## నూతన ప్రచురణలు
















హెల్త్ గైడ్
జి.టి. ప్రభాకర్
ఋషి

# హెల్త్ గైడ్

## అల్లోపతి వైద్య సర్వస్వం



సర్టిఫైడ్ మెడికల్
ప్రాక్టీషనర్స్‌కు
ప్రత్యేకం



జి.టి. ప్రభాకర్

# హెల్త్ గైడ్

## అల్లోపతి వైద్య సర్వస్వము









**HEALTH GUIDE**
By : G.T. Prabhakar

First Edition : May, 2002
Cover Design : Giridhar
Printed at : Swamy Offset Printers, VJA
DTP : Monarch Graphics, VJA

Publishers
**Rushi Prachuranalu**
Main Road, Hanumanpet,
Vijayawada - 520 003
Ph : 579190

Price : **50-00**


## విషయ సూచిక

★ ★ ★

# అల్లోపతి వైద్యము

ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా విస్తరించివున్న వైద్య విధానం ఇది. అలోపతి వైద్యము ఎప్పుడు ఎలా మొదలయిందో దాని పరిణామక్రమం ఏమిటో ఒకసారి తెలుసుకుందాం. నేడు ఇంతగా అభివృద్ధి చెందిన ఈ వైద్య విధానం తొలిరోజుల్లోని క్రిస్టియన్ మతాధికారులు మతం పేరును ఉపయోగించి అభివృద్ధి చెందకుండా శాయశక్తులా ప్రయత్నించారు. నాడు వారు ఆ వ్యక్తి చేసిన పాపానికి ప్రతిఫలంగా రోగం వచ్చిందని దీనికి పశ్చాత్తాపంతో దైవధ్యానము చేయడమే నివారణోపాయం అని నమ్మబలికేవారు. కేవలం ఆ రోజుల్లో నమ్మకమే తప్పసరైన వైద్య విధానమే లేదు. రాజు వ్యాధులకు తన చేతి స్పర్శ ద్వారా నివారణ చేసేవాడని చెపుతారు.రోగ రాజు ముందు మోకరిల్లడంతో "నేను నిన్ను స్పృశిస్తున్నాను. భగవంతుడు నీకు నయం చేస్తాడు" అని పలికి రోగి శిరస్సును తన చేతితో స్పృశించేవాడు. ఆ తరువాత రోగికి ఒక వెండి నాణేన్ని ఇచ్చేవారట. ఇలాటి నమ్మకం పై అంటే ఈ వైద్య విధానంలో క్రమంగా అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా ఈజిప్టు, మెసపటోనియా వైద్యవిధానాలను క్రోడీకరించి ఆధునిక వైద్యవిధానానికి పునాదులు వేశారు.

అతీత శక్తుల నమ్మకం నుండి వ్యాధి భావనను వేరు చేసి, వ్యాధికి సంకేతకమైన, సహజమైన వివరణను ఇచ్చినవారు 'వైద్యశాస్త్ర పిత'గా పేరు గాంచిన ప్రఖ్యాత ప్రాచీన గ్రీకు వైద్యుడు 'హిప్పోక్రేట్స్' (క్రీ.పూ. 400). ఆరోగ్యాన్ని - వ్యాధుల్ని వివరించేందుకు ఈయన సిద్ధాంతాలు ప్రతిపాదించాడు. రక్తం, కఫం, పిత్తము, క్లోమం వంటి నాలుగు ముఖ్య కారణాలు చెప్పడంతో పాటు వైద్యుడికి సంబంధించిన ప్రమాణాన్ని కూడా రూపొందించారు. వైద్య పట్టా తీసుకునే వారు ఈ ప్రమాణాన్ని చేసి తీరవలసిందే !

హిప్పోక్రేట్స్ తరువాత గ్రీకు వైద్యుడు గాలెన్ (క్రీ.శ. 200) అనేక పరిశోధనలు చేశారు. ముఖ్యంగా మానవ శరీర అంతర్నిర్మాణ శాస్త్రాన్ని రూపొందించారు. క్రీ.శ. 14-15 శతాబ్దాలలో శాస్త్ర సాంకేతిక రంగాలు పారిశ్రామిక విప్లవం వల్ల వేగంగా పురోగమించాయి. మానవ శరీర అంతర్నిర్మాణం, శరీర ధర్మశాస్త్రం బాగా ఆసక్తి కలిగించిన అంశాలయ్యాయి. యాంక్రియన్ వెసాలియస్ అనే బెల్జియం శాస్త్రవేత్త, వైద్యుడు (1543లో) ఫాబ్రిక్ ఆఫ్ హ్యూమన్ బాడీ అనే వైద్య గ్రంథాన్ని వెలువరించాడు. ఈయన గాలెన్ పరిశోధనలలో వున్న లోపాల్ని సవరించాడు.

ఏంబ్రాయిస్ పేరి అనే ఫ్రెంచ్ వైద్యుడు ఆధునిక శస్త్ర చికిత్సా పితామహుడుగా పేరు పొందాడు. 1628లో 'విలియం హార్వే' రక్త ప్రసరణ 'వ్యవస్థను వివరించి వైద్య విజ్ఞానంలో ఒక గొప్ప సంచలనం సృష్టించారు. హృదయ స్పందన నిముషానికి 72 సార్లు వుంటుందని కూడా ఈయనే చెప్పాడు. మార్సెల్లో మాల్ఫిజీ (1628-94) కప్ప ఊపిరితిత్తులలో రక్తనాళాల వ్యవస్థను

పరిశీలించాడు. రాబర్ట్ బాయిల్ జీవించాలంటే ప్రాణ వాయువు అవసరం అని తెలిపాడు. 1665లో లీవెన్ హాక్ సూక్ష్మదర్శినిని ఉపయోగించి సూక్ష్మజీవుల ఉనికిని అవి ( వ్యాధుల్ని కలిగించగలవని తెలియజేశాడు.

18వ శతాబ్దంలో ఆధునిక వైద్య విధానంలో వ్యాధి శాస్త్రం, రోగనిర్ధారణ అనే అంశాలు అమలులోనికి వచ్చాయి. 1819లో ఫ్రెంచ్ వైద్యుడు రెనెలెనెక్ స్టెతస్కోపును కనుగొన్నాడు. 1796లో మశూచికి టీకా మందును ఎడ్వర్డ్ జెన్నర్ ప్రయోగించాడు. విలియం విడరింగ్ గుండె జబ్బులకు డిజిటాలిస్ మంచిదనే విషయం వివరించాడు. 1754లో స్కర్వీ వ్యాధిని నిమ్మరసం వాడి నివారించవచ్చని 'లిండ్' చెప్పాడు. ఆ తరువాత కాలంలో వైద్య రంగం పెను మార్పులకు గురైంది. సూక్ష్మదర్శిని, ఎలక్ట్రానిక్ సూక్ష్మదర్శిని వల్ల, శరీర ఛేదనలవల్ల మానవ శరీరం పూర్తిగా అవగాహనకు వచ్చింది. జోహాన్స్ ముల్లర్ 1833-40ల్లో 'మాన్యువల్ ఆఫ్ ఫిజియాలజీ' ప్రకటించారు. జర్మన్ శాస్త్రవేత్త రుడాల్ఫ్ విర్ఛో వ్యాధి కలిగినప్పుడు శరీర కణాలు ఎలా మార్పు చెందుతాయో వివరించాడు. లూయీ పాశ్చర్ 'జర్మ్ థియరీ ఆఫ్ ఇన్ఫెక్షన్'ను ప్రతిపాదించాడు. రాబిస్, ఏంత్రాక్స్, మసూచి, కలరా వంటివి పూర్తిగా అవగాహనకు వచ్చాయి. 1865లో జోసెఫ్ లిస్టర్ అనే బ్రిటీష్ శాస్త్రవేత్త ఏంటిసెప్టిక్ విధానం కనిపెట్టాడు.

పాల్ ఎర్లిచ్ అనే శాస్త్రవేత్త ఇరవైయవ శతాబ్దం మొదట్లో కీమో థెరపీ (రసాయనాలతో చికిత్స జరపడం) మొదలుపెట్టాడు. డోమాక్ 1937లో సల్ఫోనమైడ్ మందుల్ని కనుగొన్నాడు. అలెగ్జాండర్ ఫ్లెమింగ్ 1928లో సూక్ష్మ జీవి నాశనమైన పెన్సిలిన్‌ను కనుగొని రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అనేక మంది ప్రాణాలు కాపాడగలిగాడు. ఆ తరువాత 1944లో వాక్స్‌మన్ అనే ఆయన స్ట్రెప్టోమైసిన్ కని పెట్టాడు. (దీనిని భారతీయ వైద్యుడు డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావుగారు కూడా అదే సమయంలో కనిపెట్టారు. జాతి వివక్ష కారణంగానేమో గాని సుబ్బారావుగారికి నోబుల్ బహుమతిఇవ్వకుండా వాక్స్‌మన్‌కు మాత్రమే ఇచ్చారు). ఇంకా రైట్, ఇంగ్లాండ్ దేశస్థుడు టైఫాయిడ్ వ్యాక్సిన్ కనుగొని అనేక మందిని వ్యాధి బారినుండి రక్షించాడు.

చివరికి అణు జీవశాస్త్రం (Molecular biology) అని పరిణామం చెందిన ఆధునిక జీవశాస్త్రం జీనుల స్థాయిలోనే రోగ నిర్ధారణచేసి నయం చేసే స్థాయికి ఆధునిక వైద్యం అభివృద్ధి చెందింది. అనేక రకాలైన కృత్రిమ మందులు, హార్మోన్లు, విటమిన్లు కనుగొనబడ్డాయి. ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, కాలేయము చివరికి గుండె మార్పిడి కూడా సాధ్యమైంది. మెదడు మార్చడమే మిగిలి వుంది. 1967లో డా. బర్నార్డ్ అనే దక్షిణాఫ్రికా వైద్యుడు గుండె మార్పిడి చికిత్సను మొదటగా విజయవంతంగా చేయగలిగాడు. అయితే ఆయన ఇటీవలే గుండెపోటుతో మరణించాడు లెండి!

ఇన్ని రకాల విజయాలు ఆధునిక వైద్య విధానం ద్వారా సాధ్యమవుతున్నా, సరికొత్త రోగాలు వస్తూనే ఉన్నాయి. కొత్త కొత్త సవాళ్ళు వైద్యులకు విసురుతూనే ఉన్నాయి. కాన్సర్,





ఎయిడ్స్, హెపటైటిస్ వంటి వ్యాధులకు తోడుగా మనిషి తనకు తాను కొని తెచ్చుకునే జీవ, రసాయన ఆయుధాల వల్ల అనేక రకాల జబ్బులు మానవాళిని ముంచెత్తుతున్నాయి. వాతావరణ కాలుష్యం కోరలు చాచుకుని ఉంది. ఇది మరిన్ని సమస్యల్ని తెచ్చి పెడుతుంది. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా వుంటుంది. ఏదిఏమైనా సామాన్యులకు అందుబాటులో వైద్య విజ్ఞానం అందించాలనే తపన ఈ పుస్తకాన్ని మీముందుంచుతుంది.

## సాధారణ వ్యాధులకు ఇంగ్లీష్ వైద్యం ...

ఈ ఆధునిక యుగంలోసాధారణ వ్యాధులకు సైతం అసాధారణ పరీక్షలు నిర్వహిస్తున్నారు. అయితే సామాన్యుడు తలనొప్పి అని వస్తే అది తగ్గకపోగా లేనిపోని తలనొప్పి మరింత పెరుగుతుంది. మన దేశంలో ఆధునిక, ఇంగ్లీషు వైద్యము (అల్లోపతి) కాకుండా ఇంకా అనేక రకాలైన వైద్య విధానాలు అందుబాటులో ఉన్నాయి.

ఎన్ని రకాల వైద్య విధానాలు అమలులో ఉన్నా సాధారణమైన రోగాలకు సర్వత్రా ఆమోదయోగ్యమైనది. అందుబాటులో వున్నదీ అలోపతి వైద్య విధానమే. తక్షణమే స్వస్థత కలిగించే సూది మందంటేనే మక్కువ మరి! తలనొప్పి వచ్చినా, జలుబు, జ్వరం ఎలాటి చిన్న చిన్న వ్యాధులయినా ఒకటి రెండు మాత్రలతో స్వస్థత పొందుతుంటే సామాన్యులకు అంతకంటే కావలసిందేముంది? !

అయితే అలోపతి వైద్యం అంత తేలికైనదేమి కాదు. సంపూర్ణంగా వైద్యం జరగాలంటే రోగనిర్ధారణ ముఖ్యం. ఇందుకోసం లాబరేటరీ పరీక్షలు, ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కానింగ్ పరీక్షలు సర్వసాధారణంగాజరుపుతారు. రోగాన్ని బట్టి మనశరీరంలో ఏ ప్రాంతాన్ని తాకిందనే దానిపైన ఏ రకమైన పరీక్ష జరపాలి అనేది వైద్యులు నిర్ధారిస్తారు. గుండె, మూత్రపిండాలు, మెదడు, చర్మము మొదలైన ప్రత్యేక భాగాలకు సోకిన వ్యాధులను గుర్తించడానికి కేవలం ఒక పరీక్ష చేస్తే సరిపోదు. అనేక రకాలైనపరీక్షలు జరిపి వ్యాధిని నిర్ధారించి చికిత్స మొదలు పెట్టాలి. వీటి కోసం వాడే మందులు అనేక సైడ్ ఎఫెక్ట్స్ కలిగించేవి. ముఖ్యంగా గుండె, మెదడు, మూత్ర పిండాలకు వాడే మందులు చాలా జాగ్రత్తగా వాడాలి. ఆరోగ్యవంతులు పొరపాటుగా ఈ మందులు వేసుకుంటే అనేక సమస్యలు కొని తెచ్చుకున్నట్లువుతుంది.

నేడు అనేక రోగాలను నయం చేసే డాక్టర్లు కొందరైతే (జనరల్ ఫిజిషియన్స్) ప్రత్యేక వ్యవస్థలకు సంక్రమించిన ప్రత్యేక రోగాలకు ప్రత్యేకమైన డాక్టర్లు వున్నారు. గర్భిణీస్త్రీలకు సంబంధించిన సమస్యలను, వారికి వచ్చే రోగాలకు చికిత్స చేసేందుకై గైనకాలజిస్ట్‌లు, అప్పుడే పుట్టిన శిశువులకు చికిత్స జరిపేందుకు, చిన్న పిల్లలకు వచ్చిన రోగాలను నయం చేసేందుకు పిల్లల వైద్యులు, మూత్ర రోగాలకు యురాలజిస్ట్‌లు, ఎముకలకు చికిత్స చేసేందుకు ఆర్థోపెడిక్ సర్జన్‌లు, చెవి, ముక్కు గొంతు వ్యాధులకు ఇ.ఎన్.టి. స్పెషలిస్ట్‌లు. కంటి వ్యాధులకు నేత్ర

వైద్యులు, నరముల వ్యాధులకు న్యూరాలజిస్టులు ఇలా ఫలానా వ్యాధులను ప్రత్యేక వైద్య సేవలందించేందుకు ప్రత్యేక వైద్యులున్నారు.

## అల్లోపతి మందులు

అలోపతి మందులు కూడా ప్రత్యేక లక్షణాల్ని కలిగి వున్నాయి. అవి ఏఏ రోగాలు మన శరీరంలో ఏ భాగానికి వచ్చాయో ఆయా ప్రాంతాలకు ప్రత్యేకమైన మందులు వున్నాయి. మందులలోని విభాగాలు స్థూలంగా ఇవి :

1. గుండె - రక్త ప్రసరణ వ్యవస్థ
2. ఎముకలు, కండరాల వ్యవస్థ
3. కేంద్ర నాడీ వ్యవస్థ
4. అహారనాళ వ్యవస్థ
5. మూత్ర - జననేంద్రియ వ్యవస్థ
6. శ్వాస వ్యవస్థ
7. ఎలర్జీల లక్షణాలకు
8. చర్మ సంబంధమైన సమస్యకు
9. గొంతు సంబంధమైన సమస్యలకు
10. హార్మోనుల అసమతుల్యం
11. పోషక పదార్థాలు
12. పెరుగుదలకు, శక్తినిచ్చేందుకు
13. శస్త్ర చికిత్సా పరికరాలు, వాక్సిన్‌లు
14. కంటి సంబంధమైన సమస్యలకు
15. ముక్కు, చెవి సంబంధమైన సమస్యలకు

ఈ విధంగామందులు అనేక రకాలు వున్నాయి. అయితే మందులు వేసుకునే విధానం కూడా తెలుసుకోవలసిన అవసరం వుంది.

1. నోటి ద్వారా మందులు వేసుకోవడం.
2. ఇంజక్షన్ల ద్వారా మందు అందించడం. ముఖ్యంగా వీనిలో రెండు రకాల పద్ధతులు ఉన్నాయి. అవి కండరాలకు ఇంజక్షన్ చేయడం/ఇంట్రావీనస్ ఇంజక్షన్లు. ఇదికాక సబ్‌క్యూటేనియస్ ఇంజక్షన్ కూడా వుంది.
3. గ్లూకోజ్ / సెలైన్ ఎక్కించడం. సెలైన్‌తో పాటుగా మందుల్ని కూడా అందించడం.
4. పై పూతకు వాడే మందులు (ముఖ్యంగా చర్మ సంబంధ సమస్యలలో వాడేవి. బెణుకులు, కీళ్ళకు సంబంధించిన సమస్యలలో వాడతారు)
5. స్ప్రే, లోనికి పీల్చడం
6. ప్రాంతీయంగా మత్తు కలిగించడం

మందులు కూడా రకరకాల రూపంలో వుంటాయి. అవి :

1. టాబ్లెట్స్, కాప్సుల్స్, పిల్స్
2. ద్రవాలు, సిరప్‌లు, మిక్చర్‌లు
3. ఇంజక్షన్స్
4. లైనిమెంట్స్, మర్ధన చేసేవి, ఎమోలియంట్స్
5. లూబ్రికెంట్స్
6. అయింట్‌మెంట్‌లు, లోషన్‌లు, ప్లాస్టర్‌లు
7. లోనికి పీల్చేవి, స్ప్రేలు
8. రిలాక్సెంట్‌లు మొదలైనవి

రోగికి ఏ రకమైన రూపంలో ఔషధాన్ని ఇవ్వాలో నిర్ణయించుకున్నాక దానిని ఇవ్వవచ్చు.

## మందుల ప్రతికూల చర్యలు

ఏదైనా ఇన్‌ఫెక్షన్ సోకిన తర్వాత వేసుకునే ఎలాంటి మందుకైనా ప్రతికూల చర్యలు వుంటాయి. మందు వేసుకునేటప్పుడు దాని పైన వున్న లేబుల్ సరిగ్గా ఒకసారి చూసుకుని, ఆ మందు కాలపరిమితిని కూడా గమనించి వాడుకోవాలి. సాధారణంగా డాక్టరు వద్దకు వెళ్ళిన తరువాత డాక్టరు వ్రాసిన మందులు అన్నీ కొనకుండా ఏదో ఒకటో అరో కొనుకుని వాడినంత మాత్రాన రోగం తగ్గుతుందని భావించరాదు. అలాగే ఏ కాస్త అస్వస్థతవున్నా వెంటనే మందుల షాపుకు వెళ్ళి, తోచిన టాబ్లెట్ వేసుకోవడం కూడా అంత మంచిది కాదు. ఏదైనా ప్రమాదం జరిగేందుకు అవకాశం వుంది. మందు మన వంటికి సరిపడని పరిస్థితిలో వంటి పైన దద్దుర్లు రావడము - ఎర్రగా మారడంతో పాటు మంట పుట్టడం., ఊపిరి అందకపోవడం, ఆకస్మికంగా రక్తపోటు పడిపోవడం లేక రక్తపోటు పెరగడం ఇలాటి సమస్యలతో పాటు ప్రాణాపాయం జరిగే ప్రమాదం కూడా వుంది. ఒకొక్క సందర్భాలలో ఇలాటి డ్రగ్ రియాక్షన్స్‌ను అదుపు చేయలేని పరిస్థిది కలగవచ్చు. దానివల్ల పక్షవాతం రావడమో, శాశ్వత అంగవైకల్యమో దాపురించవచ్చు. అదే విధంగా మందు వేసుకోవడంలోనే కాక వేసుకునే మందు ఖచ్చితమైన డోసు ప్రకారం వేసుకొంటున్నామో లేదో కూడా గమనించాలి. డోసు తక్కువైతే జబ్బు తగ్గదు. ఎక్కువైతే ఇతర

సమస్యలు రావచ్చు. ఈ సమస్యలు మందు లక్షణాల్ని బట్టి రకరకాలుగా వుంటాయి. కొన్ని మందులు జీర్ణ వ్యవస్థ పైన ప్రభావం చూపితే, మరికొన్ని మందు గుండె - రక్తప్రసరణ వ్యయస్థ పైన ప్రభావం చూపవచ్చు. మరికొన్ని మందులు నాడీ వ్యవస్థ పైన, ఇంకొన్ని మూత్రపిండాలపై ప్రభావం చూడవచ్చు.

వేసుకున్న మందులు - పిల్లలకు, వృద్ధులకు తీవ్రమైన సమస్యలను తెచ్చిపెట్టవచ్చు. వీరికి మందులు వాడేటప్పుడు చాలా జాగ్రత్తగా వాడాలి. పెద్దవారికి ఇచ్చే డోసును బాగా చిన్న పిల్లలకు ఇస్తే తట్టు కోలేరు. అదే విధంగా పెద్ద వారికి ఇచ్చే డోసు వృద్ధులలో కూడా తీవ్ర ప్రభావాన్ని చూపవచ్చు. అంతేగాక చాలా రకాల మందులు గర్భిణీ స్త్రీలపైన విపరీత ప్రభావాన్ని చూపుతాయి. చాలా మందులు అబార్షన్ (గర్భస్రావం) కలిగించడమో లేక గర్భస్థ శిశువుకు అంగవైకల్యాన్ని కలిగించడమో చేయవచ్చు. కావున గర్భిణీ స్త్రీలు అలోపతి మందుల్ని తనకుతానుగా ఏవి పడితే వాటిని వాడరాదు. కేవలం డాక్టర్ సలహాపైనే మందుల్ని వాడాలి.

## రోగాలు రావడానికి కారణాలు

రోగాలు రావడానికి కారణాలు - అనేక విధాలుగా ఉన్నాయి. అవి బాక్టీరియా, వైరస్, ఫంగస్ ఇంకా ఇతర జీవుల వలన వచ్చే రోగాలు, రోగానికి తగిన రక్త పరీక్షలు, ఇంకా ఇతర పరీక్షలు చేయడం వల్ల దేనివల్ల రోగం వచ్చిందనేది తెలుస్తుంది.

**బాక్టీరియా** : రోగాలలో సుమారు డెబ్బైశాతం ఇవి ఆక్రమిస్తాయి. అంతటి ప్రభావం బాక్టీరియాలకు వుంది. ఏంటోనివాన్ లీవెన్ హాక్ 1665లో సూక్ష్మదర్శినిలో బాక్టీరియాను మొదటిసారిగా గుర్తించాడు. ఆ తరువాత ఎందరో పరిశోధకులు బాక్టీరియాలను గమనించి వాటి స్వభావాన్ని బట్టి వాటిని వర్గీకరించారు.

హారిసన్ అనే శాస్త్రవేత్త బాక్టీరియాలను వర్ణిస్తూ చాలా బాక్టీరియాలు యూని సెల్యులర్‌లు (ఏకకణ జీవులు), బాక్టీరియా కణాలు గుండ్రంగా (Coccus) వుండవచ్చు. రాడ్ లాగా వుండవచ్చు (Bacillus), సర్పిలాకారంగా (Spirillum) వుండవచ్చు. కామా ఆకారంలో కూడా వుండవచ్చు (Vilario), కార్క్ స్క్రూ ఆకారంలో కూడా వుండవచ్చు (Spirochete). ఇవి రకరకాల సైజులలో వుంటాయి. వీటి సైజు వీటి ఆకారం బట్టి మారుతూ వుంటుంది. వీటి సైజు సుమారు 0.5 నుండి 5 మి.మీ వరకు ఉంటుంది. (ఇది ఖచ్చితమైన సైజు కాదు) అని చెప్పాడు. ఇంకా బాక్టీరియా ప్రపంచంలో వుండని చోటు లేదు. మంచులోను, భూగర్భంలోను, గాలిలో, భూమి పైన, నీటిలోను, సముద్రాలలోను మానవ దేహంలో సైతం ఇవి ఉంటాయి.

బాక్టీరియాలు కొన్ని సహజీవనం గడుపుతాయి. మరికొన్ని స్వతంత్రంగా మనగలుగుతాయి. ఇంకొన్ని బాక్టీరియాలు రోగకారకమవుతాయి. వీటిని పారసైట్స్ (పేథోజన్స్) అంటారు. ఇలా రోగాల్ని కలిగించే బాక్టీరియాలు కేవలం మనుష్యులకే కాక జంతువులకు, మొక్కలకు కూడా





రోగాల్ని కలిగించగలవు. బాక్టీరియా నేరుగా తన ప్రభావాన్ని చూపదు. రోగం కలిగించే విషపదార్థాల్ని అది మన శరీరంలో విసర్జిస్తుంది. కనుక మనకు రోగం వస్తుందన్న మాట. బాక్టీరియాల గురించి తెలియజేసే శాస్త్రాన్ని 'బాక్టీరియాలజీ' అంటారు. వైద్య రంగానికి సంబంధించిన బాక్టీరియాలను గురించి తెలిపే శాస్త్రాన్ని 'మైక్రోబయాలజీ' అంటారు. రోగ లక్షణాలను బట్టి ఏ రకమైన బాక్టీరియా కారణమో పరిశీలించి దానికి తగిన మందుల్ని వాడతారు.

**వైరస్‌లు** : బాక్టీరియా తరువాత వైరస్‌లు అనే అతిచిన్న సూక్ష్మ జీవులు రోగాల్ని కలిగిస్తాయని గుర్తించారు. జలుబు, మొదలుకొని అటలమ్మ, పోలియో వంటి ఎన్నో ప్రాణాంతకమైన వ్యాధులకు వైరస్‌లు కారణం. అంతెందుకు - ఇటీవల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా గడగడలాడిస్తున్న భయంకర వ్యాధి ఎయిడ్స్ కూడా వైరస్ ద్వారా వచ్చేదే. వైరస్‌లు అతి సూక్ష్మకణాలు, మామూలు మైక్రోస్కోప్‌లో వీటిని చూడడం కష్టం. వీటిని చూడాలంటే ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ అవసరం. మామూలు మైక్రోస్కోప్‌లో చిన్నచుక్కలవలె మాత్రమే కనిపిస్తాయి. వైరస్‌లు ఎన్నో బాక్టీరియా శరీరంలో ఇట్టే ఇమిడి పోయేంత చిన్నవి. వైరస్‌లు మన శరీరంలో ఉన్నంత సేపు జీవించి వుంటాయి. బయట చలన రహితంగా ఉంటాయి. డి.ఎన్.ఎ. లేక ఆర్.ఎన్.ఎ అనే కేంద్రకామ్లము వైరస్‌ల్లో ఉంటుంది. దీనిచుట్టూ ఒక ప్రోటీన్ కవచం ఉంటుంది. వైరస్‌లకు సరైన మందులు లేవు. రోగనిరోధక శక్తిని పెంపొందింప జేసుకోవడం ఒక్కటే సరైన మందు. వైరస్ వలన రోగాలు రాకుండా టీకాలు వేయడం మాత్రం జరుగుతుంది.

## జబ్బులు రావడానికి ఇతర కారణాలు

ఫంగస్ వలన కూడా జబ్బులు వస్తాయి. ఇవి బూజులని చెప్పవచ్చు. ఫంగస్ వలన చర్మ వ్యాధులు, నోటిపూత, కడుపులో పేగుపూత, మెదడుకు చెందిన అనేక జబ్బులు, సమస్యలు వస్తాయి.

1. అతిగా తినడంవల్ల లేక అసలు తినక పోవడం వల్ల జబ్బులు రావచ్చు.
2. స్థూలకాయము, అధికంగా ఆహారం తీసుకోవడం పని తక్కువ (శ్రమించడం తక్కువ) చేయడం. పోషకాహారలోపం తదితరలు.
3. మానసిక వత్తిడి, ఆదుర్దా, మనసు వికలం అగుట.
4. పరిసర వాతావరణం ఆకస్మికంగా మార్పు చెందుట.
5. లైంగిక సంతృప్తి లేకపోవుట, మానసికంగా కృంగిపోవుట.
6. గాలి, నీరు, శబ్ద కాలుష్యము వలన
7. జన్యుపరమైన కారణాలవల్ల
8. వ్యక్తిగత జీవిత విధానం - అలవాట్లు వలన

9. ఏదైన మందుగాని లేక సారాయిగాని త్రాగడం వల్ల సంభవించే ఆకస్మిక అనారోగ్యం.
10. కుటుంబ సమస్యలు, సామాజిక సమస్యలు వల్ల
11. అధికంగా చెమటలు పట్టడం, అతిమూత్రము వంటివి.
12. ఆర్థికపరమైన ఇబ్బందులు లేక నిరుద్యోగ సమస్య
13. మలబద్ధకము
14. వ్యక్తిగత నిబంధనలు, సామాజిక కట్టుబాట్లు

ఇలాటి ఎన్నో రకాల కారణాల వల్ల జబ్బులు వస్తున్నాయి. వీటిలో చాలా వాటిని తేలికగా నయం చేసుకోవచ్చు. చాలా సమస్యలకు మందులు కూడా వాడనవసరం లేదు. అయితే మందులు వాడే సందర్భాలలో ఈ క్రింది అంశాలు గమనించవలసి వుంది.

1. రోగం యొక్క పరిస్థితి, దాని గురించిన అవగాహన
2. రోగి యొక్క వయస్సు, లైంగిక సామర్థ్యము
3. ఏరకమైన రోగం వచ్చింది? దాని ఫలితం ఏమిటి?
4. ఎలర్జీ లేక అలాంటి పరిస్థితులైతే దానికి కారణమేమిటి?
5. రోగి తన బాధల్ని పూర్తిగా చెప్పకోగలుగుతున్నాడా?
6. రోగం ఎంత కాలం వుంటుంది? - ఇది తరుణ రోగమా లేక దీర్ఘతర రోగమా?

అనే విషయాలు అన్నీ గమనించాలి. అదే విధంగా ఔషధాల్ని వాడేటప్పుడు కూడా కొన్ని విషయాలు గమనించాలి. అవి :

1. రోగి గర్భంతో వున్నదా?
2. రోగం చిన్న పిల్లలకు, శిశువులకు (Infants) వచ్చిందా?
3. రోగి ఆస్త్మాలోను, బ్రాంకోన్యూమెనియాతోను, డిఫ్తీరియాతోగాని, లేక ఏదైనా గుండె జబ్బుతో బాధపడుతున్నాడా మూత్రపిండాల వ్యాధితోగాని, క్షయవ్యాధితో గాని బాధపడుతున్నాడా? - అంటే ఇవి అంతకు ముందే వచ్చి అంతర్లీనంగా వుండే జబ్బులు - పైకి కనిపించే వేరే జబ్బుకు చికిత్స చేస్తే ఒక్కోసారి తీవ్రమైన పరిస్థితిలోనికి రోగి వెళ్ళే ప్రమాదం వుంది. కావున రోగి పూర్తి చరిత్ర తెలుసుకుని మందులు వాడాలి.
4. రోగి తీవ్రమైన అతిసార లేదా డయేరియాతో బాధపడుతున్నాడా?
5. మధుమేహ రోగి, ముఖ్యంగా రక్తంలో చెక్కెర శాతం ఆకస్మికంగా పెరగడమో లేక తగ్గడమో జరుగుతూ ఉన్నదా?





6. చెవులలోనుండి, ముక్కుల్లో నుండి లేక జననాంగముల నుండి, పాయువు నుండి రక్తస్రావం అవుతున్నదా?
7. పిల్లల్లో - వాళ్ళు ఇంతకు ముందే షుగర్‌చికిత్స చేయించు కుంటున్నారా? (వంశ పారంపర్యంగా షుగర్ వ్యాధి చిన్న పిల్లల్లో కూడా వస్తుంది)
8. అప్పుడేగాని, ఇంతకు మునుపేగాని ఆపరేషన్ చేయించుకున్నారా?
9. రోగి తప్పని పరిస్థితిలో మురికిలో పని చేయవలసి వస్తుందా?

ఇంకా ఇలా చాలా చాలా విషయాల్ని గమనించి చికిత్స చేయాల్సి వుంటుంది. అనేక మందుల కంపెనీలు మందు మోతాదును వయసు వారీగా ఎంతెంత వాడాలో నిర్ణయించి వాటిని తమ మందులపైన ముద్రించాయి. అయితే అన్ని సందర్భాలలోను ఈ మోతాదు పనికి రాకపోవచ్చు. రోగి స్వభావాన్ని అంచనా వేసి డాక్టర్ ఇస్తేనే మందు సక్రమంగా పని చేస్తుంది. మందుల్ని వాడేటప్పుడు రోగి ఆరోగ్యాన్ని, జబ్బును (వ్యాధితీవ్రతను) రోగి చరిత్రను, రోగ లక్షణాల్ని ఏ విధంగా పరిశీలిస్తామో - అదే విధంగా రోగికి మందుల్ని వాడేటప్పుడు ఈ క్రింది సూచనలు గమనించాలి.

1. మందు బ్రాండ్ పేరు లేక వ్యాపార నామం - ఆ మందును తయారు చేసే కంపెనీ పేరు గుర్తించాలి.
2. దోసు లేదా మోతాదు నిర్ణయించడం, సాధారణంగా రోగ లక్షణాలు బయట బడ్డప్పుడు చేయవలసింది.
3. ఆ మందు ఒకటికాక రకరకాల పదార్థాలను కలిపి చేయబడితే వాటిని గమనించాలి. ఆయా పదార్థాలు తగు పరిమాణంలోనే వున్నాయా? అన్న సంగతి గమనించాలి. మందుల కాంబినేషన్స్ ఏ పరిమాణంలో ఉన్నాయో మందుల పెట్టెలపై ముద్రించి వుంటారు.
4. కల్తీ లేని మందుల పదార్థాలు రోగికి యిచ్చే మందుల్లో వున్నాయా లేదా గమనించాలి.
5. మందులు టాబ్లెట్ల రూపంలోను, సిరప్‌ల రూపంలోను కాప్సుల్స్ రూపంలోను బజారులో అమ్ముతారు. రోగి పరిస్థితిని బట్టి వాటిలో ఏది వాడాలో నిర్ణయించుకోవాలి. చిన్న పిల్లలకు కాప్సుల్స్ ఇస్తే పని చేసే మాట అటుంచి మోతాదు ఎక్కువై ప్రాణాపాయం కలగవచ్చు కాబట్టి మందు ఎవరికి ఎంత వాడాలో నిర్ణయించడంతో పాటు ఏ రూపంలో ఇస్తే మంచిదో ఆలోచించాలి. చిన్న పిల్లలకు సిరప్‌ల రూపంలో ఇవ్వడం, పెద్దవారికి టాబ్లెట్స్, కాప్సుల్స్ వాడడం మంచిది.
6. చిన్న పిల్లలకు, గర్భిణీస్త్రీలకు ఇచ్చే మందుల్ని చాలా జాగ్రత్తగా వాడాలి.
7. మందుల్ని వాడేటప్పుడు అది రోజుకు ఎన్ని సార్లు వాడాలి నిర్ణయించాలి. అంతేగాక ఆ మందుకు కాలపరిమితిని తప్పని సరిగా చూడాలి. కాలపరిమితి దాటిన మందులు విషంతో సమానం.
8. మనం వాడే మందు ఇతర మందులతో కలిపి వాడవచ్చా? గమనించాలి. ఎందుకంటే కొన్ని రకాల మందులు కలిపి వాడడం వలన మందు పని చేయక పోవడమో లేక, ఈ రెండూ కలిసి విషంగా మారి ప్రాణాపాయం కలగడమో జరుగుతుంది.

9. మందుల్ని వాడేటప్పుడు మందులకు సంబంధించిన ప్రత్యేక జాగ్రత్తలు గమనించాలి.
10. ఆ మందులు మనకు ఇచ్చే సైడ్ ఎఫెక్ట్ ఏమిటి? అనే దాన్ని ముందుగానే తెలుసుకుంటే ఒకవేళ ముందు వలన ఏదైనా సైడ్ ఎఫెక్ట్ కనిపిస్తే ఆందోళన చెందకుండా వుండొచ్చు.

మందుల్ని వాడేటప్పుడు సంపూర్ణ అవగాహన లేకపోతే ప్రాణాపాయం కలగవచ్చు. ఇంకా ఇతర ఉపద్రవాలు కూడా సంభవించవచ్చు. ఏదో జలుబు చేసిందనో మరో రకమైన ఇబ్బంది కలిగిందనో వెళ్ళి ఏదో ఒక టాబ్లెట్ తెచ్చి వేసుకుంటే ఇతర సమస్యలు తలెత్తవచ్చు. రోగం గురించి, మందుల గురించి, రోగి లేక మనిషి శరీర నిర్మాణం గురించి పూర్తిగా తెలిసి వుండాలి.

కొన్ని రకాల మందులు కొందరికి అవసరం కావచ్చు. కానీ వాటిని అదేపనిగా వాడడం వల్ల సైడ్ ఎఫెక్ట్ రావచ్చు. అలాగే కొన్ని రకాల మందులు కొందరికి ఎట్టి పరిస్థితిలోను వాడకూడదు. అవేమిటో చూద్దాం

ముఖ్యంగా గర్భిణీ స్త్రీలు వాడకూడనివి :

- ★ ఆస్ప్రిన్
- ★ క్లోరోసైక్లజైన్
- ★ బార్బిట్యూరేట్స్
- ★ కార్టిసోన్స్
- ★ డయాజొక్సైడ్
- ★ ఎథిస్టిరోన్
- ★ క్లోమిఫిన్
- ★ ఎథినమైడ్
- ★ మార్ఫిన్
- ★ క్లోరోక్విన్
- ★ డికౌమరాల్
- ★ డైక్లోఫెనాక్ సోడియం
- ★ నార్ఇథైనోడ్రాల్
- ★ పెథిడిన్
- ★ మెల్ఫాలాన్
- ★ మెథోడోన్
- ★ నారెథిస్టిరాన్
- ★ ఓరల్‌కాంట్రాసెప్టివ్స్
- ★ విరేచనకారులు
- ★ క్లోరాంఫినికాల్
- ★ కార్బమజోల్
- ★ డెక్సామిథాసోన్
- ★ డెక్సాఏంఫిటమైన్
- ★ గ్లిబెన్‌క్లమైడ్
- ★ డైజిపామ్
- ★ β - కుమారిన్
- ★ లిథియం కార్బొనేట్
- ★ హైడ్రోప్రొజెస్టిరాన్
- ★ ఫ్యూరోసొమైడ్
- ★ హైడ్రాలజైన్
- ★ ఇండోమెథాసిన్
- ★ ఓపియం
- ★ మెనాఫ్థోన్
- ★ మిథైల్‌డోపా
- ★ మెర్కాప్టురైన్
- ★ నైట్రోఫురాంటన్
- ★ ఫెన్‌ఫార్మిన్

ఈ మందులలో వేటినీ ఇవ్వరాదు. తప్పని పరిస్థితిలో డాక్టర్ అబ్జర్వేషన్‌లో ఇస్తారు.





## శిశువులు - చిన్న పిల్లలకు

గర్భిణీస్త్రీల తరువాత శిశువులు. (అప్పుడే పుట్టినవారు - సంవత్సరంలోపు పిల్లలు) - చిన్న పిల్లలు 2-5 సంవత్సరాలు, 6నుండి 12 సం॥లోపు వారు ఈ క్రింది మందులు జాగ్రత్తగా వాడాల్సి వుంటుంది. లేక అసలు వాడకుండా వున్నా బావుంటుంది.

- ★ అనాల్జిన్
- ★ బెటామిథాసోన్
- ★ డైఫెనాక్సైలేట్
- ★ నాన్‌డ్రోలోన్
- ★ ప్రెడ్నిసోలోన్
- ★ ట్రైఏమినోలోన్
- ★ క్లోరాంఫెనికాల్
- ★ డెక్సామిథాసోన్
- ★ ఇథైల్ ఎస్ట్రర్నాల్
- ★ మెథాన్‌డెస్టిరాన్
- ★ స్టానోజోలోల్
- ★ టెట్రాసైక్లిన్‌లు

పైన వివరించిన అనేక మందులు ఎముకమూలుగ (మజ్జ) పైన పనిచేసి దానిని పేలుచన చేస్తాయి. తద్వారా అనీమియా రావడం, డిప్రెషన్, ఎముకల పెరుగుదల ఆగిపోవడం దానివల్ల మొత్తం పెరుగుదలే ఆగిపోవడం జరుగుతుంది. ఒకొక్కసారి ఊపిరితిత్తులకు కూడా ఇన్ఫెక్షన్ రావచ్చు. టెట్రాసైక్లిన్ వాడడం వల్ల పిల్లల్లో ఎముకలు, పళ్ళు దెబ్బతింటాయి. పళ్ళపైన పసుపు పచ్చనిగార - లేక పసుపు రంగులోకి పళ్ళు మారడం సంభవిస్తుంది. అంతేగాక మూత్రము కూడా పసుపు రంగులోనికి మారుతుంది. ఇది ఒకొక్క సారి ఎరుపు రంగులో కూడా రావచ్చు.

## వయసు పై బడిన వారిలో ఇబ్బందులు

సర్వసాధారణంగా 40 సంవత్సరాలు దాటిన వారికి ఒకొక్క అవయవం లేక ఏదో ఒక అవయవం బలహీనపడి ఇబ్బంది పెట్టడం సహజం. ఉదాహరణకు వీరికి మూత్ర పిండాల సమస్య అధికంగా వుంటుంది. ఆ తరువాత గుండె, ఊపిరితిత్తులు, జీర్ణక్రియ, కీళ్ళనొప్పులు వంటి సమస్యలతో పాటు మతిమరపు ఇంకా మెదడు, నరాల సంబంధించిన సమస్యలు వస్తాయి. ముసలివారు పిల్లలు ఒకటే అన్నారు మన పెద్దవారు. వీరికి కూడా కొన్ని రకాల మందుల్ని తరుచు వాడడం తగ్గించాలి లేక పూర్తిగా మానెయ్యాలి అయితే వారికి ఆ మందు తప్పనిసరిగా వేయల్సి వస్తే డాక్టరు పర్యవేక్షణ తప్పనిసరి. ఉదాహరణకు

- ★ గార్డినాల్
- ★ డిప్సొనిల్
- ★ డైజిపాం
- ★ అమిలైన్
- ★ లానోక్సిన్
- ★ ఆల్డటోన్
- ★ మెల్లెరిల్
- ★ వాలియం
- ★ లిథోకార్బ్
- ★ డిగాక్సిన్
- ★ హైథాల్‌టోన్
- ★ Cry-4

- ★ PPF
- ★ డాక్సీ - 1
- ★ అల్ఫెరిలైన్
- ★ కాన్‌సిన్
- ★ పురాడాన్‌టిన్
- ★ జోసెఫ్
- ★ జెంటిసిన్
- ★ సెఫెరాడైన్

ఈ మందులు పెద్దవారిలో ముఖ్యంగా వయసు మళ్ళిన వారిలో వాడేటప్పుడు జాగ్రత్తగా వుండాలి. వయసుమళ్ళిన వారిలో ఈ క్రింది విషయాలు గమనించవచ్చు.

- ★ గుండె పని మందగిస్తుంది. ముఖ్యంగా 80 శాతం 50 సంవత్సరాల వయసులోను, 70 శాతం 60 సంవత్సరాల వయసులోను, 65 శాతం 80 సంవత్సరాల వయసులోను గుండె పని తీరు తగ్గుతుంది.
- ★ అలాగే మూత్రపిండాల పనితీరు కూడా 60 సంవత్సరాల వయసున్న వారిలో 60 శాతం - 80 సంవత్సరాల వయసున్న వారిలో 70 శాతం మూత్రపిండాల పనితీరు దెబ్బతింటుంది.
- ★ అదే విధంగా ఊపిరి పీల్చుకునే సామర్థ్యం కూడా తగ్గుతుంది. 50 సంవత్సరాల వయసు వారిలో 85% ఊపిరి తీసుకునే సామర్థ్యం తగ్గుతుంది. 60 సంవత్సరాల వయసు వారిలో 60 శాతం, ఎనభై సంవత్సరాల వయసు వారిలో నలభై శాతం ఊపిరి తీసుకునే సామర్థ్యం తగ్గుతుంది.
- ★ వయసు పైబడిన వారిలో ఎముకల పెరుగుదల నిలిచిపోతుంది. ఉన్న ఎముకలు అరగడం మొదలవుతాయి. దీనివల్ల కీళ్ళనొప్పులు, అస్టియో పోరోసిస్, ఇంకా ఇలాంటి ఎముకల సంబంధమైన సమస్యలు వస్తాయి. వీరి శరీరంలో కాల్షియం శాతం పడిపోతుంది. శరీరంలో కాల్షియం తగ్గడంతో ఎముకలకు మాత్రమే కాక నరాలకు సంబంధించిన ఇబ్బందులు వస్తాయి. శరీరంలో వేడి తగ్గిపోతుంది. చర్మం ముడుతలు పడుతుంది. వీరికి తప్పనిసరిగా కాల్షియం అందించాలి.
- ★ వయసు పై బడిన వారు మందులు గాని, ఆహారంగాని తీసుకోవడంలో అశ్రద్ధ చేయరాదు. అసలు వీరు మందులు ఏవి తీసుకున్నా అవి పని చేయడం సమస్యే ఒకవేళ మందు పని చేసినా ఆ మందువల్ల వచ్చే సైడ్ ఎఫెక్ట్స్ బాధిస్తాయి. తిన్న ఆహారం సరిగ్గా జీర్ణంకాదు. దీనివల్ల నీరసం, రక్తహీనత వస్తాయి. మందులతోను ఎంతకాలం బ్రతకాలి అనిపిస్తూ వుంటుంది. కాబట్టి మందులు - దానితో పాటు ఆహారం కూడా తప్పనిసరిగా వీరికి ఇవ్వాలి. వీరికి ఇచ్చే ఆహారం తేలికగా జీర్ణం అయ్యేది ఇస్తే వీరు కాస్త ఉత్సాహంగా వుండడానికి తోడ్పడుతుంది. ఎల్లప్పుడు వీరు ఇలా తేలికగా జీర్ణమయ్యే ఆహారం తీసుకోవడం మంచిది కూడా. ఆకుకూరలు, షుగర్ వ్యాధి లేకపోతే పళ్ళు తీసుకుంటే చాలామంచిది.

## మందుల్ని వాడే సందర్భాల్లో గుర్తుంచుకోవలసినవి

1. రోగి వయసును గుర్తించాలి. రోగి ఆడ, లేక మగ అనే విషయం కూడా రాసుకోవాలి. ఎందు చేతనంటే మందుల్ని వినియోగించుకోవడంలో ఆడవారు, మందుల ప్రభావాన్ని





తట్టు కోవడంలో ఆడవారి కంటే మగవారు ముందు ఉంటారు. రోగికి కలిగిన బాధ, రోగి మానసిక స్థితి, రోగి గత చరిత్ర తెలుసుకోవాలి.

2. మందుల్ని కొనేటప్పుడు ఎక్కబడితే అక్కడ తీసుకోరాదు పెద్దది, నమ్మకంగా మందుల్ని యిచ్చే షాపుల్లోనే తీసుకోవాలి. మందులు మార్చి ఇచ్చే వారు ఉంటారు జాగ్రత్త!
3. మందు వేసుకుంటే ఎలాటి ఫలితం లేకపోతే డోసును ఎట్టి పరిస్థితిలోను పెంచరాదు.
4. మందుల్ని దానిపైన సూచించిన ఉష్ణోగ్రతలోనే వుంచాలి. ఎండ తగలరాదు. తేమలో వుంచరాదు. అదే విధంగా మందులకు పొగ తగులరాదు.
5. మందులు కాలపరిమితి, వున్నదో లేదో చూసుకొని కొనాలి. అలాగే కాల పరిమితి వున్న మందుల్ని మాత్రమే వాడాలి.
6. ఏ మందు అయినా ఖాళీ కడుపుతో ఇవ్వరాదు. విటమిన్లు గాని, ఐరన్ మందులుగాని జీర్ణాశయంలో తీవ్రమైన ఇబ్బంది కలిగిస్తాయి.
7. కొన్ని సందర్భాలలో రెండు మందుల్ని కలిపివేసుకోవడం వల్ల వాటి పనితీరు మందగించవచ్చు. అయితే కొన్ని రకాల మందుల్ని కలిపి వేసుకోవలసి రావచ్చు. మందుల్ని బాగా స్టడీ చేశాక అవి వేసుకోవచ్చో లేదో తెలుసుకోవాలి.
8. రోగి నరాల జబ్బుతో బాధపడుతున్న లేక వాడేమందుల వల్ల నరాల సమస్య వచ్చినట్లయితే వెంటనే అన్ని రకాల సదుపాయాలు గల ఆస్పపత్రిలో చేర్పించి చికిత్స చేయాలి.
9. మందులు పూర్తి కోర్సు ప్రకారం వాడాలి. మధ్యలో ఆపరాదు. ముఖ్యంగా నరాల సంబంధించిన - బ్రెయిన్‌కు సంబంధించిన వ్యాధులలో మందులు వాడేటప్పుడు అసలు అపరాదు. ప్రతిరోజు క్రమంగా తగ్గించాలి. పూర్తి కోర్సు డాక్టరు సలహాపైనే వాడాలి.
10. చిన్న పిల్లలను ముఖ్యంగా ఒక సంవత్సరంలోపు చాలా జాగ్రత్తగా మందులు వేయాలి. వారికి ఏకాస్త మోతాదు ఎక్కువైనా ఇబ్బందే అన్న సంగతి గుర్తుంచుకోవాలి.
11. అదే విధంగా వయసు మళ్ళినవారి విషయంలో కూడా జాగ్రత్త అవసరం.
12. పరిస్థితి చేయిదాటే వరకు వుంచకుండా అవసరం అయితే అన్ని రకాల వసతులు వున్న పెద్ద అసుపత్రిలో చికిత్స చేయించాలి.
13. శరీరంలో ఏ భాగమైన తెగినా లేక ఏ భాగం నుండి అయిన రక్తస్రావం అవుతున్నా ముందుగా దానిని అరికట్టాలి.
14. మందుల పై వుండే జాగ్రత్తలను (Warning notes) గమనించి దాని ప్రకారం వాడవలసి వుంటుంది.
15. గర్భిణీ స్త్రీలకు మందులు వాడేటప్పుడు చాలా జాగ్రత్త అవసరం. ఏ మాత్రం తేడా వచ్చినా గర్భస్రావం జరగడమో లేక పుట్టబోయే శిశువుకు అంగవైకల్యం కలగడమో జరగవచ్చు.

# మానవ శరీర నిర్మాణము-విధులు

"శరీరమున్నప్పుడే సాధించడానికి ఏమైనా అవకాశం వుంటుంది" అన్నారు. శరీరం వున్నప్పుడే కాక అది ఆరోగ్యంగా వున్నప్పుడే సాధ్యపడుతుంది. శరీరానికి అస్వస్థత వున్నప్పుడు దానిని నివారించడానికి పలు ప్రయత్నాలు చేస్తాం - రకరకాల ఔషధాలు వాడతాం. ఇలా ఔషధాలు వాడేటప్పుడు మనకు ముఖ్యంగా శరీర నిర్మాణము - దాని విధులు తెలుసి వుండడం చాలా అవసరం. మనకు శరీరంలో ఏ అవయవంలో అస్వస్థత వుంది? దానిని గుర్తించడానికి మనకు శరీరంలోని ఆ అవయవం చేసే విధులు (పనులు) తేడా రావడంతో తెలుస్తుంది. దీన్నిబట్టే మనకు వ్యాధి గురించి.అవగాహన వస్తుంది. మానవ శరీరాన్ని స్థూలంగా మూడు భాగాలుగా విభజిస్తారు. అవి (1) తల, (2) మొండెము, (3) కాళ్ళు, చేతులు. కానీ ఈ విధంగా విభజించడం వల్ల మన శరీరం యొక్క ముఖ్య విధులు వివరించడం సాధ్యపడదు. కాబట్టి శరీరాన్ని పదిభాగాలుగా - ఈ రకంగా విభజింపవచ్చు అవి :

1. అస్థిపంజరము
2. శ్వాసక్రియా వ్యవస్థ
3. రక్తప్రసరణ వ్యవస్థ
4. నాడీ వ్యవస్థ
5. జీర్ణ వ్యవస్థ
6. మూత్ర జననేంద్రియ వ్యవస్థ
7. విసర్జన వ్యవస్థ
8. చర్మము
9. అంతస్రావ గ్రంధులు
10. జ్ఞానావయవములు

వీటివలన మన శరీరం ఏ విధంగాపని చేస్తుందో పూర్తిగా తెలుసుకోవచ్చు. అవయవాల పనితీరు గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

## అస్థిపంజరము

అస్థిపంజరము శరీరానికి నిర్దిష్టమైన ఆకృతిని కల్పిస్తోంది. శరీరంలోని ముఖ్యమైన అవయవాలైన గుండె, ఊపిరితిత్తులు, మెదడు, మూత్రపిండాలు, జీర్ణావయవాలు ఇలా ముఖ్యమైన అవయవాలన్నీ అస్థిపంజరము చేత రక్షించబడతాయి.





పిల్లలో 300ల ఎముకలు వుంటాయి. వారు పెరిగిన కొద్దీ ఈ ఎముకలలో కొన్ని ఒకదానితో మరొకటి కలిసిపోయి ఒకే ఎముకగా మార్పు చెందుతుంది. చివరికి పెద్దవారు అయ్యాక రెండు వందల ఆరు ఎముకలు వుంటాయి. తలలోను (పుర్రెలోను) - మెడలోను - ఇరవై మూడు ఎముకలు వుంటాయి. ప్రతి చెవిలోను మూడు ఎముకలు వుంటాయి. వీటిని 'మిస్' (MIS) అని వ్యవహరిస్తారు. మిస్ అంటే మాలియస్, ఇంకస్, స్టేపిస్ అనేవి వీటిలో స్టేపిస్ అనేది మన శరీరంలోని మొత్తం ఎముకల్లో చిన్న ఎముక. ఇది 0.5 సెం.మీ పొడవు వుంటుంది. వెన్నుపూస లేక వెన్నెముక అనే ఎముకల వరుస వుంటుంది. ఇది వెనుక వైపున తలనుండి పాయువు వరకు వుంటుంది. దీనిలో మొత్తం ఇరవై ఆరు ఎముకలుంటాయి. వెన్నెముక ఎముకల మధ్య ఖాళీగా వుండే భాగం వుండి మొత్తం ఒక గొట్టం మాదిరిగా వుంటుంది. దీనిలో మెదడు నుండి మస్తిష్క మేరు ద్రవంలో తెలియాడుతూ చిన్నమెదడు నుండి వెన్నుపాము వేలాడుతు వుంటుంది. ఇదీ నరాలను ఇతర శరీర భాగాలకు సంధించి సంకేతాల్ని మెదడుకు పంపుతుంది.

ఛాతీ భాగములో మొత్తం ఇరవై ఐదు ఎముకలు వుంటాయి. ఇక్కడ ఎముకలలో పన్నెండు జతలు ఒక గూడు వలె ఏర్పడి ఉంటాయి. మధ్యలో రొమ్మెముక వద్ద ఈ ఎముకలు అతుకబడి వుంటాయి. అయితే కొందరిలో ఈ ఎముకలు పదమూడు జతలు కూడా వుండవచ్చు.

ఇక భుజము, చేతిలోని ఎముకలు మొత్తం ముప్పై రెండు వుంటాయి. తొడలోను, కాలులోను, పాదాలలోను కలిపి మొత్తం ముప్పై ఒక్క ఎముకలుంటాయి. రెండు వైపులా కలిపి భుజము, చేయి, తొడ, కాలు, పాదాలలో మొత్తం నూట ఇరవై ఆరు ఎముకలు వుంటాయన్న మాట.

ఎముకలన్నింటిలోను అతి పెద్ద ఎముక పేరు ఏమిటో తెలుసా? 'ఫెముర్' అంటారు. ఇది తొడ ఎముక. దీని పొడవు మనిషి పొడవులో ఇరవై ఏడు శాతం ఉంటుంది. అదే విధంగా శరీరంలో అతి వెడల్పాటి ఎముక ఏదంటే కటివలయము దీనిని 'పెల్విస్' అంటారు.

శరీరంలోని మొత్తం ఎముకల బరువు ఎంత వుంటుందో తెలుసా మనిషి మొత్తం బరువు యాభై కిలోలు అయితే ఎముకలు మొత్తం బరువు ఏడు కిలోలు వుంటుంది. ఎముకలకు సాధారణంగా వుండే పేర్లతో బాటు వాటిని వైద్య పరిభాషలో ఏఏ పేర్లతో పిలుస్తారో చూడండి.

| | | |
|---|---|---|
| మాండిబుల్ | - | క్రింది హనువు |
| మాక్సిల్లా | - | పై హనువు |
| జైగోమాటిక్ బోన్ | - | దవడ ఎముక |
| స్కాపులా | - | భుజపు ఎముక |
| స్టెర్నమ్ | - | రొమ్మెముక |
| హ్యూమెరస్ | - | భూజాస్థి |

క్రేనియం - పుర్రె

అల్నా - ముంజేతిలోని రెండు ఎముకలలోలోపలి వైపుది. దీన్ని మూర ఎముక అని కూర్పరాస్థి అని కూడా అంటారు.

రేడియస్ - ఇది ముంజేతిలోని రెండు ఎముకలలో బొటనవ్రేలి వైపు వెలుపలి వైపు ఉండేది.

క్లావికిల్ - కాలర్‌బోన్ అంటారు

థోరాసిక్ వర్టిబ్రే - వెన్నెముక పై భాగము

లంబార్ వర్టిబ్రే - వెన్నెముక క్రింది భాగము

ఇలియం - శ్రోణ్యస్థి

ప్యూబిస్ - జఘనాస్థి

ఇస్కమ్ (ఇస్కియం) - ఆసనాస్థి

ఫెమ్యుర్ - తొడ ఎముక

పటెల్లా - మోకాలి చిప్ప

కార్పెల్స్ - మణికట్టు ఎముకలు

మెటాకార్పెల్స్ - కరభాస్థికలు (పాదాల ఎముకలు)

ఫాలాంజెస్ - అంగుళ్యాస్థులు (Finger bones)

శాక్రమ్ - వెన్ను చివర ఎముక

కాక్సిక్స్ - అనుత్రికము (తోక ఎముక)

ఫిబులా - బహిర్జంఘిక

టిబియా - పిక్క ఎముక

టార్సల్స్ - కాలి చీలమండ ఎముకలు

మెటాటార్సల్స్ - ముఖ్యమైన పాదాల ఎముకలు

ఫాలంజెస్ - అంగుళ్యాస్థులు (toe bones)

ఇవి- ముఖ్యంగా మన శరీరంలో వుండే ఎముకలు. ఎముకలు - అవి కలిసి వుండేందుకు మధ్యలో జాయింట్లు వుంటాయి. వీటిని కీళ్ళు అంటారు. రెండు లేక మూడు ఎముకలకు కలిపి కార్టిలేజ్ అనబడే ఒకరకమైన కణజాలం వుంటుంది. ఈ కణజాలం చాలా దృఢంగా వుంటుంది. కార్టిలేజ్‌తో బాటుగా ఎముకలు అటూ ఇటూ కదలడానికి వీలుగాసైనోవియల్ ద్రవం వుంటుంది. ఈ ద్రవం రెండు ఎముకల మధ్యకందెసలాగా ఉపయోగపడుతుంది.





## కండరాలు (Muscles)

శరీరంలో ఎముకలు కదలడానికి ఎముకలకు అతికి వుండేవి కండరాలు. ఇవి తేలికగా వంగుతాయి. దృఢంగా వుంటాయి. ఇవినాడులను కలిగి వుంటాయి. నాడీ స్పందనను కలిగి వుంటాయి. ఇవి సాగెడు గుణం కలిగి వుంటాయి. అదే విధంగా ముడుచుకు పోయే తత్వం కలిగి వుంటాయి. ఇవి ఎన్నో కణాలు కలిసి ఒక తాడువలె వుంటాయి. మనకు కండరాల కదలిక లేకపోతే అసలు కదలికే లేనట్లు. వీటిలో కొన్ని కండరాలు నిరంతరం పని చేస్తూనే వుంటాయి. ఉదాహరణకు గుండె కండరాలు, ఊపిరితిత్తుల కండరాలు నిరంతరం పని చేస్తాయి. అలాపని చేయకపోతే ప్రాణాపాయం సంభవిస్తుంది.

## నాడీ వ్యవస్థ (Nervous system)

మన శరీరంలో అతి ముఖ్యమైన వ్యవస్థ నాడీ వ్యవస్థ: నాడీ వ్యవస్థ రెండు రకాలుగా వుంటుంది. (1) అసంకల్పిత లేదా స్వయంచోదిత నాడీ వ్యవస్థ, (2) కల్పిత నాడీ వ్యవస్థ. వీటిలో అసంకల్పిత నాడీ వ్యవస్థ గుండె, ఊపిరితిత్తులు మూత్రపిండాలు వంటి అవయవాల్ని అదుపులో వుంచితే కల్పితనాడీ వ్యవస్థ కాళ్ళు, చేతులు, నోరు వంటి ముఖ్య భాగాలలో వుండి మనం అనుకున్న సందర్భంలో ఆయా అవయవాల చేత పని చేయించేందుకు ఉపయోగపడుతుంది నాడులు లేదా నాడీ వ్యవస్థ - నాడీ కణాలు, నాడీ దండాలు లేదా నాడీ పోగుల రూపంలో ఉంటుంది. నాడులన్నీ మెదడుకు లేదా మెదుల్లా అబ్లాంగేటా (చిన్న మెదడు)కు లేదా వెన్నుపాముకు అనుసంధానించబడి వుంటాయి.

నాడులు మన శరీరంలో అంతటా విస్తరించి వుంటాయి. చర్మం పై పొరల్లో కూడా నాడులు వుంటాయి. అందుచేతనే కాస్తంత గీరుకు పోయినా నొప్పి అనిపిస్తుంది. జ్ఞానావయవాల నుండి నాడులు మెదడుకు ప్రత్యక్షంగా అనుసంధానించబడి వుంటాయి. సింపథెటిక్ నెర్వస్ సిస్టం, పారాసింపథెటిక్ నెర్వస్ సిస్టం అని రెండు రకాలుగా ఈ నాడీ వ్యవస్థ ఉంటుంది. సింపథెటిక్ నెర్వస్ సిస్టంలో నాడీ పోగులు వుంటాయి. ఇవి మెదడుకు ప్రత్యక్షంగా అనుసంధానించబడి వుంటాయి.

నాడుల ద్వారా మెదడు మన శరీరంలోని వివిధ జీవనక్రియలను నియంత్రిస్తుంది. మెదడు చనిపోతే మనిషి చనిపోయినట్లే - అలాగే నాడీ వ్యవస్థలోని కొన్ని నాడులు చనిపోతే (నాడీ కణాలు చనిపోతే) ఆ ప్రాంతం అచేతనంగా మారుతుంది. దీనినే పక్షవాతం అంటారు

## శ్వాసక్రియా వ్యవస్థ

'ఊపిరి చొరబడితే పుట్టాడంటారు. ఊపిరి నిలబడితే పోయాడంటారు ...' అని అన్నాడో మహాకవి. ఊపిరికీ మనం జీవించడానికి అంత దగ్గరి సంబంధం వుంది. అంతెందుకు ముక్కు మూసుకుని మూడు నిముషాలు వుంటే ప్రాణం హరీమంటుంది. మనిషి జీవించడానికి ప్రా

వాయువు అవసరం. గాలిలోని ఆక్సిజన్‌ను మనం పీల్చుకుని కార్బన్ డయాక్సైడ్ వాయువును వదిలి పెడుతుంటాము. ప్రాణవాయువును రక్తము ద్వారా మన శరీరంలోని ప్రతి కణం వద్దకు వెళ్ళి అవి జీవించడానికి కావలసిన శక్తిని అందించి వాటిలో తయారైన విష పదార్ధమైన కార్బన్ డయాక్సైడ్‌ను రక్తం ద్వారా తీసుకొని బయటకు వదిలి వేసే అవయవం ఊపిరితిత్తులు.



Organs of respiration

ముక్కు ద్వారా గాలి మన ఊపిరి తిత్తుల లోనికి ప్రవేశిస్తుంది. ఊపిరితిత్తులు రెండు ఉంటాయి. ఈ ఊపిరితిత్తులలో ఒకదాన్లో రెండు మరొకదాన్లో మూడు తమ్మెలు ఉంటాయి. ఈ తమ్మెలలో చిన్నచిన్న ద్రాక్ష గుత్తులవంటి వాయు గోణులు వుంటాయి. ఈ వాయుగోణుల చుట్టూ రక్తనాళాలు వలవలె అల్లుకుని వుంటాయి. ఇలా అల్లుకుని వుండడం వల్ల వాయు వినిమయం జరుగుతుంది. ఊపిరితిత్తుల్లో మ్యూకస్ పొరలు (జిగురుపొరలు) వుంటాయి. ఒకొక్కసారి వీటివల్ల ఆస్మా, ఎలర్జీ వంటి ఇబ్బందులు కూడా వస్తాయి.

ఊపిరి పీల్చుకునేందుకు ఊపిరితిత్తుల కండరాలు సహకరిస్తాయి. ఊపిరి పీల్చు కోవడాన్ని ఇన్‌హెలేషన్ అని, ఊపిరి వదలడాన్ని ఎక్స్‌హేలేషన్ అని అంటారు. ఊపిరితిత్తులకు క్రింది భాగంలో ఒక కండరపు పొర వుంటుంది. ఇది ఊపిరితిత్తులు, గుండెల నుండీ జీర్ణ మండలాన్ని వేరు చేస్తుంది. దీనిని ఉదరవితానము అంటారు. ఇది ఊపిరితిత్తుల క్రిందుగా వున్నా ఊపిరి పీల్చుకోవడానికి ఊపిరితిత్తులకు సహకరిస్తుంది కూడా.

## విసర్జక వ్యవస్థ (Excretory system)

మనశరీరం పొరపాటున విషపదార్ధాలను గ్రహించినప్పుడు వాటిని బయటకు నెట్టి వేసేందుకు సహకరించే వ్యవస్థ విసర్జక వ్యవస్థ. అంతే కాదు మన శరీరంలో తయారయ్యే వ్యర్ధ పదార్ధాలను బయటికి పంపడానికి కూడా ఇది ఉపయోగపడుతుంది.

విసర్జక వ్యవస్థ మన శరీరంలో మూడు విధాలుగా వుంటుంది. అది

1. చర్మము (చెమట ద్వారా వ్యర్ధ పదార్ధములు, ఇంకా అధికంగా వున్న లవణములు విసర్జింప బడతాయి).
2. మూత్రము
3. మలము





ఒకవేళ చర్మంలోని స్వేదగ్రంథులు సరిగ్గా పనిచేయకపోతే చర్మ రంధ్రాలు మూసుకు పోతాయి. దానితో విసర్జించ వలసిన విషతుల్య పదార్ధాలు చర్మం ద్వారా బయటకు పోవు. దీనివల్ల ప్రేవులలోను, మూత్రపిండాలలోను కూడా విసర్జక పదార్ధాలు విసర్జింపబడక వ్యవస్థ అస్తవ్యస్థం అవుతుంది. దీనివలన కడుపులో నొప్పి, మలబద్ధకము కడుపులో వాయువులు. ఎసిడిటీ, ఒకొక్కసారి నీళ్ళ విరేచనాలు గుండెల్లో మంట వంటి పలు సమస్యలు రావచ్చు.

చర్మంలోని స్వేదగ్రంథులు పని చేయాలన్నా చర్మ రంధ్రాలు తెరచుకోవాలన్నా ఆహార నియమాలు, చర్మ పరిశుభ్రత అవసరం. దీనివల్ల చర్మం ద్వారా విసర్జింపబడే విసర్జన పదార్ధాలు మాములుగా విసర్జింపబడతాయి.

ఇక రెండోది మూత్రము. మనం తినే ఆహారంలోని నీరు. త్రాగే నీరు మన శరీర అవసరాలకు ఉపయోగపడినంత ఉపయోగపడి మిగిలినది మూత్రం ద్వారా బయటకు పోతుంది. ఈ సందర్భంలో శరీరంలోని నీరు తనతో శరీరంలోని విషపదార్ధాల్ని కరిగించుకుని మరీ బయట బడుతుంది. ఇలా మూత్రం బయటకు రావాలంటే మూత్ర పిండాలు పనిచేయాలి.

మూత్ర పిండాలు మన శరీరంలోని నీటిని వడగట్టి మనకు ఉపయోగపడే వాటిని శరీరంలోనే వుంచి హానికర పదార్ధాల్ని బయటకు పంపుతాయి. ఇవి రెండు వుంటాయి. నడుము భాగంలో వుంటాయి. ప్రతి మూత్రపిండములో భౌమన్స్ గుళికలనేవివుంటాయి. రక్తములోని విషపదార్ధాలను గ్రహించి బయటకు పంపడమే కాక తీసుకున్న ఆహారంలోని నీటిని కూడా గ్రహించి, ఉపయోగపడేట్లయితే రక్తంలో కలిపి, మనకు ఉపకారం చేసే అతిసూక్ష్మాతి సూక్ష్మమైన నిర్మాణాలు ఇవి. మనం పొరపాటున వేసుకున్న మందులు కూడా మూత్రం ద్వారా బయటకు రావడం జరుగుతుంది. ఈ సందర్భంలో కొన్ని రకాల మందులు వేసుకోడం వల్ల మూత్ర సంబంధమైన పలు సమస్యలు కూడా రావచ్చునని గ్రహించాలి.

విసర్జన పదార్ధాలలో మరొకటి మలము. మనం తీసుకున్న ఆహారం జీర్ణ వ్యవస్థ ద్వారా చిన్న ప్రేవులలో జీర్ణం కాబడి రక్తంలో కలుస్తుంది. అయితే ఇంకా ఏమైనా మిగిలివున్న పోషక పదార్ధాలు పెద్దప్రేవులలో జీర్ణం కాబడతాయి. ఇక్కడే వడగట్టబడి మిగిలిన పనికిరాని విషతుల్య పదార్ధం మలం రూపంలో బయటకు వస్తుంది. కొన్ని కారణాల వల్ల మల విసర్జన సరిగా జరగక పోవడంతో అనేక సమస్యలు వస్తాయి. కొందరికి తరచు ఇలాటి సమస్య రావడం ఏదో ఒక అనారోగ్యాన్ని కలిగించడం జరుగుతూ వుంటుంది. ఒకసారి మలబద్ధకం వచ్చిన వారు తరచుగా దీనికి గురవడం మాత్రమే కాక ఆ తరువాత కాలంలో వారికి మొలల వ్యాధి కూడా దాపురించవచ్చు. కావున ప్రతిరోజు క్రమం తప్పకుండా మలవిసర్జన జరిగేలా చూసుకోవాలి.

## జీర్ణక్రియ (DigestiveSystem)

జీర్ణక్రియలో నోరు, పళ్ళు, గొంతు, ఆహారనాళం ఉదరము (జీర్ణాశయం), పెద్ద, చిన్న ప్రేవులు, కాలేయము, గాల్‌బ్లాడర్ (పిత్తాశయం), ప్లీహము, క్లోమము, సిగ్మాయిడ్, రెక్టమ్, అనస్, సీకం, ఉండుకము (అపెండిక్స్), ఇలియం ఇవన్నీ పాలుపంచుకుంటాయి.

మనం తిన్న ఆహారం వివిధ రకాల ప్రదేశాలలో వివిధ రకాల జీర్ణ రసాలు (ఎంజైములు) సహాయంతో జీర్ణమవుతుంది. జీర్ణమవడం అంటే ఆహారంలోని పోషక పదార్థాలు శరీరానికి శక్తినిచ్చేందుకు రక్తంలో కలవడమే.




-Organs of the digestive system (Shown diagrammatically)

మనం తీసుకునే ఆహారం సాత్వికంగా వుండాలి. అప్పుడే జీర్ణం అవడం సులువు అవుతుంది. కొన్ని కొన్ని సందర్భాలలో - ముఖ్యంగా ఏదైనా జబ్బు పడ్డప్పుడు మనం తీసుకునే ఆహారం జీర్ణం కాదు. దీనికి కారణం జీర్ణ మండలంలో జీర్ణరసాలు సరిగ్గాఉత్పత్తి అవ్వకపోవడమే! ఈ సందర్భంలో పాలు, రొట్టె, ఫలాలు వంటివి తీసుకోవడం ఎంతో ఉపయోగకరం. ఇవి చాలా తేలికగా జీర్ణం అవుతాయి. - మంచి పోషక విలువలు కూడా వీటిలో వుంటాయి. రోగి త్వరగా కోలుకోవడానికి ఇవి ఉపయోగపడతాయి.

## మూత్రజననేంద్రియ వ్యవస్థ

ప్రత్యుత్పత్తి వ్యవస్థ. మూత్ర వ్యవస్థ రెండు దాదాపు ఒకే చోటు నుండి జరుగుతాయి. మన శరీరంలోని పనికిరాని ద్రవపదార్థం మూత్రము. మూత్రము రక్తం నుండి వ్యర్థ పదార్థముగా





సేకరించబడుతుంది. చిక్కుడుగింజల ఆకారంలోని రెండు మూత్రపిండాలు మూత్రాన్ని సేకరించి మూత్రాశయంలోనికి పంపుతాయి. అక్కడ నుండి మూత్రం బయటకు మూత్రనాళం ద్వారం బయటకు పంపబడుతుంది.

**పురుష జననేంద్రియ వ్యవస్థ** : ఇది పురుషులకు శరీరానికి వెలుపలగా - అంటే బయటకు వుంటుంది. దీనిని పెనిస్ లేక పురుషాంగము అంటారు. ఇది కండరయుతమైన నిర్మాణము. పురుషాంగము మొదలులో ఒక సంచి వంటి భాగము వుంటుంది. దీనిలో రెండు టెస్టికల్స్ లేక బీర్జాలు వుంటాయి. వీటిని శుక్ర కోశాలు అంటారు. వీనిలో శుక్ర కణాలు వుంటాయి. వీటిని వీర్యకణాలు అంటారు. అంగము చివర ఉబ్బినట్లు ఒక భాగము వుంటుంది. దీనిని 'గ్లాన్స్ పెనిస్' అంటారు. దీనిపైన చర్మము వదులుగా కప్పి వుండి రక్షిస్తూ వుంటుంది. ఇంకా మిగిలిన పురుష జననేంద్రియ వ్యవస్థలో ప్రొస్టేట్ గ్రంధి, ఎపిడిడైమస్,శుక్రనాళికలు వంటివి వుంటాయి.

-Reproductive organs of the male ( side view )




**స్త్రీ జనేంద్రియ వ్యవస్థ** : స్త్రీ జననేంద్రియ వ్యవస్థ పురుష జననేంద్రియ వ్యవస్థకు భిన్నంగా వుంటుంది. స్త్రీ జననేంద్రియములో బయటకు కనిపించే భాగాలు వల్వా (Vulva), లాబియామేజోరా (Labia Majora) (రెండు పెదవుల వంటి ముడుతలు), లాబియామైనోరా (Labia minora) అనే ముడుతలు - ఇవి మ్యూకస్ మెంబ్రేన్ కలిగి లాబియా మేజోరా క్రిందుగా వుంటుంది. ఆ తరువాత 'క్లిటోరిస్' అనేది వుంటుంది. 'క్లిటోరిస్' పురుషులలో పెనిస్ వంటి నిర్మాణమే యురెత్రా (యోని) ఇది ఒకటిన్నర అంగుళాల పొడవు వుంటుంది. అయితే లోపలి భాగము పొడవు ఐదు అంగుళాల వరకు పెరుగుతుంది. యోనిలోపల చివరి భాగంలో వజినా స్పింక్టర్ వుంటుంది.




Reproductive organs of the famale (side view)

యుటెరస్ చదునుగా వెనుకకు వుంటుంది. దీని పొడవు మూడు అంగుళాలు వుంటుంది. యోని కంఠము (సెర్విక్స్) అనే భాగము వుంటుంది. దీనిని 'OS' అని అంటారు. ఫాలోపియన్ ట్యూబులు రెండు వైపులా లోపలి వైపు అమరి వుంటాయి. ఇవి అండములకు కలపబడి వుంటాయి. ఫాలోపియన్ ట్యూబులు ఒకొక్కటి నాలుగు అంగుళాలు పొడవు వుంటుంది.

పురుష జననేంద్రియ వ్యవస్థ అయినా స్త్రీ జననేంద్రియ వ్యవస్థ అయినా మన శరీరంలో కటి వలయం అనబడే ఎముకల పేటికలో చాలా భద్రంగా అమరి ఉంటాయి.

## రక్తప్రసరణ వ్యవస్థ

మన శరీరంలో నాడీ వ్యవస్థ, శ్వాస వ్యవస్థ తరువాత అత్యంత ముఖ్యమైన వ్యవస్థ రక్తప్రసరణ వ్యవస్థ. రక్తము మానవ శరీరంలో ఎంతో ప్రముఖమైన పాత్ర నిర్వహిస్తుంది.

రక్తము మన శరీర ఉష్ణోగ్రతను క్రమపరుస్తుంది. మన శరీరంలో ప్రవేశించిన అన్య పదార్ధములను లేదా మన శరీరంలో తయారయ్యే నిరుపయోగ విషతుల్య పదార్ధాలను విసర్జింప జేసేందుకు రక్తం ఉపయోగపడుతుంది. రక్తము ద్రవరూపంలో వుంటుంది. ఇది మన శరీరం అంతటా సన్నని కేశనాళికలు గుండా ప్రసరించి ఊపిరితిత్తుల నుండి ప్రాణవాయువును వివిధ కణాలకు అందజేస్తుంది. అదే సమయంలో ఆయా కణాలలో తయారయ్యే కార్బన్ డయాక్సైడ్‌ను గ్రహించి ఊపిరితిత్తులకు అందజేస్తుంది. ఊపిరితిత్తుల నుండి మంచి రక్తము. అంటే ఆక్సిజన్ (ప్రాణవాయువు) కలిగి వున్న రక్తము ముందుగా గుండెకు చేర్చబడుతుంది. ఈ రక్తము గుండె





ద్వారా వివిధ శరీర భాగాలకు చేర్చబడుతుంది. అదే విధంగా వివిధ శరీర భాగాల నుండి రక్తం మొదటగా గుండెకు చేరి అక్కడ నుండి ఊపిరితిత్తులకు పంపబడుతుంది.

గుండె నుండి ఇతర శరీర భాగాలకు రక్తాన్ని తీసుకుని వెళ్ళే రక్తనాళాలను ధమనులు (ఆర్టెరీస్ (Arteries)) అని అంటారు. ఇవి శరీరంలో లోతుగా వుంటాయి. దీనిలో వుండే రక్తము స్కార్లెట్ ఎరుపు రంగును కలిగి వుంటుంది.

గుండె నుండి రక్తమును తీసుకు వెళ్ళే రక్తనాళాలు ధమానులు అయితే మరి గుండెకు రక్తాన్ని తీసుకువచ్చే రక్తనాళాలను సిరలు (Veins) అంటారు. సిరలు మన శరీరంలో ఉపరితలములో చర్మానికి క్రిందుగా వుంటాయి. తెల్లని శరీరంగల వారిలో ఇవి నీలపురంగులో కనిపిస్తాయి. దీనిలో వుండే రక్తము చిక్కని ఎరుపు రంగుతో వుంటుంది. ఈ రక్తములోని ప్రవాహం ఎలాటి మార్పులు లేకుండా సాఫీగా వుంటుంది. అయితే ధమనులలో వుండే రక్తము జర్కులు ఇస్తూ ప్రవహిస్తుంది. నాడి కూడా ధమనులవలననే తెలుస్తుంది. అయితే సిరలన్నీ చెడు రక్తాన్ని ధమనులన్నీ మంచి రక్తాన్నీ తీసుకెళ్తాయంటే పొరపాటే. సిరలలో పుపుససిరలు మంచి రక్తాన్ని గుండెకు చేరుస్తాయి. ఇవి ఊపిరి తిత్తులనుండి మంచి రక్తాన్ని గుండెకు తీసుకెళ్తాయి. అదే విధంగా పుపుస ధమనులు గుండె నుండి చెడు గక్తాన్ని ఊపిరితిత్తులకు చేరవేస్తాయి.

రక్తము ధమనుల నుండి సిరలకు రక్తకేశనాళికల గుచ్ఛము ద్వారా మారుతుంది. రక్తకేశ నాళికలు తల వెంట్రుకల కన్నా సన్నగా వుంటాయి. ఇవి కాక మన శరీరంలో లింపు గ్రంధులు, లింపు నాళాలు కూడా ఉంటాయి. ఇవి మన శరీరంలో ప్రవేశించిన అన్య పదార్ధాలను గుర్తించి దానిని బయటకు పంపుతాయి.

## కొన్ని సాధారణ వ్యాధులు జీర్ణ వ్యవస్థలో సంభవించే వ్యాధులు

### మలబద్ధకము (Constripation)

మలబద్ధకము అనేక రోగాలకు మూలము. చిన్న ప్రేవులు బలహీన పడడం వల్ల మనం తినే ఆహారం జీర్ణక్రియలో చివరకు ద్రవ పదార్థాం అంతా బయటకు ప్రేగుల ద్వారా రక్తంలో కలిసి వ్యర్థమైనది మూత్రంపిండాల గుండా వెలుపలకు పోతుంది. దానితో మలము గట్టిపడిపోయి బటయకు వెడలుట కష్టము అవుతుంది.

**మలబద్ధకం ఈ క్రింది లక్షణాలు కలిగి వుంటుంది.**

★ రెండు లేక మూడు రోజుల కొకసారి విరేచన మవ్వవచ్చు లేక అప్పటికీ విరేచనం చాలా కష్టంగా అవుతుంది.

★ విరేచనం ఎంత కష్టంగా అవుతుందంటే చాలాసేపు ముక్కవలసి వస్తుంది. బలవంతాన ముక్కి విరేచనం కావించు కోవడం వలన చర్మం చీరుకు పోయి ఒకొక్కసారి రక్తం కూడా కారవచ్చు.

★ విరేచనం సాఫీగా రాదు. చాలా కష్టంగా రాయిలాగా పిష్టము కట్టి వుటుంది. ఎండిపోయి వుంటుంది.

★ మలబద్ధకంతో బాటే ఉత్సాహం లేక పోవడం నీరసం కూడా వుంటాయి.

★ తిన్ని ఆహారం సరిగ్గా అరగకపోవడం వల్ల - ఆహారం తిన్నాక తగినన్ని మంచినీరు తీసుకోక పోవడం వల్ల కూడా మలబద్ధకం వస్తుంది.

★ మలబద్ధకం వలన తలనొప్పి, తలతిరగడం, నిద్రమత్తు, ఆయాసం, దగ్గు కూడా వస్తాయి.

★ మలబద్ధకం వున్నవారు చీటికీ మాటికీ చికాకు పడుతూ వుంటారు. వూరికినే కోపగించుకుంటారు.

★ వీరికి బొడ్డు దగ్గర పెద్దరాయి పెట్టినట్లు వుంటుంది. కడుపులో గ్యాస్ వుండి నొప్పిగా వుంటుంది.

★ ఆసనం చీరుకుపోయి కత్తెరతో కత్తిరించినట్లుగా అనిపించి నొప్పి చేస్తుంది.

★ కడుపులో మెలి తిప్పినట్లుగా అయి కడుపునొప్పి, వాంతులు, కడుపు ఉబ్బరం వుంటాయి.

★ కడుపులో పేగులు గనుక మడత పడినట్లయితే ఆపరేషన్ చేయించాల్సి వస్తుంది.

★ కొన్ని సందర్భాలలో గర్భిణీస్త్రీలకు, ముసలి వారికి కూడా మలబద్ధకం వస్తుంది. వీరిలో కడుపు కండరాలు బాగా బలహీనంగా వుండడం వల్ల చాలా ఇబ్బంది పడాల్సి వుంటుంది.





అయితే వీరికి మలబద్ధకం చాలా కాలం నుండి వున్నట్లయితే విరేచనాల్ల మందు వేసుకోవచ్చు. లేకపోతే ఎనిమా చేసి మలాన్ని బయటకు రప్పించాలి. గర్భిణీ స్త్రీలలో ఎనిమా చేయడము, విరేచనాల మందు వేయడము రెండు రిస్క్ తో కూడుకున్నవే.

★ హఠాత్తుగా కడుపునొప్పి, వాంతులు వచ్చి పొట్ట బాగా ఉబ్బరంగా వుంటే డాక్టరుకు చూపించాలి.

★ మలబద్ధకం అకస్మాత్తుగా వస్తుంది. మలద్వారం దగ్గర చీలిన వారికి చివరికి 'ఏనల్ ఫిషర్' వచ్చే అవకాశం వుంది. విరేచన సమయంలో రక్తం పడడం, మలద్వారం దగ్గర నొప్పి, ఎడతెగని కడుపునొప్పి వుంటే డాక్టరుకు చూపించాలి.

★ చిన్నపిల్లల్లో మలబద్ధకం ఉన్నప్పుడు - అది కూడా తరుచుగా వుంటుంటే డాక్టరు సలహా తీసుకోవాలి. మలబద్ధకంతో పాటుగా జ్వరం వున్నా, గుండె పోటు వున్నా వీరు విరేచన మందువాడరాదు. వెంటనే డాక్టరు వద్దకు తీసుకెళ్ళాలి.

**మలబద్ధకం రావడానికి అనేక కారణాలు వున్నాయి అవి :**

★ అజీర్తి, అన్నం అరగకపోవడం, ఆహారంతో పాటుగా మంచినీరు త్రాగక పోవటం వల్ల మలబద్ధకం వస్తుంది.

★ మనం తినే ఆహారంలో లోపం వల్ల మలబద్ధకం వస్తుంది.

★ కడుపులో ప్రేగులకు సంబంధించిన బలహీనత, పేగులకు కేన్సర్ వ్యాధి వస్తే మలబద్ధకం రావచ్చు.

★ మనం తీసుకునే ఆహారంలో పీచుపదార్థాల వాడకం తక్కువగా ఉండడం వల్ల మలబద్ధకం ఏర్పడవచ్చు.

★ ఒకొక్క సందర్భంలో డయేరియాగాని, డీసెంట్రీగాని రావడం వల్ల ఆ తరువాత మలబద్ధకం ఏర్పడుతుంది.

★ మలబద్ధకం వచ్చిన వారు తమకు వంట్లో ఏమీ బాగోలేదని అనుకుంటారు గాని ఇదీ సమస్య అని తెలుసుకోలేరు.

★ మలబద్ధకం తరచుగా విరేచన కారులయిన మందుల్ని అలవాటుగా వాడడం వల్ల కూడా వస్తుంది.

★ అతిగా విశ్రాంతి తీసుకోవడం లేదా ఎక్కువగా పని చేయడం రెండూ మలబద్ధకాన్ని కలిగించవచ్చు.

★ కొన్ని కొన్ని దురలవాట్ల వల్ల కూడా మలబద్ధకం వస్తుంది. అంటే - మాదకద్రవ్యాలు, పొగత్రాగడం, సారాయి త్రాగడం ఇలాటి దురలవాట్ల వల్ల కూడా మలబద్ధకం రావచ్చు.

## చికిత్స

మందులు వాడి మాత్రమే మలబద్ధకాన్ని వదలించడానికి ప్రయత్నించడం కష్టమే. మందులతో పాటుగా ఆహార నియమాల్ని పాటించాలి. ఇంకా

★ వేళకు భోజనం చేయాలి.

★ మల విసర్జన జరిగినా, జరగకపోయినా ప్రతిరోజు ఒకేవేళకు లెట్రిన్‌కు వెళ్ళాలి.

★ ఆహారంలో కాయగూరలు, ఆకుకూరలు - పీచుపదార్థాలు ఎక్కువగా ఉండేటట్లు చూడాలి.

★ మంచినీళ్ళు అధికంగా త్రాగాలి.

★ బిస్కెట్లు, బ్రెడ్డువంటివి మందము చేసి విరేచనం కాకుండాఉంచుతాయి. వీటికి దూరంగా వుండాలి.

★ అదే విధంగా స్వీట్స్, నూనె పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు తినరాదు.

★ అరటిపళ్ళు తింటే మలబద్ధకం చాలావరకు పోతుంది.

★ ఒక గ్లాసు నీళ్ళలో రెండు మూడు చెంచాల ఉప్పు కలుపుకుని త్రాగి కదలకుండా పడుకోవాలి. అటు ఇటు కదిలితే వాంతి వచ్చే అవకాశం వుంది. కాబట్టి కదలకుండా పడుకుని వుంటే ఒక పది నిముషాలలో నీళ్ళ విరేచనం అవుతుంది.

పై పద్ధతులలో మలబద్ధకం పోకపోతే ఈ మందులు వాడవచ్చు.

★ మెగ్నీషియం సల్ఫేట్ -.ఇది 'ఎప్సమ్ సాల్ట్' రూపంలో బజారులో వుంటుంది. ఒక పాకెట్ నోట్లో పోసుకుని నీళ్లు త్రాగాలి. ఈ విధంగా చేస్తే అరగంటలోపు విరేచనం అవుతుంది.

★ మిల్క్అఫ్ మెగ్నీషియా - 11.25 మి.లీ. దీనితోపాటు లిక్విడ్ పారఫిన్ - 3.75మి.లీ. కలిసిన మందు. ఇది 'క్రిమాఫిన్' అనే పేరుతో వుంటుంది.

దీనిని రెండు నుండి ఐదేళ్ళలోపు వారికి 2.5 మి.లీ. నుండి 5 మి.లీ. వరకు రాత్రిపూట

ఐదు నుండి పన్నెండు సంవత్సరాలు వారికి 5 మి.లీ నుండి 10 మి.లీ వరకు రాత్రిపూట.

పన్నెండేళ్ళ పైబడిన వారందరికీ - 7.5 మి.లీ నుండి 15 మి.లీ వరకు రాత్రిపూట ఇవ్వాలి.

అలాగే 'క్రీమోఫిన్ పింక్' అనే మందులో అయితే మిల్క్ ఆఫ్ మెగ్నీషియా, లిక్విడ్ పారఫిన్‌లతో పాటుగా ఫినాప్తలీన్ 50 మి.గ్రా లేక 15 మి.లీ వరకు కలిసి వుంటుంది. ఇది కూడా క్రీ మాఫిన్ వాడినట్లుగానే వాడాలి.

★ లిక్విడ్ పారఫిన్ - ఇది పై మందులతో కలిసి వుండొచ్చు - లేదా విడిగా కూడా దొరుకుతుంది. ఈ మందు విడిగా వున్నదాన్ని క్రీమాఫిన్ డోసులోనే వాడవచ్చు.

★ బిసకోడిల్ - 5 మి.గ్రా. : ఇది డుల్కోలాక్స్ పేరుతో వుంటుంది. రెండు మాత్రలు రాత్రి పడకునేటప్పుడు వేసుకుంటే ఉదయాన విరేచనం అవుతుంది.





★ సెన్నోసైడ్స్ : ఇది గ్లాక్సెన్నా; సర్సెన్నైడ్ అనే పేర్లతో బజారులో అమ్ముతారు. దీనిని 12 సంవత్సరాలలోపు వారికి, ఆరు సంవత్సరాలు దాటిన వారికి ఒకటి లేక రెండు టాబ్లెట్లు వాడాలి (రాత్రి పూట) పన్నెండు సంవత్సరాలు దాటిన వారికి మాత్రము రోజుకు రెండు లేదా నాలుగు టాబ్లెట్లు రాత్రిపూట వాడాలి.

ఇది కాకుండా చాలా చిన్న పిల్లలకు చికిత్స కొరకు :

★ 'గ్లిజరిన్ సపోజిటరీ' - దీని పై నుండే తగరమును తీసివేసి మలద్వారము లోనికి నెట్టాలి.

★ పెద్దవారికి డుల్కోలాక్స్ టాబ్లెట్స్ వలె చిన్న పిల్లలకు డుల్కోలాక్స్ సపోజిటరీ వుంటుంది. దీన్ని కూడా పైదాని వలెనే వాడాలి.

★ అసలు మందులే వాడకుండా చిన్న సబ్బు ముక్కను కూడా మలద్వారం ద్వారా ప్రవేశ పెట్టవచ్చు. అంతే దీనికి కూడా విరేచనం సాఫీగ అవుతుంది.

## డయేరియా (Diarrhoeas)

ఈ వ్యాధినే 'అతిసార వ్యాధి' అని కూడా పిలుస్తారు. ఈ వ్యాధిలో నీళ్ళు నీళ్ళగా పల్చగా విరేచనాలు అవుతాయి. ఈ విరేచనాలు వైరస్ క్రిముల వల్ల ఎక్కువగా వస్తూ ఉంటాయి. 'బాసిల్లస్ కొలి' అనే బాక్టీరియా వల్ల కూడా అతిసార వ్యాధి రావచ్చు.

వైరస్ వల్ల వచ్చే అతిసార వ్యాధిలో చికిత్సకు సరైన మందులు లేవు. దీనికి కోల్పోయిన నీటిని భర్తీ చేయడం ఒక్కటే మార్గం. డయేరియా బాక్టీరియా వల్ల వస్తే మటుకు యాంటీబయాటిక్ మందుల్ని వాడి రోగాన్ని తగ్గించవచ్చు.

### వ్యాధిని గుర్తించడం

అతిసార వ్యాధిలో పల్చగా నీళ్ళనీళ్ళగాను కాస్తంత చిక్కుగాను విరేచనాలు అవుతాయి. కాస్తంత మలాన్ని స్లైడు పై వేసి మైక్రోస్కోపులో చూసి ఇది బాక్టీరియా వల్ల వచ్చిందా లేక వైరస్ వల్ల వచ్చిందా అన్నది నిర్ధారిస్తారు.

అతిసారవ్యాధిలో రోగికి ఈ క్రింది లక్షణాలు కనిపిస్తాయి. అవి :

★ విరేచనాలు ఇన్ని అని లెక్కలే లేకుండా పల్చగా అవుతూ వుంటాయి.

★ విరేచనాలు అధికంగా అవుతూ వుండడం వల్ల నీరసం, వికారం, వాంతులు, పిక్కలు నొప్పులు వస్తాయి.

★ అతిసార విరేచనాలను అశ్రద్ధ చేస్తే ప్రాణాపాయం కూడా సంభవిస్తుంది.

★ అతిసార వ్యాధిలో రోగి తనవంట్లో వున్న ఖనిజలవణ జలాన్ని కోల్పోతాడు. దీని వల్ల అతని జీవనక్రియలకు అంతరాయం కలిగి రోగి కోమాలోనికి వెళ్ళే ప్రమాదం ఉంది. దీన్ని నివారించేందుకు రోగికి సెలైన్ ద్వారా కోల్పోయిన నీటిని అందించాలి.

★ ఒకవేళ వ్యాధి అంతతీవ్రంగా లేనట్లయితే నోటి ద్వారా ద్రవహారాన్ని, ద్రవాలను అందిచాలి. ఒక్కోసారి రోగికి వాంతులు అవవచ్చు. ఇలా వాంతులు అవుతూ వుంటేమటుకు సెలైన్ వాడడం తప్పనిసరి.

★ రోగి పరిస్థితి తీవ్రంగా మారితే నాడీ బలహీనంగా వుంటుంది. ఒకొక్కసారి నాడి దొరకడం కూడా కష్టమే. వళ్ళు చల్లబడి పోతుంది. రోగి తెలివి తప్పిపోతాడు.

★ రోగి పరిస్థితి తీవ్రతను గమనించి సెలైన్ వెంటనే అందించాలి. తనలోని ఖనిజ లవణాల్ని కోల్పోవడం వల్ల రోగి వళ్ళు చల్లబడి, నాలుక పిడచకట్టు కునిపోతుంది, రోగి పెదవులు కూడా ఎండిపోయినట్లు అవుతాయి.

★ రోగి కళ్ళు లోపలికి పోయినట్లుగా అవుతాయి. నీరసం వల్ల రోగి మాట్లాలేక పోతాడు. చీటికి మాటికి తెలివి తప్పి పడిపోవడం జరుగుతుంది. మాటకూడా చాలా లోతుగా నూతిలో నుండి వస్తున్నట్లుగా వుంటుంది.

★ ఒకొక్క సందర్భంలో రోగికిజ్వరం, ఫిట్స్ కూడా రావచ్చు.

★ రోగి మూత్రం చిక్కగా పసుపురంగులో ఉంటుంది. చాలా తక్కువగా వస్తుంది. ఒక్కోసారి మూత్రం అసలు రాకపోవడం కూడా జరగవచ్చు.

★ అతిసార వ్యాధి రోగిలో ముఖ్యంగా గమనించాల్సినది - రోగి చర్మం. ఇది ఎండిపోయి నట్లుగా అయిపోయి సాగే శక్తిని కోల్పోతుంది. పొట్టపై నున్న చర్మాన్ని గనుక లాగివదిలితే మడత అలాగే ఎంతో సేపు ఉంటుంది.

★ రోగికి వాంతులు అవుతూ వుంటాయి. అయితే అందరిలోవాంతులు అవ్వాలని లేదు. రోగి శ్వాస కూడా చాలా వేగంగా తీసుకుంటూ వుంటాడు.

★ డయేరియా ఏ వయసువారికైనా రావచ్చు. చిన్న పిల్లలకు, వృద్ధులకు, గర్భిణీ స్త్రీలకు గనుక వస్తే చాలా ప్రమాదం. వీరికి అతిసార లక్షణాలు కనుక కనిపిస్తే వెంటనే చికిత్స మొదలు పెట్లాలి.

★ గ్లూకోజ్ వాటర్, బజారులో దొరికే ఎలక్ట్రాల్ పౌడర్ నీళ్ళలో కలిపి తరచు త్రాగించాలి.

## డయేరియాలో ఎన్నో రకాలున్నాయి

1. చిన్న పిల్లలలోను శిశువులలోను వచ్చే డయేరియా.
2. యువకులలో వచ్చే డయేరియా
3. ప్రయాణీకులలో వచ్చే డయేరియా
4. గర్భిణీ స్త్రీలలోను. బాలింత రాళ్ళలోను వచ్చే డయేరియా





5. వయసు మళ్ళిన వారికి వచ్చే డయేరియా
6. తిన్నది జీర్ణం కానందువల్ల వచ్చే డయేరియా
7. ఆత్రుత, ఆదుర్దా, భయంవల్ల వచ్చే డయేరియా
8. కాలం లేక ఋతువు మారినందువల్ల వచ్చే డయేరియా
9. వేసవిలో వచ్చే డయేరియా.
10. విందు వినోదాలలో పాల్గొన్నాక వచ్చే డయేరియా.

ఈ విధంగా చాలా రకాల డయేరియాలు ఉన్నాయి. స్థూలంగా ఈ క్రింది విషయాలు గమనిస్తే డయేరియా గురించి ఆందోళన అవసరం.

★ భోజనం చేయవచ్చు. భోజనం సహించక పోతే గంజి త్రాగవచ్చు. మంచిది.

★ గంజి త్రాగడం నామోషీ అనుకుంటే కొబ్బరి నీళ్ళు లేక కొద్దిగా సున్నపు తేట నీరు త్రాగినా సరిపోతుంది.

★ 'ఎలక్ట్రాల్ పౌడర్' త్రాగడం వల్ల చాలా మేలు జరుతుంది. కోల్పోయిన లవణాల్ని తిరిగి పొందవచ్చు.

★ ఆహారంలో తప్పనిసరిగా మజ్జిగ లేదా పెరుగు తీసుకోవాలి.

★ కాచి చల్లార్చిన నీటిని మాత్రమే తాగాలి.'

★ కొద్దిగా టీ త్రాగవచ్చు. టీ డికాక్షన్ అయితే మంచిది.

★ కొవ్వులు, నూనెలు, పాలు, పాలపదార్థాలు, జామ్‌లు, చట్నీలు, పచ్చళ్ళు ఇలాటివి ఏవీ తీసుకోరాదు.

★ తిరునాళ్ళు, పెళ్ళిళ్ళు - ఇంకా ఇతర ఫంక్షన్ల సందర్భంలో, ఫాస్ట్ ఫుడ్ సెంటర్లలో తిండి తినేటప్పుడు జాగ్రత్త వహించాలి.

★ జ్యూస్ సెంటర్లలోను ముఖ్యంగా చెరుకురసం ఇతర కూల్‌డ్రింకులు త్రాగేటప్పుడు పరిశుభ్రత వుందో లేదో గమనించి త్రాగాలి లేకపోతే డయేరియా పొంచి వుంటుంది.

★ కాఫీ, కోకో, వైన్, విస్కీ, బీరు, పొగాకు వంటివి వాడరాదు. కాస్త డయేరియా లక్షణాలు కనిపించినప్పుడు వీనిని వాడితే వ్యాధి మరింత పెరుగుతుంది.

★ మాంసము, చేపలు, మషాలాలు తినరాదు.

★ మందులు వేసుకున్నాక కాస్తంత అది పనిచేసే వరకు ఆగాలి. మందు వేసుకున్నాంగదా అని అటూ ఇటూ తిరిగి గంతులు వేస్తే నీరసం కలగవచ్చు. కాబట్టి డయేరియా వచ్చాక పూర్తి విశ్రాంతి తీసుకోవాలి.

చికిత్స

- ★ రోగికి అవసరం అయితే - రోగి నోటి ద్వారా ఆహారం తీసుకోలేక పోతుంటే, రోగికి విరేచనాలతో పాటుగా వాంతులు అవుతుంటే - రోగి నాడి అందకపోతే - తప్పనిసరిగా సెలైన్ ఎక్కించాలి.
- ★ ORS (Oral Rehydration Solution) ద్రవాన్ని రోగికి అందిస్తే విరేచనాలు తగ్గడమే కాక రోగి కూడా త్వరగా కోలుకుంటాడు. ఈ ORS ద్రవాన్ని చిన్న పిల్లలకు, పెద్దవారికి ఎవరికైనా ఇవ్వవచ్చు. ORS పౌడర్ రూపంలో మందులు షాపుల్లో అమ్ముతారు.
- ★ ఒకవేళ ORS దొరకకపోతే ఈ క్రింది విధానంతో లవణ జలాన్ని తయారు చేసుకుని వాడవచ్చు. ఇది కూడా ORS వలె పనిచేస్తుంది.

ఒక లీటరు మరగకాచిన నీటిలో మూడున్నర గ్రాములు ఉప్పు (టేబుల్ సాల్ట్), రెండున్నర గ్రాములు సోడా ఉప్పు (సోడియం బై కార్బొనేట్), ఒకటిన్నర గ్రాములు పొటాషియం క్లోరైడ్, నలభై గ్రాముల చెక్కెర వేసి కలపాలి. అంతే మనకు కావలసిన ద్రావణం తయారైనట్లే. దీనిని చాల్లార్చి కాస్తకాస్త రోగికి పట్టించాలి.

- ★ పై నున్న పదార్థాలన్నీ దొరకవు అనుకుంటే ఒక గ్లాసెడు నీటిలో నాలుగు చెంచాల పంచదార, అరచెంచాడు ఉప్పువేసి కరిగించి త్రాగిస్తూ వుంటే విరేచనాలు తగ్గిపోతాయి.
- ★ విరేచనాలు వైరస్ వలన వచ్చిన వా లేక బాక్టీరియా వలన వచ్చిన వా? తెలియకపోతే ఈ క్రింది మందులు వాడవచ్చు.

**లిమోటిల్** - ఒక టాబ్లెట్ చొప్పున మూడు పూటలా వాడాలి. దీనివల్ల మూత్రం పసుపు రంగులో వస్తుంది. దీనిని పది సంవత్సరాల వయసులోపు పిల్లకు వాడరాదు. అలాగే గర్భిణీ స్త్రీలకు కూడా వాడరాదు. కొందరికి దీనిని వాడడం వల్ల మూత్రం పసుపు రంగులో రావడమే కాక నోరు ఎండిపోవడం కంటి చూపు మసక బారడం, నోరు చేదుగా అన్పించడం వంటి ఉపద్రవాలు కలగవచ్చు. కావున వీటిని డాక్టర్ సలహా పైనే వాడాలి. ఒకవేళ దీనిని ఎక్కువ కాలం వాడితే చాలా ప్రమాదం. ఊపిరి అందకపోవడం, కోమాలోనికి వెళ్ళడం చివరికి మరణం కూడా సంభవించవచ్చు.

**ఫురోక్సోన్** - 100 మి.గ్రా టాబ్లెట్లు లేదా

**ఫ్యూడోన్** - 100 మి.గ్రా టాబ్లెట్లు వీటిని రోజుకు మూడు చొప్పున వాడాలి.

ఈ టాబ్లెట్స్ వలన బాక్టీరియా వలన వచ్చిన అతిసార కూడా తగ్గిపోతుంది. ఇది టెట్రాసైక్లిన్, క్లోరోమైసిన్ వంటియాంటి బయాటిక్స్ కంటే సమర్థవంతమైనది. దీనిని వాడడం వల్ల వికారం కలగడం, వాంతులు కావడం, తలనొప్పి, మూత్రం పసుపు రంగులో రావడం, చర్మం పైన





దద్దుర్లు రావడం ఇంకా ఎలర్జీ లక్షణాలు రావచ్చు. అయితే ఇవన్నీ అరుదుగా వచ్చేవే. ఇలాటి లక్షణాలు గమనించిన వెంటనే మోతాదు తగ్గిస్తే సరిపోతుంది.

**వోటిసెక్స్** : (టాబ్లెట్స్) ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి వాడాలి. దీనిని పన్నెండేళ్ళలోపు పిల్లలకు వాడరాదు. అంతే కాదు గర్భిణీ స్త్రీలకు వాడరాదు. వీరికి కాలేయ సంబంధమైన సమస్యలు కలగవచ్చు. దీనిని వాడడం వల్ల నోరు వగరుగాను చేదుగాను అనిపించవచ్చు.

విరేచనాలతో పాటు జ్వరం కూడా వుంటే -

స్టాన్ డి.యస్ టాబ్లెట్లు

సైనాస్టాట్ టాబ్లెట్లు

బాక్ట్రిం డి.యస్ టాబ్లెట్లు

సెప్ట్రాన్ టాబ్లెట్లు

వీటిలో ఏదైనా సరే రోజుకు రెండు చొప్పున వాడాలి. అప్పటికీ తగ్గకపోతే డాక్టర్‌కు చూపించాలి. ఇవి పడనివారికి

**ఏంపిసిల్లిన్** - 250 మి.గ్రా టాబ్లెట్లు లేదా కాప్సుల్స్. రోజుకు నాలుగు లేదా 500 మి.గ్రా టాబ్లెట్లు లేదా కాప్సుల్స్ రోజుకు రెండు చొప్పున వాడాలి.

**నియోమైసిన్** - దీనిని పిల్లలకు వాడవచ్చు. ముఖ్యంగా చంటి పిల్లలలో ఇది బాగా పని చేస్తుంది. అయితే డోసును నిర్ణయించేటప్పుడు డాక్టర్ సలహాను తీసుకోవాలి.

విరేచనాలతో పాటుగా కడుపు నొప్పి భరించలేనట్లుగా వుంటే అది విరేచనం అయిన తర్వాత కూడా తగ్గకపోగా బొడ్డు చుట్టూ మెలి తిప్పినట్లు వుంటే

సైక్లోపామ్ టాబ్లెట్లు / ఇంజక్షన్స్

నోవిగాన్ టాబ్లెట్లు

కొలినాల్ టాబ్లెట్లు

బస్కోపాన్ టాబ్లెట్లు (పెద్దవారికి మాత్రమే) వాడవచ్చు.

కోలిమిక్స్ డ్రాప్స్ (చంటి పిల్లలకు మాత్రమే వాడాలి)

కోలిమిక్స్ టాబ్లెట్స్ పెద్దవారికి వాడవచ్చు.

ఇవి కాకుండా - విరేచనాలకు

గ్రామోనెగ్ - మాత్రలు లేదా

యులిక్స్ - పి మాత్రలు రోజుకు మూడు చొప్పున వాడవచ్చు.

కలుషితమైన నీరు, ఆహారం, వాతావరణం ద్వారా డయేరియా వస్తుంది. డయేరియా ముఖ్యంగా వానాకాలంలోను, తిరునాళ్ళలోను, పుష్కరాలలోను, పెళ్ళిళ్ళలోను, ఆరు బయలు విందు వినోదాలలో పరిశుభ్రత పాటించని వంటకాలు భుజించినందు వల్ల వచ్చే ప్రమాదం వుంది. నేటికీ డయేరియా రాష్ట్రంలో ఎందరినో బలి తీసుకుంటూనే వుంది.

## అమీబియాసిస్ (Amoebiasis)

దీనినే 'డీసెంట్రీ' అని కూడా అంటారు. 'ఎంటమీబా హిస్టొలైటికా' అనే ప్రొటోజోవన్ పరాన్న జీవి వలన ఈ వ్యాధి వస్తుంది. మనం త్రాగే నీరు, తినే ఆహారం కలుషితమై పోయినప్పుడు ఈ క్రిములు సిస్ట్‌ల రూపంలో మన శరీరంలో వాటి ద్వారా ప్రవేశిస్తాయి.

ఆహారం లేక నీటి ద్వారా మన శరీరంలో ప్రవేశించిన సిస్ట్‌లు నేరుగా మన జీర్ణాశయాన్ని చేరతాయి. అక్కడి ఆమ్లాల రసాయన చర్యలవలన సిస్ట్‌ల గోడలు కరిగిపోయి వ్యాధికారక క్రిములు బయట బడతాయి. అవి తరువాత చిన్న ప్రేవుల్లోనికి ప్రవేశించి అక్కడ నిలవ వుండి అమీబియాసిస్ వ్యాధికి కారణమవుతాయి.

అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన 'ఎంటమీబా' క్రిములు చిన్న ప్రేవుల్లోని మ్యూకస్ పొరపైన దాడి చేసి దానిని శిథిలం చేస్తాయి. అందుచేతనే విరేచనాలు కలుగుతాయి. ఈ విరేచనాలలో జిగురుపొరలు పోతూ వుంటాయి. కాబట్టి వీటిని బంక విరేచనాలు లేదా జిగట విరేచనాలు అని కూడా అంటారు. అంతేగాక ఈ క్రిములు ప్రేగులకు రంధ్రాలు కూడా చేస్తాయి. దీనివల్ల అక్కడ చీము ఏర్పడుతుంది. రక్తం కూడా కారవచ్చు. దానితో దీనిని రక్తవిరేచనాలు అని కూడా అంటారు.

★ అమీబియాసిస్ వ్యాధి రావడానికి ముందు సిస్ట్‌లు మన శరీరంలో ప్రవేశించాక ఒకటి రెండు వారాలకుగానీ వ్యాధి లక్షణాలు బయటబడవు.

★ అమీబియాసిస్‌లో చీము, బంక, రక్త విరేచనాలు రోజుకు పది లేక ఇరవై కూడా అవ్వవచ్చు.

★ ఎంటమీబా కొంతమందిలో బంక విరేచనాలు కలిగించక పోవచ్చు. అయితే వీరిలో ఒకటి రెండు విరేచనాలు కలిగే అవకాశం వుంది. వారికి రెండు విరేచనాలు అయినా కడుపులో మెలిత్రిప్పేటటు వంటి విపరీతమైన నొప్పి కలుగుతుంది.

★ కొందరిలో విరేచనాలు అలాగే కంటిన్యూకాక మధ్యలో కొన్నాళ్ళు ఆగిపోతాయి. ఈ సందర్భంలో వారికి మలబద్ధకం కలుగుతుంది. అయితే అంతలోనే వీరికి విరేచనాలు కలుగుతాయి.

★ చాలామందికి కడుపు నొప్పి విరేచనానికి వెళ్లిన తర్వాత నొప్పి తగ్గుతుంది. ఆ తర్వాత కాసేపటికే నొప్పి మళ్ళా మొదలవుతుంది.

★ చాలా మందిలో విరేచనం ఒకసారి కాకుండా కాస్తకాస్త చొప్పున ఎక్కువ సార్లు వస్తుంది. కొంతమందిలో భోజనం చేసిన వెంటనే విరేచనానికి వెళ్లాలనిపిస్తుంది. మరికొందరి





కయితే బంక విరేచనాలు ఏమీ లేకుండానే ముందుగా మాములుగా విరేచనం అయి ఆ తరువాత కొద్దిగా బంక పడుతుంది.

★ విరేచనాలతో పాటుగా వీరికి కాళ్ళు నొప్పులు జ్వరం కూడా వుంటాయి.

★ అమీబియాసిస్ వచ్చిన వారిలో మలద్వారం మంటగాను, పుండు పడినట్లుగాను అవుతుంది. కొందరు ఈ విధంగా మంట, పుండు పడినట్లయితే విరేచనానికి వెళ్ళాలంటేనే భయపడుతుంటారు. కడుపులో మంట, తిన్నది సరిగ్గా అరగకపోవడం, వంట పట్టక పోవడం వుంటాయి.

★ అమీబియాసిస్ వచ్చే ముందుగా వీరికి గ్యాస్‌ట్రబుల్, ప్రేగులలో ఉద్రిక్తత, మంట, నొప్పి, పేగుపైత, కడుపు ఉబ్బరించడం, తరచుగా చర్మం పైన దద్దర్లు రావడం, ఎగ్జిమా, నల్లని మచ్చలు రావడం, చర్మం కందిపోవడం ఆ తరువాత పొరలు పొరలుగా రాలిపోవడం - ఇలాటి లక్షణాలు ఏవైనా రావచ్చు.

★ ఎంటమీబా పేగుల్లో ఉండే మ్యూకస్ (జిగురు) పొరను శిథిలం చేయడం వల్ల అది రాలి పడిపోతుంది. అందుచేత విరేచనంలో జిగురు వుంటుంది. ఇవి పేగుల్ని చిల్లుపడేట్లు చేయడమేకాక ఒక రకమైన విషపదార్థాల్ని కూడా విడుదల చేస్తాయి. దానివల్ల ప్రేగుల్లోపల పుండ్లు పడి రక్తస్రావం అవడం, ఆ తరువాత విషపదార్థాల ప్రభావం వల్ల - మనిషికి మరణం కూడా సంభవించవచ్చు.

### వ్యాధిని గుర్తించడం

అమీబియాసిస్ వ్యాధి అని గుర్తించడానికి కడుపు నొప్పితో పాటుగా జిగటి విరేచనాలు అవడం మాత్రమే కాక ఈ వ్యాధిని గుర్తించేందుకు మల పరీక్ష జరపాలి.

లేబరేటరీలో మలాన్ని పరీక్షకు పంపినప్పుడు అమీబా క్రిములు, సిస్ట్‌లు కనిపించిన అది అమీబియాసిస్ అని గుర్తించాలి. జియార్డియాసిస్ అనే వ్యాధిలో జియార్డియా అనే ప్రొటోరోవన్ పరాన్న జీవివలన కూడా ఇలాటి విరేచనాలే కలుగుతాయి మరి.

అమీబియాసిస్ రావడానికి వయసుతో పనిలేదు. ఏ వయసు వారికైనా రావచ్చు. సంవత్సరం వయసున్న పిల్లల దగ్గర నుండి పండు ముదుసలి వరకు ఎవరికైనా వ్యాధి రావచ్చు.

### అమీబియాసిస్ వల్ల ఇబ్బందులు

అమీబియాసిస్ వ్యాధిని నిర్లక్ష్యం చేయరాదు. అమీబియాసిస్ వ్యాధికి వున్న రకరకాల పేర్లు చూడండి. ఇది ప్రేగులలో వుంటే ఇంటెస్టినల్ అమీబియాసిస్ (Interstinal Amoebiasis) అంటారు. ఇది చిన్నప్రేవులకు రంధ్రాలు చేసి శరీరంలోని ఇతర అవయవాలుకు కూడా పాకుతుంది. అప్పుడు ఈ వ్యాధిని ఎక్స్‌ట్రా ఇంటెస్టినల్ అమీబియాసిస్ (Extra Intestinal Amoebiasis) అని అంటారు. ఇది చిన్నప్రేవులను దాటి కాలేయం, స్లీన్ (ప్లీహం), ఊపిరితిత్తులు, గుండె, మెదడు వంటి అవయవాలకు కూడా సాగుతుంది.

అమీబా ప్రేగుల్ని దాటి వెళ్ళిందంటే ముందుగా లివర్ పైన దాడి చేస్తుంది. దానితో కడుపులో కుడి డొక్కలో నొప్పి వస్తూ వుంటుంది. కొందరిలో ఇది కాలేయానికి చీము గడ్డను కలిగిస్తుంది. ఈ పరిస్థితిని లివర్‌యాబ్సెస్ అంటారు. దీనితో పాటుగా జ్వరం, దగ్గు, గుండెల్లో నొప్పి, కామెర్లు, వంటికి నీరు రావడం వుంటాయి. కుడివైపు డొక్కలో చేతితో తట్టితే చేతికి గడ్డలాంటిది తగులుతుంది. కాలేయం నుండి ఈ క్రిములు ఇతర అవయవాలకు వ్యాపిస్తాయి. కాలేయంలో వున్న సందర్భంలో ఒకొక్కసారి కాలేయం పగిలిపోయి ప్రాణాపాయం కలగవచ్చు.

అమీబియాసిస్ దీర్ఘకాలం వుండే వ్యాధి. ఇది అంత తొందరగా తగ్గేది కాదు. లివర్ చీము పడితే ఎప్పటికప్పుడు చీము తీసివేయాలి (Aspiration) లేదా తగ్గించేందుకు ప్రయత్నం చేయాలి. లివర్‌ను స్కానింగ్ చేసి లివర్‌లో గడ్డ ఏ పరిస్థితిలో వుందో తెలుసుకోవచ్చు. లివర్ లోనికి సూది వేసి చీమును తొలగిస్తారు. అయితే ఇది అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో జరగాలి. లివర్‌లోని చీము గడ్డను తగ్గించడానికి మెట్రోనిడజోల్ వంటి మందుల్ని నరాన్నికి ఎక్కించాల్సి ఉంటుంది.

## చికిత్స

అమీబియాసిస్ వ్యాధి కలుషితమైన ఆహారం, నీరు తీసుకోవడం వల్ల వస్తుంది. కాబట్టి బోరు బావులలోని నీరు, చెరువులలోని నీరు త్రాగవలసిన పరిస్థితి వస్తే వాటిని బాగా కాచి వడకట్టి త్రాగాలి. ఇలా చేయడం వల్ల అమీబాసిస్ట్‌లు నశిస్తాయి.

★ అమీబియాసిస్‌కు మెట్రోనిడజోల్ మందును వారం రోజులు వాడాలి.

★ మెట్రోజిల్ 200 మి.గ్రా / 400 మి.గ్రా టాబ్లెట్లు లేక సస్పెన్షన్

★ యూనిమెజోల్ 200 మి.గ్రా/400 మి.గ్రా. టాబ్లెట్లు లేక సస్పెన్షన్

★ మోనిజోల్ 600 మి.గ్రా టాబ్లెట్లు గాని

★ ఫ్లాజెల్ 200 మి.గ్రా. లేక 400 మి.గ్రా టాబ్లెట్లు లేక సస్పెన్షన్ గాని వీటిలో ఏదైనా సరే వాడవచ్చు.

సంవత్సరం పిల్లలకు 1/2 స్పూను చొప్పున రోజుకు మూడు సార్లు వాడాలి. ఒకటి నుండి ఐదు సంవత్సరాలలోపు పిల్లలకు ఒక స్పూను చొప్పున రోజుకు మూడుసార్లు వాడాలి. ఐదు నుండి పన్నెండు సంవత్సరాల వయసులోపు వారికి 200 మి.గ్రా టాబ్లెట్లు రోజుకు మూడు - పూటకు ఒకటి చొప్పున వాడాలి. పన్నెండు సవత్సరాల వయసు పై బడిన వారికి 400 మి.గ్రా టాబ్లెట్లు మూడు పూటలా ఒకటొకటిగా వాడాలి.

ఇంకా మెట్రోనిడజోల్ తోపాటుగా 'డైలాక్సనైడ్ ఫ్యురోయేట్' కలిసిన

★ ఎంటమిజోల్ - (200 మి.గ్రా + 250 మి.గ్రా) టాబ్లెట్లు గాని

★ మెట్రోజిల్ కాంపౌండ్ (400 మి.గ్రా + 500 మి.గ్రా) టాబ్లెట్లు గాని





★ మెట్రాన్ డి.ఎస్ (400 మి.గ్రా + 500 మి.గ్రా) టాబ్లెట్స్

వీటిలో ఏదైనాసరే వాడవచ్చు. పన్నెండేళ్ళు పైబడిన వారికి 400 మి.గా + 500 మి.గ్రా టాబ్లెట్లు రోజుకు మూడు చొప్పున మూడు పూటలా వాడాలి.

టినిడజోల్ కలిసిన మందుల్ని కూడా అమీబిక్ విరేచనాలకు వాడవచ్చు.

★ టినిడా - 280 మి.గ్రా/ 500 మి.గ్రా / 1000 మి.గ్రా టాబ్లెట్లు గాని

★ టిని - 300 మి.గ్రా / 800 మి.గ్రా / 1000 మి.గ్రా టాబ్లెట్లు గాని

పెద్దవారికి 1000 మి.గ్రా టాబ్లెట్లు రోజుకు రెండు చొప్పున మూడు రోజులు వాడాలి. పిల్లలకు డోసు తగ్గించాలి.

★ నలిడిక్సిక్ ఏసిడ్ కలిసిన టాబ్లెట్లు / గొట్టాలు కూడా వాడవచ్చు. దీనితో పాటు మెట్రోనిడజోల్ కలిసినవి కూడా వాడవచ్చు.

★ జెనోజైల్ - M - టాబ్లెట్లు

★ మైక్రోనెగ్ - టాబ్లెట్లు

వీటిలో ఏదైనా రోజుకు రెండు చొప్పున వాడవచ్చు. ఈ మందు వాడడం వల్ల మూత్రం పసుపు రంగులో రావడం నోరు చేదుగా వుండడం జరగవచ్చు. విరేచనాలు ఎంతకీ తగ్గకపోతే డాక్టరు వద్ద అశ్రద్ధ చేయకుండా తీసుకెళ్ళాలి. లేకపోతే ప్రాణానికే ప్రమాదం.

## బాసిల్లరీ డీసెంట్రీ (Bacillary Dysentery)

ఇది అతిసార విరేచనాల వంటి విరేచనాలు కలిగే వ్యాధి. అమీబియాసిస్‌లు జిగట విరేచనాలు, రక్త విరేచనాలు కలుగుతాయి. అతిసార విరేచనాలు నీళ్ళగాను, అప్పుడప్పుడు కాస్తంత చిక్కగాను (పలుచగా) (Semi solid గా) వుంటాయి. అయితే మామూలు అతిసార వ్యాధిని, బాసిల్లరీ డీసెంట్రీని గుర్తించడం కష్టం. ఈ రకమైన అతిసార వ్యాధిని కేవలం లాబొరేటరీలలోనే గుర్తించగలం. మామూలు అతిసార వ్యాధికి వైరస్ క్రిములు కారణం. అమీబియాసిస్‌కు అమీబా కారణం. అదే విధంగా బాసిల్లరీడీసెంట్రీకు షైజెల్లా గ్రూపుకు చెందిన బాక్టీరియా కారణం. వీటిని 'రక్త విరేచనాలు'' అనవచ్చు.

బాసిల్లరీ విరేచనాలు మందుగా 'కలరా' విరేచనాల వలె వస్తాయి. ఆ తరువాత ఇవి రక్త విరేచనాలుగా మారతాయి. అన్ని రకాల విరేచనాల వలెనే కలుషిత ఆహారం, పానీయాల వల్ల వస్తాయి. ముఖ్యంగా పుష్కరాల సమయంలోను సంతలు తిరునాళ్ళ సమయాలలో ఇవి వేగంగా వ్యాపించగలవు.

★ బాసిల్లరీ డీసెంట్రీ లేక రక్త విరేచనాలు ముఖ్యంగా చిన్న పిల్లలలో కనిపిస్తాయి. బాక్టీరియా క్రిములు మన శరీరంలో ప్రవేశించిన తర్వాత ఒకటినుండి వారం రోజులలోపు వ్యాధి లక్షణాలు బయటపడతాయి.

★ విరేచనాలు ఆకస్మికంగా - ఒక్కసారిగా మొదలవుతాయి. మొదట్లో మామూలు నీళ్ళ విరేచనాల వలె వున్నా ఆ తరువాత విరేచనంలో రక్తం పడుతుంది. చీటికి మాటికీ విరేచనం అవుతుంది.

★ విరేచనానికి అప్పుడేవెళ్ళి వచ్చినా మళ్ళీ వెళ్ళాలనిపిస్తుంది. రోజుకు పది పదిహేను విరేచనాలకు పైగా అవుతూ వుంటాయి.

★ విరేచనంతో పాటుగా కొందరికి వాంతులు కూడా అవుతూ వుంటాయి. విరేచనాలు, వాంతులు ఒకేసారికావచ్చు.

★ విరేచనాలు అధికంగా అవుతూ వుండడంతో డీహైడ్రేషన్ కలగవచ్చు. అధికంగా విరేచనాలు అవుతుండడమే కాక జ్వరం కూడా రావచ్చు.

★ ఒకొకక్కసారి విరేచనాలు తగ్గినట్లుగా అనిపిస్తుంది. కానీ మళ్ళీ వెంటనే మొదలవుతాయి.

★ విరేచనంతో పాటుగా ముందు కడుపులో మెలి త్రిప్పినట్లు విపరీతమైన నొప్పి కూడా వస్తుంది.

★ రోగి తగిన జాగ్రత్తలు తీసుకుంటే ఒక వారం లేదా పది రోజుల్లో పూర్తిగా కోలుకోవడానికి అవకాశం ఉంది. సకాలంలో చికిత్స చేయకపోతే ప్రాణాపాయం కలగవచ్చు.

★ వ్యాధి నిర్ధారణకు విరేచనం పరీక్ష జరపాలి.

## చికిత్స

బాసిల్లరీ డీసెంట్రీలో కూడా మామూలు విరేచనాలకు చేసే ఉప్పు, పంచదార చికిత్స చేసిచూడాలి. ఆ తరువాత మెట్రోనిడజోల్ మందుల్ని కూడా అమీబిక్ డీసెంట్రీలో వలె వాడాలి. వాటితో పాటుగా

★ సిప్రాన్ - 20 మి.గ్రా లేక 500 మి.గ్రా టాబ్లెట్లు గాని

★ సిప్రోలెట్ - 250 మి.గ్రా టాబ్లెట్లు / డిస్‌పర్సబుల్ టాబ్‌లెట్స్ లేక ఇంజక్షన్స్ (20mg/ 10ml) గాని

★ క్వినోబాక్ట్ - 250 మి.గ్రా టాబ్లెట్లు/500 మి.గ్రా టాబ్లెట్లు వీటిలో ఏదైనా సరే రోజుకు రెండు చొప్పున ఐదు రోజుల పాటు వాడాలి.

★ ఇమోసెక్-ఎఫ్ కాప్సుల్స్ రోజుకు మూడు చొప్పున ఐదు రోజులు వాడాలి.

★ రోగికి అవసరం అయితే సెలైన్ ఎక్కించాలి. సెలైన్ ఎక్కించినప్పటికీ మందులు మాత్రం వాడాల్సిందే

★ రోగి పరిస్థితి తీవ్రంగా వుంటే నరానికి మెట్రోనిడజోల్ (మెట్రోజిల్) ఇంజక్షన్ ఇవ్వాలి.





# జియార్డియాసిస్ (Giardiasis)

విరేచనాలు కలిగించే అనేక జీవులలో జియార్డియా లాంబ్లియా అనే పరాన్న జీవి వల్ల ఈ జియార్డియాసిస్ వ్యాధి వస్తుంది. మానవుని ప్రేగులలో వుండి విరేచనాలను కలిగిస్తుంది. ఎంటమీబావలె ఇది కూడా ప్రోటోజోవన్ పరాన్నజీవి. ఇవి విరేచనాలను కలిగించడమే కాక విరేచనాలను దీర్ఘకాలం కొనసాగనీయక రోగిలోని పోషక పదార్థాలను గుంజుకొని ఆ తరువాత విరేచనాలను కలిగించి నీరసపరుస్తాయి.

## వ్యాధి నిర్ధారణ

వ్యాధి నిర్ధారణకు వ్యాధి సోకిన వ్యక్తికి మల పరీక్ష జరిపినట్లయితే వ్యాధి క్రిములు బయటపడవచ్చు. వ్యాధి నిర్ధారణ కొరకు యాంటిజెన్ డిటెక్షన్ కూడా చేయించాలి.

## వ్యాధి లక్షణాలు

★ ఇది ఎంటమీబావలె అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రోటోజోవన్ జీవి. అయితే ఇది ఎంటమీబా వలె బంక విరేచనాలుగాని, రక్త విరేచనాలు గాని కలిగించదు. విరేచనాలు కూడా దీర్ఘకాలంగా గాని - అప్పుడప్పుడు గాని వస్తూపోతూ వుండవచ్చు.

★ ఇది కూడా కలుషితమైన ఆహారం ద్వారాగాని, నీటి ద్వారా గాని మన శరీరం లోనికి ప్రవేశిస్తుంది. మన శరీరంలోనికి ఈ క్రిమిసిస్ట్‌ల రూపంలో ప్రవేశిస్తుంది.

★ శరీరంలోప్రవేశించిన సిస్ట్‌లు జీర్ణాశయంలోని జీర్ణరసాల వల్ల కరిగి క్రిములు నేరుగాచిన్న ప్రేవులలోనికి ప్రవేశిస్తాయి. అక్కడే ఇవి స్థిర నివాసం ఏర్పాటు చేసుకుంటాయి.

★ జియార్డియాసిస్ వున్న వ్యక్తులలో కడుపులో నొప్పి తెరలు తెరలుగా మెలితిప్పినట్లు వస్తూ వుంటుంది.

★ అరుగుదల తక్కువగా ఉండడం, వికారం అనిపించడం, ఆకలివేయక పోవడం ఉంటాయి.

★ కడుపు ఉబ్బరంగా వుండడం, కడుపు నొప్పి వుండడంతో పాటుగా కడుపునొప్పి పై కడుపులో వుంటుంది.

★ బంక విరేచనాలుగాని, రక్త విరేచనాలు గాని వుండవుగాని అమీబియాసిస్‌లో వలె తరచుగా విరేచనానికి వెళ్ళాలని మాత్రం అనిపిస్తుంది.

★ జియార్డియాసిస్‌లో మొదట నీళ్ళవలె విరేచనం అవుతుంది. ఆ తర్వాత దుర్వాసనతో విరేచనం అవుతుంది. పసుపు పచ్చగా విరేచనాలు అవుతూ వుంటాయి. అందుకనే వీటిని చీము విరేచనాలు అనిపిలుస్తారు.

★ జియార్థియాసిస్‌లో విరేచనాలతో పాటుగా మత్తుగా వుండడం, అలెర్జీ లక్షణాలు కూడా కనిపిస్తాయి.

★ ఈ విరేచనాలతో పాటుగా కొవ్వు తరకలు కూడా వుంటాయి. (Fatty stools) - ఈ పరిస్థితిని స్టీటోరియా (Steatorrhea) అంటారు.

★ విరేచనాలు తీవ్ర స్థాయిలోనికి వెళ్ళాక వారి విరేచనంలో అత్యధిక సంఖ్యలో జియార్డియా క్రిములు బయటకు వచ్చి మరొకరికి వ్యాపించేందుకు సిద్ధమవుతాయి.

★ జియార్థియాసీస్ ఎక్కువగాచిన్న పిల్లల్లో వుంటుంది. చాలా మంది పిల్లల్లోను, పెద్ద వారిలోను వ్యాధి ఎలాటి మందులు వాడకుండానే దానంతట అదే తగ్గిపోతుంది.

★ జియార్థియాసిస్ వ్యాధిలో పోషకాహార లోపం ఏర్పడుతుంది. వ్యాధి త్వరగా తగ్గుతుంది. కానీ ఈ లోపం మాత్రం చాలా కాలం వుండిపోతుంది.

## చికిత్స

★ బాగా కడుపులో నొప్పి వుండడం, విరేచనాలు అధికంగా అవుతూవుంటే, నీరసంగా వుంటే ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ మెట్రోనిడజోల్ - 200 మి.గ్రా చొప్పున రెండు వారాలు రోజుకు మూడు వాడాలి.

★ టనిడజోల్ 150 మి.గ్రా. చొప్పున రోజుకు రెండు సార్లుగా పది రోజుల పాటు వాడాలి.

★ నీరసం ఎక్కువగా వుంటే సెలైన్ ఎక్కించాలి.

# అజీర్ణ వ్యాధి

అజీర్ణమంటే అన్నం అరగకపోవడం. అన్నమేమిటి? మనం తిన్న ఆహారం ఏదైనా సరే అరగక పోవడం. మనం అహారం తిన్న తరువాత మూడు లేక నాలుగు గంటలలో పూర్తిగా జీర్ణమవుతుంది. వయసు పైబడిన వారికి మాత్రం మరికొంత ఎక్కువ సమయం పడుతుంది. మాములుగా అయితే యువకులలోను, నడివయసు వారిలోను ఇలా అరుగుదల అనే సమస్యే వుండేదికాదు. ఇది ఒకప్పటి మాట. నేడు చిన్న పిల్లలలోను, నడివయసు వారిలోను అజీర్ణం అనేది సమస్యగా వుంది.

## కారణాలు

★ అజీర్ణ వ్యాధి రావడానికి ఎన్నో కారణాలున్నాయి. అతిగాభోజనం చేయడం, లేదా అధికంగా పానీయాలు త్రాగినా వ్యాధి వస్తుంది. అయితే ఇది అ పూటకు తిండి మానేస్తే అదే సర్దుకుంటుంది.

★ కాఫీలు, 'టీ'లు త్రాగడం వల్ల, వేళ తప్పి భోజనం చేయడం వల్ల అజీర్ణ వ్యాధి రావచ్చు.





★ అతిగా యాంటిబయాటిక్స్ వాడిన వ్యక్తులలో కూడా అజీర్తి వ్యాధి కనిపిస్తుంది.

★ క్షయ వ్యాధి - ఇంకా ఇలాంటి అంతర్గత వ్యాధులు వున్నవారిలో లివర్ వ్యాధులలోను జీర్ణ రసాల ఉత్పత్తి తగ్గిపోవడం వల్ల అజీర్తి వస్తుంది.

## అజీర్తి వ్యాధి లక్షణాలు

★ కడుపు ఉబ్బరంగా వుండడం, ఆకలి వేయక పోవడం వుంటాయి.

★ రోగికి ఏమీ తినాలని అనిపించదు. ఏదైనా బలవంతాన తింటే, కాస్తంత తింటే చాలు కడుపు నిండిపోయినట్లుగా అనిపిస్తుంది.

★ అజీర్తి వ్యాధిలో ఒకొక్కసారి విరేచనాలు కూడా కలుగుతాయి. అలాగే వాంతులు కూడా అవుతాయి. వాంతి అయితే చాలా ఉపశమనంగా అనిపిస్తుంది.

★ అజీర్ణ వ్యాధి మలబద్ధకానికి దారి తీస్తుంది.

## చికిత్స

అజీర్ణ వ్యాధి తగ్గించడానికి ఎంజైము సిరప్పులు వాడాలి. దీని తోడుగా తేలికగా జీర్ణం అయ్యే ఆహార పదార్థాల్ని వాడాలి.

★ ఎసిజైమ్ సిరప్

★ అరిస్టోజైమ్ సిరప్/కాప్సుల్స్

★ బెస్టోజైమ్ సిరప్/కాప్సుల్స్

★ యూని ఎంజైమ్ సిరప్ / టాబ్లెట్స్

వీనిలో ఏదైనా వాడవచ్చు సిరప్‌లను రెండు పూటలా ఒకొక్క చెంచాడు చొప్పున వాడాలి. కాప్సుల్స్ లేదా టాబ్లెట్స్ అయితే అవసరాన్ని బట్టి రోజుకు రెండు లేక మూడు పుటలా వాడవచ్చు లేక రాత్రికి ఒకటిగా కూడా వాడవచ్చు.

# వికారం, వాంతులు

వికారంగా అనిపించడం, వాంతులు కలగడం వల్ల చాలా చీకాకుగాను ఎవరితోను మాట్లాడకుండా పడుకోవాలని అనిపించడం సహజం. వాంతులు ఎన్నో కారణాలతో అవుతాయి.

★ వేళ తప్పి ఆహారం తిన్నా

★ అజీర్ణం వలన - అంటే తిన్న ఆహారం అరగకపోవడం వల్ల.

★ మనకు కడుపు పట్టినంత తిన్నాక బావుంది కదా అని మరికాస్త తింటే వాంతి కలగవచ్చు.

★ కొందరికి సారాయి ఎక్కువగా తాగితే వికారం కలుగుతుంది. వాంతి కూడా కావచ్చు.

★ చాలామందికి అలవాటులేని ఆహారం తింటే వికారం అనిపిస్తుంది.

★ ఎక్కువగా మసాలాలు, కారం వున్న ఆహార పదార్థాలు తింటే వికారం కలుగుతుంది.

★ పాచిపోయిన లేదా కుళ్ళిపోయిన, బూజు పట్టిన ఆహారం తీసుకున్నా వికారం లేదా వాంతులు వచ్చే అవకాశం వుంది.

★ చాలా సందర్భాలలో వాంతులతో పాటుగా విరేచనాలు కూడా కలుగుతాయి.

★ అంతేకాక కలరా, టైఫాయిడ్ వంటి జీర్ణకోశ వ్యాధుల్లో వాంతులు అవుతాయి.

★ జీర్ణాశయంలో ఏదైనా అడ్డుపడడం (Acute Abdomen) వలన కూడా వాంతులు అవుతాయి.

★ ఒకొక్కసారి కడుపులో నులిపురుగులు వున్నా కూడా వాంతులు అవుతాయి.

★ చెవి పోటువున్నా, చెవిలో చీము వున్నా కూడా వాంతులవుతాయి.

★ అదే విధంగా గొంతులో టాన్సిల్స్ చీము పట్టినప్పుడు కూడా వాంతులవుతాయి.

★ కాలేయానికి ఏదైనా వ్యాధి సోకిన - పచ్చకామెర్ల వంటి వ్యాధులలోను వాంతులు అవుతాయి.

★ మెదడుకు సంబంధించిన వ్యాధులలో ముఖ్యంగా 'మెనింజిటిస్'లో తీవ్రమైన వాంతులు అవుతాయి.

★ మూత్రశయపు వ్యాధులలో కూడా వాంతులు అవుతాయి.

★ ఉదయాన్నే మొదలయి సాయంత్రానికిగాని తగ్గని, ఒకవైపునే వచ్చే పార్శ్వపు తలనొప్పిలో కూడా వాంతులు అవుతాయి.

★ కొందరికి జలుబు చేసినప్పుడు కూడా వాంతులు అవుతాయి.

★ గర్భంతో వున్న స్త్రీలలో కూడా వాంతులు అవుతాయి. అయితే కొంతకాలంలో వాంతులు తగ్గిపోతాయి. కొందరిలో మాత్రం ఈ వ్యాధులు తీవ్ర రూపంలో వుంటాయి. కడుపులో బిడ్డ కూడా నోట్లోంచి బయటపడుతుందేమోననిపిస్తుంది.

★ మలేరియా జ్వరంలో కూడా నోరు చేదు, వాంతులు వస్తాయి.

★ అతిగా తిన్న తర్వాత పానీయాలు కూడా అధికంగా త్రాగడం వల్ల కూడా వాంతులు అవుతాయి.

★ కొంతమందికి బస్సులోగాని, కారు లేక లారీలోగాని ప్రయాణిస్తే ప్రయాణంలో వుండగానే వికారం వాంతులు వస్తాయి.

★ ప్రయాణాలలో వాంతులు కొందరికి వుంటే మరికొందరికి ప్రయాణంలో బాగానే వున్నా ఆ బస్సుగాని లేక మరే వాహనమో దిగిన వెంటనే వాంతులు అవుతాయి.

★ కొందరికి పడవ ప్రయాణంలోను, సముద్ర ప్రయాణాలలోను వాంతులు అవుతాయి. ఇంకొందరికి కేవలం సముద్ర తీరంలో తిరిగి నంతనే వాంతులు కలుగుతాయి.





## వాంతులు రాకుండా జాగ్రత్తలు

★ వాంతులు అవుతున్నా లేక వికారం అనిపించినా ఏ ఆహార పదార్థాల్నీ తినరాదు. పానీయాలు త్రాగరాదు.

★ వాంతులు అవుతుంటే వంట్లోని నీరు అంతా బయటకు పోతుంది. దానికి తోడు చెమటలు విపరీతంగా పట్టి మరింత సమస్య అవుతుంది. ఇది డీ-హైడ్రేషన్‌కు దారితీస్తుంది. డీ-హైడ్రేషన్ రాకుండా వుండేందుకు తీసుకోవాల్సిన చర్యలన్నీ తీసుకోవాలి.

★ వాంతులతోపాటుగా విరేచనాలు కూడా అవుతుంటే ORS ద్రవాన్ని అందించాలి. కొందరికి ORS ను కూడా తీసుకున్న వెంటనే వాంతులయ్యేట్లు అనిపిస్తుంది. అయితే ORS ను గాని ఉప్పు, పంచదార, నీటినిగాని కాస్త కాస్త అయినా పట్టించాలి. ఇలా కొద్ది కొద్దిగా తీసుకోవడం వల్లవాంతులు కావు.

★ వాంతులు అయ్యేవారు వీలైనంత వరకు పూర్తిగా మంచం పైనే వుండి విశ్రాంతి తీసుకోవాలి. వాంతుల వల్ల కొందరికి కళ్ళు కూడా తిరగవచ్చు.

★ వాంతులు దీర్ఘకాలం పెద్దపెద్దగా అవుతుంటే చాలా ప్రమాదం. నీరసంతో పాటుగా జ్వరం రావడం లేక వళ్ళు తేలిపోవడం వళ్ళు చల్లబడి పోవడం జరగవచ్చు. ఇలాటి పరిస్థితిలో తప్పనిసరిగా ఆసుపత్రిలో వుంచి చికిత్స చేయాలి. అవసరం అయితే సెలైన్ ఎక్కించాల్సి వస్తుంది.

★ వాంతులు పదేపదే అవుతుంటే రోగి నోటి ద్వారా ఏమీ ఆహారం తీసుకోలేడు. వీరికి వెంటనే సెలైన్ ఎక్కించాలి.

★ ప్రయాణంలోని వాంతులు అవుతుంటే వారు తమదృష్టిని వాంతుల పై నుండి మళ్ళించాలి. చుట్టు ప్రక్కల వస్తువుల పైకి దృష్టి పెడితే వాంతి వచ్చే ప్రమాదం వుంది. కాబట్టి దూరంగా కదిలే వస్తువుల పైన దృష్టి నిలిపితే వాంతి వచ్చే అవకాశం తగ్గుతుంది.

★ వాంతులు వచ్చేవారు ప్రయాణాలలో ప్రయాణ సమయంలో కళ్ళు మూసుకుని నిద్ర పోవడం ఎంతో ఉపయోగకరం.

★ ప్రయాణాలలో వాంతులయ్యేవారు ప్రయాణం చేసే ముందు లేదా ప్రయాణం మధ్యలోగాని ఎలాటి ఆహారం తీసుకోరాదు. పానీయాలు త్రాగరాదు.

★ ప్రయాణాలలో వాంతులు అయినవారు పూర్తిగా కోలుకోవడానికి కనీసం మూడు రోజులు పడుతుంది. వాంతులు అయిన తర్వాత కోల్పోయిన నీటిని వీలైనంత త్వరగా భర్తీ చేస్తే చాలా మంచిది.

★ ఒకొక్కసారి వాంతులు తగ్గించే మందులు కూడా ఇముడకుండా బయటకు వచ్చేస్తాయి. ఈ సందర్భంలో మందుల్ని మలద్వారం నుండి పంపవలసి వస్తుంది.

★ వాంతులు, వికారంనకు మందులు వాడేటప్పుడు కూడా వీలైనన్ని తక్కువ నీటితో వేసుకుంటే వాంతి కాదు. అదేవిధంగా మందులు వేసుకున్న పది నిముషాల వరకు ఏమీ తీసుకోరాదు.

★ వాంతులకు మందు కూడా నిర్ణీతమోతాదు మించి వాడరాదు. వాంతులు ఎక్కువగా ఉన్నాయని మోతాదు మించి వేసుకుంటే ఎంతో ప్రమాదం కలుగుతుంది. అంతేకాదు డీ-హైడ్రేషన్ సరయ్యే వరకు మోతాదు మళ్ళీ ఇవ్వరాదు. పైగా రోగి మూత్ర విసర్జన జరిపితేగానీ మరో డోసు ఇవ్వరాదు.

★ వాంతులతో పాటు విరేచనాలు కూడా వుంటే మందులు సెలైన్ నుండి ఇవ్వాల్సి వుంది.

★ ప్రయాణంలో వాంతులు అయ్యేవారు చదవడం కూడా ప్రయాణంలో చేయరాదు.

★ వాంతులలో డీ-హైడ్రేషన్ ఎక్కువ అవుతుంటే సాధారణ స్థితిలో దానిని కంట్రోల్ చేయలేకపోతే చాలా ప్రమాదం వెంటనే డాక్టరును సంప్రదించాలి.

★ అదే విధంగా వాంతులు ఇరవైనాలుగు గంటలలో కాస్తయినా తగ్గకపోతే లేక వాంతి ఆకస్మికంగా అయినప్పుడు - గోధుమ రంగులోనో లేక ఆకు పచ్చరంగులోనో లేక నలుపు రంగులోనో వాంతి అయి అది మలము వాసన కలిగి వుంటే డాక్టరును వెంటనే సంప్రదించాలి. అలాగే రక్తపు వాంతి అయినప్పుడు కూడా డాక్టరును కలవాలి.

## చికిత్స

వాంతులకు కారణమైదైనప్పటికీ అది కలిగించేది మాత్రం నీరసం. ఈ నీరసం ఒక్కొక్కసారి ప్రాణాపాయం కూడా కలిగించవచ్చు. కాబట్టి చికిత్సను వీలైనంత తొందరగా మొదలుపెడితే రోగికి డీహైడ్రేషన్ కలగకుండా చూడవచ్చు.

★ ప్రోమెథజైన్ (Promethazine) అనే మందును వాంతులకు ఇవ్వవచ్చు. ఇది ప్రయాణాలలో వాంతులకు వాడదగిన మందు - ఇది.

ఫెనెర్గాన్ అనే పేరుతో మార్కెట్లో వుంటుంది. వాంతి అయినప్పుడు ఒక్క టాబ్లెట్ వాడాలి. ఇది మత్తు కలిగిస్తుంది.

★ మెటోక్లోప్రమైడ్ (Metoclopramide) 5 మి.గ్రా. ఇది ఈ క్రింది పేర్లతో వుంటుంది.

పెరినారమ్ - రోజుకు రెండు టాబ్లెట్లు ఉదయం, సాయంత్రం లేదా మూడు పూటలా మూడు టాబ్లెట్లు లేదా

మాక్సిరాన్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు పై విధంగానే లేదా

రెగ్లాన్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు పై విధంగానే లేదా

ఎమినిల్ - టాబ్లెట్లు వాడాలి - పరిస్థితి తీవ్రంగా వుంటే పెరినారమ్ ఇంజక్షన్స్ ఇవ్వాలి.





రోజుకు ఒకటిలేక రెండు యాంపిల్స్ ఇవ్వాలి.

చిన్న పిల్లలకు వాంతులు అవుతుంటే వారికి పెరినారమ్ సిరప్‌ను వాడవచ్చు. వయసును బట్టి మోతాదు నిర్ణయించాలి.

★ డోంపెరిడోన్ 10 మి.గ్రా/20 మి.గ్రా. మందును వాంతులకు ఇవ్వవచ్చు. ఇది ఈ క్రింది పేర్లతో వుంటుంది.

డోమ్‌స్టాల్ - టాబ్లెట్లుగా వుంటుంది. లేదా

డాంపెడ్ - 10 మి.గ్రా టాబ్లెటు గానీ లేదా

ఎమిటిన్ - 10 మి.గ్రా టాబ్లెట్లు గానీ లేదా

గ్యాస్ట్రోక్టివ్ - 10 మి.గ్రా టాబ్లెట్లు గాని రోజుకు రెండు చొప్పున వాడాలి.

★ సిసాప్రైడ్ - 10 మి.గ్రా

ఇది వాంతులతో పాటుగా కడుపు నొప్పి, కడుపు ఉబ్బరం వున్నప్పుడు బాగా పని చేస్తుంది. ఇది ఈ క్రింది పేర్లతో వుంటుంది.

సిసాప్రా - టాబ్లెట్లు (10 మి.గ్రా) లేదా

సిసాటెన్ - టాబ్లెట్లు గాని లేదా

సిసాపిడ్ - టాబ్లెట్లు గాని లేదా

సిసానార్మ్ - టాబ్లెట్లు గాని

గాస్‌కిన్ - టాబ్లెట్లు (5 మి.గ్రా / 10 మి.గ్రా)

వీటిలో దేనినైనా సరే వాడవచ్చు. ఇవి రోజుకు రెడు పూటలా వాడాలి.

★ క్లోర్ ప్రామజైన్ (Chlorpromazine) 25 మి.గ్రా. లేదా 50 మి.గ్రా

ఇది సూది మందు రూపంలో వుంటుంది కూడా అవసరం అయితే ఇవ్వవచ్చు.

ఎమిటిల్ - 25/50 mg టాబ్లెట్లు రోజుకు మూడు లేదా

మెగాటిల్ - 25/50/100 మి.గ్రా టాబ్లెట్లు ఇవి కూడా వయసును బట్టి పరిస్థితిని బట్టి మోతాదు ఇవ్వాలి.

రెలిటివ్ - 50mg/100మి.గ్రా టాబ్లెట్లు గాని - లేదా

లార్గాక్టిల్ - ఇంజక్షన్స్ వారి

మెగాటిల్ - ఇంజక్షన్ గాని వాడవచ్చు.

**Note : ఈ మందులు వేటితోనైనా సరే కొందరిలో ఎక్స్‌ట్రా పిరమిడల్ రియాక్షన్స్ (Extra Pyramidal Reactions) వస్తాయి. దీనివల్ల మందు తీసుకున్న కొద్ది నిమిషాల్లో మెడ వెనక్కు విరుచుకు పోవడం మూతి ఒక ప్రక్కకు లాక్కుపోవడం జరుగుతుంది. కొద్ది గంటలలో అంతా సర్దుకుంటుంది.**

## కడుపు ఉబ్బరం / గ్యాస్ / కడుపులో వాయువు

మనం తినే ఆహార పదార్థాలను బట్టి కడుపులో వాయువులు ఉత్పత్తి అవుతాయి. ఇవి ఎటు పోలేని పరిస్థితిలో కడుపు ఉబ్బరంగా అనిపిస్తుంది. ఇలా కడుపులో వాయువులు ఉన్నప్పుడు అవి జీర్ణాశయంలో వుంటే త్రేన్పుల రూపంలో బయటకు వస్తాయి. అవి గనుక చిన్నప్రేవు, పెద్దప్రేవులలో వుంటే పాయు రంధ్రము ద్వారా వెలుపలికి వస్తాయి. కడుపులో గ్యాస్ అంటే కడుపు ఉబ్బరమే కాక కడుపు నొప్పి కూడా వుంటుంది. కడుపు నొప్పి ఏ రూపంలో గ్యాస్ బయటకు పోయినా వెంటనే తగ్గిపోతుంది.

★ కడుపులో గ్యాస్ వున్నప్పుడు ఒకొక్కసారి వాంతులు కూడా వస్తాయి.

★ కడుపులో వాయువుల వల్ల కడుపు నొప్పిగాను, కడుపు ఉబ్బరంగాను వుంటుంది. కడుపు పట్టుకుని నొక్కితే భరించలేనంత నొప్పిగా వుంటుంది.

★ కడుపులో వాయువులు వుంటే నడుము నొప్పి కూడా వుంటుంది. వీరిలో మలబద్ధకము గాని లేక తరచుగా విరేచనాలు కాని వుంటాయి.

★ కడుపునొప్పి వుండి వుండి రావడం, ఆహారం ఏమి తినాలని అనిపించక పోవడంతో పాటుగా ఉదర సంబంధమైన అనేక నొప్పులు కూడా వస్తాయి.

★ ఒకొక్కసారి కడుపులో వాయువులు ఎటూ బయటకు పోలేని స్థితిలో ఛాతీపైన వత్తిడిని తీసుకువస్తాయి. దానివల్ల గుండె నొప్పి అనిపిస్తుంది. దీనినే 'ఏంజినా పెక్టోరిస్' అంటారు. అయితే ఈ రకమైన కడుపు నొప్పితో వచ్చే గుండె నొప్పి త్వరగా తగ్గిపోతుంది. ముందుగా గ్యాస్ ట్రబుల్‌ను నివారించాలి.

★ ఈ రకమైన కడుపు ఉబ్బరాన్ని, కడుపులోని వాయువులను రాకుండా చూసుకోవాలంటే ముందుగా జీర్ణక్రియను సక్రమంగా జరిగేటట్లు చూసుకోవాలి.

★ ఆహారంలో తేలికగా జీర్ణం అయ్యే అహార పదార్థాల్ని మాత్రమే తీసుకోవాలి. అంతేగాక వేళకు భోజనాన్ని చేయాలి. కాఫీలు, టీలు ఇతర శీతల పానీయాలు తగ్గించడమో లేదా పూర్తిగా మాని వెయ్యడమో చేయాలి.

★ కడుపులో గ్యాస్ సమస్య మానసికంగా కూడా రావచ్చు. కావున మనసు ప్రశాంతంగా వుంచుకోవడం కూడా ఈ వ్యాధి నివారణకు ముఖ్యమే. అదే విధంగా శరీరానికి తగినంత వ్యాయామం కూడా అవసరమే. కాయకష్టం చేసే వారిలో గ్యాస్‌ట్రబుల్ రాకపోవడానికి అదే కారణం.

### చికిత్స

★ డైజీన్ / డియోవోల్ టాబ్లెట్లు రెండు చొప్పున చప్పరించాలి. లేదా పంటి కింద నమిలి కాసిని మంచి నీళ్ళు త్రాగాలి. ఈ విధంగా ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒక సారి వాడాలి.





★ ఏమాత్రం ఉపశమనం లేకపోతే - కడుపునొప్పి విపరీతంగా వుంటే

స్పాస్మోప్రొక్సివాన్ - కాప్సుల్‌ను వాడాలి. దీనిని ప్రతి ఆరుగంటలకు లేక ఎనిమిది గంటలకు ఒకసారి వాడాలి. అయితే దీనిని చిన్న పిల్లలకు, శిశువులకు వాడరాదు. గర్భిణీస్త్రీ కూడా వాడరాదు. పాలిచ్చే తల్లులు వాడితే వారిలో కాలేయ సంబంధమైన సమస్యలు రావచ్చు.

సుధినాల్ - టాబ్లెట్ - రోజుకు మూడు లేక నాలుగు సార్లు వాడాలి. అయితే పైన వివరించిన సమస్యలు దీని కూడా వస్తాయి. ఈ మందు నొప్పులకు కూడా పని చేస్తుంది.

★ టిడిజెసిక్ - టాబ్లెట్స్ - దీనిని ప్రతి ఆరుగంటలకు గాని ఎనిమిది గంటలకు గాని ఒకటి చొప్పున వాడవచ్చు.

★ టోరోలాక్ - టాబ్లెట్సు దీనిని ప్రతి 4 లేక 6 గంటలకు ఒకటి చొప్పున వాడాలి. అవసరాన్ని బట్టి టోరోలాక్ ఇంజక్షన్స్ ఇవ్వవచ్చు. అయితే వీటిని 16 సంవత్సరాలలోపు పిల్లలకు వాడరాదు.

## ఎసిడిటీ - గుండెలమంట (Acidity & Heartburn)

ఎసిడిటీ లేక అమ్లత అనేది కడుపులోని జీర్ణ రసాల వల్ల వస్తుంది. కడుపులో తయారయ్యే కొన్ని రకాల జీర్ణరసాలు, హైడ్రోక్లోరికామ్లం పరిమితికి మించి ఉత్పత్తి అయినప్పుడు అమ్లత వస్తుంది. ఎసిడిటీని ప్రతి ఒక్కరు అనుభవించే వుంటారు. ఏదో ఒక సందర్భంలో ఇలా అందరికీ ఎసిడిటీ వచ్చినా అది తాత్కాలికంగాను పెద్దగా ఇబ్బందికలిగించేట్లుగాను ఉండదు. దానంతట అదే సర్దుకుంటుంది. కాని కొందరిలో ఎసిడిటీ నిలిచి వుండి జీవితాంతం బాధ పెడుతూ వుంటుంది.

### ఎసిడిటీరావడానికి కారణ

ఎసిడిటీ ఫలానా కారణం వల్ల మాత్రమే వచ్చిందని చెప్పడానికి లేదు. చాలా కారణాల వల్ల ఎసిడిటీ వస్తుంది.

★ అజీర్ణము (తిన్నది సరిగా జీర్ణం కాకపోవడం) వల్ల కూడా ఎసిడిటీ వచ్చే అవకాశం వుంది.

★ ఆహారం వేళకు తినక పోవడం ముఖ్యమైన కారణాలలో ఒకటి.

★ ఆహారం వేళ తప్పి తినడం, ఆలస్యంగా తినడం వల్ల ఇలా ఉదయంగాని, సాయంత్రంగాని ఎప్పుడైనా ఆలస్యంగా తినడం అలవాటుగా మారితే ఎసిడిటీ వస్తుంది.

★ అతిగా తినడం వల్ల కూడా ఎసిడిటీ వస్తుంది. అలాగే సారాయి, పొగాకు వంటివి త్రాగడం వల్ల కూడా రావచ్చు.

★ కొన్ని సందర్భాలలో / కొవ్వు పదార్థాలు తిన్నా అతిగా చేపలు, మాంసం తిన్నా - అంటే అధిక పరిమాణంలో ప్రొటీన్లు ఆహారంలో తీసుకున్నా అదే సందర్భంలో కార్బోహైడ్రేట్స్ (పిండి పదార్థాలు) తీసుకున్నా ఎసిడిటీ రావడానికి అవకాశం వుంటుంది.

★ పిండి పదార్థాలు, మాంసకృత్తులు శరీరానికి అవసరమే, అయితే పిండి పదార్థాల మోతాదు బాగా తక్కువగాను, మాంసకృత్తుల మోతాదు ఎక్కువగాను వుంటే ఎసిడిటీ వచ్చే ప్రమాదం వుంది.

★ అంతేగాక ఎసిడిటీ మానసిక కారణాల వల్ల కూడా వస్తుందని ఇటీవలి అధ్యయనాలలో తేలింది. ఆందోళనతోను ఎడతెగని ఆలోచనలతోను వుండడం వల్లఎసిడిటీ వస్తుంది.

## లక్షణాలు

ఈ క్రింది లక్షణాలు గనక వుంటే ఎసిడిటీ వున్నదనో లేక రాబోతొందనో అనుకోవచ్చు

★ ఎసిడిటీ వుంటే గుండెలలో బాగా మంటగా వుంటుంది.

★ కడుపు ఉబ్బరంగాను - ఒకొక్కసారి కడుపు నొప్పిగాను అనిపిస్తుంది.

★ పులిసిన వాసనతోను లేదా - పుల్లని త్రేన్పులతో కడుపులో వాయువులు వుంటాయి.

★ గుండెలలో మంట కూడా చేదుగా లేక వగరుగా వచ్చే పసరు వల్ల వస్తుంది.

★ గుండెలలోనే కాక ఆహార నాళం అంతామంటగా వుంటుంది.

★ తరచూ ఆపాన వాయువులు వస్తూ వుంటాయి.

★ ఆహారం ఏకాస్త తీసుకున్నప్పటికీ కడుపునిండి నట్లుగా వుంటుంది.

★ రొము ఎముక క్రిందుగా నొప్పి కూడా వస్తుంది. ఇది ఒకొక్కసారి వీపు పై కూడా రావచ్చు, మూత్రపిండాలపై కూడా నొప్పి రావచ్చు. ఒక్కోసారి ఈ నొప్పిని గుండె పోటుగా భ్రమపడడం కూడా జరగవచ్చు.

★ ఎసిడిటీ వున్నవారిలో కడుపులో వాయువుల వలన వాంతి కూడా అయ్యే ప్రమాదం వుంది.

★ వాంతి రూపంలోగాని, త్రేనుపు రూపంలోగాని, ఆపాన వాయువుగా గాని కడుపులోని గ్యాస్ వెలువడిన తర్వాత నొప్పి తగ్గవచ్చు.

## చికిత్స

ఎసిడిటీ వున్నవారు తాము ఆహారం తీసుకునే విషయంలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

★ ముఖ్యంగా ఆమ్ల స్వభావం గలఫలాలు, నిమ్మ, నారింజ, బత్తాయి వంటి వాటిని పూర్తిగా విసర్జించాలి.

★ చింతపండుతో చేసిన ఆహార పదార్థాలు, చారువంటివి తగ్గించాలి.

★ మషాలాలు, కారం తినరాదు.

★ మాంసం, చేపలు, ఇంకా ఇలాటి నాన్-వెజిటేరియన్ వంటకాలు కూడా తగ్గించాలి.

★ కాఫీలు, టీలు త్రాగరాదు. పాలు త్రాగవచ్చు. బజారులో అమ్మే శీతల పానీయాలు, సోడాలు త్రాగరాదు.





ఈ క్రింది మందులు వాడవచ్చు

★ డైజీన్ - టాబ్లెట్స్ / జెల్

★ జెలుసిల్ - టాబ్లెట్స్ / లిక్విడ్ / జెలుసిల్ MPS టాబ్లెట్స్

★ ఎసిడిన్ - టాబ్లెట్స్ / ఎసిడిన్ MPS / ఎసిడిన్ MPS జెల్

వీటిలో ఏదైనా సరే వాడవచ్చు. వీటిని భోజనానంతరం టాబ్లెట్స్ అయితే ఒకటి, జెల్ అయితే ఒక టీ స్పూన్ తీసుకోవాలి.

★ రాంటిడిన్ 150 మి.గ్రా టాబ్లెట్స్

★ హిస్టాక్ 150 మి.గ్రా టాబ్లెట్స్

బాగా తీవ్రంగా గ్యాస్ వుండడం, గుండెలు మండటం వుంటే ఒక టాబ్లెట్ వాడాలి. దీనిని రెండు పూటలా వాడాలి. అయితే దీనిని గర్భిణీ స్త్రీలకు, పన్నెండు సంవత్సరాలలోపు వయసు గల పిల్లలకు ఇవ్వరాదు. దీనిని జోలిన్‌జర్ - ఎల్లిసన్ సిండ్రోమ్ లేక క్రానిక్ ఎపిసోడిక్ డిస్‌పెప్సియా వంటి జబ్బులలో వాడునప్పుడు చికిత్సను అకస్మాత్తుగా ఆపకూడదు

★ ఫామ్‌టాక్ 20 మి.గ్రా/40 మి.గ్రా టాబ్లెట్స్

★ ఫామోనిట్ 20 మి.గ్రా/40 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఫామోసిడ్ 20 మి.గ్రా./40 మి.గ్రా. టాబ్లెట్స్

★ బ్లోకాసిడ్ 20 మి.గ్రా./40 మి.గ్రా. టాబ్లెట్స్

ఈ టాబ్లెట్స్‌లో దేనినైనాసరే 20 మి.గ్రా. రాత్రి పడుకునే సమయంలో వేసుకోవాలి. అవసరాన్ని బట్టి డోసు 40 మి.గ్రా.గా పెంచుకోవచ్చు. ఈ విధంగా నాలుగు నుండి ఎనిమిది వారాల పాటు వాడితే ఎసిడిటీ చాలా వరకు అదుపులో వుంటుంది.

★ ఎసిడిటీ వున్నవారు సారాయి, కల్లువంటి మత్తు పదార్థాలు తాగరాదు. అదే విధంగా ధూమపానం కూడా చేయరాదు.

**Note :** ఎసిడిటీకు మందులు వాడుకునేవారు డాక్టరు సలహా పైననే మందులు వాడాలి. అంతేగాక వేరే ఏవైనా మందులు వాడ వలసివస్తే డాక్టరును సంప్రదించిగాని అవి వాడరాదు. ఎసిడిటీకి వాడే మందులు ఇతర మందులతో రసాయన చర్యలు జరుపుతాయి. అలాగే కొన్ని మందులు కూడా ఎసిడిటీని కలిగించగలవు.

## పెప్టిక్ అల్సర్స్ (Ulcers)

మన కడుపులోని జీర్ణరసాలలో 'హైడ్రోక్లోరిక్ ఆమ్లం' పెప్సిన్ అనే ఎంజైము కూడా వుంటాయి. ఇవి అతిగా ఉత్పత్తి అవడమో - లేక ఇవి వేళకు ఉత్పత్తి అవుతుంటే ఆ సమయానికి ఆహారం తీసుకొనక పోవడం వల్లా ఈ పదార్థాలు ప్రేగులలోనికి ప్రవేశించి అక్కడి మ్యూకస

పొరను తినివేస్తాయి. అలా తిని వేసిన ప్రదేశంలో పుండ్లు వస్తాయి. ఇలాటి పుళ్ళను 'అల్సర్స్' అని 'పెప్టిక్ అల్సర్స్' అని - పొట్టలో పుండు అని, 'షేగుపూత' అని కూడా అంటూ వుంటారు. పెప్టిక్ అల్సర్స్ రెండు రకాలుగా వుంటాయి. అవి :

1. గ్యాస్ట్రిక్ అల్సర్స్ (Gastic ulcers) - (జీర్ణాశయంలో పుండు)
2. డ్యూయోడినల్ అల్సర్స్ (Duodenal ulcers) (ఆంత్రమూలంలో పుండు)

## అల్సర్స్ ఎందుకు వస్తాయి ?

అనేక రకాల కారణాల వలన అల్సర్స్ వస్తాయి. కాని చాలా మందిలో అల్సర్స్ కారం, మసాలాలు తినడం వల్ల మాత్రమే వస్తాయనే అపోహ వున్నది. అది పూర్తిగా నిజం కాదు. అయితే అల్సర్స్ బయటబడిన తరువాతైనా కారం, మసాలాలు తగ్గించడం మంచిది.

★ అమీబియాసిస్ అనే రక్తంతో కూడిన జిగట విరేచనాలు వ్యాధి. దీర్ఘకాలంగా వుంటే అల్సర్స్ వచ్చే అవకాశం వుంది.

★ పొగత్రాగేవారిలోను, సారాయి త్రాగేవారిలోను అల్సర్స్ వచ్చే అవకాశం ఎక్కువ.

★ కొందరు అన్నం తినేటప్పుడు నమిలి మ్రింగకుండా అలాగే మ్రింగేస్తూ వుంటారు. ఇలాటి వారిలో కూడా అల్సర్స్ వస్తాయి.

★ న్యూరోటిక్ పర్సనాలిటీ వున్నవారిలోనూ (అంటే మనో దౌర్బల్యం గల వారిలోను) ఆందోళనా మనస్తత్వం గల వారిలోను అల్సర్స్ వచ్చే ప్రమాదం వుంది.

★ కడుపులో నులి పురుగులు వున్నవారిలోను అల్సర్స్ వస్తాయి.

★ అల్సర్స్ వచ్చే వారిని చాలా మందిని పరిశోధించి 'O' గ్రూప్ రక్తం గల వారిలో డ్యుయోడినల్ అల్సర్ వస్తుందని గమనించారు.

★ అంతెందుకు అల్సర్ ఇలాటి బాహ్యకారణాల వల్ల మాత్రమే కాక జన్యువులలోనే నిర్దేశింపబడి వచ్చేందుకు కూడా అవకాశం వుంది.

## అల్సర్ కలిగించే లక్షణాలు

డ్యుయోడినల్ అల్సర్ : జీర్ణాశయానికి, పేగులకు మధ్య అనుసంధానమైన ప్రదేశం - ఆంత్రమూలం అంటారు. ఈ ప్రదేశంలో ఏర్పడ్డ పుండును డ్యుయోడినల్ అల్సర్ అంటారు.

★ దీనిని గుర్తించేందుకు పై పొట్టలో కుడివైపుగా నొప్పి వస్తుంది.

★ రోగికి వచ్చే నొప్పి ఏదైనా తింటే తగ్గిపోతుంది.

★ రోగికి నొప్పి మాత్రమే కాక కడుపులో మంట కూడా వుంటుంది. కానీ ఇదంతా తిండి తింటే తగ్గుతుంది. అయితే అన్నం గానీ ఏదైనా తిన్న తర్వాత కాసేపటికి అది అరగడం మొదలయ్యేసరికి మళ్ళీ నొప్పి మొదలై క్రమేపీ పెరుగుతుంది.





★ ఈ నొప్పి ఒకొక్కసారి గుండెల్లో మంటవలె వస్తుంది.

★ ఈ నొప్పి అన్నం తిన్నాక అది జీర్ణం అయ్యే సమయానికి మళ్ళీ వస్తుంది. అంటే సాయంత్రం మూడు లేక నాలుగు గంటలకు గానీ, తెల్లవారు ఝామున మూడు గంటలకు గానీ మంట, నొప్పి వస్తాయి. ఇది ఎంతలా వస్తుందంటే నిద్ర పోయేమనిషి కూడా లేచి కూర్చుంటాడు!

★ డ్యుయోడినల్ అల్సర్స్ వున్న రోగులు మాత్రమే అధిక సంఖ్యలో వుంటారు.

★ పుండు ఎక్కువ అవడం వలన క్రింది వైపు ప్రేగుల్లోని దారి మూసుకు పోతుంది. దీనివలన రెండు మూడు రోజుల పాటు ఆహారం అలాగే జీర్ణాశయంలో నిలవ వుండి పోయి చివరకు వాంతుల రూపంలో బయటకు వస్తుంది. దీనిని పైలోరిక్‌స్టెనోసిస్ అంటారు.

★ పుండు జీర్ణాశయం, ఆంత్రమూలంనకు వెనుకగల శరీర భాగాలకు అతుక్కుని అది అలా పెరుగుతూ వుంటే నొప్పి వీపులోనికి కూడా పాకుతుంది.

★ పుండు వలన ప్రేవులు చిల్లులు పడి జీర్ణరసాలన్నీ ప్రేవుల చుట్టూ చేరి పెరిటోనైటిస్ అనే ప్రమాదకరమైన జబ్బు కలగవచ్చు.

★ కడుపులో పుండు రక్తనాళాల పైకిపోతే చీము కలిగి రక్త నాళాల నుండి జీర్ణాశయంలోనికి కారుతుంది. వాంతి అయితే లేక విరేచనంలోనూ బయటకు నలుపు రంగులో గాని కాఫీ డికాక్షన్ రంగులో గాని బయట పడుతుంది.

★ వాంతులు, వికారం, మలమూత్రాలు బంధించినట్లుగా వుండి సరిగ్గా రాకపోవడం పొట్ట బిగబట్టడం, కడుపు ఉబ్బరం, ఇలాంటి లక్షణాలు మాత్రమేగాక, వళ్ళంతా వణుకు, దప్పిక, నాలుక జిగురుతో వుండడం వెక్కిళ్ళు వుంటాయి.

★ ఈ రకమైన అల్సర్స్ మందులు వాడితే తగ్గిపోతాయి. మందు లేమీ వాడకపోయినా కూడా కొంత కాలానికి తగ్గిపోయి ఆరు నెలలు, లేక సంవత్సరం తిరిగేసరికి మళ్ళీ మొదలవుతాయి. మందులు వాడినా కొంతకాలం తర్వాత మళ్ళీ వస్తాయి.

2. గ్యాస్ట్రిక్ అల్సర్స్ : ఇవి జీర్ణాశయంలో వస్తాయి.

★ గ్యాస్ట్రిక్ అల్సర్స్ వచ్చే రోగులు చాలా తక్కువ శాతం వుంటారు.

★ ఇది డుయోడినల్ అల్సర్‌కు పూర్తి వ్యతిరేకంగా వుండే లక్షణాలు చూపుతాయి. డుయోడినల్ అల్సర్‌లో నొప్పి, మంట వున్నప్పుడు భోజనం చేస్తే తగ్గితే గ్యాస్ట్రిక్ అల్సర్ అంటే భోజనం చేసినా, ఏమైనా తాగినా నొప్పి ఎక్కువ అవుతుంది.

★ ఇది పొట్టపైన మధ్య భాగంలో వుంటుంది.

★ భోజనం చేస్తే నొప్పి ఎక్కువ అవుతుంది. కాబట్టి రోగి భోజనం చేయడానికి భయపడతాడు. దీనివల్ల నీరస పడతాడు, చిక్కిపోతాడు.

★ జీర్ణాశయపు గోడలు చాలా మందమైన మ్యూకస్ పొరలను కలిగి వుంటాయి. కాబట్టి ఈ అల్సర్స్ చాలా తక్కువ మందికే వస్తాయి.

★ జీర్ణాశయపు అల్సర్స్ సర్వసాధారణంగా నడి వయసు వారికి వస్తూ వుంటాయి. అరుదుగా యువకులకు కూడా వస్తాయి.

★ జీర్ణాశయంలో ఏర్పడిన పుండు (ulcer) పెరిగి చివరకు 'కాన్సర్ గడ్డ'గా మారే ప్రమాదం కూడా వుంది.

★ గ్యాస్ట్రిక్ అల్సర్స్ సాధారణంగా జీర్ణాశయంలో తయారయ్యే జీర్ణరసాలవల్ల, హైడ్రోక్లోరి కామ్లం వల్ల వస్తాయి. ఇవి అంతత్వరగా తగ్గేనికావు.

## చికిత్స

ఎసిడిటీలో వాడే మందుల్ని ఇక్కడా వాడవచ్చు. కడుపులో మంట, వికారం, వాంతి, అన్నం అరగకపోవడం వంటి లక్షణాలతో పాటుగా నోట్లో పుల్లని నీళ్ళుపూరడం, త్రేణుపులు రావడం కూడా జరుగుతుంది.

అల్సర్‌కు చికిత్సను మొత్తం నాలుగు రకాల మందులతో చేస్తే ఎంతో ఉపయోగం వుంటుంది. అవి :

1. **ఎంటాసిడ్ మాత్రలు లేదా సిరప్ (సొల్యూషన్)**

★ జెలుసిల్ MPS మాత్రలు - రోజుకు మూడు, మూడు పూటలా

★ జెలుసిల్ MPS సొల్యూషన్ - రోజుకు మూడు పూటలా మూడు టీ స్పూన్లు

★ డైజీన్ - మాత్రలు

★ డైజీన్ - సొల్యూషన్ (జెల్) - రోజూ పై వానివలె

2. **అల్సర్స్‌ను తగ్గించేందుకు**

★ రాన్‌టిడిన్ - 150 మి.గ్రా. మాత్రలు

★ హిస్టాక్ - 150 మి.గ్రా మాత్రలు

★ జిన్‌టాక్ - 150 మి.గ్రా. మాత్రలు

★ రాన్‌టిన్ - 150 మి.గ్రా. మాత్రలు

వీటిలో ఏదైనా సరే రోజుకు రెండు చొప్పున రెండు పూటలా వాడాలి. ఈ విధంగా ఒకటి లేక రెండు నెలలు వాడాలి.

★ ఫామోనిట్ 20 మి.గ్రా/40 మి.గ్రా. టాబ్లెట్లు

★ ఫామోటిన్ 20/40 మి.గ్రా. టాబ్లెట్లు

★ ఫామోసిడ్ - 20/40 మి.గ్రా. టాబ్లెట్లు





వీటిలో ఏదైనా సరే పూటకు ఒకటి చొప్పున రోజుకు రెండు వాడాలి. లేదా - 40 మి.గ్రా. రాత్రి పడుకునేటప్పుడు వేసుకోవాలి. ఈ విధంగా ఒకటి నుండి అవసరాన్ని బట్టి రెండు నెలలు వాడాలి.

★ ఒమెజ్ - 20 మి.గ్రా. కాప్సుల్స్.

★ ఓసిడ్ - 20 మి.గ్రా. కాప్సుల్స్

★ లోమాక్ - 20 మి.గ్రా. కాప్సుల్స్

★ ఒమిజాక్ - 20 మి.గ్రా. కాప్సుల్స్

వీటిలో ఏదైనాసరే రోజుకు ఒకటి చొప్పున - మధ్యాహ్నం గాని, రాత్రికి గాని వాడాలి. ఈ విధంగా ఒకటి లేక రెండు నెలలు వాడాలి.

★ లాన్‌జోల్ - 30 మి.గ్రా. కాప్సుల్స్

★ లాంజాప్ - 30 మి.గ్రా. కాప్సుల్స్

★ స్లాన్సా - 30 మి.గ్రా. కాప్సుల్స్

వీటిలో ఏదైనా సరే రోజుకు ఒకటి చొప్పున పై విధంగానే వాడవచ్చు. ఇవి కాకుండా కడుపులో వచ్చే నొప్పిని తగ్గించేందుకు

★ ఈక్విరెక్స్ - టాబ్లెట్లు

★ లిబ్రాక్స్ - టాబ్లెట్లు

★ స్పాస్‌రిల్ - టాబ్లెట్లు

వీటిలో ఏదైనా సరే రోజుకు రెండు చొప్పున నెల, నెలన్నర వాడాలి.

వాంతులు - కడుపులో గడబిడలను అదుపు చేసేందుకు

★ మాగ్జిరాన్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ పెరినారమ్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ ఎమెనిల్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో దేనినైనా రోజుకు రెండు చొప్పున నాలుగు నుండి ఎనిమిది వారాలు వాడాలి. లేదా

★ గ్యాస్ట్రోస్టాటివ్ 10/20 మి.గ్రా. టాబ్లెట్లు

★ డోమ్‌స్టాల్ 10/20 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో ఏదైనారోజుకు రెండు చొప్పున ఒకటి లేక రెండు నెలలు వాడాలి. లేకపోతే

★ సిసాపిడ్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ సిసాప్రో - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ నార్మగట్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ సిజా - 10 మి.గ్రా. టాబ్లెట్లు

★ పెరిస్టిల్ - 10 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో ఏదో ఒకటి రోజుకు రెండు చొప్పున ఒకటి లేదా రెండు నెలలు వాడాలి. కొంతమందికి అల్సర్‌కు వాడే పై మందులన్నింటి వల్ల తలతిరగడం, నొప్పి, డయేరియా ఇంకా బ్రెస్ట్ ఎన్లార్జిమెంట్ వంటి సమస్యలు వచ్చే ప్రమాదం వుంది. వీరు మాములుగా పెయిన్‌కిల్లర్లు వేసుకోవడం వల్ల అల్సర్ కు వాడే మందులు తమ ప్రభావాన్ని తగ్గించి చూపుతాయి.

ఈ మందుల్ని జాగ్రత్తగా పూర్తి కోర్సుగా వాడితే అల్సర్‌లకు ఆపరేషన్ చేయల్సిన అవసరం వుండదు.

అల్సర్‌లు తయారవుతున్నప్పుడు వాటి వల్ల ఇతర ఉపద్రవాలు కలగకుండా చూసుకోవడం ముఖ్యం. వాటిలో అల్సర్ పుండు పెద్దదై కన్నం పడడం ఒకటి. ఈ స్థితిని పెర్‌ఫొరేషన్ అంటారు. అంతేగాక అల్సర్ పుండు నుండి రక్తం కారడం కూడా (Bleeding) మంచిది కాదు. మరొక సమస్య పుండు పెద్దదై ఆంత్రమూలంలోని ద్వారం మూసుకుని పోవడం ఒకటి. దీనిని పైలోరిక్‌స్టెనోసిస్ (Pyloric stenosies) అనే అంటారు. దీనివల్ల ఆహారం జీర్ణం కాకుండా వున్న పదార్థం వాంతి రూపంలో వెలువడుతుంది. ఇది కూడా ప్రమాదకరమైన సమస్యే! క్యాన్సర్ పుండుగా మారే పెప్టిక్ అల్సర్ అతిముఖ్యమైన సమస్య. వీలైనంత త్వరగా అల్సర్‌ను గుర్తించి తగిన మందులు వాడడం వల్ల క్యాన్సర్ వరకు రాకుండానే అల్సర్‌ను తగ్గించుకోవచ్చు.

ఈ రోజులలో అల్సర్‌లు చాలా మందిలో చూస్తూ వున్నాము. రోగికి కడుపు నొప్పిగా వుంటే, కడుపు ఉబ్బరంగా వుంటే అల్సర్ కావచ్చు. దీని కొరకు ఎండోస్కోప్ అనే పరీక్ష నిర్వహిస్తారు. ఈ పరీక్ష చాలా ఖచ్చితమైన సమాచారాన్ని అందిస్తుంది.

'ఎండోస్కోపి'లో సన్నగా వుండే గొట్టాన్ని నోటి ద్వారా జీర్ణాశయంలోనికిగానీ, ఆంత్ర మూలంలోనికి గానీ పంపి అక్కడ పుడుగానీ - మరేదైనా సమస్యగానీ వుంటే దానిని కళ్ళకు కట్టినట్లు చూడడానికి అవకాశం ఏర్పడుతుంది.

అల్సర్‌లు వున్నాయని నిర్ధారణ అయితే దానిని మందులతో తగ్గించడానికి ప్రయత్నించాలి. సర్వ సాధారణంగా మందులతో తగ్గిపోతుంది. అయితే పరిస్థితి తీవ్రమై మందులకు లొంగ స్థితిలో, రోగి ఏ పనీ చేసుకోలేకపోతే అప్పుడు ఆపరేషన్ చేసి అల్సర్‌ను తొలగిస్తారు. అయితే మళ్ళీ పుండు పడదన్న గ్యారెంటీ లేదు!

కడుపులో ఏసిడ్ పెరగకుండా చూసుకోవడం, సమయానికి భోజనం చేయడం, కారం, మషాలాలు తగ్గించడం, వేపుడు కూరలు మానివేయడం చేయాలి. అనాల్జిన్ గాని ఏస్ప్రిన్‌గాని అక్సిఫెన్ బ్యూటాజోన్ మందులు వాడడం వల్ల అల్సర్ నుండి రక్తం కారే ప్రమాదం వుంది. మందులు వాడడంగాని లేక వాడే మందుల్ని ఆపడంగాని డాక్టరు సలహాపైనే చేయాలి. అలాగే ఆపరేషన్ కూడా డాక్టర్లు తగు పరీక్షలు చేసి దురి నిర్ధారిస్తారు. దీర్ఘకాలికమైనదే గానీ చికిత్సకు లొంగని జబ్బు కాదుయిది.





## ఇర్రిటబుల్ బొవెల్ సిండ్రోమ్ (IBS - Irritable Bowel Syndrome)

కడుపులో హటాత్తుగా వచ్చే జబ్బు ఇది. దీని లక్షణాలు మనిషి మనిషికీ మారుతూ వుంటాయి. అదే విధంగా ఇది రావడానికి రకరకాల కారణాలు ఉన్నాయి. ముఖ్యంగా మానసిక వత్తిడి ఈ వ్యాధి రావడానికి కారణం.

### కారణాలు

వ్యాది రావడానికి కారణాలు ఇవీ అని స్పష్టంగా తెలియనప్పటికీ ఈ క్రింది కారణాల్ని చెప్తున్నారు.

★ మానసిక వత్తిడి, ఆందోళన వల్ల, మెదడు పైన జరిగే ఈ వత్తిడివల్ల దానిలో ఏర్పడిన కొన్ని రసాయనాల ప్రభావం పొట్టలోని ప్రేవులపైన పడుతుంది. దానితో వ్యాధి మొదలవుతుంది.

★ కొంతమందిలో తాము తిన్న ఆహారం సరిపడకపోవడం వల్ల ప్రేగుల్లో ఎలర్జీ లక్షణాలు మొదలై అది IBS కు దారి తీయవచ్చు.

★ విరోచనాలు, వాంతులు అయిన తరువాత కొందరిలో అవి తగ్గిపోయినా యింకా కడుపు బిగబట్టడం, పేగులు కదలాడడం, వికారం వుండి IBS రావచ్చు.

★ IBS ను ఒక్కసారిగా గుర్తించడం కష్టం. దానికి తగిన పరీక్షలన్నీ చేసినా కూడా ఒక్కోసారి బయటబడదు.

### వ్యాధి లక్షణాలు

★ ఎసిడిటీలో వున్నట్లుగానే నోట్లో పుల్లని నీరు వూరుతుంది. అలాగే కడుపులో మంట కూడా వస్తుంది.

★ అల్సర్‌కు వాడే మందులు వాడినప్పటికీ కడుపులో మంట చల్లారదు.

★ పొట్టలో మెలిబెట్టినట్లుగా నొప్పి వస్తూ వుంటుంది.

★ కడుపు నొప్పితో బాటుగా మల విసర్జన కూడా తరచుగా కావడం వుంటుంది. మల విసర్జనకు వెళ్ళిన తరువాత కడుపు నొప్పి తగ్గిపోతుంది.

★ విరేచనంలో మ్యూకస్ (జిగురు) వుంటుంది. అమీబియాసిస్‌లో కూడా జిగురు వుంటుంది. కాని దానికి దీనికి తేడా వుంది. 'అమీబియాసిస్'లో విరేచనంలో రక్తం పడుతుంది - దీనిలో రక్తం పడదు.

★ మందులు వాడినప్పుడు తగ్గినట్లు అనిపించినా మళ్ళీ వ్యాధి మొదలువ్వుతుంది.

★ తిన్న ఆహారం జీర్ణం కాకపోవడం, కడుపులో-వాయువులు వున్నట్లు ఉబ్బరంగా ఉండడం - విరేచనం అయినాక కూడా కడుపులో మలం వున్నట్లు భావన - ఇలాటి అర్థంకాని రోగ లక్షణాలతో ఈ 'IBS - బయటబడుతూ వుంటుంది.

### చికిత్స

నిజానికి ఇదొక మానసిక సమస్య అని చెప్పితే అతిశయోక్తి కాదు. ఎన్ని మందులు వాడినా తగ్గకపోవడంతో అసలు నాకు రోగం తగ్గదేమోననే ఆందోళన వుండడం రోగాన్ని పెంచుతుంది.

★ పేగులలో మ్యూకస్ జారిపడడం వల్ల పెద్దగా నష్టం లేదు. దీనికి ఆందోళన పడి మందులు వాడడం వల్ల IBS వచ్చేందుకు అవకాశం ఏర్పడుతుంది.

★ మానసిక వత్తిడిని తొలగిస్తే రోగం దానంతట అదే తగ్గుతుంది. ఎలాటి మందులు వాడకుండానే కొన్ని రోజులకు ఈ రోగం తగ్గిపోవడానికి కారణం అదే!

★ మరీ ఎక్కువ బాధగా, కడుపులో నొప్పి, మంట వున్నా తాత్కాలిక ఉపశమనానికి మందులు వాడుకోవచ్చు.

★ మందులతో పాటు పొగత్రాగడం సారాయి త్రాగడం చేయరాదు.

ఈ జాగ్రత్తలతో పాటు ఈ క్రింది మందులు వాడుకోవచ్చు.

★ 'ఓమేజ్' 20 మి.గ్రా. కాప్సుల్ రోజుకొకటి చొప్పున

★ లిబ్రాక్స్ టాబ్లెట్స్ గాని

★ స్పాస్‌రిల్ టాబ్లెట్స్ గాని రోజుకు ఒకటి చొప్పున

★ పెరినారమ్ టాబ్లెట్స్ రోజుకు రెండు చొప్పున

★ జెలుసిల్ MPS రోజుకు మూడు చొప్పున వాడవచ్చు.

## పసరుతిత్తిలో రాళ్ళు (Gall stones)

జీర్ణ మండలంలో కాలేయం ముఖ్యమైన అవయవం. ఆహారం జీర్ణం కావడానికి అవసరమైన జీర్ణ రసాల్ని కూడా కాలేయం ఉత్పత్తి చేస్తుంది. కాలేయంలో ఒక చిన్న సంచి వంటి భాగం వుంటుంది. దీనిని పసరుతిత్తి అంటారు. దీనినే పిత్తాశయం అని కూడా అంటారు. ఇది పైత్య రసాన్ని ఉత్పత్తి చేస్తుంది.

పసరుతిత్తిలో ఏర్పడే రాళ్ళను 'గాల్‌స్టోన్స్' అంటారు. ఇవి అనేక కారణాల వల్ల వస్తాయి.

★ మాంసకృత్తులు వుండే ఆహారం తక్కువగా తీసుకునే వారిలో గాల్‌స్టోన్స్ వచ్చే ప్రమాదం వుంది.

★ గాల్ లేక పిత్తాశయం బాక్టీరియా ఇన్‌ఫెక్షన్‌కు గురైనప్పుడు స్టోన్స్ వచ్చే అవకాశం వుంది.

★ ఋతువు వాయిదాకు వాడే మందుల వల్ల, ఇతర హార్మోన్‌ల ఇంజక్షన్స్ వల్ల 'గాల్‌స్టోన్స్' వచ్చే ప్రమాదం వుంది.





★ కడుపులో నులి పురుగులు ఉన్నవారిలోను, అమీబియాసిస్ వ్యాధితో బాధపడేవారిలోను పిత్తాశయంలో రాళ్ళు ఏర్పడవచ్చు.

పసరుతిత్తిలో రాళ్ళు వస్తే ఒక్కోసారి ప్రమాదకర పరిస్థితులు తలెత్తవచ్చు. ముఖ్యంగా పచ్చకామెర్ల వ్యాధిలోను, సెప్టికేమియా వ్యాధిలోను పసరుతిత్తిలో రాళ్ళు ప్రధాన కారణం కావచ్చు. ఒకొక్కసారి 'షాక్' (గుండె ఆగిపోవచ్చు) వచ్చి ప్రాణం కూడా పోవచ్చు. గాల్‌బ్లాడర్‌కు ఇన్‌ఫెక్షన్ సోకడం వల్ల బాగా వాచి చీము పట్టి పగలిపోతే చాలా ప్రమాదం కలుగుతుంది.

### నిర్ధారణ

పసరుతిత్తిలో రాళ్ళను గుర్తించడానికి ఆధునిక వైద్యం ఎంతో ఉపయోగపడుతుంది. ముఖ్యంగా అల్ట్రాసౌండ్ స్కానింగ్ పరీక్షల్లో జబ్బును ఖచ్చితంగా నిర్ధారించవచ్చు.

### లక్షణాలు

★ గాల్‌స్టోన్స్ కాలేయం వున్న వైపు అంటే కడుపు పై భాగాన కుడి చేతి వైపు వున్న గాల్ బ్లాడర్‌లో ఏర్పడతాయి. ఇవి ఏర్పడిననంత మాత్రాన వ్యాధి లక్షణాలు ఏ మాత్రం కనిపించకపోవచ్చు. అలా అని అందరిలో ఈ విధంగా వుంటుందని కాదు. కొందరిలో మాత్రమే ఈ విధంగా వుండవచ్చు.

★ కాలేయం దిగువ భాగాన అకస్మాత్తుగా - ఉన్నట్టుండి నొప్పి మొదలౌతుంది. అంతేగాక ఈ నొప్పి చాలాసేపు కొన్ని గంటలపాటు అలాగే నిలిచి వుండి ఆ తరువాత ఎప్పటికో నిదానంగా సర్దుకుంటుంది.

★ జ్వరం వుంటుంది. వాంతులు అవుతాయి. విరేచనాలు అవడంతో పాటు రోగి శ్వాస కోసం ఇబ్బంది పడే ప్రమాదం కూడా వుంది.

★ కాలేయం వుండే చోట ఈ ప్రాంతంలో రెండు వేళ్ళుంచి గట్టిగా గాలి పీలిస్తే నొప్పిగా వుంటుంది. ఈ నొప్పి కలిగే లక్షణాన్ని మర్ఫీస్ సైన్ (Murphy's sign) అంటారు.

★ జ్వరం, విరేచనాలేకాక కడుపు ఉబ్బరం, త్రేన్పులు, అజీర్ణం, నోట్లో పదేపదే నీరు ఊరడం వంటి లక్షణాలు వుంటాయి.

★ కడుపులో వుండే నొప్పి అటునుండి వీపుపై కూడా కుడి వైపు రావచ్చు. అక్కడ నుండి భుజపు ఎముకపైకి, మెడ ఎముకల దగ్గరకు ప్రాకవచ్చు. కుడివైపు చేయి అంతా గుంజుతుంది.

★ కడుపులో వచ్చే నొప్పిని ఈ విధంగా అశ్రద్ధ చేస్తే నొప్పి పదే పదే వచ్చి నొప్పి వచ్చినప్పుడల్లా ప్రాణం మీదకు వచ్చేట్లు వుంటుంది.

★ జ్వరం విపరీతంగా వుండి చలి కూడా వస్తుంది.

★ వీరికి కామెర్ల వ్యాధి కూడా వస్తుంది. కామెర్ల వ్యాధిలో వచ్చినట్లుగా విరేచనం తెల్లగా వస్తుంది.

★ ఒక్కోసారి కడుపు నొప్పి ప్రాణాపాయం కలిగించే స్థితికి చేరవచ్చు. చివరికి రెండు మూడు రోజులలోనే ఆపరేషన్ చేయించు కోవాల్సి వుంటుంది.

★ తరచుగా కడుపునొప్పి రావడం, వికారం, వాంతులు అవడం గాల్ బ్లాడర్ వాపు వుండి స్టోన్స్ అడ్డుపడడం వల్ల పసరు బయటకు రాకపోవడం వల్ల విడవకుండా వచ్చే పచ్చకామెర్ల వ్యాధి వుంటే ఆపరేషన్ చేసి రాళ్లను తొలగిస్తారు.

వ్యాధి రాకుండా కొన్ని రకాల జాగ్రత్తలు తీసుకుంటే ఇలాటి ఇబ్బందులు ఏవీ రాకుండా వుంటాయి.

★ స్టోన్స్ వచ్చినట్లు అనుమానంగా వుంటే పూర్తి విశ్రాంతి తీసుకోవాలి.

★ నెయ్యి, వేపుడు కూరలు, వేరు శనగనూనె, ఊరగాయ పచ్చళ్ళు, కోడిగ్రుడ్లులోని పచ్చసొన, వెన్న, మీగడ, కొవ్వు పదార్థాలు తినరాదు.

★ ఆకుకూరలు, కూరగాయలు, పప్పుధాన్యాలు విరివిగా వాడాలి.

★ రోగి ఎక్కువ బరువు వుండకూడదు.

★ సన్‌ఫ్లవర్ ఆయిల్ లేదా డబుల్ రిఫైన్డ్ ఆయిల్ వంటలలో వాడుకోవచ్చు. అయితే ఇవి కూడా చాలా స్వల్పంగా వుండీలేనట్లుగా వాడాలి.

## చికిత్స

పసరుతిత్తిలో రాళ్లు. ఏర్పడి పసరుతిత్తి బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్‌కు గురై వాపు, చీము పట్టి వుంటే యాంటిబయాటిక్ మందులు వాడుకోవచ్చు. పైగా ఇవి కూడా డాక్టర్ సలహా మేరకు వాడాలి. ఇవి వాడడం వల్ల తాత్కాలికంగా కాస్త ఉపశమనం కలుగుతుంది. వాంతులు, జ్వరం, నొప్పి, విరేచనాలు వంటివి తగ్గిపోతాయి. అయితే రాళ్ళను మాత్రం ఆపరేషన్ చేసి తొలగించాలి. 'బటన్‌హోల్ సర్జరీ అనే పద్ధతిలో తొలగిస్తారు.

పరసుతిత్తిలో ఏర్పడేరాళ్ళు లివర్‌లో కొవ్వు పదార్థాలు ఎక్కువగా పెరగడం వల్ల ఏర్పడతాయి. వీటిని 'కొలెస్ట్రాల్ గాల్‌స్టోన్స్' అంటారు. అంతేగాక రంగును కలిగించే పదార్థాలను 'డిగ్మెంట్స్' అంటారు. రక్తానికి రంగును ఇచ్చే పిగ్మెంట్స్ వల్ల పిగ్మెంటల్ గాల్‌స్టోన్స్ అనేవి కూడా ఏర్పడవచ్చు. ఇంకా కాల్షియం లవణాలు, కొవ్వు పదార్థాలు, పిగ్మెంట్స్ ఇవ్వన్నీ కలిసి ఏర్పడే మిక్సెడ్ గాల్ స్టోన్ అనేవి కూడా ఒక రకమైన పసరుతిత్తిలోని రాళ్ళే.

పసరుతిత్తిలో రాళ్ళు ఏవైనప్పటికీ, ఎలాటి కారణాల వల్ల ఏర్పడినప్పటికీ వాటి లక్షణాలన్నీ ఒకటే - ఎలాటి అశ్రద్ధ చూపకుండా వెంటనే చికిత్స చేస్తే వ్యాధి తీవ్రదశకు చేరి ప్రాణాపాయం కలగడం అనేది తగ్గుతుంది.





పసరుతిత్తిలో రాళ్ళున్నప్పుడు వచ్చే జ్వరం, వాంతులు, విరేచనాలకు కడుపు నొప్పికీ, ముఖ్యంగా బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ వున్నప్పుడు ఈ క్రింది యాంటి బయాటిక్స్ వాడవచ్చు.

★ రోసిలిన్ - 125/250/500 మి.గ్రా. కాప్సుల్స్ / ఇంజక్షన్

★ యాంపిల్లిన్ - 125/250/500 మి.గ్రా. కాప్సుల్స్ / ఇంజక్షన్

★ క్యాంపిసిల్లిన్ - 125/250/500 మి.గ్రా. కాప్సుల్స్/ ఇంజక్షన్

★ బాసిపెన్ - 125/ 250/500 మి.గ్రా. కాప్సుల్స్ / ఇంజక్షన్.

★ బయోసిలిన్ - 125/250/500 మి.గ్రా. క్యాప్సుల్స్ / ఇంజక్షన్

వీటిలో ప్రతి ఆరు గంటలకు ఒకటి చొప్పున ఏదో ఒక రకం వారం లేదా పది రోజులు వాడాలి. లేదా

★ సిప్రాన్ - 250/500/750 మి.గ్రా. టాబ్లెట్లు

★ షిప్రాలెట్ - 250/50 మి.గ్రా. టాబ్లెట్లు

★ సిప్రా - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. టాబ్లెట్లు

★ అల్‌సిఫ్రా - 250 మి.గ్రా / 500 మి.గ్రా టాబ్లెట్లు

వీటిలో ఏదైనాసరే ప్రతి ఎనిమిది గంటలకు ఒకటి చొప్పున వారం రోజులు వాడాలి. లేదా

★ జెంటిసిన్ - 20/40 మి.గ్రా. ఇంజక్షన్స్

★ గ్యారామైసిన్ - 20/40/60/80 మి.గ్రా. ఇంజక్షన్స్

★ మెరిజెంటా - 20/40/60/80 మి.గ్రా. ఇంజక్షన్స్

వీటిలో ఏదైనాసరే ప్రతి ఎనిమిది గంటలకు ఒకటి చొప్పున పదిరోజుల పాటు వాడాలి.

## పచ్చకామెరలు (Jaundice)

ఆరోగ్యవంతులలో బైల్ (పసరు) ఆహారం జీర్ణం కావడానికి అంత్రమూలంలోనికి విడుదల అవుతుంది. అదే కాలేయ వ్యాధులలోను, పచ్చకామెర్ల వ్యాధిలోను బైల్ అంత్రమూలంలోనికి విడుదల కాక రక్తనాళాల ద్వారా పీల్చుకోబడి శరీరంలోని ఇతర ప్రాంతాలకు చేరుతుంది. దీనితో వారి కళ్ళు, గోళ్ళు చర్మం వంటివి పసుపు రంగులో కనబడతాయి. బైల్‌లోని వర్ణకాలు (Bile pigments) ఈ విధంగా ఆయా ప్రాంతాలలోనికి చేరడం వల్ల ఇలా కనబడుతుంది.

జాండిస్ లేదా పచ్చకామెరలు అనేక వ్యాధులలో కనిపించే లక్షణం. కాలేయ వ్యాధుల్లోను. గాల్ బ్లాడర్ జబ్బులలోను పైత్య రసనాళానికి ఇన్‌ఫెక్షన్ సోకడం వల్ల కూడా జాండిస్ రావచ్చు. ఇది మొత్తం నాలుగు రకాలుగా వుంటుంది. అవి

1. ఎకోల్యూరిక్ జాండిస్ (Acholuric Jaundice)
2. హీమోలైటిక్ జాండిస్ (Haemolytic Jaundice)
3. హెపాటోసెల్యులార్ జాండిస్ (Hepatocellular Jaundice)
4. అబ్‌స్ట్రక్టివ్ జాండీస్ (Obstructive Jaundice)

### ఎకోల్యూరిక్ జాండిస్ (Acholuric Jaundice)

కాలేయానికి సంబంధించిన జబ్బులు, పిత్తాశయానికి చెందిన జబ్బులు, పైత్య రసనాళ వ్యవస్థలో వచ్చే జబ్బులలో ఈ రకమైన జాండీస్ బయటబడుతుంది. దీనిలో యూరిన్ ద్వారా గాని, మలం ద్వారా గానీ బైల్ వెలువడదు. ఎర్రరక్త కణాలు బంతిలాగా గుండ్రంగా వుంటాయి. రక్తహీనత కలుగుతుంది. ప్లీహము (spleem) పెరుగుతుంది. ఈ జబ్బులో మూత్రము పచ్చగా వుడదు.

### హీమోలైటిక్ జాండిస్ (Haemolytic jaundice)

ఈ రకమైన కామెర్ల వ్యాధిలో ఎర్ర రక్తకణాలు విచ్ఛిన్నమవుతాయి. దానితో రక్తహీనత కలుగుతుంది.

### హెపాటోసెల్యూలార్ జాండిస్ (Hepatocellular Jaundice)

ఈ రకమైన వ్యాధి కాలేయ కణాలు నాశనమవడం వల్ల వస్తుంది. కాలేయ కణాలు వైరస్ సోకడం వల్ల, కొన్ని రకాల మందుల దుష్ప్రభావం వల్ల నాశనం అవుతాయి. అప్పుడు జాండిస్ వస్తుంది.

### అబ్‌స్ట్రక్టివ్ జాండిస్ : (Obstructive Jaundice)

ఇది పైత్య రసము పొరుదలకు అటంకము ఏర్పడుటవల్ల వస్తుంది. దీనిలో పైత్యరస నాళము వాచి, తద్వారా పైత్య రసము ప్రవహించుటకు ఆటంకం, ఏర్పడుతుంది. పైత్య రసనాళములో రాయి (stone) అడ్డుపడడం వల్ల కూడా ఈ రకమైన వ్యాధి వస్తుంది.

వీటన్నిటిలోను ముఖ్యంగా కాలేయానికి ఇన్‌ఫెక్షన్ సోకడం వల్ల వచ్చే జబ్బునే కామెర్లు అంటున్నారు. కాలేయానికి వైరస్ వల్లన వచ్చే ఇన్‌ఫెక్షన్‌లు కామెర్లకు కారణమవుతాయి. ఈ స్థితిని హెపటైటిస్ అంటారు. హెపటైటిస్‌లో కాలేయం వాపును చూపుతుంది. హెపటైటిస్‌లలో ముఖ్యంగా చిన్న పిల్లలో నియోనటల్ హెపటైటిస్ అనే జబ్బు శిశువు జన్మించిన తరువాత నాలుగు వారాలలో లోపు వస్తుంది.. ఇది శిశు మరణాలకు కారణం కావచ్చు. ఇంకా పోస్ట్‌ట్రాన్స్ ఫ్యూజన్ హెపటైటిస్ అనే రకము రక్తమార్పిడి తరువాత వస్తుంది. ఇవన్నీ పక్కన బెడితే ముఖ్యంగా వైరల్ హెపటైటిస్ అనేదే చాలా చోట్ల మనకు కనిపించేది. వైరస్‌ల హెపటైటిస్‌లో A, B, non-A, non-B మొదలైన అనేక హెపటైటిస్‌లు వైరస్ వల్లవస్తాయి.





### వైరస్ హెపటైటిస్‌లలో రకాలు

వ్యాధి కారక వైరస్‌లు కాలేయంలో చేరి వాపును కలిగిస్తాయి. దీనివల్ల కామెర్లు వస్తాయి. ఈ జబ్బును హెపటైటిస్ అంటారు. వైరస్ కణాలు కాలేయ కణాల్ని సర్వనాశనం చేస్తాయి. వైరస్‌లు అన్నింటికంటే హెపటైటిస్-B వ్యాధి వైరస్‌ల వల్ల చాలా జాగ్రత్తగా వుండాలి.

హెపటైటిస్‌లో రెండు రకాలు వున్నాయి. అవి

హెపటైటిస్ - ఎ

హెపటైటిస్ - బి

ఇవి రెండే కాక ఇంకా ఆరు రకాల హెపటైటిస్ వైరస్‌లు వ్యాధిని కలుగజేస్తాయి - అవి

1. నాన్ హెపటైటిస్ - ఎ
2. నాన్ హెపటైటిస్ - బి
3. హెపటైటిస్ - సి
4. హెపటైటిస్ - డి
5. హెపటైటిస్ - ఇ
6. హెపటైటిస్ - జి

హెపటైటిస్ - A' వైరస్ వ్యాధి వల్ల వచ్చే కామెర్ల వ్యాధినే 'జాండిస్' అని అంటారు. ఈ వ్యాధి కారక వైరస్‌లు కలుషిత ఆహారం ద్వారా, నీటి ద్వారా మన శరీరంలోనికి ప్రవేశిస్తాయి. హెపటైటిస్-A వ్యాధి వున్న వ్యక్తి మల, మూత్రాల ద్వారా వాతావరణం కలుషితమై మరొకరికి వ్యాధి వ్యాపిస్తుంది. ఇవి సంక్రమించిన క్రిములు వారం రోజులలోపు లక్షణాల్ని బహిర్గత పరుస్తాయి. వీని ప్రభావం శరీరం పైన సుమారు రెండు వారాల పాటు వుంటుంది.

వ్యాధి కారకక్రిములు నేరుగా కూడా సంక్రమించవచ్చు. అదెలాగంటే ! - హెపటైటిస్-A వ్యాధి వున్న రోగినిగాని మీరు దగ్గరకు తీసుకుంటే లేక వారికి పరిచర్యలు చేస్తే ఆ తరువాత మీరు మీ చేతుల్ని శుభ్రపరచుకోకుండా వుంటే వ్యాధి నేరుగా మీకు సోకవచ్చు. మనదేశంలో సుమారు 90 శాతం కామెర్ల వ్యాధి ఈ హెపటైటిస్-A వ్యాధి బాధితులే. వీరిలో కూడా 90 శాతం మంది పిల్లలు వుంటారు. అందుచేతనే దీనిని పిల్లలకు వచ్చే కామెర్ల వ్యాధిగా కూడా పరిగణించవచ్చు. ఒకసారి వ్యాధి సోకిన పిల్లలలో మరలా వ్యాధి రాకపోవచ్చు లేదా మరొకసారి వ్యాధి వచ్చినా మొదటి సారి వచ్చినంత తీవ్రంగా వుండకపోవచ్చు.

హెపటైటిస్-A వ్యాధిని ఒకొక్కసారి ప్రయాణాలలో వచ్చే జబ్బుగా కూడా భావించవచ్చు. ప్రయాణాలలో ఎక్కడబడితే అక్కడ ఆహార పదార్థాల్ని కొనుక్కుని తినడం వల్ల హెపటైటిస్ వ్యాధి సోకే ప్రమాదం వుంది.

## హెపటైటిస్-A లో తీసుకోవలసిన జాగ్రత్తలు

- ★ ఇది ఎక్కువగా కనిపించే ప్రాంతాలలో పారిశుధ్యం సరిగ్గా జరిగేట్లు చూడడం ముఖ్యమైన విషయం.
- ★ Ig (ఇమ్యూనోగ్లోబ్యులిన్‌లను) వాడడం వల్ల రోగి యొక్క రోగనిరోధక శక్తి పెరుగుతుంది. రోగికి వైరస్‌లను ఎదుర్కొనే శక్తి కలుగుతుంది. ఇమ్యూనో గ్లోబ్యూలిన్‌లు హెపటైటిస్-A వైరస్ యొక్క ఏంటి బాడీలను కలిగి వుంటాయి.
- ★ ఇమ్యునో గ్లోబ్యులిన్‌లు తాత్కాలికంగా మనల్ని వ్యాధి నుండి కాపాడ గలుగుతాయి, ఆ తరువాత మనకు స్వయంగా రోగ క్రిముల్ని ఎదుర్కొనే శక్తి వస్తుంది. ఇవి మన శరీరంలో ప్రవేశించాక మూడు నుండి ఐదు నెలల పాటు పని చేస్తాయి. ఈలోపు హెపటైటిస్-A వైరస్‌ల ప్రభావతం తగ్గిపోతుంది.
- ★ హెపటైటిస్-A రాకుండా వ్యాధి నిరోధక టీకాలు కూడా వున్నాయి. దీనివల్ల రోగికి దీర్ఘకాలపు రక్షణ లభిస్తుంది. ఒకసారి చేస్తే వ్యాధి రాదన్న గ్యారంటీ లేదు. సంవత్సరంలో మళ్ళీమళ్ళీ చేస్తే ఉపయోగం వుంటుంది. ఏడాదికి కనీసం రెండు సార్లయినా టీకాలు ఇవ్వాలి.
- ★ వ్యాధి నిరోధక టీకాలు వేయించుకున్నవారిలో రియాక్షన్ వచ్చే ప్రమాదం కూడా వుంది. అయితే ఇది చాలా అరుదుగా వుంటుంది.

## హెపటైటిస్-B

ఇది చాలా ప్రమాదకరమైన వైరస్ వ్యాధి. ఇది అతివేగంగా వ్యాప్తి చెందగలదు. హెపటైటిస్-B వ్యాధి వున్న వారిలో అందరికీ ఒకేరకమైన లక్షణాలు కనబడవు. కొందరిలో ఈ వైరస్ ఏ విధమైన లక్షణాలు కనిపించవు కూడా. అయితే వ్యాధి లక్షణాలు కనిపించక పోయిన వీరు వ్యాధిని వ్యాప్తి చేయగలరు. వీరిని కారియర్స్ (Carriers) అంటారు. హెపటైటిస్-B వ్యాధి వున్నవారిలో ఈ క్రింది లక్షణాలు కలిగి వుంటారు.

- ★ జ్వరంగా వుండడం
- ★ వళ్ళు నొప్పులు, కళ్లు పచ్చగా మారడం
- ★ మూత్రం పచ్చగా రావడం, మలం తెల్లగా బంకమన్నువలె వుండడం (ఇవన్నీ సాధారణ హెపటైటిస్ (కామెర్లు)లో కనిపించే లక్షణాలే!)
- ★ జీర్ణక్రియ సరిగ్గా వుండకపోవడం
- ★ కాలేయం దెబ్బ తినడంతో రోగి ప్రాణాలకు ప్రమాదం కలగడం
- ★ రోగిలో వుండే సహజ సిద్ధమైన రోగ నిరోధక శక్తి నశించి పోవడం





- ★ రోగికి ఇతర వ్యాధులు సంక్రమించడం
- ★ హెపటైటిస్-B వైరస్ సోకినవారిలో మూడింట రెండొంతుల మందిలో కొద్దిపాటి అనారోగ్యం మాత్రమే కనిపిస్తుంది. ఒకసారి హెపటైటిస్-B. ఏంటీబాడీలు తయారైతే వారిలో అనారోగ్యం పూర్తిగా నయం అవుతుంది. చాలా కొద్ది మందిలో మాత్రమే వ్యాధిలో తీవ్రపరిమాణాలు సంభవిస్తాయి.
- ★ తరుణ హెపటైటిస్-B వ్యాధి (Acute Hepatitis-B) హెపటైటిస్-B వ్యాధి సోకిన రోగుల్లో నాలుగోవంతు మందికి ఈ తరుణ వ్యాధి సోకే ప్రమాదం వుంది. వీరిలోను వ్యాధి లక్షణాలు బయటపడడానికి ఆరు నెలలకు పైగాపట్టవచ్చు. వంటిపైన చిన్న పొక్కులు రావడం, కీళ్ళనొప్పులు మూత్ర పిండాలలోనొప్పి, రక్తనాళాలలో మంట ఈ వ్యాధిలో ముఖ్యలక్షణాలు.
- ★ తరుణ హెపటైటిస్ వ్యాధిలో ఎముక మజ్జలో వైరస్ చూపే ప్రభావం వల్ల రక్తహీనత కలుగుతుంది. చాలామంది తరుణ హెపటైటిస్ వ్యాధిగ్రస్తులు ఆరునెలల్లో పూర్తిగా కోలుకుంటారు. మిగిలిన వారిలో ఒకటి నుండి ఐదు శాతం మందిలో వ్యాధి తీవ్ర రూపం దాల్చి మరణం సంభవించవచ్చు.
- ★ నూటికి పది మందిలో ఏ రకమైన లక్షణాలు కనబడని హెపటైటిస్-B వ్యాధి గ్రస్తులు వుంటారు. వీరి శరీరంలో రక్తాన్ని పరీక్షిస్తే హెపటైటిస్ వైరస్ అంత స్పష్టంగా కనబడదు. అయితే వీరికి ఎలటి ఇబ్బందీ లేకపోయినా వీరు వ్యాధిని ఇతరులకు అందజేయగలరు. వీరు వాడిన బ్లేడు మరొకరు వాడిన వీరు ఇతరులకు రక్తదానం చేసినా, లేక వీరు లైంగిక కలయిక జరిపినా ఇతరులకు వ్యాధి వస్తుంది. వీరు వీటికి దూరంగా వుండి చికిత్స చేయించుకుంటే వ్యాధిని వ్యాప్తి చేయకుండా వుంటారు.
- ★ ఏ లక్షణాలు కనపడని హెపటైటిస్-B వ్యాధి గ్రస్తులలో వైరస్ స్పష్టంగా కనపడక పోయినా కొన్ని ప్రత్యేక పరీక్షలు చేస్తే వైరస్‌లు కనబడవచ్చు. వీరు గనుక వ్యాధిని అశ్రద్ధ చేస్తే వైరస్‌లు విపరీతంగా పెరిగిపోయి మరణానికి దారితీసే ప్రమాదం కలగవచ్చు. లక్షణాలు ఒక్కసారిగా బయటపడవచ్చు.
- ★ హెపటైటిస్-B వ్యాధి వున్న వారిలో కాలేయం పుండు పడడం (Cirrhosis of Liver). ఒక్కోసారి కాలేయపు కేన్సర్ రావడం జరగవచ్చు. దీనికి తగిన చికిత్స చేయించుకోవాలి. అవసరం అయితే ఆపరేషన్ కూడా చేయించుకోవాల్సి వుంటుంది.
- ★ దీర్ఘతర హెపటైటిస్ (Chronic hepatitis) 90 నుండి 95 శాతం మందిలోను అప్పుడే పుట్టిన శిశువులలో తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. హెపటైటిస్-B వ్యాధి తీవ్రత చిన్న పిల్లల్లో కంటే పెద్దవారిలో అధికంగా వుంటుంది.

## హెపటైటిస్-C

- ★ ఇది కూడా హెపటైటిస్-బి వ్యాధి వలె ఒకరు వాడిన బ్లేడులు, సూదులవలన, రక్త మార్పిడి వలన, లైంగిక కలయిక వలన వ్యాపిస్తుంది.
- ★ పైగా ఇది సోకిన స్త్రీ గనుక గర్భిణీ అయితే అమెకు పుట్టబోయే శిశువుకు కూడా ఈ వ్యాధి సోకుతుంది.
- ★ తరుణ హెపటైటిస్ వ్యాధి ఒక్కోసారి హెపటైటిస్-సి కావచ్చు.
- ★ ఇది మందకొడిగా వుండే జబ్బు. హెపటైటిస్-సి వ్యాధి సోకిన వారిలో 50 నుండి 70 శాతం మందికి వ్యాధి తరుణ స్థాయి నుండి దీర్ఘ తరహా వ్యాధిగా మారవచ్చు.
- ★ ఈ వ్యాధి క్రిములు శరీరంలో ప్రవేశించిన తరువాత దాదాపు పదిహేను లేక పాతిక సంవత్సరాల లోపు ఎప్పుడైనా వ్యాధి లక్షణాలు బయటపడవచ్చు.
- ★ ఈ వ్యాధిలో కాలేయం పుండుపడే ప్రమాదం వుంది.
- ★ ఈ వ్యాధి కూడాహెపటైటిస్-బి వలె ఎలాంటి లక్షణాలు బహిర్గత పరచక వ్యాప్తి చెందగలదు
- ★ హెపటైటిస్-సి లో దీర్ఘతరహా వ్యాధి గనుక సోకితే లివర్ క్యాన్సర్ వస్తుంది. ఇది బయట పడడానికి సుమారు పాతిక సంవత్సరాలు పడుతుంది.
- ★ హెపటైటిస్-సి వ్యాధి క్రిములు ప్రవేశించిన తరువాత - వ్యాధి లక్షణాలు బహిర్గత మయ్యాక, రోగిలో యాంటిబాడీస్ తయారు కావడానికి సుమారు నెల రోజుల నుండి ఆరు నెలల సమయం పడుతుంది.
- ★ హెపటైటిస్-సి వ్యాధిలో కూడా మిగిలిన లక్షణాలన్నీ హెపటైటిస్-బి మాదిరిగానే వుంటాయి.

## హెపటైటిస్-D

- ★ ఈ వైరస్ సర్వసాధారణంగా హెపటైటిస్-B తో పాటే వుంటుంది. అంటే ఈ రెండు కలిసి ఒకే వ్యక్తిలో కనబడవచ్చు.
- ★ హెపటైటిస్-D వైరస్లకు రక్తపరీక్ష ద్వారా మాత్రమే గుర్తించవచ్చు. రక్తంలో హెపటైటిస్-D యాంటీబాడీలను కనుగొనడంతో హెపటైటిస్-D వైరస్ ఉన్నట్లు తెలుస్తుంది.
- ★ B-వైరస్కు ఈ D వైరస్తోడైతే చివరకు హెపటైటిస్-B వ్యాధి తీవ్రరూపం దాల్చి వ్యక్తి మరణానికి కారణమవుతుంది.
- ★ హెపటైటిస్-D వైరస్కు ప్రత్యేకించి వ్యాధి లక్షణాలు ఏవీ ఉండవు. అన్నీ హెపటైటిస్-B లక్షణాలే వుంటాయి.
- ★ హెపటైటిస్-B వ్యాధికి టీకా గనుక వాడితే అదిహెపటైటిస్-D వైరస్ పైన కూడా పని చేస్తుంది.





## హెపటైటిస్-E

- ★ ఈ రకమైన వైరస్ కూడా హెపటైటిస్-Aమాదిరి లక్షణాలచే చూపుతుంది.
- ★ హెపటైటిస్-E వ్యాధి కూడా 'A' వైరస్ లాగానే వ్యాపిస్తుంది కూడా. ఈ వ్యాధి ఏకకాలంలో అనేకమందికి (Epidemic) వస్తుంది. ఒకే ప్రాంతంలో చాలామందిలో కామెర్లు వున్నాయంటే హెపటైటీస్-C వున్నట్లు భావించాలి.
- ★ హెపటైటిస్-A వ్యాధికి, హెపటైటిస్-E వ్యాధికి మధ్య తేడాను గుర్తించడం మామూలుగా కష్టము. లాబరేటరీ పరీక్షల వల్ల అయితేనే గుర్తించవచ్చు.
- ★ వంట్లో అనీజీగా అనిపించడం
- ★ ఆకలి వుండకపోవడం
- ★ కడుపులో నొప్పి రావడం
- ★ కీళ్ళ మధ్యన నొప్పి రావడం, జ్వరం రావడం. ఇలాటి లక్షణాలన్నీ దీనిలో వుంటాయి.
- ★ హెపటైటిస్-E వ్యాధి లక్షణాలు వ్యాధి కారక క్రిములు మన శరీరంలో ప్రవేశించిన తరువాత రెండు నుండి తొమ్మిది వారాల తరువాత మాత్రమే బహిర్గతమవుతాయి.
- ★ వ్యాధికారక క్రిములు గర్భిణీ స్త్రీకి గనుక సోకితే చాలా ప్రమాదం. ముఖ్యంగా గర్భిణీ స్త్రీకి తొమ్మిదవ నెలలో ఈ వ్యాధి సోకితే తల్లికి, బిడ్డకు కూడా చాలా ప్రమాదం కలుగుతుంది. చివరకు మరణం కూడా సంభవిస్తుంది. వ్యాధి వల్ల ఇరువురు లేదా బిడ్డ మాత్రమే చనిపోవచ్చు.
- ★ సర్వసాధారణంగా హెపటైటిస్-E వ్యాధి సోకిన ప్రజలలో అందరూ కోలుకుంటారు. వ్యాధి నుండి కోలుకోవడానికి సుమారు రెండు వారాల సమయం పడుతుంది.
- ★ హెపటైటిస్-A వ్యాధి క్రిములు మన శరీరంలో ప్రవేశించాక వారం రోజులలోపునే లక్షణాలు బయటబడతాయి.
- ★ హెపటైటిస్-A వ్యాధికి టీకా వేయించుకుంటే అది హెపటైటిస్-Eకు కూడా పనిచేస్తుంది.

## హెపటైటిస్-చికిత్స

హెపటైటిస్ వ్యాధి కారకం ఏ రకమైన వైరస్ అయినప్పటికీ చికిత్సా విధానం ఇంచుమించు అన్ని రకాలకు ఒకే విధంగా వుంటుంది.

ముఖ్యంగా హెపటైటిస్ వ్యాధిని గుర్తించాలి. దీనికి Hbs Ag అనే రక్త పరీక్ష, మూత్రం, స్వేదం వంటి పరీక్షలను చేసి నిర్ధారించనచ్చు

వ్యాధి రాకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవడమే ముఖ్యమైన చికిత్స. అయితే ఏ కారణం చేతనైనా వ్యాధి వస్తే మాత్రం ప్రత్యేక వైద్యం ఏమీ ఇంతవరకు లేదు. ఆరు నెలల్లో పూర్తి ఆరోగ్యవంతులయ్యే అవకాశం వుంది.

★ వ్యాధి రాకుండా వ్యాక్సిన్ ఇవ్వవచ్చు.

★ హెపటైటిస్-B వ్యాక్సిన్‌లను నిర్ణీతకాల వ్యవధిలో మూడుసార్లు తీసుకోవాల్సి వుంది. పూర్తి రక్షణ కావాలంటే మాత్రం మూడు డోసులు తప్పనిసరిగా తీసుకోవాలి. ఐదు సంవత్సరాల తరువాత బూస్టర్ డోసు తీసుకోవాలి. డోసు '20' మైక్రో గ్రాములు చొప్పున, 0, 1, 2, 12 నెలల్లో తీసుకోవాలి.

★ మన దేశంలో హెపటైటిస్ వ్యాక్సిన్‌లు రెండు రకాలవి దొరుకుతున్నాయి. అవి

1. జెనిటిక్ ఇంజనీరింగ్ ప్రక్రియ ద్వారా తయారు చేసిన రీకాంబినెంట్ వ్యాక్సిన్ : ఇది కృత్రిమంగా తయారైనది. 'శాన్‌వాక్ - బి.హెపటైటిస్' - ఇది మన దేశంలో జెనిటిక్ ఇంజనీరింగ్ ద్వారా ఈస్ట్ నుండి తయారైనది.

2. ప్లాస్మా నుండి తయారైన వ్యాక్సిన్ : ఇదీ పూర్తి ప్రమాద రహితమైనదే - కానీ ఇది రక్తం నుండి తయారైనది. అందుచేతనే దీనికంటే జెనిటిక్ ఇంజనీరింగ్ పద్ధతిలో తయారైన రీకాంబినెంట్ వ్యాక్సిన్ మాత్రమే అందరూ ఆమోదిస్తున్నారు.

★ వ్యాధి వచ్చాక కూడా - ఇంటర్‌ఫెరాన్, రోఫిరాన్, రిబావిరిన్ వంటి మందులు వాడవచ్చు. కానీ ఇవి చాలా ఖరీదైనవి.

★ వ్యాధి రాకుండా జాగ్రత్తపడడం ఒక్కటే సరైన పద్ధతి.

## కాలేయనిష్క్రియత్వం (Liver Failure)

కాలేయంలో వుండే కణాలు త్వరగా కుళ్ళిపోతూ వుంటాయి. దీనితో అది పని చేయకుండా పోతుంది. ఈ విధంగా అప్పుడప్పుడు జరుగుతుంది. ఈ రకంగా తరుచూ జరిగితే దానిని పర్మినెంట్ హెపాటిక్ ఫెయిల్యూర్ అని అంటారు.

లివర్ ఫెయిల్యూర్ అవడానికి కారణం. ఏదైనా వైరల్ ఇన్‌ఫెక్షన్‌గాని, లేక బ్యాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్‌గాని లేక కాలేయ ప్రాంతానికి గాయం అవడం వల్ల గాని, పచ్చకామెర్లు వ్యాధి రావడం వల్లగాని ఈ రకమైన పరిస్థితి కలుగుతుంది.

పచ్చకామెర్ల వ్యాధి రావడం అది త్వరితంగా పెరగడం, అపస్మారక స్థితి ఏర్పడడం, కామెర్లలో రక్తపువాంతి కలగడం, లివర్ ఫెయిల్యూర్ కావడం వల్ల మెదడు పని చేయక కోమాలోనికి వెళ్ళడం ఇవన్నీ కాలేయం పని చేయక పోవడంలో వచ్చే లక్షణాలు.





కామెర్ల వ్యాధులలో, కొన్ని రకాల మందుల దుష్ప్రభావం వల్ల కూడా కాలేయం పని చేయకపోవచ్చు. గర్భిణీస్త్రీలలోలివర్ వ్యాధి గ్రస్తం అవడం వల్ల చాలా ప్రమాదం కలుగుతుంది.

### నిర్ధారణ

వ్యాధి నిర్ధారణ కొరకు రక్త పరీక్ష, మూత్ర పరీక్ష వంటివి చేయిస్తే నిర్ధారణ చేయవచ్చు.

### చికిత్స

★ ముందుగా నరానికి సెలైన్ పెట్టాలి.

★ ఆహారంలో ప్రొటీన్లు లేదా మాంసకృత్తులు లేకుండా చూడడం, పళ్ళరసాలు, కొబ్బరి నీళ్ళు, వెజిటబుల్ సూప్స్ ఇవ్వడం చేయాలి.

★ జీర్ణాశయం, పేగులు క్లీన్ అవడానికై ఎప్సమ్ సాల్ట్ ఇచ్చి క్లీన్ చేయాలి.

★ నియోమైసిన్ - 1 గ్రా కాప్సూల్ పూటకు ఒకటి చొప్పున రోజుకు నాలుగు వాడాలి.

★ లాక్ట్యులోజ్ - 5 మి.లీ చొప్పున రోజుకు మూడు సార్లు ఇవ్వాలి.

★ లివర్ ఫెయిల్యూర్‌లో పొటాషియం, కాల్షియంలు వంట్లో తగ్గిపోతాయి. కాబట్టి పొటాషియం, కాల్షియం ఇంజక్షన్స్ ఇవ్వాలి.

★ మెదడుకు నీరు చేరి కోమా వస్తే లేదా అలా వచ్చిందనిగాని అనుమానం వస్తే - మేనిటాల్ 5% ఇంజక్షన్ నరానికి ఇవ్వాలి.

★ గుండె, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు సరిగ్గా పనిచేయకపోతే దానికి తగిన చికిత్స జరపాలి. లివర్ ఫెయిల్యూర్ అనేది ప్రమాదకరమైన పరిస్థితి కాబట్టి హాస్పటల్‌లో వుంచి చికిత్స చేయాల్సి వుంటుంది. సకాలంలో చికిత్స చేయకపోతే ప్రాణాపాయం కలగవచ్చు.

## కాలేయం గట్టిపడడం (Cirrhosis of Liver)

ఏ కారణం చేతనైనా సరే కాలేయం గట్టిపడి తన జీవన ప్రక్రియలను నిర్వర్తించలేక పోతే దానిని సిర్రోసిస్ ఆఫ్ లివర్ అంటారు.

### లక్షణాలు

★ కాలేయంలోని రకాలు మందుల దుష్ప్రభావం వల్ల గట్టిపడి పోవచ్చు.

★ కాలేయంలో పసరు (బైల్) నిలువవుండి పోవడంవల్ల.

★ కాలేయ కణాలు మద్యపానం వల్ల పాడైపోయి కుచించుకుని పోవడం వల్లగాని.

★ వైరల్ హెపటైటిస్ గాని లేక చిన్న వయసులో ఏదైనా కాలేయ వ్యాధులు రావడం వల్లగాని కాలేయం గట్టిపడే అవకాశం వుంది.

★ కాళ్ళకు నీరు చేరడంతో వాపు చూపుతాయి.

★ జీర్ణాశయంలో కొందరికి రక్తస్రావం జరగడం వుంటుంది.

★ ఆకలి ఉండదు. అలాగే అరుగుడలకూడా ఉండదు.

★ సెక్స్‌కోరిక తగ్గిపోతుంది.

★ కాలేయం గట్టిపడడం ఒకొక్కసారి ప్రాణాపాయానికి దారి తీయవచ్చు. వీరిలో రక్తపు వాంతి కావడం, రక్తపు విరేచనం రావడం వుంటాయి.

★ వ్యాధిని అశ్రద్ధ చేసినట్లయితే కేన్సర్‌కు కూడా దారి తీయవచ్చు.

**చికిత్స**

★ నరానికి సెలైన్ ఎక్కించాలి.

★ ఆహారంలో ఉప్పు తగ్గించాలి. పాలు, గుడ్లు, మాంసం వంటివి ఎక్కువగా తీసుకోవాలి.

★ వ్యాధికి మూల కారణమేమిటో కనుక్కుని చికిత్స చేయాలి.

★ వ్యాధి ముదిరిపోతే లివర్ మార్పిడి శస్త్రచికిత్స ఒక్కటే మార్గము.

★ నైసోలిన్ 10 మి.గ్రా. - టాబ్లెట్లు రోజుకు ఒకటి చొప్పున కొన్ని నెలల పాటు వాడాలి.

★ ఈ వ్యాధిలో రక్తహీనత వుంటుంది. కాబట్టి దానిని సరిచేసేందుకు ఐరన్ కాప్సుల్స్ వాడాలి.

★ కాళ్ళకు చేతులకు పొట్టకు నీరు చేరుతుంది. కాబట్టి దాన్ని తగ్గించేందుకు స్పైరకోలాక్టోస్ టాబ్లెట్స్ రోజూ మూడు పూటలా ఒకొక్కటి వాడాలి.

★ లివ్ '52' టానిక్ రోజుకు మూడు మోతాదులుగా అరు నెలల పాటు వాడాలి. మాత్రలైతే రెండు చొప్పున మొత్తం రోజుకు ఆరు చొప్పున దీర్ఘకాలం వాడాల్సి వుంటుంది.

## హెపాటోమెగాలి (కాలేయం పెరగడం)

కాలేయం ఉబ్బడాన్ని హెపాటోమెగాలి అంటారు. కొన్ని రకాల జబ్బుల్లో కాలేయం వుండవలసిన సైజు కంటే పెద్దగా మారుతుంది.

**కారణాలు**

★ కాలేయం పెరగడం వైరల్ స్పైరోకీటల్‌గాగానీ,

★ ప్రొటోజోవల్ పేరసైటిక్ వల్లగాని

★ బాక్టీరియాల వల్లగాని

★ ఫంగల్ ఇన్‌ఫెక్షన్‌వల్ల గాని లివర్ పెరుగుతుంది.





★ వైరల్ హెపటైటిస్, సిఫిలిస్, టైఫాయిడ్, ట్యూబర్క్యులోసిస్, ఎమీబియాసిస్, మలేరియా వంటి వ్యాధులలో కూడా లివర్ సైజు పెరిగేందుకు అవకాశం వుంది.

★ కొన్ని రకాల మందులు వాడడం వల్ల కూడా లివర్ పెరగవచ్చు. ఉదాహరణకు : ఆర్సెనిక్, మిథైల్ టెస్టోస్టిరాన్, కార్బన్ టెట్రాక్లోరైడ్ (C.T.C), సల్ఫోనమైడ్స్ వంటివి వాడడం వల్ల లివర్ పెరగవచ్చు.

★ ఒకొక్కసారి కాలేయ కణాల మధ్య కొవ్వు కణాలు చేరి కాలేయం వాపు రావచ్చు.

★ గుండె జబ్బులలో (హార్ట్ ఫెయిల్యూర్ వంటివి), పోర్టల్ హైపర్‌టెన్షన్, కన్‌స్ట్రక్టివ్ పెరికార్డైటిస్ (గుండె పై నున్న పొర దళసరిగా మారి గుండెను కుంచింపజేసే జబ్బు)లోను కాలేయం ఉబ్బి పెద్దదిగా మారవచ్చు

★ కాలేయంలో పుళ్ళు వున్నా, కేన్సర్ కంతులు వున్నా కూడా కాలేయం ఉబ్బి పెద్దది కావచ్చు.

★ ఇంకా గ్లైకోజన్ స్టోరేజ్ డీసీజ్, లివర్ యాబ్సెస్, హైడాటికొసిస్ట్ (నీరుకోశం), సికిల్‌సెల్ అనీమియా, బ్లడ్‌కేన్సర్ వంటి జబ్బులలో కూడా హెపాటోమెగాలి వ్యాధి రావచ్చు.

**చికిత్స**

★ వ్యాధి రావడానికి మూలకారణాన్ని ముందుగా కనుగొని దానికి తగిన చికిత్స చేస్తే ఈ వ్యాధి కూడా దానంతట అదే తగ్గుతుంది.

★ ఈ వ్యాధికి మందులు గాని ఇతర చికిత్స పద్ధతి అంతా కామెర్ల వ్యాధిలో వాడినట్లుగా వాడుకోవచ్చు. ఈ వ్యాధిలో బయటబడే లక్షణాలు కూడా కామెర్ల మాదిరిగానే కనిపిస్తాయి.

కాలేయం మన శరీరంలో ఉన్న అతిపెద్ద గ్రంధి. సాధారణంగా దీనికి సంబంధించిన వ్యాధులన్నీ మనం మందులు వాడినా వాడకపోయినా వాటంతట అవే తగ్గించుకునే శక్తి దీనికి వుంది. అంతే గాదు మన కాలేయంలో పుండు పడి ఆపరేషన్ చేసి ఆ భాగాన్ని తీసివేసినా మరలా కొన్నాళ్ళకు కాలేయం మళ్ళా యథా ప్రకారం తన పూర్వరూపాన్ని సంతరించు కుంటుంది. కాలేయ వ్యాధులలో మనం చేయగలిగేది ఏదైనా వుంటే అది కాలేయానికి శ్రమ కలిగించక పోవడమే.

## కలరా (Cholera)

ఇది కలుషితమైన ఆహారం తీసుకోవడం వల్ల వస్తుంది. ముఖ్యంగా ఈగలు వాలిన పదార్థాలు తినడం వల్ల వస్తుంది. కలరా వ్యాధికి మూలకారణం 'విబ్రియో కలరే' అనే బాక్టీరియా. దీని వ్యాప్తి ఈగల ద్వారా జరుగుతుంది.

పూర్వం ఒక ఊరిలో కలరా వచ్చిందంటే ఆ ఊళ్ళో చాలామందికి ఆ వ్యాధి వచ్చేది. దానికి కారణం వారు పరిసరాల పరిశుభ్రత పాటించకపోవడమే. ముఖ్యంగా తిరునాళ్ళలోను, పుష్కరాలు, సంతలు, పెళ్ళిళ్ళలోను వంటకాలలో, తినుబండారాలపైన ఈగలు వాలడం సహజం - ఇలాటి ఆహారం తినడంవల్ల వారందరికీ కలరా సోకేది. అందుకే దీనిని ఎపిడెమిక్ డిసీజ్‌గా గుర్తిస్తారు.

కలరావ్యాధి కారక బాక్టీరియాలు మన శరీరంలో ప్రవేశించిన కొద్ది గంటలలోనే వీటి సంఖ్య విపరీతంగా పెరిగి పోతుంది. జబ్బు వెంటనేగాని లేక నాలుగు లేక ఐదు రోజులలో ఎప్పుడైనా బయటబడవచ్చు.

**లక్షణాలు**

- ★ అకస్మాత్తుగా నీళ్ళ విరేచనాలు అవుతాయి. నీళ్ళ విరేచనాలు మొదట పసుపు రంగులో వుంటాయి. ఆ తరువాత ఏ రంగూ లేకుండా నీళ్ళ వలె, చివరకు బియ్యం కడుగు నీళ్ళ మాదిరిగా గంజిలాగా వుంటాయి.
- ★ విరేచనాలతో పాటు వాంతులు కూడా విపరీతంగా అవుతూ వుంటాయి.
- ★ విరేచనాలు మాటిమాటికీ అవుతూ వుండడం వల్ల మనిషి నీరసపడిపోతాడు.
- ★ విరేచనాలలో కొద్దిపాటి జిగురు వుంటుంది.
- ★ రోగి ప్రయత్నం ఏమీ లేకుండానే వాంతులు, విరేచనాలు అవుతూ వుంటాయి. తత్ఫలితంగా రోగి శరీరం తీవ్రంగా డీహైడ్రేషన్‌కు గురవుతుంది.
- ★ రోగికి మూత్రం సరిగా రాదు. అసలు తయారు కాక పోవచ్చు.
- ★ రోగి తీవ్రమైన నీరసంలో పడిపోయి సరైన వైద్యం అందకపోతే ప్రాణాపాయం కలగవచ్చు.
- ★ చిన్న పిల్లలలో కలరా వ్యాధి తీవ్ర పరిణామాల్ని కలిగిస్తుంది.
- ★ రోగి కండరాలు పట్టేసినట్లు అయిపోయి (Cramps) తీవ్రంగా సలుపుతూ వుంటాయి.
- ★ రోగి అపస్మారక స్థితిలోనికి వెళ్ళడం, వళ్ళంతా చల్లబడడం, నీరంతా ఇంకిపోయి నాడి అందక పోవడంతో చివరకు ప్రాణాపాయం కూడా సంభవించవచ్చు.
- ★ ముఖ్యంగా విరేచనం రంగు మొదట్లో పసుపు రంగులోను ఆ తరువాత బియ్యపు కడుగు నీళ్ళ వంటి విరేచనాలు దుర్వాసనతో వస్తే దానిని కలరాగా గుర్తించవచ్చు.

**నిర్ధారణ**

కలరా వ్యాధిని నిర్ధారించుకోవడానికి విరేచనాన్ని కల్చర్ చేయించి - లాబరేటరీలో టెస్ట్ చేయిస్తే మైక్రోస్కోపులో బాక్టీరియా క్రిములు స్పష్టంగా కనబడతాయి.

**చికిత్స**

కలరా వ్యాధికి చికిత్సలో అతిసార వ్యాధికి తీసుకునే జాగ్రత్తలు అన్ని తీసుకోవాలి. ఎందుచేతనంటే ఇది అతిసార వ్యాధి కన్నా ప్రమాదకరమైనది. కాబట్టి జాగ్రత్త అవసరం.

కలరా వచ్చిన వ్యక్తులను దూరంగా వుంచాలి. రోగి వాంతి చేసుకున్నా, విరేచనానికి వెళ్ళినా దాన్ని పూడ్చి వేయడమో లేదా కాల్చడమో చేయాలి. అంతేగాక రోగికి ఆహారం ఇచ్చే పాత్రలను, నీళ్ళు త్రాగించే పాత్రల్ని కూడా ఉడికించకుండా ఇతరులు వాడరాదు.





రోగి దుస్తుల్ని ఫినాయిల్‌తో శుభ్రపరచాలి. అంతేగాక రోగి వున్న గది ప్రాంతంలోని నేలను కూడా ఫినాయిల్‌తో కడగాలి. రోగికి పరిచర్యలు చేసేవారు కూడా తమ చేతుల్ని డెట్టాల్‌తోను లేక 1% క్రిసాల్ లేక ఫినాయిల్‌తో కడుక్కుని ఆ తరువాత కార్బోనిక్ సోపుతో చేతులు శుభ్రపరచు కోవాలి.

కలరా వచ్చిన వారిలో డీ హైడ్రేషన్ ఒక మోస్తరుగా వుంటే ముందు ORS ద్రావణాన్ని పట్టించాలి. లేదా మరగించి చల్లార్చిన నీటిలో కాస్తంత పంచదార, చిటికెడు ఉప్పువేసి త్రాగించాలి. డీహైడ్రేషన్ తీవ్రంగా వుంటే సెలైన్ ఎక్కించాలి. వీరికి రింగర్ లాక్టేట్ సీసాలు కూడా ఇవ్వాల్సి వుంటుంది.

- ★ టెట్రాసైక్లిన్ - 250 మి.గ్రా. గొట్టాలు
- ★ సుబ్బామైసిన్ - 250 మి.గ్రా. గొట్టాలు
- ★ టెట్రాడాక్స్ - 100 మి.గ్రా. మాత్రలు
- ★ డాక్సిక్లిన్ - 100 మి.గ్రా. మాత్రలు
- ★ డాక్సి-1 - 100 మి.గ్రా. మాత్రలు
- ★ బయోడాక్సి - 100 మి.గ్రా. మాత్రలు

వీటిలో దేనినైనా సరే మొదట రెండు మాత్రలు లేదా రెండు గొట్టాలుగాని ఒకేసారి మింగాలి. ఆ తరువాత ప్రతి పన్నెండు గంటలకు గాని ఎనిమిది గంటలకు గాని వ్యాధి తీవ్రత తగ్గే వరకు మూడు రోజులు లేక ఐదు రోజులపాటు వాడాలి.

- ★ బాక్ట్రిం - డి.యస్ - టాబ్లెట్లు
- ★ స్టాన్ - డి.యస్ - టాబ్లెట్లు

వీటిని ప్రతిరోజు ఉదయం ఒకటి సాయంత్ర ఒకటి చొప్పున ఐదు రోజులు వాడాలి.

- ★ ఫ్యుడోన్ - 100 మి.గ్రా. టాబ్లెట్లు లేక
- ★ పురాక్సోన్ - టాబ్లెట్లు

వీటిని విరేచనాలను అరికట్టేందుకు మూడుపూటలా ఒక్కొక్కటి చొప్పున వాడాలి.

## కడుపులో పురుగులు

చిన్న పిల్లలు మట్టిలో ఆడుకోవడం - ఆ తరువాత చేతులు సరిగ్గా కడుక్కోకుండా ఏదైనా తింటే మట్టిలో వుండే సూక్ష్మాతి సూక్ష్మమైన పురుగుల గ్రుడ్లు ఆ మట్టి ద్వారా నేరుగా వారి శరీరంలోనికి ప్రవేశిస్తాయి.

అలాగే బియ్యం ఏరుకునే ఆడవారు అందులో ఉండే మట్టి బెడ్డలను ఏరి నోట్లో వేసుకోవడం చూస్తూ వుంటాం దాని వల్ల కూడా వారి వంట్లోకి నులి పురుగులు గ్రుడ్లు ప్రవేశిస్తాయి.

కొందరు పిల్లలు సుద్ద ముక్కలు, బలపాలు, మట్టి తింటూ వుంటారు. అందుకు కారణం వారి పొట్టలో పురుగులు వుండడమే !

ఈగల ద్వారా కూడా పురుగుల గ్రుడ్లు ఆహార పదార్థాల పైకి చేరి మన శరీరంలోనికి ప్రవేశిస్తాయి. త్రాగేనీరు కూడా డ్రైనేజి ద్వారా కలుషితమైతే పురుగుల గ్రుడ్లు మన శరీరంలోనికి ప్రవేశిస్తాయి.

మన కడుపులో ప్రవేశించే ఈ పురుగులలో అనేక రకాలు వున్నాయి. అవి :

నులి పురుగులు, కొంకి పురుగులు, కొరడా పాములు, బద్దె పురుగులు, ఏలిక పాములు, దారపు పురుగులు, నీరు గడ్డ పురుగులు మొదలైనవి వున్నాయి.

## నులిపురుగులు

నులి పురుగులు సన్నగా, తెల్లగా, దారపు పోగుల మాదిరిగా వుండి - మన శరీరంలో ప్రేగులలో నివాసం వుంటుంది. ఎంటిరోబియాస్ వెర్మిక్యులారిస్ లేదా ఆక్సియురిస్ వెర్మిక్యులారిస్ అని పిలువబడే ఈ పురుగుల వలన 'ఎంటరో బియాస్' అనే స్థితి కలుగుతుంది.

ఈ పురుగులు మన శరీరంలో ఆరు వారాల పాటు బ్రతుకుతాయి. ఆ తరువాత ఇవి గుడ్లు పెట్టి చనిపోతాయి. మరలా ఈ గ్రుడ్లు ఈ వ్యక్తి మలం ద్వారా బయటకు విసర్జింపబడి మరలా వేరే వ్యక్తుల శరీరంలోనికి ప్రవేశిస్తాయి.

నులి పురుగులలో ఆడ పురుగులు మలద్వారం వద్ద రాత్రిపూట గ్రుడ్లు పెడతాయి. అంతేగాక అక్కడ దురదను కలిగిస్తాయి. చేతి వేళ్ళతో ఆ ప్రాంతంలో గోక్కోవడంతో మళ్ళా ఈ గ్రుడ్లు గోళ్ళలోనికి ఆ తరువాత మరలా ఆహార పదార్థాలతో పాటు శరీరంలోనికి ప్రవేశిస్తాయి.

నులి పురుగులు ఆడవాళ్ళలో యోని మార్గంలో ప్రవేశించి తెల్లబట్ట వ్యాధిని, యోని మార్గంలో దురదను కలిగిస్తాయి. అంతేగాక ఇవి స్త్రీలకు, పురుషులకు కూడా మూత్ర నాళంలో ప్రవేశించి మూత్రంలో మంటను, ఎక్కువసార్లు మూత్రం పోయడంవంటి లక్షణాల్ని కలిగిస్తాయి.

శారీరక పరిశుభ్రత పాటిస్తే నులి పురుగుల నుండి మనను మనం రక్షించుకోవచ్చు. నులి పురుగులు మన శరీరంలో వున్నాయోమోననే అనుమానం కలిగినప్పుడు మల పరీక్ష జరిపితే వాటి గ్రుడ్లు కనబడతాయి. అంతేగాక ఇవి ఎక్కువ అయితే కడుపు నొప్పి రావడం, మలబద్ధకం కలగడం, ఒకొక్కసారి విరేచనాలు కావడం, శరీరంలో దురదలు రావడం మొదలైన లక్షణాలు కనబడతాయి.

నులి పురుగులున్న పిల్లలకు కట్ డ్రాయర్‌లు పగలు, రాత్రి తప్పని సరిగా వేయాలి. దీనివల్ల వారు దురదగా వున్నా గోక్కోవడం తగ్గుతుంది. వారి గోళ్ళను పొట్టిగా (మట్టి చేరకుండా వుండేదుకై) కత్తిరించుకోవాలి. పరిశుభ్రత లేకపోతే ఎన్ని మందులు వాడినా మళ్ళా నులి పురుగులు వచ్చే అవకాశం వుంది.





## కొంకి పురుగులు (Hook Worms)

కొంకి పురుగులు ఎర్రగాను ఒక సెంటీమీటరు పొడవు కలిగి వుంటాయి. మామూలుగా విరేచనంలో ఇవి పడవు. కేవలం మల పరీక్ష ద్వారా నిర్ధారించుకోవాలి.

కొంకి పురుగులు వున్న వ్యక్తుల మలవిసర్జన ద్వారా ఇవి లార్వా దశలో బయటకు వస్తాయి. ఇవి అక్కడ నుండి మట్టిలో కలిసి అక్కడ బాగా అభివృద్ధి చెందుతాయి. మరలా మరొక వ్యక్తి పాదాల ద్వారా పాదాల దగ్గర చర్మాన్ని తొలిచి వారిలో ప్రవేశిస్తాయి. పాదాల ద్వారా రక్త ప్రవాహంలోనికి చేరిన కొంకి పురుగులు శరీరం అంతటా ఎక్కడబడితే అక్కడ దురదను కలిగిస్తాయి. ఆ తరువాత ఇవి ప్రేవుల్లో నిలవ వుంటాయి.

కొంకి పురుగులు ప్రేగులలో కూడా ఎక్కువకాలం వుండకుండా రక్తం ద్వారా ఊపిరితిత్తుల్ని, శ్వాసనాళాల్ని చేరి పొడిదగ్గును కలిగిస్తాయి. అప్పడప్పుడు కఫం కూడా పడవచ్చు. దగ్గు ద్వారా గొంతులోనికి వచ్చిన కొంకిపురుగులు ఉమ్మిని మింగడం వల్ల మళ్ళీ కడుపులోనికి చేరి కడుపు నొప్పిని, విరేచనాలను కలిగిస్తాయి. మల పరీక్ష చేయించి వ్యాధిని నిర్ధారించవచ్చు.

కొరికి పురుగుల వల్ల రక్త హీనత కలుగుతుంది. ఇవి ఆంత్ర మూలంలో గోడలకు గట్టిగా పట్టుకుని రక్తం త్రాగి బ్రతుకుతాయి. పేగు గోడలకు కూడా అంటి పెట్టుకుంటాయి. దీనివల్ల ఆరోగ్యం క్షీణిస్తుంది. గుండెదడ, ఆయాసం, నరాల బలహీనత వంటి లక్షణాలు వస్తాయి.

కొంకి పురుగులు మన శరీరంలోనికి ప్రవేశించకుండా శారీరక పరిశుభ్రత పాటించాలి. ముఖ్యంగా చెప్పులు లేకుండా ఆరు బయట దుమ్ములో తిరగరాదు. మల విసర్జన సమయంలో కూడా తప్పనిసరిగా చెప్పులు వేసుకోవాలి. సెప్టిక్ లెట్రిన్స్ వాడడంవల్ల కొంకి పురుగుల వ్యాప్తిని అరికట్టవచ్చు.

## కొరడా పురుగులు (Whip Worms)

ట్రైకోరియాసిస్ (Trichuriasis)ను ఇవి కలగజేస్తాయి. ఇవి ఎక్కువగా వుండడమే, వీటి వల్ల కలిగే స్థితినే ఈ ట్రైకోరియాసిస్ అంటే. ఈ కొరడా పురుగులు కొరడా ఆకారంలో కొరడా మాదిరిగానే మూడునుండి ఐదు సెంటీమీటర్ల పొడవు వుండి కొద్దిగా ఎర్రగాగాని లేక బూడిద రంగులోగాని వుంటాయి. ఇవి ఇతర పురుగులంత ప్రమాదకరమైనవి కావు. ఇవి కలుషిత ఆహారం, నీరు ద్వారా మన శరీరంలో ప్రవేశిస్తాయి.

కొరడా పురుగులు మన శరీరంలో పెద్ద ప్రేగులో వుంటాయి. వీటివల్ల ఒకొక్కసారి విరేచనాలు, కడుపు నొప్పి, రక్తహీనత, వికారం వంటి లక్షణాలు కలుగుతాయి. వీటివలన ఒకొక్కసారి కొందరు పిల్లకు మలాశయం లేదా ప్రేగు భాగం మలద్వారం నుండి క్రిందకు జారవచ్చు (Prolapse). కొరడా పురుగుల వల్ల వచ్చే విరేచనాలలో ఒకొక్కసారి జిగురు కూడా పడవచ్చు.

అన్ని రకాల పురుగులకు తీసుకునే జాగ్రత్తలు దీనికి తీసుకోవాలి. శారీరక పరిశుభ్రతతో పాటుగా ఆహార పదార్థాలు, నీరు కలుషితం కాకుండా కూడా చూసుకోవాలి.

## ఏలిక పాములు

ఇవి 20 నుండి 30 సెం.మీ. పొడవులో లేత గులాబీ రంగులోగాని, తెలుపు రంగులో గాని వుంటాయి. ఇవి కూడా నోటి ద్వారా కలుషిత ఆహారం ద్వారా, నీటి ద్వారా, గ్రుడ్ల రూపంలో మన శరీరంలోనికి ప్రవేశిస్తాయి.

మన శరీరంలో ప్రవేశించిన ఏలిక పాము గ్రుడ్లు కడుపులోని జీర్ణరసాల ప్రభావంతో పగిలి వానిలో నుండి వచ్చిన చిన్న ఏలిక పాములు అన్న వహికలోనికి, అక్కడ నుండి రక్త ప్రసరణ వ్యవస్థలోనికి చేరతాయి. ఈసమయంలో శరీరం అంతటా దురదలు వస్తాయి. రక్తం ద్వారా ఊపిరితిత్తుల్ని చేరడంతో పొడిదగ్గు వస్తుంది. న్యూమోనియా కూడా వస్తుంది. ఒకొక్కసారి జ్వరం వచ్చి నోటి వెంట దగ్గు తెమడతో పాటుగా రక్తం కూడా రావచ్చు. దగ్గుతో పాటుగా గొంతులోనికి వచ్చిన ఏలిక పాములు నోటి వెంట వాంతి రూపంలో బయట పడవచ్చు. అన్నవాహిక లోనికి చేరిన పురుగుల వలన పొట్ట పెరిగి పెద్దదిగా కనబడుతుంది.

ఏలిక పాముల వలన అజీర్ణం, వికారం, కడుపులో తిప్పడం, వాంతులు, ఆకలి మందగించడం పిల్లలలో ఎదుగుదల లేకపోవడం, తరచు జ్వరం రావడం, ఫిట్స్ రావడం వంటి అనేక ప్రమాదాలు వస్తాయి.

ఏలిక పాములున్న పిల్లలు మందకొడిగా వుంటారు. వారి పొట్ట బానపొట్టలాగా మారుతుంది. ఒకొక్కసారి ఈ ఏలిక పాములు కడుపులో చుట్టలు చుట్టుకుని వుండడం వల్ల ఆహార పదార్థాల జీర్ణక్రియలో - రవాణాలో తీవ్రమైన ఇబ్బందులు వస్తాయి. విరేచనంలోను, దగ్గినా తుమ్మినా ఏలిక పాములు నోటి ద్వారా బయటబడవచ్చు. ఇవి శ్వాస నాళాలలో దూరి ఊపిరి సలపకుండా గూడా చేయవచ్చు.

సరిగ్గా ఉడికించని ఆకుకూరలు వల్ల ఇవి మన శరీరంలో ప్రవేశించవచ్చు. ఈ పురుగుల డింభక దశలో కాలేయం, గుండె, మెదడు, శ్వాసకోశాలు, మూత్రపిండాలను కూడా ప్రభావితం చేయగలవు. ఏలిక పాములు అన్నవాహిక నుండి పేగులలోనికి జారడంవల్ల కడుపు నొప్పిరావచ్చు. అపెండిక్స్ (ఉండుకము) లోనికి ప్రవేశిస్తే అపెండిసైటిస్, పెరిటోసైటిస్ వంటివి రావచ్చు. రాత్రుళ్ళు నిద్రపట్టకపోవడం, చిన్నపిల్లల్లో రక్తహీనత, మందకొడి తనము కనబడడం, తరచుగా జ్వరం రావడం వల్ల, రక్తపరీక్షలో ఇసినోఫీలియా వుండడం వల్ల ఏలిక పాములు వుండవచ్చని భావించవచ్చు. మల పరీక్ష జరిపితే ఏలిక పాముల గ్రుడ్లు స్పష్టంగా కనబడతాయి.

## దారపు పురుగులు

నులి పురుగుల కోవలోనికి చెందినవే ఇది కూడా. ఇవి సుమారు రెండు - మూడు మి.మి. పొడవులో చిన్న ప్రేగుల్లో స్థిర నివాసం ఏర్పాటు చేసుకుంటాయి. వీటివల్ల అంత పెద్ద ప్రమాదం ఏమీ వుండదు. కానీ వీటి సంఖ్య అధికం అయితే మాత్రం ప్రేగులు చిల్లులు పడవచ్చు.





ఆహార లోపం కలగవచ్చు. వళ్ళంతా దురదలు, పొట్టలో నొప్పి, విరేచనాలు, గొంతులో పిల్లులు కూసినట్లు శబ్దాలు రావడం వుంటాయి. ఆయాసం కూడా వుంటుంది. ఇవి కూడా కలుషిత ఆహారం, నీరు ద్వారా మన శరీరంలోనికి ప్రవేశిస్తాయి. కాబట్టి శారీరక, పరిసరాల పరిశుభ్రత పాటించడం అవసరం.

## నీరుగడ్డ పురుగు (Hydatid cyst)

ఎకైనోకోకస్ గ్రాన్యులోసిస్ అనే బద్దె పురుగు (Tape worm) సాధారణంగా కుక్కలు, పిల్లులలో పెరుగుతూ వుంటుంది. ఒకొక్కసారి ఇది మనుషులకు కూడా సంక్రమిస్తుంది. ఆయా జంతువులు మలమూత్రాదుల ద్వారా కలుషితమైన ఆహారాన్ని గ్రహించడం ద్వారా - కుక్కలు, పిల్లులతో ఆడుకోవడం ద్వారా పిల్లలోను ఈ నీరుగడ్డ పురుగు సోకుతుంది. ఈ పురుగు ద్వారా మన కడుపులోను, ఇతర కణజాలాలలోను సిస్టులు (కోశాలు) తయారవుతాయి. ఇవి ఎలాటి ఇబ్బందినీ కలిగించేవి కావు. అలాగే ఎలాటి లక్షణాలు చూపించవు. కాని కొందరిలో మాత్రం ఎలాటి నొప్పీ లేకుండా 'లివర్' పెరుగుతుంది. కారణం తెలియకుండా జ్వరం రావడం గమనించవచ్చు.

ఇతర కణజాలాలలో సిస్టులు వస్తే మాత్రం ప్రమాదం కలగవచ్చు. స్ప్లీన్ మీద సిస్టులు వస్తే పచ్చకామెర్లు వచ్చే అవకాశం వుంది. అల్లాగే ఊపిరితిత్తులలో వస్తే వారిలో ఆయాసం వుంటుంది. దగ్గుతో. పాటు రక్తం పడుతుంది. జ్వరం, దగ్గు, కళ్ళె పడడం కూడా వుంటాయి. మెదడులో సిస్టులు తయారైతే ఫిట్స్ వస్తాయి. మరణం కడూఆ సంభవించవచ్చు. ఈ సిస్టులు కడుపులో వస్తే విరేచనాలను, కడుపు నొప్పిని కలిగిస్తాయి. ఈసిస్టులు కిడ్నీలలో కూడా తయారవుతాయి. పరిసరాల పరిశుభ్రత, శారీరక పరిశుభ్రత అవసరం.

## బద్దె పురుగులు (Tape worms)

సన్నగా రిబ్బను మాదిరిగా చాలా పొడవుగా వుండే ఈ పురుగులు కూడా మన కడుపులో స్థిర నివాసం ఏర్పరచుకుని మన ఆరోగ్యాన్ని క్షీణింపజేస్తాయి. ఇవి శాఖాహారులలో కనిపించవు. కేవలం మాంసాహారులలోనే వుంటాయి. సరిగ్గా ఉడికించని పశుమాంసం తినే వారిలో బద్దె పురుగు కనబడుతుంది. ఈ బద్దె పురుగులలో ఎన్నో రకాలు ఉన్నాయి. ముఖ్యంగా పంది మాంసం తినేవారిలో 'టీనియాసోలియం' అనే బద్దె పురుగు కనబడుతుంది. ఇది కొన్ని మీటర్ల పొడవు పెరుగుతుంది. పురుగు చివరి భాగం నుండి ముక్కలు ముక్కలుగా ఒక సెంటీమీటరు పొడవున్న చిన్న దోసగింజల వంటివి మలంలో రాలి పడుతుంటాయి. ఈ మలాన్ని పందులు తిన్నప్పుడు పంది శరీరంలోనికి ప్రవేశించి అక్కడ మార్పులు చెంది కోశాలుగా మారి పంది శరీరంలోని మాంసంలో వుండి పోతాయి. పంది మాంసం తినే మానవులు ఈ రకమైన మాంసాన్ని తీసుకోవడం వల్ల అది సరిగా ఉడకని మాంసం అయితే క్రిములు సజీవంగా మరలా వారిలో ప్రవేశిస్తాయి.

సిస్టులు (కోశాలు) లోవుండే బద్దెపురుగు లార్వాలు జీర్ణాశయాన్ని చేరినప్పుడు వాటిపై నుండే పొరలు జీర్ణరసాల వల్ల కరిగిపోయి లార్వాలు పేగులలోనికి ప్రవేశిస్తాయి. అక్కడ నుండి రక్తప్రసరణ ద్వారా మెదుకు చేరితే తలపోటు, ఫిట్స్ కూడా వస్తాయి. ఒకొక్క సందర్భంలో మరణం కూడా సంభవించవచ్చు. బద్దె పురుగులు పేగులలో పెరిగి పెద్దవవుతాయి. ఈ పురుగులు కడుపులో ఉన్నప్పుడు కడుపు నొప్పి, ఆకలి లేకపోవడం, బరువు కోల్పోవడం. వళ్ళంతా దురదలు ముఖ్యమైన లక్షణాలను కలిగిస్తాయి. పేగులలో రంధ్రాలను చేయడం కూడా అప్పుడప్పుడు గమనించవచ్చు. ఇలా రంధ్రాలు పడితే ప్రేవులలోని కొంత భాగం కుళ్ళిపోవడం జరుగుతుంది. ఈ సమయంలో వైద్యం చేసినా పురుగు పోదు. చివరకు ఆపరేషన్ చేసి మళ్ళిపోయిన పేగు భాగాన్ని, స్కోలెక్స్ (బద్దె పురుగు తల ప్రాంతాన్ని) తీసివేస్తే బద్దె పురుదు పోయినట్లు లెక్క.

బద్దె పురుగులలో హైమినోలెపిస్ నానా అనే ఒక రకమైనది. పొట్టిగా వుంటుంది. ఈ పురుగులు వున్నప్పుడు మనకు కడుపునొప్పి, నిద్రపట్టకపోవడం, పొత్తి కడుపులో నొప్పి, విరేచనాలు మూర్ఛ లక్షణాలు ఏర్పడవచ్చు.

## ట్రైకినోసిస్ (Trichinosis)

ట్రైకినెల్లా స్పైరాలిస్ (Trichinella spiralis) అనే గుండ్రటి పరిధిగల పురుగు వల్ల ట్రైకి నోసిస్ వస్తుంది. ఈ క్రిమి కూడా సిస్ల రూపంలో పంది, ఎలుకలలో వుంటాయి. ఈ క్రిములు గల మాంసం తిన్నవారికి వ్యాధి సంక్రమిస్తుంది. సరిగా వుడికించని పంది మాంసం తిన్న వారికి బద్దె పురుగు మాదిరిగానే ఇది కూడా సంక్రమిస్తుంది. మాంసం తిన్న తరువాత ఒకటి రెండు రోజుల్లో వికారం, విరేచనాలు బయటబడతాయి. ఆ తరువాత కొద్ది రోజులకు చలి జ్వరం, ముఖం వాయడం, కళ్ళ చుట్టూ కూడా వాపు చూపడం గమనించవచ్చు.

ట్రైకినోసిస్‌లో వీరికి దగ్గు, ఆయాసం, కండరాల నొప్పి వస్తాయి. అంతేగాక గుండె జబ్బుకు, మెదడుకు కూడా ఇది పాకవచ్చు. ఒకే పంది మాంసం తిన్న వారందరికీ ఒకేసారి ఈ లక్షణాలు కనిపిస్తే దానిని ట్రైకినోసిస్‌గా అనుమానించాల్సిందే!

శారీరక పరిశుభ్రతతో బాటు ఆహారం సరిగా ఉడికించిగాని తినడం వల్ల ఇలాటి వ్యాధి రాకుండా నివారించుకోవచ్చు.

**చికిత్స**

★ ముఖ్యంగా ఆహారం, నీరు పరిశుభ్రంగా వుండాలి. ఆహారాన్ని బాగా ఉడికించి, నీటిని కూడా బాగా మరిగించి గాని ఫిల్టర్ చేసిగాని వాడాలి.

★ ఏలిక పాములకు, కొంకి పురుగులకు, దారపు పురుగులకు, నులి పురుగులకు ఈ క్రింది మందులు వాడవచ్చు.





మెబెక్స్ - 100 మి.గ్రా. టాబ్లెట్లు లేదా

వార్మిన్ - 100 మి.గ్రా. టాబ్లెట్లు లేదా

మెబుజోల్ - 100 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో ఏదైనా సరే ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి చొప్పున వాడాలి. ఈ విధంగా మూడు రోజులు వాడాలి. ఆ తరువాత వారం రోజులు పోయాక మళ్ళా ఇదే విధంగా వాడాలి. బద్దె పురుగులు, దారపు పురుగులు చావడానికి పై మాత్రలు ఉదయం రెండు, సాయంత్రం రెండు చొప్పున రోజుకు నాలుగు మాత్రల్ని మూడు రోజులపాటు వేసుకోవాలి. మళ్ళీ వారం రోజుల తరువాత అదే విధంగా వాడాలి.

★ నెమోసిడ్ - 250 మి.గ్రా. టాబ్లెట్లు లేదా సస్పెన్షన్‌గాని వాడవచ్చు. దీనిని ఐదు సంవత్సరాలలోపు పిల్లలకు 250 మి.గ్రా. టాబ్లెట్ ఒకేసారి వాడాలి. రెండు సంవత్సరాల వయసులోపలి పిల్లకు సస్పెన్షన్ వాడవచ్చు. వారికి వారి శరీరపు బరువును బట్టి వాడాలి. (10 మి.గ్రా./kg బరువుకు) ఐదు నుండి 12 సంవత్సరాలలోపు వారికి 500 మి.గ్రా. (రెండు టాబ్లెట్లు) ఒకేసారి వాడాలి. 12 సంవత్సరాల వయసు దాటిన వారి కందరికీ 750 మి.గ్రా. (మూడు టాబ్లెట్లు) ఒకేసారి వాడాలి.

★ బెండెక్స్ - 400 మి.గ్రా. టాబ్లెట్స్ / 200 మి.గ్రా. టాబ్లెట్స్

ఆల్‌మింథ్ - 400 మి.గ్రా. టాబ్లెట్స్ / 200 మి.గ్రా. టాబ్లెట్స్

నో వార్మ్ - 400 మి.గ్రా. టాబ్లెట్స్

ఆల్బెజోల్ - 400 మి.గ్రా. టాబ్లెట్స్ / 200 మి.గ్రా. టాబ్లెట్స్ / సస్పెన్షన్

జెన్‌టిల్ - 400 మి.గ్రా. టాబ్లెట్స్

వీటిలో ఏదైనా సరే పెద్దవారికి, రెండు సంవత్సరాలు దాటిన పిల్లలకు 400 మి.గ్రా. పూర్తి డోసు ఒక్కసారిగా వాడాలి. ఒకటి నుండి రెండు సంవత్సరాల పిల్లలకు 200 మి.గ్రా. టాబ్లెట్లు గాని సస్పెన్షన్‌గాని ఒకేసారి వాడాలి.

బద్దె పురుగులు పోవడానికి 400 మి.గ్రా. చొప్పు మూడు రోజుల పాటు వరసగా వాడాలి. నీరు గడ్డపురుగులు (హైడాటిడ్ సిస్టటలకు) 400 మి.గ్రా. టాబ్లెట్లు రోజుకు రెండేసి చొప్పున నెల నుండి మూడు నెలల పాటువాడాలి.

★ నీరుగడ్డ పురుగులకు మాత్రమే :

డిక్లోసైడ్ - 600 మి.గ్రా. మాత్రలు రోజుకు మూడు మాత్రలుగా రెండు వారాలు వాడాలి. లేదా

ఎబిజడ్ - 400 మి.గ్రా. టాబ్లెట్లు

జెన్‌టిల్ - 400 మి.గ్రా. టాబ్లెట్లు

అల్బెజోల్ - 400 మి.గ్రా. టాబ్లెట్లు

బెండెక్స్ - 400 మి.గ్రా. టాబ్లెట్లు - వీటిలో ఏదైనా సరే రోజుకు రెండుగా ఒకటి నుండి మూడు నెలలపాటు వాడాలి. ఆక్సీటెట్రా సైక్లిన్ - 250 మి.గ్రా. రోజుకు నాలుగు సార్లు వాడాలి. డాక్టరు సలహా తీసుకోవాలి.

★ బద్దెపురుగుకు -

ఐడిబెండ్ - 100 మి.గ్రా.

మోబెక్స్ - 100 మి.గ్రా

వీటిలో ఏదైనా సరే పెద్దవారు ఉదయం రెండు, సాయంత్రం రెండుగా మూడు రోజులు వాడాలి. తిరిగి వారం రోజుల తరువాత అలాగే వాడాలి.

నిక్లోపన్ - 500 మి.గ్రా. ముందురోజు రాత్రి పస్తు వుండి తెల్లారాక రెండు మాత్రలు చప్పరించాలి. గంట తరువాత మరో రెండు మాత్రలు చప్పరించాలి. ఆ తరువాత విరేచనం కావడానికి ఎప్సమ్ సాల్ట్ ఒక పేకెట్ వేసుకోవాలి.

★ జియార్డియాసిస్ క్రిమి తొలగిపోవడానికి

ఫాసిజిన్ - 1 గ్రాము టాబ్లెట్స్ - రెండు ఒకే డోసుగా వాడాలి. లేదా

జిల్ - 1 గ్రాము టాబ్లెట్స్ - రెండు ఒకే డోసుగా వాడాలి.

## మొలలు (Hemorrhoids) - పైల్స్ (Piles)

పైల్స్ లేక మొలలు రెండు రకాలుగా వుంటాయి. అవి రక్తంతో బాధ పెట్టేవి. రక్తం కారకుండా ఇబ్బంది పెట్టేవి. మలబద్ధకము మొలలు రావడానికి ముఖ్య కారణం. విరేచనం సాఫీగా కాక పోవడం వల్ల - మలం గట్టిగా వుండి మలాశయం చీరుకుపోయి రక్తస్రావం కలుగుతుంది. అక్కడ పుండ్లు పడతాయి. చిన్న చిన్న పొక్కులు ఏర్పడి విరేచనానికి వెళ్ళినప్పుడల్లా విపరీతమైన బాధ కలుగుతుంది. ఈ బాధ ఆ తరువాత చాలా సేపటికి గాని సర్దుకోదు.

### కారణాలు

★ పైల్స్ రావడానికి తీవ్రమైన మలబద్ధకంగాని ఎక్కువగా విరేచనాలకు (డయేరియా) గురవ్వడమో జరగవచ్చు.

★ పాలు, పాల పదార్థములను వాడడం ఆపివేసి, పొడిగావున్న, వేపుడు కూరలు పదార్థాలు అధికంగా వాడడం వల్ల పైల్స్ రావచ్చు.

★ ఆహారం నియమం తప్పి తీసుకోవడం వల్ల - ఇతర జీవన క్రియలకు ఆటంకం కలగడం వల్ల (ప్రొద్దున్నే చేసే కాలకృత్యాల దగ్గర నుండి అన్ని క్రమం తప్పుతాయి)





★ సారాయిని అధికంగా త్రాగడం, టీ, కాఫీ, కోకో, పొగాకు, మత్తు పదార్థాలు వాడడం వల్ల మొలలు వస్తాయి.

★ చాలా కాలం పాటు విరేచనాల మందులు వాడడం వల్ల కూడా అలవాటుగా వాడే ఆ మందుల వల్ల మొలల వ్యాధి వస్తుంది.

### చికిత్స

★ మందులతో కంటే ముందు ఆహార పదార్థాలతో చికిత్స జరపాలి. ఆహారంలో పీచు పదార్థాలు వుండేటట్లు జాగ్రత్త పడాలి. పళ్ళు తీసుకోవాలి. ముఖ్యంగా అరటి, నారింజ, బత్తాయి పళ్ళు వంటివి వాడడం వల్ల మొలల వ్యాధి నుండి బయట పడవచ్చు.

★ ఎక్కువసేపు కుషన్ కుర్చీలలో కూర్చోవడం తగ్గించాలి.

★ పాలు, నీళ్ళు కాయగూరలు అధికంగా వాడాలి. చెరకు రసం తరచూ తీసుకుంటే మొలలు తగ్గిపోతాయి.

★ గోరువెచ్చని నీటిని త్రాగుతూ వుంటే మొలలు వ్యాధి నెమ్మదిస్తుంది. సుఖవిరేచనం అవుతుంది.

★ క్రీమాఫెన్ - లిక్విడ్‌ను రాత్రి పూట ఒకటేబుల్ స్పూన్ వాడాలి.

పైలెక్స్ - టాబ్లెట్స్ వాడవచ్చు.

పైపూతకు నొప్పి తగ్గించేందుకు

హెడెన్‌సా వంటి ఆయింట్‌మెంట్‌లు వాడవచ్చు.

# రక్తప్రసరణ మండలం

## గుండె (Heart)




గుండె ఆగితే మరణం. జీవం వున్నదో లేదో తెలియాలంటే నాడి చూడడం, శ్వాసను చూడడం అందరికీ తెలిసిందే. శ్వాస ఆగినా, గండె ఆగినా మరణించినట్లే లెక్క మన శరీరంలో అత్యంత ప్రధానమైన భాగం గుండె.

### గుండె నిర్మాణం

బోలుగా వుండే కండరములతో నిర్మితమైన శంఖాకారం వంటి నిర్మాణం గుండె. ఇది తల్లి గర్భంలో శిశువుకు మూడు నెలల వయసు వచ్చినప్పటి నుండీ ఆ తర్వాత పెరిగి పెద్ద అయిన ఆ వ్యక్తి చనిపోయేదాకా నిరంతరం ఏమాత్రం అలసత్వం ప్రదర్శించకుండా పని చేస్తుంది.

గుండెలో నాలుగు గదులు వుంటాయి. ఎడమ వైపు రెండు గదులు, కుడివైపు రెండు గదులు వుంటాయి. గుండెలో ఎడమవైపు మంచి రక్తం కుడివైపు చెడు రక్తం ప్రవహిస్తూ వుంటాయి. పైన వుండేగదిని 'కర్ణిక' (Atrium) అని క్రింది వైపున వుండే గదిని 'జఠరిక' (Ventricle) అని అంటారు. కర్ణికకు, జఠరికకు మధ్య కవాటాలు వుంటాయి. జఠరిక నుండి ధమనులకు రక్తం చేరే దారిలో కూడా కవాటాలు వుంటాయి. రక్తం ఎప్పుడూ ఒకే దిశగా ప్రవహిస్తూ వుంటుంది.

రక్తం కర్ణికలలో నుండి జఠరికలలోనికి అక్కడ నుండి పెద్ద ధమనులలోనికి ప్రవహిస్తూ వుంటుంది. రక్త ప్రవాహాన్ని కవాటాలు నియంత్రిస్తూ ఉంటాయి. మన శరీరంలో రోజుకు సుమారు 6500 లీటర్ల రక్తాన్ని వివిధ శరీర భాగాల నుండి స్వీకరించి మరలావాటికి సరఫరా చేస్తుంది. గుండె పై భాగంలో రెండు పొరల సంచీ వంటి భాగం వుంటుంది. దీనిని హృదయావరణము అంటారు. దీనిలో రంగు లేని ద్రవం వుంటుంది. దీనిని హృదయావరణము అంటారు. హృదయావరణము గుండెకు రక్షణ వలయంగా వుంటుంది.

మన శరీరంలోని తల, చేతుల నుండి ఊర్ధ్వబృహత్సిర (Superior Vena Cava/SVC), ఉదరము, కాళ్ళ నుండి అధోబృత్సిర (Inferior Vena Cava/IVC) - ఇవి చెడు రక్తాన్ని గుండెలోని కుడి కర్ణిక (Right Atrium /RA) లోనికి తీసుకొస్తాయి. కుడి కర్ణిక నుండి త్రిపత్రకవాటం (Tricurpid Valve/TV) ద్వారా కుడి జఠరిక (Right Ventricle/RV) లోనికి





అక్కడ నుండి పుపుసధమని (PulmonaryArtery/PA) లోనికి రక్త ప్రవాహం వుంటుంది. పుపుసధమని నుండి రక్తం రెండు ఊపిరితిత్తులకు చేరుతుంది. ధమనులన్నింటిలో మంచి రక్తం ప్రవహిస్తే పుపుసధమనులలో మాత్రం చెడు రక్తం ప్రవహిస్తుంది.

మనంతిన్న ఆహారం జీర్ణమై రక్తంలో కలుస్తుంది. ఆ తరువాత రక్తం అధోబృహత్సిర ద్వారా గుండెకు చేరుతుంది. శరీర భాగాలు వివిధ జీవన క్రియలు జరిపి తరువాత తయారైన మలిన పదార్థాలు, కార్బన్ డయాక్సైడ్ వాయువు బృహత్సిరల ద్వారా గుండె కుడివైపు గదుల్లో చేరతాయి. అక్కడ నుండి ఊపిరితిత్తులకు చేరి అక్కడ శుభ్రపడి మరలా పుపుససిరల ద్వారా గుండెకు చేరుతుంది.

పుపుససిరల (Pulmonary Veins/PV) ద్వారా మంచి రక్తం గుండెలోని ఎడమ కర్ణికకు (Left Atrium/LA) చేరి అక్కడ నుండి మైట్రల్‌కవాటం (Mitral Valve/MV) ద్వారా ఎడమ జఠరికలోనికి పోతుంది. ఆ తరువాత బృహద్ధమని (Aort/AO)·లోనికి అయోర్టిక్ కవాటం (Aortic Valve/AV) ద్వారా శరీరంలోని అన్ని అవయవాలకు చేరుతుంది. రక్తంలోని కార్బన్ డయాక్సైడ్, మినహా మిగిలిన మలినాలయిన యూరియా, యూరిక్ ఏసిడ్ వంటివి మూత్రపిండాల ద్వారా విసర్జింపబడతాయి.

కర్ణికలు రెండు ఒకేసారి, జఠరికలు రెండు, ఒకేసారి సంకోచ వ్యాకోచాలు జరుపుతాయి. కర్ణికలు సంకోచించినప్పుడు జఠరికలు వ్యాకోచిస్తాయి. జఠరికలు సంకోచించినప్పుడు కర్ణికలు వ్యాకోచిస్తాయి. కర్ణికల, జఠరికల మధ్యనున్న కవాటాలు తెరచుకుని, మూసుకుని శబ్దాలు చేస్తాయి. కర్ణికల, జఠరికల మధ్య వుండే కవాటాలు మూసుకుని 'లబ్' అనే శబ్దం వస్తే - జఠరికలకు - పెద్ద రక్త నాళాలకు మధ్యగల కవాటాలు మూసుకోవడం వల్ల 'డబ్' అనే శబ్దం వస్తుంది. ఇలా నిరంతరం జరగడం వల్ల లబ్-డబ్ అనే శబ్దం గుండె నుండి వస్తూ వుంటుంది.

గుండె కొట్టుకునే వేగం శరీరానికి పని ఎక్కువైనా, పరిగెత్తడం, అలసి పోయేట్లు చేయడం వల్ల ఎక్కువ అవుతుంది. రక్తహీనత వున్నా కూడా ఇదే విధంగా వుంటుంది. ఇంకా ఊపిరితిత్తులలో ఆక్సిజన్ సరిగా గ్రహించలేక పోయినా. గండె జబ్బులలోను గుండె వేగంగా కొట్టుకుంటుంది. నిద్రలో కూడా గుండె కొట్టుకునే వేగంలో హెచ్చు తగ్గులు వుంటాయి. గుండె కొట్టుకునేందుకు గుండెలో వుండే గతిప్రేరకము (Pacemaker) ముఖ్య పాత్రవహిస్తుంది. ఇది కుడి ఏట్రియం కుడ్యంలో వున్న 'SA' కణపు వల్ల సూక్ష్మ విద్యుత్ ప్రచోదనాలను ఉత్పత్తి చేసి గుండె సంకోచములు కలిగిస్తుంది. గుండె కొట్టుకునే విధానంలో తేడా వచ్చే జబ్బులలో ఒక్కోసారి కృత్రిమమైన గతిప్రేరకము (Artificial Pacemaker) శస్త్ర చికిత్స ద్వారా ఛాతీలో ప్రవేశ పెట్టవలసి వుంటుంది.

## గుండె నొప్పి (Angina Pectoris)

ఇది ఊపిరి ఆడకుండా చేసే ఉక్కిరి బిక్కిరి చేసే గుండె పోటు. పట్టకారు తోలోపల నొక్కుతున్నట్లుగా అనిపించే జబ్బు దీనిని రొమ్ముశూల అంటారు. గుండెలోపల రక్తం వున్నప్పటికీ హృదయ కండరాలకు (గోడలకు) రక్తం సరఫరాకాదు.

సాధారణంగా నడివయస్సు వారిలోను, ముసలి వారిలోను ఇదివస్తుంది. అసాధారణంగా ఈ జబ్బు పాతికేళ్ళ లోపువారికి కూడా రావచ్చు. గుండెల్లో నొప్పిగా అనిపించిన వెంటనే డాక్టరు వద్దకు వెళ్ళి తగు పరీక్షలు చేయించుకుంటే వ్యాధిని ప్రారంభ దశలోనే అరికట్ట వచ్చు.

## లక్షణాలు

★ గుండెలో అరచెయ్యి పెట్టి కెలికినట్లుగా విపరీతమైన మంట, నొప్పి వుండవచ్చు.

★ గుండెలపైన పెద్దబరువు పెట్టినట్లుగాను, గుండెపిసికి వేసినట్లుగాను వుండవచ్చు.

★ సాధారణంగా ఎదురు రొమ్ము మధ్యలో నొప్పి వస్తుంది. ఏంజినా నొప్పి ఎడమ చేయి లోపలి వరకు అంటే గుండెలోనికి అరచెయ్యి నుంచి పాకవచ్చు. ఇంకా ఈ నొప్పి మెడలోనికి పాకి ఆ తరువాత పొట్టలోపలికి కూడా పాకవచ్చు.

★ ఏంజినా నొప్పి బాగా అలసి పోయేటట్లు పని చేసినా, అమితమైన ఆనందం పొందినా, ఆందోళనకు గురయినా మెరుపులా వచ్చి, ఒక చోటు నుండి మరొక చోటుకు మారుతూ వుంటుంది.

★ గుండెనొప్పి ఒక చోట వుంటే ఆ ప్రాంతంలో నొక్కితే నొప్పి తెలుస్తుంది.

★ అప్పుడప్పుడు ఊపిరి పీల్చినప్పుడు ఆ నొప్పి తగ్గవచ్చు లేదా పెరగవచ్చు. అప్పుడు దానిని ఏంజినాగా గుర్తించవచ్చు.

★ అన్నం తిన్నాక గుడెల్లో మంటగా రావడం, పుల్లని త్రేన్పులు రావడం, నోట్లో పుల్లని నీళ్ళు వూరడం - ఇవి ఏంజినా ముఖ్య లక్షణాలు

## ఏంజినా ఎందుకు వస్తుంది

★ ఏంజినా అనేది నిజానికి గుండెలో వచ్చే నొప్పి కాదు - ఇది గుండెకు సంబంధించిన రక్తనాళాల నుండి రక్తం గుండె కండరాలకు సరిగ్గా సరఫరా కాకపోవడం ముఖ్యమైన విషయం.

★ ఏంజినా వచ్చిన వారిలో చాలా కొద్ది మందికి మాత్రమే హార్ట్ ఎటాక్ వచ్చేందుకు అవకాశం వుంది.

★ కొద్దిపాటి జాగ్రత్తలు పాటిస్తే ఏంజినా త్వరలోనే సద్దుకుంటుంది.

## జాగ్రత్తలు

★ గుండెకు రక్తం చేరక పోవడం వల్ల వచ్చే గుండె నొప్పిగాబట్టి సాధారణంగా గుండె పోటుకు తీసుకునే జాగ్రత్తలన్నీ తీసుకోవాల్సిందే.

★ రక్తపోటు ఉన్నవాళ్ళు తీసుకునే జాగ్రత్తలన్నీ పాటించాలి.

★ ఏంజినాకు వాడే మందుల్ని ఎప్పుడూ వెంట వుంచుకోవాలి.

★ ప్రయాణాలలోను, ఏదైనా మీటిగుల్లో మాట్లాడేటప్పుడు దాంపత్యంలో పాల్గొనబోయే ముందు ఈ మాత్రల్ని వాడడం మంచిది.





## నిర్ధారణ

వ్యాధి గుండె నొప్పి అని తెలుసు కానీ అది ఏ రకమైన గుండె నొప్పి తెలుసు కోవాలంటే ముందు డాక్టరును సంప్రదించి ఆయన సలహాపైన వివిధ పరీక్షలు జరపాలి., ముఖ్యంగా ఈ వ్యాధిలో E.C.G. పరీక్ష చేస్తారు. ఈ పరీక్షలోనే దాదాపు జబ్బును నిర్ధారించవచ్చు. ఎకోకార్డియోగ్రఫీ ద్వారా గుండె పని తీరును పరిశీలిస్తారు.

## చికిత్స

ఏంజినాకు సాధారణంగా ఈ క్రింది మందులు వాడతారు.

★ 'గ్లిజరిల్ ట్రై నైట్రేట్' కలిసిన యాంజిసిడ్ - 0.5 మి.గ్రా. టాబ్లెట్లు నాలుక క్రింద పెట్టుకోవాలి. ఇది వెంటనే కరిగిపోయి గుండె నొప్పి తగ్గిపోతుంది.

★ 'ఐసోసార్బైడ్ - 5 - మోనోనైట్రేట్' అనే మందు కలిసి ఉన్న

మోనోట్రేట్ - 10 మి.గ్రా. / 20 మి.గ్రా. / 40 మి.గ్రా. టాబ్లెట్లు

మోనోసార్బిట్రేట్ - 10 మి.గ్రా. / 20 మి.గ్రా. / 40 మి.గ్రా. టాబ్లెట్లు

యాంజిటాబ్ - 10 మి.గ్రా. / 20 మి.గ్రా. / 40 మి.గ్రా. టాబ్లెట్లు

ఇస్మో - 10 మి.గ్రా. / 20 మి.గ్రా / 40 మి.గ్రా. టాబ్లెట్లు

వాసోట్రేట్ - 10 మి.గ్రా. / 20 మి.గ్రా. / 40 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిని డాక్టరు సలహా మేరకు డోసు నిర్ణయించి వాడాలి. మూడు పూటలా ఒకొక్క టాబ్లెట్టు చొప్పున వాడవచ్చు. లేదా రెండు పూటలా ఒకొక్క టాబ్లెట్ చొప్పున వాడవచ్చు. టాబ్లెట్లు ఏదైనా తిన్న తరువాత వేసుకోవాలి. రోజు మొత్తానికి మొత్తం మందు (డోసు) 120 మి.గ్రా.కు మించకూడదు.

★ 'ఐసోసార్బైడ్ డై నైట్రేట్' అనే మందు కలిసి వున్న

ఐసోర్డిల్ - 5 మి.గ్రా / 10 మి.గ్రా. టాబ్లెట్లు

ఐసోమాక్ రిటార్డ్ - 20 మి.గ్రా. / 40 మి.గ్రా. కాప్సుల్స్

సార్బిట్రేట్ - 5 మి.గ్రా. / 10 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో మాత్రలు 5 మి.గ్రా మోతాదు నాలుక క్రింద పెట్టుకుంటే వెంటనే కరిగిపోయి గుండె నొప్పి తగ్గుతుంది. కొద్ది రోజుల కాలం ఈ మాత్రలు వాడాల్సిన వారు 10 మి.గ్రా. మోతాదును ఉదయం ఒకటి (రాత్రి) సాయంత్రం ఒకటి చొప్పున మింగాలి. లేదా కాప్సుల్ - ఉదయం గాని సాయంత్రం గాని ఒకటి వాడాలి. లేదా

★ 'నిఫిడిపిన్' కలిసివున్న

డెపిన్ - 5 మి.గ్రా / 10 మి.గ్రా / 20 మి.గ్రా కాప్సుల్స్

కాల్సిగార్డ్ - 5 మి.గ్రా / 10 మి.గ్రా. కాప్సుల్స్

కార్డ్యులస్ - 5 మి.గ్రా. / 10 మి.గ్రా. కాప్సుల్స్

మయోగార్డ్ - 5 మి.గ్రా. కాప్సుల్స్

మయోగార్డ్ - 10 - 10 మి.గ్రా. టాబ్లెట్లు

మయోగార్డ్ - LA - 20 మి.గ్రా. S-r టాబ్లెట్లు

వీటిని కాల్షియం ఛానల్ బ్లాకర్స్ అంటారు. 10 మి.గ్రా. లేదా 20 మి.గ్రా. మోతాదులో ఉదయం ఒకటి, రాత్రి ఒకటి చొప్పున వాడవచ్చు. లేదా

★ 'అమిలోడిపైన్' మందు కలిసివున్న

అమ్‌కార్డ్ - 2.5 మి.గ్రా./ 5 మి.గ్రా / 10 మి.గ్రా. టాబ్లెట్లు

అమ్లోగార్డ్ - 2.5 మి.గ్రా / 5 మి.గ్రా/ 10 మి.గ్రా టాబ్లెట్లు

స్టామ్లో - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. / 10 మి.గ్రా. టాబ్లెట్లు

అమ్లోపిన్ - 5 మి.గ్రా. టాబ్లెట్లు

వీటిలో ఏదైనా రోజుకు ఒకసారి 5 మి.గ్రా. చొప్పున ఉదయంగాని రాత్రికిగాని వాడాలి. లేదా 2.5 మి.గ్రా. చొప్పున రెండు పూటలా వాడాలి. రోజుకు 10 మి.గ్రా. మోతాదు మించరాదు.

## గుండె పోటు (Hear Attack)

దీనినే మయో కార్డియల్ ఇన్‌పార్‌క్షన్ (Myocardial infarction) అంటారు. ఏంజినాలో వున్న లక్షణాలన్నీ దీనిలో కూడా ఉంటాయి. అయితే ఏంజినా గుండెనొప్పి విశ్రాంతి తీసుకుంటే తగ్గుతుంది. కానీ దీనిలో విశ్రాంతి తీసుకున్నా నొప్పి తొలగి పోవాలని లేదు. ఇది ఎప్పుడైనా సరే రావచ్చు. నిద్రలో వున్నాకూడా వస్తుంది. అలాగే ఏదైనా పని చేస్తునప్పుడు కూడా రావచ్చు.

### లక్షణాలు

ఏంజినా లక్షణాలు దీనిలో కూడా వుంటాయి. అవికాక దీనిలో కొన్ని ప్రత్యేకమైన లక్షణాలు కూడా కనబడతాయి.

★ తలతిరగడం

★ వికారం, వాంతి కావడం

★ కాళ్లు, చేతులు చల్లబడడం

★ మలము, మూత్రము వారికి తెలియకుండానే బట్టలలో అవడం

★ విపరీతంగా చెమటలు కారడం, తలపైనా, నుదురు పైన విస్తారంగా చెమటలు కారడం.

ఈ లక్షణాలు కనిపించిన తరువాత అరగంట గడిచినా తగ్గకపోతే వెంటనే డాక్టరుకు చూపించాలి.





రోగిని కనీసం నడిపించకూడదు కూడా. వెంటనే కదలనీయకుండా వీలైతే మంచం పైన పడుకో బెట్టాలి. రోగిని వీలైనంత త్వరగా దగ్గరలోని డాక్టరు వద్దకు తీసుకెళ్ళాలి. అందు బాటులోవుంటే మార్ఫిన్‌గాని, ఫెథిడిన్‌గాని కండరానికి ఇంజక్షన్ చేయాల్సి వుంటుంది.

రోగి అసుపత్రి నుండి ఇంటికి తిరిగి వచ్చాక కూడా చాలా జాగ్రత్తగా వుండాలి. శారీరక శ్రమ ఎట్టి పరిస్థితిలోను పనికిరాదు. నిదానంగా పని చేసుకోవచ్చు. అయితే మాటిమాటికి నొప్పిగాని, ఆయాసంగాని వస్తుంటే డాక్టరును సంప్రదించాలి. రక్తపోటును పరిశీలించాలి. రక్తపోటుకు తీసుకునే జాగ్రత్తలే దీనికి కూడా తీసుకోవాలి. పొగ త్రాగేవారు పొగత్రాగడం మానెయ్యాలి. పొగాకులో వుండే నికోటిన్ వలన రక్తనాళాలు సంకోచంచెంది రక్తపోటు, గుండెపోటు రావడానికి అవకాశం వుంటుంది. మూత్రపిండాల జబ్బు ఏదైనా వుంటే దానిని తక్షణం తగ్గించుకోవాలి. స్థూలకాయులు కూడా తమ వంటి బరువును తగ్గించుకోవాలి. ఎందుచేతనంటే స్థూలకాయులకు సుగర్ వ్యాధి, దానితో రక్తపోటు, గుండె పోటు కూడా వచ్చేందుకు అవకాశం వుంది.

### జాగ్రత్తలు

★ గుండె నొప్పి (Heart attack) వచ్చినప్పుడు రోగిని కదిలించ రాదు. కదిలిస్తే పరిస్థితి విషమించే ప్రమాదం వుంది.

★ దగ్గరలోని అన్ని వసతులు గల ఆసుపత్రికి తీసుకెళ్ళాలి. అక్కడ ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో వుంచుతారు.

★ తాగడానికి గాని, తినడానికి గాని నొప్పిగా వున్న సమయంలో ఏమీ ఇవ్వరాదు.

★ చికిత్స అంతా ICU (ఇంటెన్సివ్ కేర్ యూనిట్)లో జరుపుతారు.

★ రోగి గాలి పీల్చుకోలేక ఇబ్బంది పడుతున్నప్పుడు రోగికి అక్సిజన్ ముక్కు ద్వారా ఇవ్వాలి.

★ రోగి పరిస్థితి మెరుగు పడేదాకా తినడానికి ఏమీ లేదు కాబట్టి నీరసం తగ్గడానికి త్వరగా కోలుకోవడానికి నరానికి గ్లూకోజ్ ఎక్కించాలి. ఇది కూడా చాలాస్లోగా ఇవ్వాల్సి వుంటుంది.

★ తరచు రోగి రక్తపోటును పరీక్షించాలి. ఒకొక్క సందర్భంలో రోగికి టెంపరేచరు కూడావచ్చే అవకాశం వుంది.

★ కొందరిలో క్షణాలలో ఊపిరితిత్తులలో నీరు చేరిపోవచ్చు. సరైన వైద్య సదుపాయం గల ఆసుపత్రికి రోగిని తరలించాలి.

### చికిత్స

★ అమ్లోడిపైన్ కలిసిన ఈక్రింది వాటిని వాడవచ్చు.

అమ్‌లోగార్డ్ - 5 మి.గ్రా లేక 10 మి.గ్రా టాబ్లెట్లు

అమ్లోపిన్ - 5 మి.గ్రా. లేక 10 మి.గ్రా టాబ్లెట్లు

అమ్‌కార్డ్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా / 10 మి.గ్రా. టాబ్లెట్లుగాని

స్టామ్లో - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా / 10 మి.గ్రా. టాబ్లెట్లుగాని

రోజుకు ఒకటి 5 మి.గ్రా మోతాదులో గాని రోజుకు రెండు 2.5 మి.గ్రా మోతాదులో గాని వాడాలి మొత్తం రోజులో 10 మి.గ్రా. మించివాడరాదు.

★ గుండెనొప్పి ఎక్కువగా వున్నప్పుడు ఐసోసార్బైడ్ డైనైట్రేట్ కలిగివున్న

సార్బిట్రేట్ - 5 మి.గ్రా. టాబ్లెట్స్ గాని

ఐసోర్డిల్ - 5 మి.గ్రా / 10 మి.గ్రా. టాబ్లెట్స్ గాని

ఇసోమాక్ రిటార్డ్ - 20 మి.గ్రా / 40 మి.గ్రా. కాప్సుల్స్ గాని మాత్రలు 5 మి.గ్రా. మోతాదు నాలుక క్రింద ఒకటి పెట్టుకుంటే వెంటనే కరిగిపోయి నొప్పి తగ్గుతుంది.

★ యాంజిట్రేట్ - 20 మి.గ్రా. లేక

★ ఐసోకోర్ - 10 మి.గ్రా. / 20 మి.గ్రా లేక

★ యాంజిజెమ్ - 30 మి.గ్రా / 60 మి.గ్రా.

★ దిల్‌గార్డ్ - 30 మి.గ్రా / 60 మి.గ్రా.

వీటిలో ఏదైనా సరే రోజుకు నాలుగు సార్లు చేసుకోవాలి. రక్తం గడ్డ కట్టడం వల్ల హార్ట్ ఎటాక్ వస్తే - ఎస్పికాట్ 80 మి.గ్రా రోజుకో టాబ్లెట్ ఇతర మందులతో వాడుకోవచ్చు.

## గుండె ఆగిపోవడం (Cardiac arrest)

గుండెకు సంబంధించిన అత్యంత ప్రమాదకరమైన పరిస్థితి ఇది. అకస్మాత్తుగా గుండె అగి పోవడాన్ని కార్డియాక్ అరెస్ట్ (Cardiac arrest) అంటారు.

గుండె ఆగిపోవడానికి అనేక కారణాలు వుంటాయి. కారణాలు ఏవైనా సరే ఇటువంటి పరిస్థితి ఎదురైతే మాత్రం తక్షణం చికిత్స చేయాలి. లేకుంటే ప్రాణాపాయం తప్పదు.

### గుండె ఆగిపోవడానికి కారణాలు

★ మెదడుకు రక్త సరఫరా ఆగిపోయి మెదడు పని చేయకపోవడం వల్ల మెదడు నుండి సంకేతాలు గుండెకు అందవు తద్వారా గుండె ఆగిపోతుంది

★ శ్వాసనాళానికి ఏదైనా అడ్డుపడడం వల్ల కూడా గుండె అగుతుంది. శ్వాసనాళానికి అడ్డు పడడం వల్ల శ్వాస క్రియ సరిగ్గా జరగదు. దానితో చెడురక్తం మంచి రక్తంగా మారదు. మరలా అలాటి చెడు రక్తం గుండె కండరాలకు చేరడంతో గుండె ఆగిపోవచ్చు.

★ కరెంట్ షాక్ కొట్టినప్పుడు, నీళ్ళలో మునిగినప్పుడు కూడా భయభ్రాంతులకు లోనై గుండె ఆగిపోయే ప్రమాదం వుంది. ఒకొక్కసారి దిగ్భ్రాంతి కలిగించే వార్తలు ఆకస్మికంగా వినడం వల్ల కూడా గుండె ఆగిపోయే ప్రమాదం వుంది.





★ ఒకొక్కసారి శస్త్ర చికిత్సకు ఉపయోగించే మత్తు మందుల వల్ల కూడా కార్డిక్ అరెస్ట్ జరగవచ్చు. అదే విధంగా కొన్ని రకాల మందులవల్ల కూడా (వాటి విష ప్రభావం వల్ల) గుండె అగిపోవచ్చు.

★ అధిక రక్తస్రావం జరగడం వల్ల (ఏదైనా ప్రమాదాలు జరిగినప్పుడు గాని మరో విధంగాగాని), లేక అతిసారము వల్ల శరీరంలోని ఎలక్ట్రోలైట్స్‌లో అస్తవ్యస్థత వల్ల కూడా గుండె అగే ప్రమాదం వుంది.

★ గుండె అగిపోవడానికి కారణం ఏదో గుర్తించడం కొన్నిసార్లు కష్టంగా వుండవచ్చు. డాక్టరు సలహా తీసుకోవాలి.

### చికిత్స

★ గుండె అకస్మాత్తుగా .అగిపోతే ఆ వ్యక్తిని వెల్లికిలా పడుకోబెట్టాలి. అ తరువాత ఆలస్యం చేయకుండా ఛాతీ మధ్యలో గట్టిగా పిడికిలి బిగించి గుద్దాలి. దానితో ఆగిపోయిన గుండె తిరిగి కొట్టుకోవచ్చు. అలా కొట్టుకోవడం మొదలైతే కార్డియాక్ మసాజ్ చేయాలి. కృత్రిమ శ్వాసను కూడా అందించాలి. నరానికి సెలైన్ పెట్టి దానితో పాటుగా ఎడ్రినలిన్ ఇంజక్షన్ ఇవ్వాలి.

★ పై విధంగా ప్రథమ చికిత్స జరిపిన తరువాత మూడు నుండి పది నిముషాలలోగా గుండె తిరిగి మాములుగా కోలుకోవచ్చు. అయితే హార్ట్ ఎటాక్ వచ్చాక కనీసం అరగంట వరకు గుండెను మసాజ్ చేస్తూనే వుండాలి. ఈ లోపు ఆక్సిజన్ అందించి ICU లో చేర్చాలి.

## గుండె సోలిపోవుట (Heart Failure)

గుండెకు సంబంధించిన అనేక సమస్యలలో ఇది కూడా ఒకటి. గుండె సక్రమంగా పని చేయక పోవడాన్ని హార్ట్ ఫెయిల్యూర్ అంటారు. కొద్దిపాటి తేడాతో అన్నీ ఒకే విధంగా కనిపించే జబ్బులు - ఈ హార్ట్ ఫెయిల్యూర్, హార్ట్ ఎటాక్, కార్డియాక్ అరెస్ట్ వంటివి. కార్డియాక్ అరెస్ట్‌లో గుండె ఆగిపోతుంది. హార్ట్ ఫెయిల్యూర్‌లో గుండె అగిపోకుండా సాగి బలహీనమవుతుంది. గుండె సైజు పెరుగుతుంది.

హార్ట్ ఫెయిల్యూర్ కొన్ని రకాల మందులు వాడిన వారిలోను, ఊపిరితిత్తుల్లోఉండే కణజాలం గట్టిపడిన వారిలోను గుండె కండరాల జబ్బు వచ్చిన వారిలోను గుండె పోటు వచ్చి కోలుకుంటున్న వారిలోను చూడవచ్చు. ఇది మొదట్లో అంత ఇబ్బంది కలిగించదు గాని వ్యాధి ముదిరే కొద్దీ బాధలు అధికం అవుతాయి.

### వ్యాధి లక్షణాలు

★ ఆయాసం అనిపిస్తూ ఉంటుంది.

★ రాత్రిళ్ళు ఆయాసం ఎక్కువగా ఉంటుంది.

★ రోగికి కూర్చున్నప్పుడున్న హాయి వెల్లకిలా పడుకుంటే వుండదు. అలా పడుకోలేడు.

★ ఊపిరితిత్తులలో నీరు చేరి గురుగురలాడుతుంది.

★ దగ్గు బాగా వుంటుంది. దగ్గుతోపాటు తెమడ పడుతుంది. కొందరికి రక్తం కూడా కనబడవచ్చు.

★ దగ్గుతోపాటుగా వీరిలో చెమటలు కూడా ఎక్కువగానే వుంటాయి.

## వ్యాధి నిర్ధారణ

ఛాతీ ఎక్సరే తీసి గుండె పరిస్థితి తెలుసుకోవచ్చు, E.C.G. తీయాలి. ఎకోకార్డియోగ్రఫీ తీయడంవల్ల వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

## చికిత్స

గుండె పోలిపోయేది లేదా హార్ట్ ఫెయిల్యూర్ రెండు రకాలుగా వుంటుంది. (1) దీర్ఘతరంగా లేక క్రానిక్‌గా వుండడం, (2) ఎక్యూట్ లేదా తీవ్రంగా వుండడం.

హార్ట్ ఫెయిల్యూర్ దీర్ఘతరంగా లేక క్రానిక్‌గా వున్నప్పుడు

★ రోగికి పూర్తి విశ్రాంతి ఉండాలి.

★ రోగికి అహారంలో ఉప్పు బాగా తగ్గించాలి. అసలు లేకపోతే మరీ మంచిది. ఒకవేళ వేసుకోవాలనిపిస్తే రోజుకు రెండు గ్రాములు మించి వాడకూడదు.

★ పొగత్రాగే అలవాటు వుంటే పూర్తిగా మానెయ్యాలి. అలాగే సారాయి త్రాగే అలవాటు కూడా మానాలి.

★ మంచి నీరు కూడా రోజుకు మూడు లీటర్ల నీరు మాత్రం త్రాగవచ్చు అంతకు మించి త్రాగరాదు.

★ స్థూలకాయం వుంటే దానిని కూడా పూర్తిగా తగ్గించుకొనేందుకు ప్రయత్నించాలి. ఆహారంలో తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

★ వ్యాయామాలు చేయవచ్చు. కానీ పరిమితికి లోబడి చేయాలి. ఆయాసం వుంటుంది. కాబట్టి చిన్న చిన్న వ్యాయామాలు చేయవచ్చు.

★ రక్తపోటు పెరగకుండాచూడాలి.

★ కార్డాక్సిన్ - 0.25 మి.గ్రా. టాబ్లెట్స్ గాని

లానోక్సిన్ - 0.25 మి.గ్రా. టాబ్లెట్స్. ప్రతి ఎనిమిది గంటలకు ఒకటి చొప్పున వాడుకోవాలి. నిదానంగా డోసు రోజురోజుకు తగ్గించుకుంటూ పోవాలి.

★ అవసరాన్ని బట్టి కాల్షియం ఎంటాగోనిస్టలను వాడాలి.

★ రక్తపోటు పెరగకుండేందుకు - లాసిక్స్ టాబ్లెట్స్ వాడాలి. ఎనాల్‌ప్రిల్ టాబ్లెట్స్ కూడా రోజూ వాడాలి. ఎనాల్‌ప్రిల్ టాబ్లెట్స్ ఈ క్రింది పేర్లతో దొరుకుతాయి.

కన్వెర్టిన్ - 2.5 మి.గ్రా / 5 మి.గ్రా / 10 మి.గ్రా టాబ్లెట్స్





ఎన్ఏసి - 2.5 మి.గ్రా / 5 మి.గ్రా. / 10 మి.గ్రా. టాబ్లెట్స్

ఎన్వాస్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. / 10 మి.గ్రా. టాబ్లెట్స్

ఇన్వోరిల్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. / 10 మి.గ్రా. టాబ్లెట్స్

ఇలా పలు పేర్లతో దొరుకుతాయి.

హార్ట్ ఫెయిల్యూర్ తీవ్రంగా వుంటే దానికి

★ రోగిని వెల్లకిలాపడుకోబెట్టకుండా వెనుక ఏదైనా దిండు వంటిది పెట్టి ఏటవాలుగా కూర్చోబెట్టాలి.

★ రోగి ఆందోళనకు గురవకుండా వుండేందుకు మార్ఫియా ఇంజక్షన్ ఇవ్వాలి. దీనితో రోగికి బాధ కూడా తెలియదు.

★ లాసిక్స్ టాబ్లెట్ గాని ఇంజక్షన్ నరానికి ఇవ్వడంగాని చేయాలి.

★ ముక్కు ద్వారా ఆక్సిజన్ అందించాలి.

★ ఎమినోఫిలిన్ ఇంజక్షన్ నరం ద్వారా చాలా నెమ్మదిగా ఇవ్వాలి.

★ సార్బిట్రేట్ టాబ్లెట్ నాలుక క్రింద పెట్టాలి.

★ అవసరాన్ని బట్టి డోపమిన్ డ్రిప్ ఇవ్వాలి.

★ రోగికి పూర్తి విశ్రాంతి అవసరం, ఆందోళన కలిగించే ఆలోచనలు రానివ్వకూడదు. రోగికి అలసట కలిగించే వ్యాయామాలు, పనులు చేయరాదు.

# గుండెకండరాల వ్యాధి (Acute Myocarditis)

గుండె కండరాలకు వాపుకలుగుతుంది. మన శరీరంలోని గుండె పూర్తిగా కండర నిర్మితమైనది. మన జీవితాంతం బలంగావుండి పని చేసే కండరాలు గుండె కండరాలు. మనం పని చేయడానికి ఏ విధంగా కండరాల్ని ఉపయోగిస్తామో అలాగే గుండె కూడా తను పని చేయడానికి బలమైన కండరాల్ని ఉపయోగించుకుంటుంది. అయితే ఒకొక్కసారి గుండె కండరాలు బలహీనం అవుతాయి. సాగిపోతాయి. రక్తాన్ని సరిగ్గా సరఫరా చేయలేక పోతాయి. గుండె కండరాలు పని చేయలేని ఈ పరిస్థితిని 'ఎక్యూట్ మయోకార్డైటిస్ అంటారు.

## కారణాలు - లక్షణాలు

★ అకస్మాత్తుగా గుండె కండరాలు వాచడంతో ఈ వ్యాధి వస్తుంది.

★ గుండె కండరాలు వాచడంతో గుండె సక్రమంగా పని చేయదు. అలసట, అయాసం వస్తాయి.

★ గుండె పనితీరు మాత్రమే గాక హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు కూడా ఏర్పడతాయి. గుండె వాపుకు గురై పెరుగుతుంది.

★ ఎక్యూట్ మయోకార్డైటిస్ న్యూమోనియా, డిఫ్తీరియా వంటి బాక్టీరియాల ఇన్‌ఫెక్షన్ వల్ల ఫ్లూ, రూబెల్లా వంటి వైరస్ ఇన్‌ఫెక్షన్‌వల్ల వచ్చేందుకు అవకాశం వుంది. కొన్ని రకాల మందుల దుష్ప్రభావం వల్ల, రుమాటిక్ ఫీవర్ వంటి వాటివల్ల కండరాల వ్యాధులు రావడం వల్ల హృదయ కండరాల వ్యాధి వస్తుంది.

★ అప్పటిదాకా చక్కగా ఆరోగ్యంగా వున్న వ్యక్తిలో ఈ వ్యాధి వచ్చినప్పుడు హఠాత్తుగా ఆయాసం వస్తుంది. చిన్న పనికే ఆయాసం ఎక్కువగా వుంటుంది. కదలిక కూడా అయాసాన్నిస్తుంది. ఛాతీ నొప్పి ఉంటుంది.

★ రోగిరక్తపోటు చాలా తక్కువగా ఉంటుంది.

★ గుండె పెరగడంతో పాటు గుండెను పరీక్షిస్తే అసాధారణ ధ్వనులు వినబడతాయి.

## వ్యాధి నిర్ధారణ పరీక్షలు

★ ముఖ్యంగా E.C.G. తీసి చూడాలి. E.C.G లో గుండెలో తేడాలు కనబడతాయి.

★ ఛాతీ ఎక్స్‌రే తీసి చూస్తే గుండె పెరిగినట్లు కనబడుతుంది.

★ రక్త పరీక్ష చేస్తే కార్డియాక్ సీరమ్ ఎంజైమ్స్ పెరగడం తెలుస్తుంది.

★ ఎకోకార్డియోగ్రఫీ తీస్తే గుండె పెరగడం, గుండె పై పొరల్లో నీరు, గుండెకవాటాల్లో వ్యాధి ఉన్నట్లు తెలుస్తుంది.

## చికిత్స

★ గుండెకు సంబంధించిన పరీక్షలు చేసి నిర్ధారించిన తరువాత వ్యాధి మూల కారణాల్ని తెలుసుకోవాలి. దేనివల్ల వ్యాధి వచ్చిందో ఆ వ్యాధిని తగ్గిస్తే ఇది కూడా అదుపులో వుంటుంది.

★ రోగి అలసిపోయే పనులు చేయరాదు. పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి.

★ బాక్టీరియా లేక వైరల్ ఇన్‌ఫెక్షన్ వల్ల వ్యాధి వస్తే వ్యాధిని బట్టి యాంటీ బయాటిక్స్ వాడాలి.

★ పై మందులతో పాటు కార్టిజోన్ మందులు కూడా వాడాలి.

★ వ్యాధికి చికిత్స డాక్టరు పర్యవేక్షణలోనే వుండాలి.

# పెరికార్డైటిస్ (Pericarditis)

హృదయావరణం అనేది గుండె నంటి ఉండే పొరలు రెండింటిని కలిపి పిలుస్తారు. గుండెను అంటిపెట్టుకుని లోపలి పొరను విసరల్ పెరికార్డియం (Visceral Pericardium) అని వెలుపలి పొరను పెరైటల్ పెరికార్డియం (Perietal pericardium) అని అంటారు. ఈ రెండు పలచని పొరలు అంచులు అంటుకుని మధ్య భాగం విడిగా వుంటాయి. ఈ మధ్య బాగంలో కొద్దిపాటి ద్రవం వుంటుంది. ఈ ద్రవం గుండెను బాహ్య వత్తిడుల నుండి షాక్ అబ్జార్బర్





లాగా రక్షిస్తుంది. అంతేగాక బాక్టీరియా, ఫంగస్, వైరస్, ప్రోటోజోవా వంటి వ్యాధి కారక క్రిముల నుండి కాపాడుతుంది. అయితే ఇలా బాక్టీరియా లేక వైరస్, వంటి వ్యాధి కారక క్రిములు సోకినప్పుడు కొందరిలో ఈ పొర వాచి నొప్పిని కలిగిస్తుంది. ఇలా వాపు కలిగి వుండడాన్ని 'పెరికార్డైటిస్' అని అంటారు.

## కారణాలు

★ పెరికార్డియం వాపు కలగడానికి వ్యాధి కారక క్రిములు ముఖ్యకారణం. అవి ఫంగస్, బాక్టీరియా, వైరస్. ప్రోటోజోవా క్రిములు, వీటిలో ఏదైనా కారణం కావచ్చు.

★ పెరికార్డైటిస్ ఒకొక్కసారి గుండె ఆపరేషన్‌లు జరిగినప్పుడు దానికి కలిగిన గాయం వల్ల కూడా వస్తుంది.

★ థైరాయిడ్ గ్రంధి తక్కువగా థైరాక్సిన్ హార్మోన్‌ను తయారు చేయడం వల్ల కూడా రావచ్చు.

★ రుమాటిక్ ఫీవర్ (కీళ్ళవాపు జ్వరం)లోను, కొన్ని రకాల కేన్సర్ వ్యాధులలోను, కొన్ని రకాల మందుల దుష్ప్రభావం వల్లను పెరికార్డైటిస్ వ్యాధి వస్తుంది.

★ రక్తంలో యూరియా శాతం పెరగడంవల్ల కూడా పెరికార్డైటిస్ వ్యాధి రావచ్చు.

## పెరికార్డైటిస్ పరిస్థితిలోని లక్షణాలు

★ పెరికార్డైటిస్ వచ్చిన వారిలో ఛాతీమధ్యలో నొప్పి వుంటుంది.

★ చలితో జ్వరంగా కూడా వుంటుంది.

★ ఆయాసం, దగ్గు ఉంటాయి.

★ పెరికార్డైలిస్ ఆకస్మికంగా కనబడవచ్చులేదా నిదానంగా రావచ్చు. ఆకస్మికంగా వస్తే వారిలో ఛాతీ మధ్యలో నొప్పి వుంటుంది.

★ ఛాతిలో నొప్పి, చెమటలు పట్టడం, ఆయాసం వుండడంతో దీనిని హార్ట్ ఎటాక్‌గా పొరబడే ప్రమాదం కూడావుంది.

## వ్యాధి నిర్ధారణ

ఛాతీ ఎక్స్‌రే తీయడంతోను, ఇ.సి.జి. ద్వారాను, ఎకోకార్డియోగ్రఫీ తీయడం వల్ల పెరికార్డైటిస్‌ను నిర్ధారించవచ్చు.

## చికిత్స

★ అన్ని రకాల గుండె వ్యాధులకు మల్లె దీనికి కూడా పూర్తి విశ్రాంతి కావాలి.

★ బ్రూఫెన్ - 400 మి.గ్రా / 600 మి.గ్రా. టాబ్లెట్లు

ఎనాఫ్లామ్ - 400 మి.గ్రా టాబ్లెట్లు

ఐబుజెసిక్ - 400 మి.గ్రా / 600 మి.గ్రా టాబ్లెట్లు

వీటిలో ఏదైనా సరే రోజుకు మూడు టాబ్లెట్లు వాడాలి. లేదా

★ ఇండోమెథాసిన్ 100 మి.గ్రా. చొప్పున రోజుకు మూడు టాబ్లెట్లు వాడవచ్చు.

★ ప్రెడ్నిసోలిన్ కలసిన -

వైసోలిన్ - 5 మి.గ్రా. / 10 మి.గ్రా. / 20 మి.గ్రా. టాబ్లెట్లు

డెల్టాకార్ట్రిల్ - 5 మి.గ్రా. టాబ్లెట్లు గాని

ఎంసోలోన్ - 5 మి.గ్రా. / 10 మి.గ్రా టాబ్లెట్లు గాని

హిస్టాకార్టిన్ - 5 మి.గ్రా టాబ్లెట్స్

ఆమ్నాకార్టిల్ - 5 మి.గ్రా. / 10 మి.గ్రా / 20 మి.గ్రా టాబ్లెట్లు

వీటిలో ఏదైనా సరే రోజుకు మూడు సార్లు ఇవ్వాలి. డోసు నిర్ధారణ పూర్తిగా డాక్టరు పర్యవేక్షణలోనే జరగాలి.

పెరికార్డియంనకు సంబంధించి ఇంకా అనేక రకాల సమస్యలు వుంటాయి. వాటిలో కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్, పెరికార్డియల్ ఎఫ్యూజన్ వంటివి - వీటిలో కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్ (Consrictive Pericarditis) అనే పరిస్థితిలో గుండె పై నుండే పొరదళసరిగా మారుతుంది. గుండెను కుంచించుతుంది.

కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్‌లో గుండెను పెరికార్డియం నొక్కి వేస్తుంది. దీనివల్ల గుండె నుండి రక్తాన్ని బయటకు తీసుకునివెళ్ళే పెద్ద రక్తనాళాలు. గుండెకు రక్తాన్ని తిరిగి చేరవేసే రక్త నాళాలు నొక్కి వేయబడి రక్త సరఫరాలో అంతరాయం కలుగుతుంది.

పెరికార్డియంనకు క్షయవ్యాధి క్రిములుగాని, ఇతర బాక్టీరియా క్రిములుగాని కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్‌కు కారణం కావచ్చు.

### లక్షణాలు

కన్‌స్ట్రిక్టివ్ పెరికార్డైటిస్ పరిస్థితిలో ఈ క్రింది లక్షణాలు కనబడతాయి.

★ రోగికి గుండెదడ, ఆయాసం వుంటాయి.

★ రోగి గుండెకు రక్తాన్ని చేరవేసే సిరలపై వత్తిడి పెరడగం వల్ల రోగి మెడదగ్గరి సిరలు బాగా ఉబ్బి కనబడతాయి.

★ రోగి నాడి చాలా బలహీనంగా కొట్టుకుంటుంది.





★ రోగి కాలేయం పెరుగుతంది. చేతితో తాకితే నొప్పిగా వుంటుంది.

★ రోగి ప్లీహం (Spleem) పెరుగుతుంది అంతేగాక కడుపుకు నీరు చేరి పెద్దదవుతుంది.

### వ్యాధి నిర్ధారణ

ఇ.సి.జి. ఛాతిని ఎక్స్‌రే తీయడం ద్వారా, MRI ద్వారా, ఎకోకార్డియోగ్రఫీ ద్వారా వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

### చికిత్స

దీనికి శస్త్రచికిత్స చేసి గుండె రక్తనాళాలను నొక్కి వేస్తున్న పెరికార్డియంను తొలగించడమే. అయితే పెరికార్డైటిస్‌కు క్షయ వ్యాధి వంటి ఇతర ఇన్‌ఫెక్షన్‌లు కారణం అయితే వాటికి తగిన యాంటీబయాటిక్స్ వాడి వ్యాధి నుండి ఉపశమనం పొందవచ్చు.

## పెరికార్డియల్ ఎఫ్యూజన్ (Pericardial affusion)

దీనిలో పెరికార్డియం పొరల మధ్యనుండే ద్రవంలోనికి నీరు అధికంగా చేరుతుంది. ఇలా నీరు చేరడం వల్ల వీరిలో మధ్య ఛాతీలో నొప్పి అధికంగా వుంటుంది. ఈ నొప్పి దగ్గినా, తుమ్మినా లేదా గట్టిగా గాలి పీల్చినా లేక ఛాతీ పై వత్తిడి కలిగినా, ఏదైనా తిన్నా కూడా ఎక్కువ అవుతుంది. అంతేగాక ఈ నొప్పి ఛాతీ మధ్యలోనేగాక చేతులలోనికి, ఛాతీ వెనుకకు మెడకు కూడా పాకుతుంది. గుండె బలహీనం అవుతుంది.

### వ్యాధి నిర్ధారణ

పెరికార్డియల్ ఎఫ్యూజన్ కొరకు ఛాతీ ఎక్సరే తీయడంతోనే తెలియవచ్చు. ఎక్సరేలో గుండె చాలాపెద్దగా కనబడుతుంది. అయితే ఇంకా ఇతర పరీక్షలు కూడా అవసరం. వాటిలో ఇ.సి.జి ఎకోకార్డియోగ్రామ్ వంటివి. వీటిలో గుండె చుట్టూ వున్న నీరు స్పష్టంగా తెలుస్తుంది. మాగ్నెటిక్ రిసొనెన్స్ ఇమేజింగ్ (MRI) ద్వారా పెరికార్డియంలోని నీరు స్పష్టంగా తెలుస్తుంది. అంతేగాక పెరికార్డియో సెంటసిస్ అనే పద్ధతిలో పెరికార్డియంలోనికి సూది వేసి సిరంజితో నీటిని లాగి లాబరేటరీలో పరీక్ష చేసి నట్లైతే వ్యాధిని పూర్తిగా నిర్ధారించవచ్చు.

### చికిత్స

★ అన్ని గుండె వ్యాధుల వలె దీనికి కూడా పూర్తి విశ్రాంతి కావాలి.

★ ఛాతీ నొప్పి తగ్గడానికి పెరికార్డైటిస్‌లో వాడే మందుల్నే వాడవచ్చు.

★ పెరికార్డియంలో చేరిన నీటిని పరీక్షించి అది ఏ యితర వ్యాధి కారక క్రిముల వల్ల వచ్చిందో తెలుసుకోవాలి. ఆ తరువాత దానికి సంబంధించిన మందులు వాడితే నీరు తగ్గుతుంది.

★ పెరికార్డియంలో నీరు బాగా ఎక్కువగా వుంటే సూది వేసి తొలగిస్తే ఉపశమనంగా వుంటుంది.

★ దీర్ఘకాలం నీరు వున్నా తరచు నీరు చేరి ఇబ్బందిగా వుంటున్న పెరికార్డియంను తొలగించాల్సి వుంటుంది.

## కార్డియాక్ ఎరిథ్మియాస్ (Cardiac Arrhythmias)

మన గుండె 'లబ్-డబ్' అని నియమిత సమయంలో లయబద్ధంగా కొట్టుకుంటూ వుంటుంది. ఏ కారణం చేతనైనా ఇలా కొట్టు కోకుండా ఎక్కువగానో లేక తక్కువగానో, అస్తవ్యస్తంగానో కొట్టుకోవడాన్ని - రిధమిక్‌గా కొట్టుకోకుండా వుంటే ఎరిథ్మియాస్ లేక కార్డియాక్ ఎరిథ్మియాస్ అంటారు.

### కారణాలు

★ కార్డియాక్ ఎరిథ్మియాస్, అనేక కారణాల వల్ల రావచ్చు. రక్తపోటు ఉన్నవారిలోను

★ గుండె జబ్బు రావడం వల్లను

★ ఒకొక్కసారి షాక్ వల్ల

★ కొన్ని రకాల మందుల దుష్ప్రభావంవల్ల

★ అతిగా ఉద్రేకం చెందడం వల్ల, ఆవేశం వల్ల

★ చిన్న పిల్లల్లోను

★ రక్తహీనత గలవారిలో, గర్భిణీ స్త్రీలలో

★ గుండెపోటు, మయోకార్డైటిస్ వచ్చిన వారిలో మద్యం సేవించేవారిలో, ధూమపానం చేసేవారిలో మానసిక రోగులలో కూడా ఈ కార్డియాక్ ఎరిథ్మియాస్ సహజంగా వస్తుంది.

### లక్షణాలు

కార్డియాక్ ఎరిథ్మియాస్ వచ్చిన వారిలో చాలా మందికి ఎలాటి ఇబ్బందీ వుండదు. కాని కొంతమందిలో గుండెదడ, తలతిరుగుడు, ఛాతీ బరువుగా వుండడం, ఛాతీ కాస్త నొప్పిగా వుంటుంది.

### చికిత్స

★ చాలామందికి ఎరిథ్మియాస్ దానంతట అదే తగ్గిపోతుంది. అయితే ఎరిథ్మియాస్ తరుచు కనబడుతుంటే కారణాన్ని బట్టి చికిత్స చేయాలి.

★ గుండె జబ్బు లేకుండా వచ్చే ఎరిథ్మియాస్ గురించిన భయం ఏమీలేదు. దీనిని విశ్రాంతి తీసుకోవడం ద్వారా పోగొట్టవచ్చు.

★ కార్డియాక్ ఎరిథ్మియాస్ ఏ కారణం చేత వచ్చినప్పటికీ ధూమపానం (పొగత్రాగడం), కాఫీ, టీలు త్రాగడం, సారాయి (మద్యపానం) త్రాగడం, మానివేయాలి.





★ మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవడం, ఎలాటి ఆందోళనలు లేకుండా చేసుకోవడంతో చాలావరకు రోగం తగ్గుతుంది.

★ కార్డియాక్ ఎరిథ్మియాస్‌కు నాలుగు రకాల మందులు వున్నాయి. అవి

1. బీటా బ్లాకర్స్ : అటెనోలాల్, ప్రొపనోలాల్, ఆక్స్ప్రెనోలాల్, మెటోప్రొలాల్, ప్రాక్టోలాల్, సోటాలాల్, పిన్‌డోలాల్ వంటివి.
2. ACE ఇన్‌హిబిటర్స్ : లిసినోప్రిల్ వంటివి.
3. కాల్షియం ఛానల్ బ్లాకర్స్ : అమోడిపైన్, నిఫెడిపైన్, బినిడిపైన్, డిల్‌టియాజెమ్, ఫెలోడిపైన్, వెరాపమిల్
4. ఇతర మందులు : ఎడినోసైన్, అమియోడరోన్, డిల్టియాజెమ్, ఎస్మోలాల్, డిసోపైరమిడ్, లిగ్నోకైన్, క్వినిడైన్, ఫెనిటాయిన్ వంటివి.

## గుండెకు చెందిన ఇతర వ్యాధులు

## పుట్టుకతో వచ్చే గుండె వ్యాధులు (Congenital heart diseases)

కొందరికి పుట్టుకతోనే గుండె జబ్బులు వస్తాయి. వీరు గుండె జబ్బుతో వున్నారని గుర్తించిన తరువాత వెంటనే చికిత్స జరపాలి. కొందరికి శస్త్ర చికిత్స చేస్తే వ్యాధి నయం కావచ్చు మరికొందరికి ప్రాణాపాయం తప్పదు.

### కారణాలు

★ మేనరికాలు చేసుకోవడం వల్ల జన్యుపరంగా వ్యాధి సంక్రమించవచ్చు.

★ తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు పిండానికి ప్రాణవాయువు తక్కువగా అందడం వల్ల.

★ తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు రూబెల్లా వ్యాధి రావడం వల్ల

★ తల్లికి అనీమియా రావడం వల్ల

★ తల్లి కడుపుతో వున్నప్పుడు మద్యం సేవించడం, పొగ త్రాగడం వల్ల

★ గర్భిణీ స్త్రీ తరచు ఎక్స్‌రే తీయించుకోవడంవల్ల

★ గర్భిణీకి గుర్రపువాతం రావడం వల్ల

★ మరికొందరికి క్రోమోజోముల్లో తేడాలు రావడం వల్ల, డౌన్స్‌సిండ్రోమ్, టర్నర్స్ సిండ్రోమ్ వంటివి రావడం వల్ల కూడా వీరిలో గుండె గోడల్లో రంధ్రాలు ఏర్పడడం, బృహద్ధమనిలో లోపాలు రావడం, శారీరక, మానసిక క్షీణము, మంగోలు ముఖం వంటివి వస్తాయి.

## పుట్టుకతో వచ్చే కొన్ని గుండె జబ్బుల గురించి చూద్దాం

★ బృహద్ధమని సన్నగిల్లడం (Coarctation) : గుండె నుండి శరీరం అంతటికీ మంచి రక్తాన్ని సరఫరాచేసేదమనిని బృహద్ధమని అంటారు. పేరుకు తగ్గట్టుగానే ఇది కూడా పెద్దగానే వుంటుంది. అయితే పుట్టుకతో వచ్చే జబ్బులో ఇది మొదట్లోనే సన్నబడడం వల్ల శరీరంలో దిగువ భాగానికి సరిగ్గా రక్తం అందదు. దీనివల్ల వీరిలో రక్తపోటు కూడా వుంటుంది. దీనిని ఎకోకార్డియోగ్రఫీ తీసి నిర్ధారించుకుని బృహద్ధమనికి శస్త్ర చికిత్స చేసి సరి చేయవచ్చు.

★ వెంట్రిక్యులార్ సెప్టల్ డిఫెక్ట్ (Vertricular septal defect) (VSD) : గుండెకు నాలుగు గదులు వుంటాయి. వీటిలో క్రింది గదులను జఠరికలు లేదా వెంట్రికల్స్ అంటారు. క్రింది భాగంలో వుండే ఈ జఠరికల రెండింటి మధ్య వుండే గోడకు రంధ్రం ఏర్పడుతుంది. దీనినే వి.యస్.డి. అని పిలుస్తారు. దీనివల్ల చెడు రక్తం మంచి రక్తం కలుస్తాయి. అయితే దాదాపు అరవై శాతం మందిలో మయసు పెరిగే కొద్దీ మధ్యలో ఏర్పడిన రంధ్రం అదే పూడిపోతుంది. అలా రంధ్రం మూసుకొని వారికి, వ్యాధి వల్ల తీవ్ర ఇబ్బందులు వున్నా శస్త్రచికిత్స చేయాలి.

★ ఏట్రియల్ సెప్టల్ డిఫెక్ట్ (Atrial septal defect) (ASD) : గుండెలోని కర్ణికల మధ్యనున్న గోడకు రంధ్రం పడితే దానిని ASD గా వ్యవహరిస్తారు. ఇది పుట్టుకతోనే వస్తుంది. ఇందులో ఎడమవైపు ఉన్న గదిలో నుండి మంచి రక్తం కుడివైపు గదిలోనికి కొంత చేరుతుంది. వీరికి మొదట్లో ఎలాటి బాధ వుండదు. అయితే వయసు పెరిగిన తరువాత ఆయాసం రావడం, తేలికగా అలసిపోవడం వుంటాయి. ఛాతీ ఎక్స్‌రే తీసిగాని, ఎకోకార్డియోగ్రఫీ వల్లగాని, ఇ.సి.జి తీసిగాని కెథ్రటైజేషన్ వల్లగాని వ్యాధిని నిర్ధారించుకోవచ్చు. సర్వసాధారణంగా ఈ వ్యాధి కూడా వయసు పెరిగేకొద్దీ తగ్గవచ్చు. కానీ ఆయాసం రావడం వుంటే వ్యాధి వున్నట్లే భావించి, వారికి శస్త్రచికిత్స చేసి రంధ్రాన్ని సరిచేయాలి.

★ పేటెంట్ డక్టస్ ఆర్టీరియోసిస్ (Patent ductus arteriosus) (PDA) : ఇది పల్మొనరీధమని, ఆయోర్టా - రెంటినీ కలుపుతూ గర్భంలో వున్నప్పుడే శిశువులో ఏర్పడుతుంది. బిడ్డ ఎదిగేకొద్దీ ఇది కనుమరుగై పోతుంది. కాని కొందరిలో ఇది అలాగే వుండి పోతుంది. ఛాతీ ఎక్స్‌రే తీసి, ఎకోకార్డియోగ్రఫీ, ఇ.సి.జి తీయడం వల్ల వ్యాధిని నిర్ధారించవచ్చు. శస్త్రచికిత్స చేసి వ్యాధిని నివారించుకోవచ్చు.

★ ఫాలెట్ టెట్రాలజీ (Fallot's tetralogy) : ఈ వ్యాధిలో పల్మొనరీ వాల్వ్ పుట్టుకతోనే మూసుకుపోయి వుంటుంది. అంతేగాక కుడి ప్రక్కన వెంట్రికల్ పెరిగి వుంటుంది. వెంట్రికల్స్ రెంటి మధ్యనున్న గోడకు రంధ్రం వుంటుంది. బృహద్ధమని స్థానం





మారుతుంది. ఇలా నాలుగు రకాల లోపాలు పుట్టుకతోనే ఏర్పడతాయి. దీనిలో ఆయాసం, గుండెదడ వుంటాయి. చేతి గోళ్ళు బాగా వుబ్బి కనబడతాయి. కార్డియాక్ కేథరైజేషన్ చేసి, ఎకోకార్డియోగ్రఫీ ద్వారాగాని, ఇ.సి.జి. తీసి ఎక్స్‌రే ద్వారాగాని వ్యాధిని నిర్ధారించవచ్చు. వ్యాధికి ప్రత్యేకంగా చికిత్స ఏమీ అవసరం లేదు, దానంతట అదే తగ్గిపోవచ్చు. వ్యాధి తీవ్రంగా వుంటే మాత్రం శస్త్ర చికిత్స ద్వారా సరిచేయాల్సి వుంటుంది. గుండెకు సంబంధించిన ఏ వ్యాధిలోనైనా సరే తగిన విశ్రాంతి తీసుకుని సకాలంలో చికిత్స తీసుకుంటే వ్యాధి తగ్గేందుకు అవకాశం వుంది.

## గుండెకవాటాల వ్యాధులు

★ గుండె నాలుగు గదులుగా వుంటుంది, కర్ణికలు, జఠరికలని రెండేసి గదులుగా వుంటాయి. వీటి మధ్య రక్తప్రసరణ జరుగుతుంది. రక్తం ఒకే వైపునకు ప్రసరించేందుకు అనువుగా కవాటాలు అమరి వుంటాయి. ఎడమవైపు కర్ణిక, జఠరిక మధ్య మైట్రల్ కవాటం (Mitral valve) వుంటుంది. కుడి కర్ణిక, జఠరిక మధ్య ట్రైకస్పిడ్ కవాటం (Tricuspid valve) వుంటుంది. బృహద్ధమనికి ఎడమ వెంట్రికల్‌కు మధ్యన ఒక కవాటం వుంటుంది. అలాగే పుపుసధమనికి కుడి వెంట్రికల్‌కు మధ్యన ఒక కవాటం వుంటుంది. వీటికి వచ్చే జబ్బులు గుండె కవాటాల జబ్బులుగా పిలుస్తారు.

★ పల్మొనరీస్టినోసిస్ (Pulmonary stenosis) : చాలా గుండె కవాటాల వ్యాధులలో ఇది పుట్టుకతోనే వస్తుంది. గుండె దడ, ఆయాసం, కాలేయం నొప్పిగా వుండడం పాదాలకు నీరు చేరడం వుంటాయి. పల్మొనరీ వాల్వ్‌కు సర్జరీ చేయడంతో వ్యాధి నివారించవచ్చు.

★ పల్మొనరీ రీగర్జిటేషన్ (Pulmonary regurgitation) : దీనిలో కూడా పుపుస కవాటాలలో లోపం పుట్టుకతోనే వస్తుంది. అంతేగాక రుమాటిక్ ఫీవర్ అనే కీళ్ళ వాపు జ్వరం వల్ల కూడా రావచ్చు. పాదాలకు నీరు చేరడం, గుండెదడ, ఆయాసం వుంటాయి. శస్త్రచికిత్స చేసి వ్యాధిని నివారించవచ్చు.

★ ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్ (Tricuspid regurgitation) : దీనిలో కుడి ఏట్రియం, వెంట్రికల్‌ల మధ్య వాల్వ్‌లీకేజ్ వుంటుంది. మెట్రిల్ వాల్వ్‌లలో లోపాలు, పల్మొనరీ స్టినోసిస్ వంటి వ్యాధులు, పల్మొనరీ హైపర్ టెన్షన్ వల్ల కూడా ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్ వస్తుంది. దీనిలో కాలేయం నొప్పిగా వుంటుంది. మెడవద్ద నరాలు వాపు చూపుతాయి. కాళ్ళకు నీరు వస్తుంది. తేలికగా అలసి పోతారు. పూర్తిగా విశ్రాంతి తీసుకుని తాత్కాలిక ఉపశాంతికై మందుల్ని వాడుతూ పాడైపోయిన వాల్వ్‌కు బదులు కృత్రిమ వాల్వ్‌ను సర్జరీ ద్వారా అమర్చడంతో ఈ పరిస్థితి తొలగుతుంది.

- ★ ట్రైకస్పిడ్ స్టినోసిస్ **(Tricuspid stenosis)** : మైట్రల్ స్టినోసిస్ (మైట్రల్ కవాటము సన్నబడడం) వల్ల రుమాటిక్ హార్ట్‌డిసీజ్‌వల్ల ఈ పరిస్థితి వస్తుంది. దీనిలో కూడా పాదాలకు నీరు చూపుతుంది. ఆయాసం, కాలేయం నొప్పిగా వుండడం ఊరికినే అలసి పోవడం వుంటాయి.
- ★ మైట్రల్ రీగర్జిటేషన్ **(Mitral regurgitation)** : మైట్రల్ కవాటం పటుత్వం కోల్పోతుంది. తద్వారా రక్తం లీక్ అవుతుంది. రుమాటిక్ ఫీవర్ రావడం వల్లగాని, బాక్టీరియా సోకడం వల్లగాని గుండె జబ్బు వస్తుంది. మైట్రల్ రిగర్జిటేషన్ వల్ల గుండె బాగా పెరిగిపోయి హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు కనబడతాయి. గుండె జబ్బు తక్కువగా వున్నప్పుడు మందుల్ని వాడవచ్చు. వ్యాధి ఎక్కువగా వుంటే కృత్రిమమైన కవాటాన్ని శస్త్ర చికిత్స చేసి అమర్చాల్సి వుంటుంది.
- ★ మైట్రల్ స్టినోసిస్ **(Mitral stenosis)** : మైట్రల్ స్టినోసిస్‌లో మైట్రల్ కవాటం సన్నబడుతుంది. ఇది పుట్టుకతోనే రావచ్చు. రుమాటిక్ ఫీవర్ రావడం వల్ల కూడా ఈ పరిస్థిదతి రావచ్చు. ఈ పరిస్థితివల్ల అంత ఇబ్బంధి అన్పించక పోవచ్చు. గానీ కొందరిలో మాత్రం గుండెకు నీరు చేరి నోటి వెంట రక్తం పడడం, గుండె దడ వుంటుంది. వీరు తేలికగా అలసి పోతారు. ఏంజినా గుండె నొప్పి వస్తుంది. గొంతు బొంగురు పోవడం, ముద్దసరిగా మింగుడు పడకపోవడంతోపాటు మనిషి నీలంగా కూడా మారవచ్చు. మైట్రల్ స్టెనోసిస్ వల్ల ట్రైకస్పిడ్ రీగర్జిటేషన్ కూడా రావచ్చు.
- ★ అయోర్టిక్ రీగర్జిటేషన్ **(Aortic regurgitation)** : బృహద్దమనికి చెందిన కవాటం పని చేయక పోవడంను ఆయోర్టిక్ రీగర్జిటేషన్ అంటారు. దీనికి కూడా రుమాటిక్ ఫీవర్ రావడం, సబ్ ఎక్యూట్ ఎండో కార్డైటిస్ వంటి వ్యాధులేగాక సిఫిలిస్ వ్యాధి కూడా ఈ పరిస్థితికి కారణం అవుతుంది. ఛాతీలో నొప్పితో పాటు గుండెదడ, ఆయాసం వుంటాయి. హార్ట్ ఫెయిల్యూర్ లక్షణాలు కనబడితే కొన్ని మందుల్ని వాడి తీవ్రతను తగ్గించుకోవచ్చు. పరిస్థితిని బట్టి కృత్రిమ కవాటాన్ని అమర్చడమే మంచిది.
- ★ అయోర్టిక్ స్టినోసిస్ **(Aortic stenosis)** : బృహద్ధమనికి చెందిన కవాటం రంధ్రం మూసుకు పోవడం ఉంటుంది. ఈ రకమైన పరిస్థితి సాధారణగా పుట్టుకతోనే కనిపిస్తుంది. వాల్వ్ గట్టిపడిన, గుండె నొప్పి, ఆయాసం వంటి లక్షణాలు బయట పడతాయి. శస్త్ర చికిత్స చేస్తే పరిస్థితి బాగుపడుతుంది.

ఎకోకార్డియోగ్రఫీ, ఇ.సి.జి. ఛాతీ ఎక్స్‌రే వంటి పరీక్షలు చేసి వ్యాధిని నిర్ధారించవచ్చు.

సర్వసాధారణంగా గుండెకవాట వ్యాధులు అన్నింటిలోను రుమాటిక్ ఫీవర్ రావడం గమనిస్తే రుమాటిక్ ఫీవర్ ఎంత ప్రమాదాన్ని కలిగిస్తుందో గుండెకు ఎంత చెరుపు చేస్తుందో అవగతమవుతుంది. రుమాటిక్ ఫీవర్ వస్తే వారికి పెనిడ్యూర్ 12LA ఇంజక్షన్‌ను నెలకు ఒకటి





చొప్పున ఇరవైఏళ్ళు వయసు వచ్చేవరకు చేయాలి. నొప్పికి - ఇంకా కొన్ని మందులు కూడా వాడాలి. ఇవన్నీ డాక్టరు సలహా మేరకు మాత్రమే వాడాలి.

## గుండె జబ్బురాకుండా వుండాలంటే ?

- ★ గుండె జబ్బులు రాకుండా వుండాలంటే పొగ త్రాగరాదు. అంతేకాదు పొగ త్రాగేవారి ప్రక్కన వుండి వారు వదిలిన పొగపీలిస్తే మరీ ప్రమాదం.
- ★ రోజు కొద్దిసేపు వ్యాయామం, యోగా చేయడం మంచిది. ముఖ్యంగా ఏ వయసు వారైనా సరే వారి వయసు తగ్గట్లు పరుగు పెట్టడం, ఈత కొట్టడం, బాడ్మింటన్ ఆడడం వంటివి చేయవచ్చు. మరీ ఇబ్బంది పడేవారు కనీసం నడకే అయినా నడవాలి.
- ★ అహారంలో కొవ్వు, నూనెలు అధికంగా వుండేవి వాడరాదు.
- ★ స్థూలకాయం వుండరాదు. వుంటే తగ్గించుకునేందుకు ప్రయత్నించాలి. బరువు కూడా అధికంగా వుండరాదు.
- ★ రక్త పరీక్ష చేయించుకుంటే రక్తంలో కొలెస్ట్రాల్ ఏ శాతంలో వుందో తెలుస్తుంది. సరిగ్గా ఉండవలసిన శాతం ఉంటే సరే - లేకపోతే కొవ్వు పదార్థాలు తగ్గించడం ద్వారా కొలెస్ట్రాల్ శాతాన్ని తగ్గించవచ్చు.
- ★ విశ్రాంతి తీసుకోవచ్చుగాని అదే పనిగా విశ్రాంతి తీసుకోవడం వల్ల స్థూలకాయం వచ్చే అవకాశం వుంది. కొంత అయిన శారీరక శ్రమ చేస్తే మంచిది.
- ★ పాన్‌పరాగ్‌లు, గుట్కాలు వక్కపొడి మానెయ్యాలి.
- ★ లోడెన్సిటీ లిపోప్రొటీన్ (LDL) శాతం, ట్రై గ్లిసరైడ్స్ శాతం రక్తంలో బాగా తక్కువగా వుండేట్లు చూడాలి.
- ★ షుగర్ వ్యాధి వున్నవారు వ్యాధిని ఎప్పుడూ అదుపులో వుంచుకోవడం వల్ల గుండె సంబంధమైన ఇబ్బందులు ఎదురుకావు.
- ★ ఆహారంలో ఉప్పు తక్కువగా వాడడం వల్ల రక్తపోటు కూడ అదుపులో వుంచుకోవచ్చు.
- ★ మూత్రంలో యూరిక్ ఏసిడ్ ఎక్కువగా వుంటే దానిని తగ్గించుకోవాలి.
- ★ గర్భిణీ స్త్రీలు చాలా జాగ్రత్తగా వుండాలి. రక్తపోటుగాని మధుమేహంగాని పూర్తిగా అదుపులో వుండేట్లు వుండాలి.
- ★ కాఫీ, టీ, పాన్ వంటివి పనికిరావు
- ★ సారాయి అసలు పనికిరావు
- ★ సాత్త్వికాహారం తీసుకోవాలి. వీలైతే శాఖాహారానికే పరిమితం అయితే మంచిది.
- ★ మానసిక వత్తిడి తగ్గించుకోవాలి. కంటి నిండా నిద్రపోవాలి. మితంగా భోజనం చేయాలి. ఆకుకూరలు వాడాలి.

★ మనసు వుల్లాసంగా ఉండేట్లు చూసుకోవాలి.

★ ఒకవేళ వంశ పారంపర్యంగా గుండె వ్యాధులు వస్తాయేమోననే అనుమానం వుంటే ముందు జాగ్రత్త పడవచ్చు. అయితే మరీ చిన్నవయసులో అయితే కష్టంగాని ఇరవై ఏళ్ళు దాటిన వారిలో రక్తపోటు కనిపిస్తే వారు తరచుగా రక్తపోటు చూపించుకోవాలి. చక్కెర వ్యాధి అదుపులో వుండేట్లు చూసుకోవాలి. కొలెస్ట్రాల్ పరీక్ష వంటివి జరిపించాలి.

★ రుమాటిక్ ఫీవర్ (Rhumatic Fever) వస్తే దానికి పూర్తి కోర్సు చికిత్స తీసుకోవాలి. ముఖ్యంగా చిన్న పిల్లల్లో ఇది చాలా తీవ్ర పరిణామాలను కలిగిస్తుంది.

★ గుండె జబ్బులకు డాక్టర్‌ను సంప్రదించాలి.

## రక్తపోటు (Bllod Presure - BP)

రక్త ప్రసరణ మండలంలో గుండె ముఖ్యమైన స్థానంలో వుంటుంది. రక్తపోటు రక్తానికి సంబంధించినది. ప్రతి మనిషికి ఒక నియమిత స్థాయిలో రక్తపోటు వుంటుంది. దానికంటే ఎక్కువగా వుంటే హై.బి.పి అని తక్కువగా వుంటే లో-బి.పి అని అంటారు. దీన్నే హైపర్ టెన్షన్ అని అంటారు.

రక్తపోటుకు గుండెకు సంబంధం వుంది. గుండెకు వివిధ శరీర అవయవాల నుండి రక్తం చేరుతుంది. అదే విధంగా వివిధ అవయవాలకు గుండె రక్తం పంపిణీ చేస్తుంది. రక్తం మన శరీర ఉష్ణోగ్రతను క్రమపరుస్తుంది. అన్యపదార్థాలు మన శరీరంలో ప్రవేశిస్తే వానిని బయటకు పంపుతుంది. రక్తం రక్తనాళ్ళాలలో నియమితమైన వేగంతో ప్రవహిస్తుంది. ధమనులలో ప్రవహిస్తున్నప్పుడు రక్తం ధమనుల గోడల పై వత్తిడి కలిగిస్తుంది. దీనినే రక్తపోటు అంటారు. ఇది రెండు రకాలుగా వుంటుంది. అవి సిస్టోలిక్ బ్లడ్ ప్రెజర్, డయాస్టోలిక్ బ్లడ్‌ప్రెజర్.

గుండె నుండి రక్తం పెద్ద రక్తనాళాలలోనికి నెట్టబడడాన్ని సిస్టోలిక్ బ్లడ్ ప్రెజర్ అంటారు. దీనివల్ల ధమనుల గోడలపైన వత్తిడి కలుగుతుంది. కాబట్టే దీనిని సిస్టోలిక్ బ్లడ్‌ప్రెజర్ అంటారు. గుండె పంపిణీ చేసేటప్పుడు ఒక స్ట్రోక్‌కు మరొక స్ట్రోక్‌కు మధ్యకాలంలో ధమనుల గోడలపై ఉండే రక్త ప్రసరణ వత్తిడిని 'డయాస్టోలిక్ ప్రెజర్' అంటారు. డయాస్టోలిక్ అంటే గుండె వ్యాకోచించడం - అంటే గుండె వ్యాకోచించడం మొదలై బృహద్దమనికి గుండెలోని ఎడమ జఠరికకు మధ్యగల కవాటం మూసుకు పోవడం వల్ల ధమనులలో వత్తిడి ఏర్పడుటను డయాస్టోలిక్ బ్లడ్‌ప్రెజర్ అంటారు. సాధారణంగా సిస్టోలిక్ బ్లడ్‌ప్రెజర్ 120 మి.మీ. మెర్క్యురీ వుండి డయాస్టోలిక్ ప్రెజర్ 80 మి.మీ. మెర్క్యురీ వుంటుంది.

వ్యాయామం చేసినా, ఆందోళనకు గురైనా, నిద్రపోయి లేచినా,సాయంకాలాల్లో అధికంగా పని చేసినా, రక్తపోటు మాములు వ్యక్తులకు కూడా కొంచెం అధికంగానే వుంటుంది. అయితే





మామూలుగా నిద్ర పోయి లేచినట్లయితే రక్తపోటు ఉండదు. గాఢనిద్ర నుండి అకస్మాత్తుగా లేచినట్లయితే వారిలో రక్తపోటు వుంటుంది. నిద్రపోయే సమయంలోను, శరీరంలో నీరు కోల్పోయిన (డీహైడ్రేషన్‌లో) రక్తపోటు తక్కువగానే ఉంటుంది. కరెంట్ షాక్ కొట్టినప్పుడు, పిడుగు పాటులోను గుండె ఆగిపోయినప్పుడు రక్తపోటు పడిపోతుంది.

రక్తపోటును 120/80 అని ఈ విధంగా వ్రాస్తూ ఉంటారు. దీనిలో పైనున్నది సిస్టోలిక్ ప్రెజర్‌ను సూచిస్తే క్రిందకున్న సంఖ్య డయాస్టోలిక్ ప్రెజర్‌ను సూచిస్తుంది. రక్తపోటును వయసును బట్టి నిర్ధారిస్తారు. వయసు పెరుగుతున్న కొద్దీ రక్త నాళాలు పెళుసెక్కుతాయి. సాగే గుణం కోల్పోయి రక్తప్రసరణలో తేడా వచ్చి రక్తపోటు పెరుగుతుంది. దీనిని ప్రాథమిక రక్తపోటు (Primary hypertension) అంటారు. అంతేగాక ఇతర అవయవాలలో ఏదైనా జబ్బు వున్నప్పుడు కూడా రక్తపోటు పెరుగుతుంది.

ఎడ్రినల్ గ్రంధుల జబ్బు, పిట్యుటరీ గ్రంధి లోపం వల్ల, థైరాయిడ్ గ్రంధి జబ్బు, ధనుర్వాతం, గుర్రపువాతం, మూత్రపిండాల జబ్బులు వుండడం వల్ల, కాంట్రాసెప్టివ్ పిల్స్ (గర్భనిరోధక మాత్రలు) వాడడంవల్ల కూడా రక్తపోటు పెరుగుతుంది. దీనిని ద్వితీయ రక్తపోటు (Secodnary hypertension) అంటారు. రక్తపోటు ఫలానా కారణం వల్ల వచ్చిందని గుర్తించి ఆ పరిస్థితిని తొలగిస్తే రక్తపోటు మామూలు స్థితికి వస్తుంది.

సాధారణంగా రక్తపోటు వయస్సును బట్టి ఈక్రింది విధంగా వుంటుంది.

| వయస్సు | పురుషులకు | | స్త్రీలకు | |
|---|---|---|---|---|
| | సిస్టోలిక్ | డయాస్టోలిక్ | సిస్టోలిక్ | డయాస్టోలిక్ |
| 16-19 | 105-135 | 60-85 | 100-130 | 60-85 |
| 20-24 | 105-140 | 62-88 | 100-130 | 60-85 |
| 25-29 | 108-140 | 65-90 | 102-130 | 60-86 |
| 30-34 | 110-145 | 68-92 | 102-135 | 60-88 |
| 35-39 | 110-145 | 68-92 | 105-140 | 65-92 |
| 40-44 | 110-150 | 70-94 | 105-155 | 65-96 |
| 45-49 | 110-155 | 70-96 | 110-165 | 70-100 |
| 50-54 | 115-160 | 70-98 | 110-170 | 70-100 |
| 56-59 | 115-165 | 70-98 | 110-170 | 70-100 |
| 60-65 | 115-170 | 70-100 | 115-175 | 70-100 |

ప్రైమరీ హైపర్‌టెన్షన్ రావడానికి 'ఇదీ కారణం' అని స్పష్టంగా తెలియదు గాబట్టి మామూలుగా రక్తపోటు వచ్చిన వారు తీసుకునే జాగ్రత్తలు తీసుకుంటే సరిపోతుంది. సెంకడరీ హైపర్‌టెన్షన్ రావడానికి ఏదైతే కారణమో దాన్ని సరిజేస్తే రక్తపోటు అదుపులో వుంటుంది.

## లక్షణాలు

రక్తపోటు వచ్చినవారిలో ఈ క్రింది లక్షణాలు కనబడతాయి.

- ★ వీరికి తల నొప్పి భరించలేనంతగా వుంటుంది. మామూలుగా అయితే వీరిని గుర్తించడం కష్టమే. రక్తపోటు వలన ఇతర కాంప్లికేషన్స్ వస్తేనే వీరికి రక్తపోటు వుందను కోవాల్సి వుంది.
- ★ వీరికి అరోగ్య పరీక్ష జరిపితే ఒకొక్కసారి బి.పి. వుండక పోవచ్చు. తలనొప్పి వున్నప్పుడు పరీక్ష చేస్తే రక్తపోటు కన్పిస్తుంది.
- ★ తలనొప్పితో పాటు తల తిరగడం, వళ్ళు తూలడం ఆయాసం వుంటాయి.
- ★ వీరికి మానసికంగా గందరగోళంగా వుంటుంది. ఛాతీబరువుగా వుంటుంది.
- ★ కంటి చూపులో దోషాలు, కాలు, చెయ్యి బలహీనం కావడం (పక్షవాతం వంటి లక్షణాలు) కూడా కనిపించవచ్చు.
- ★ నడుము నొప్పి వుంటుంది. ఇది వెనుక నుండి ముందుకు వస్తుంది.
- ★ కొందరికి మూత్రం తరచుగా వస్తుంది. ఇది కూడా హైపర్‌టెన్షన్ లక్షణమే.
- ★ గుండెదడ, గుండె నొప్పి, చెమటలు పట్టడంతో కళ్ళు తిరగడం, ఆయాసం వంటివి రక్తపోటు లక్షణాలు.

హైపర్ టెన్షన్స్‌లోనే మళ్ళీ నాలుగు రకాలు వున్నాయి. అవి :

1. మైల్డ్ హైపర్ టెన్షన్ - దీనిలో రక్తపోటు చాలా కొద్దిగా పెరిగి వుంటుంది.
2. మోడరేట్ హైపర్‌టెన్షన్ - ఒక మోస్తరుగా రక్తపోటు వుంటుంది.
3. సివియర్ హైపర్‌టెన్షన్ - దీనిలో ఎక్కువ మోతాదులలో రక్తపోటు వుంటుంది. దీనితో ప్రమాదం వుంటుంది.
4. మాలిగ్నెంట్ హైపర్‌టెన్షన్ - దీనిలో తీవ్రమైన రక్తపోటు వుంటుంది. ఇది చాలా ప్రమాదకరమైనది.

మగవారిలో ఇరవై సంవత్సరాల వయసులో 140/90 Hg/మి.మీ. కు మించి రక్తపోటు వున్నా,యాభై ఏళ్ళ వయసువారిలో 160/95 Hg/మి.మీ.కు మించి వున్నా రక్తపోటు వున్నట్లు భావించాలి. రక్తపోటుకు చికిత్స డాక్టరు పర్యవేక్షణలో జరగాలి. కొందరికి రక్తపోటు వంశపారం పర్యంగారావచ్చు. వీరిలో రక్తపోటు రాకుండా ఆపడం కష్టం. అయితే వీరిలో రక్తపోటు రాకుండా





కొన్ని జాగ్రత్తలు తీసుకోవడం వల్ల ఫలితం వుండొచ్చు. రక్తపోటు రాకుండానే కాకుండా వచ్చాక కూడా జాగ్రత్తలు పాటించాలి.

## జాగ్రత్తలు

రక్తపోటు వున్నవారు ఈ క్రింది జాగ్రత్తలు. అహార నియమాలు వంటివి పాటించడం వల్ల దానిని అదుపులో వుండవచ్చు.

## రక్తపోటులో పనికిరావని

- ★ అతిగా వ్యాయామం చేయడం
- ★ ఎండలో తిరగడం, ముఖ్యంగా వేడిగా వున్న ఎండలో తిరగరాదు.
- ★ ధూమపానం (పొత్రాగడం), మద్యపానం (సారాయి త్రాగడం) అసలు పనికిరావు.
- ★ కోపం, ఆవేశం, ఉద్రేకాలు అసలు పనికిరావు
- ★ కారం, మషాలాలు, పులుపు, 'ఉప్పు' వాడరాదు. అంతేగాక సముద్రాలలో పెరిగే చేపలు కూడా తినరాదు.
- ★ కొలిమి దగ్గర పని చేయడం కూడా అంత మంచిది కాదు.

## రక్తపోటుకు కావలసినది

- ★ బాగా పాతబడిన బియ్యం వాడాలి.
- ★ ఆవు, గేదె, పాలు, నెయ్యి, వెన్న వంటి పదార్థాలు తీసుకోవచ్చు. కాని మితంగానే సుమా!
- ★ మరమరాల జావ, పెసలు, చిరుసెనగలు, వంటి పదార్థాల్ని తినవచ్చు.
- ★ మనసును ప్రశాంతంగా వుంచుకోవడం చల్లగాలి, చక్కని ప్రదేశాలలో వుండేందుకు ప్రయత్నించడం వల్ల బి.పి. అదుపులో వుంటుంది.
- ★ పచ్చకర్పూరం, గంధం (పైపూతకు) వాడవచ్చు.

ఫలానా వ్యక్తికి రక్తపోటు వున్నదని నిర్ధారణ చేయాలంటే ఒకసారి రక్తపోటు కొలిచి తేల్చకూడదు. ఒకే బి.పి. అపరేటస్‌తో వారం రోజుల పాటు ఒకే డాక్టరుచే చెకప్ చేయించుకుంటే రక్తపోటు ఉన్నదీ లేనిదీ తెలుస్తుంది. రక్తపోటు వుంటే అది ప్రారంభంలో ఎక్కువగా వున్నా ఆ తరువాత ధానంతట అదే తగ్గిపోవచ్చు. వారం రోజుల గాప్‌లో కూడా రక్తపోటు అదే విధంగా వుంటే అప్పుడు రక్తపోటు వుందని నిర్ధారించి మందుల్ని వాడాలి.

రక్తపోటు వలన హార్ట్‌ఎటాక్, హార్ట్ ఫెయిల్యూర్, యాంజినా గుండె నొప్పి, మెదడులో రక్తనాళాలు చిట్లడం (Hemarage), ముక్కు నుండి రక్తం కారడం (Epistaxis), మూత్ర పిండాలు దెబ్బతినడం, పక్షవాతం రావడం వంటి ప్రమాదాలు వున్నాయి.

మూత్రంలో అల్బుమిన్, ఎర్ర రక్తకణాలు వుంటే రక్తపోటుకు దారితీసే మూత్రపిండాల జబ్బు వున్నట్లు కాబట్టి విధిగా మూత్ర పరీక్ష చేయాలి. గుండె పెరగడం వల్ల కూడా రక్తపోటు రావచ్చు. కాబట్టి గుండెకు ఎక్స్‌రే తీసి, ఇ.సి.జి తీస్తే గుండె పై రక్తపోటు ప్రభావం స్పష్టమవుతుంది. రక్తంలో గ్లూకోజ్ (చక్కెర) శాతం ఎక్కువైనా కూడా రక్తపోటు పెరగవచ్చు. 'బ్లడ్‌షుగర్ టెస్ట్ చేయించి గ్లూకోజ్ శాతం రక్తంలో ఎంతో వుందో కనుక్కోవాలి. ఎక్కువగా వుంటే దానిని అదుపులో వుంచాలి. సీరం కొలెస్ట్రాల్ టెస్ట్ చేస్తే రక్తనాళాలలో కొలెస్ట్రాల్ శాతం ఎంతవున్నదో తెలుస్తుంది. ఈ పై టెస్ట్‌లే కాకుండా ఒకొక్కసారి రీనల్‌బయాప్సీ, సి.టి. స్కాన్ వంటి పరీక్షలు కూడా చేయించాల్సి వుంటుంది. సాధారణంగా రక్తపోటు వున్నవాళ్ళు పైన చెప్పిన పరీక్షలు చేయించుకుని మందులు వాడితే మంచిది. రక్తపోటు వంశపారంపర్యంగా వున్నట్లు కనిపిస్తే మాత్రం వారు జీవితాంతం మందుల్ని వాడాల్సి వుంటుంది. ఒకవేళ మందులు వాడడం ఆపిన వెంటనే మళ్ళీ రక్తపోటు పెరుగుతుంది. పెద్ద వయసు వారికి రక్తపోటు వుంటే వారికి మొదట డయూరిటిక్స్ (మూత్రం అధికంగా జారీ అయ్యేట్లు చేసే మందులు) వాడాలి.

## చికిత్స

రక్తపోటు, గుండె వ్యాధులు వీటి చికిత్స డాక్టరు పర్యవేక్షణలోనే జరగాలి. ఎందు చేతనంటే ఈ మందులు మోతాదు మించి వాడితే రక్తపోటు పడిపోవడమో (Hypotension) లేక రియాక్షన్స్ రావడమో జరిగితే ఇబ్బంది అవుతుంది. రక్తపోటు ఏ స్థాయిలో వుందో గమనించి ఆ స్థాయిని బట్టి రకరకాల మందులు వాడాలి. ఉదాహరణకు డయూరిటిక్స్, బీటాబ్లాకర్స్, కాల్షియం ఏంటాగోనిస్ట్స్, ACE ఇన్‌హిబిటర్స్ వంటివి వాడాల్సి వుంటుంది.

1. రక్త పోటు ఆందోళన చెందడం వల్ల వస్తుంది. ఉద్రేకం చెందడం, ఆందోళన చెందడాన్ని తగ్గించేందుకు ట్రాన్‌క్విలైజర్స్ (Tranquilizers) వాడతారు.

★ వాలియం - 5 మి.గ్రా. టాబ్లెట్లు

★ డైజిపాం - 5 మి.గ్రా. టాబ్లెట్లు

★ పాక్సమ్ - 5 మి.గ్రా. టాబ్లెట్లు

★ కాంపోజ్ - 5 మి.గ్రా. టాబ్లెట్లు

★ ఏన్‌క్సోల్ - 5 మి.గ్రా. టాబ్లెట్లు.

వీటిల్లో ఏదైనా సరే రోజుకు ఒక టాబ్లెట్ చొప్పున రాత్రిపూట వాడాలి. లేదా

★ ఏంక్సిట్ - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ రెస్టిల్ - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఆల్ప్రోలాం - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్





★ ట్రైకా - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ అల్ప్రోమాక్స్ - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ జోపిక్ - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ ట్రాన్స్ - 0.25 మి.గ్రా. / 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

వీటిల్లో ఏదైనాసరే రోజుకు ఒకటి చొప్పున రాత్రి పూట వాడాలి. ఇవి ఆందోళనను తగ్గిస్తాయి. తద్వారా రక్తపోటు తగ్గుతుంది.

2. 'డయూరిటిక్స్' వల్ల కూడా రక్త పోటు తగ్గుతుంది.

'ఫ్రూసిమైడ్' కలిసిన మందులు

★ లాసిక్స్ - 40 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఫ్రూసెనెక్స్ - 40 మి.గ్రా. టాబ్లెట్స్

★ సాలినెక్స్ - 40 మి.గ్రా. టాబ్లెట్స్

వీటిలో ఏదైనా సరే రోజుకు ఒకటి లేదా రెండు - రెండు పూటలా గాని ఒకటి అయితే రాత్రిళ్ళు గాని వాడవచ్చు లేదా.

'హైడ్రోక్లోర్ థయాజైడ్' కలిసిన మందులు.

★ ఎసిడ్రెక్స్ - 50 మి.గ్రా. టాబ్లెట్స్.

ఉదయం పూట ఒకటి లేదా సగం టాబ్లెట్ వాడవచ్చు.

3. బీటా బ్లాకర్స్ : ఇవి గుండెకు రక్తం సరిగా అందని గుండె జబ్బు వున్న రోగులకు మంచిది. ప్రొపనోలాల్, అటెనోలాల్ వంటి మందులు కలిసిన మందులు వాడాలి.

★ అటెన్ - 25 మి.గ్రా. / 50 మి.గ్రా. టాబ్లెట్స్

★ బీటాకార్డ్ - 25 మి.గ్రా. / 50 మి.గ్రా. టాబ్లెట్స్

★ లోనోల్ - 25 మి.గ్రా. / 50 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఆల్‌టోల్ - 25 మి.గ్రా. / 50 మి.గ్రా. టాబ్లెట్స్

★ టెనోలాల్ - 25 మి.గ్రా. / 50 మి.గ్రా. టాబ్లెట్స్

ఇవన్నీ అటెనోలాల్ అనే మందు వున్నవి. ఇవి కాక

★ బెటాస్పన్ - 10 మి.గ్రా. / 40 మి.గ్రా. / 80 మి.గ్రా టాబ్లెట్స్

★ సిప్లార్ - 10 మి.గ్రా. / 40 మి.గ్రా. / 80 మి.గ్రా. టాబ్లెట్స్

★ కార్బిటా - 10 మి.గ్రా. / 40 మి.గ్రా. / 80 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఇన్‌డెరాల్ - 10 మి.గ్రా. / 40 మి.గ్రా. / 80 మి.గ్రా. టాబ్లెట్స్

వీటిలో ఏదైనా వాడవచ్చు. ఇవి ప్రొపనోలాల్ అనే మందు కలిసినవి వీటిని రోజుకు మూడు చొప్పున వాడవచ్చు.

4. ACE ఇన్‌హిబిటర్స్ - వీటిలో ఎనలాప్రిల్ కలిసిన
   - ★ నార్‌మేస్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. టాబ్లెట్స్
   - ★ ఎనామేట్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. టాబ్లెట్స్
   - ★ ఎన్వాస్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. టాబ్లెట్స్
   - ★ ఎనాప్రిల్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. టాబ్లెట్స్
   - ★ ఎనామ్ - 2.5 మి.గ్రా. / 5 మి.గ్రా. టాబ్లెట్స్

   వీటిలో ఏదైనా సరే ఒక మాత్ర రోజుకు - వాడవచ్చు. ఇంకా ఇతర ఎ.సి.ఇ. ఇన్‌హిబిటర్స్ కూడా వాడవచ్చు. వీటిని వాడిన తరువాత కూడా ఇవి పని చేయకపోతే బీటాబ్లాకర్స్ వాడాలి.

5. కాల్షియం ఛానల్ బ్లాకర్స్ - వీటిలో కూడా చాలా రకాలు వున్నాయి. నిఫిడిపిన్, అమ్లోడిపిన్, డిల్టియాజం, వెరాపమిల్ వంటివి వున్నాయి.
   - ★ కాల్సిగార్డ్ - టాబ్లెట్స్ 5 mg / 10 mg / 120 mg.
   - ★ నిఫిలాట్ - టాబ్లెట్స్
   - ★ డెపిన్ - 5 మి.గ్రా / 10 మి.గ్రా టాబ్లెట్లు వీటిలో ఒకటి రోజుకు మూడు
   - ★ డిల్టియాజ్ - 30 మి.గ్రా. / 60 మి.గ్రా. టాబ్లెట్స్
   - ★ డిల్జమ్ - 30 mg / 60 mg టాబ్లెట్లు
   - ★ యాంజిజెం - 30 mg / 60 మి.గ్రా. టాబ్లెట్లు వీటిలో ఏదో ఒకటి రోజుకు మూడు చొప్పున వాడాలి.

ఈ అయిదు రకాల మందులలో అన్నీ రక్తపోటుకు పని చేస్తాయి. వీటిలో ఏదో ఒక దానితో మొదలు పెట్టి కొన్ని సందర్భాలలో రెండు లేక మూడు గ్రూపుల (రకాల) మందుల్ని కలిపి కూడా వాడతారు. ఇవన్నీ డాక్టరు పర్యవేక్షణలోనే వాడాలి.

## రక్తహీనత (Anaemia)

దీనినే 'ఎనీమియా' అని కూడా అంటారు. దీనిలో రక్తంలో వుండవలసిన దానికంటే తక్కువగా ఎర్రరక్త కణాలు వుంటాయి. ఎర్రరక్త కణాలలో వుండే హిమోగ్లోబిన్ అనే ఎరుపు వర్ణకం తక్కువగా ఉండడాన్నే రక్తహీనత అంటారు.





### కారణాలు

ఎనీమియా రావడానికి ఎన్నో రకాల కారణాలున్నాయి. అవి :

- ★ రక్తం కోల్పోవడం వల్ల కలిగే రక్తహీనత - అంటే మన శరీరంలోని ఏ భాగం నుండి అయినా రక్తస్రావం జరిగి రక్తహీనత కలగవచ్చు.
- ★ గాయాలు, దెబ్బలు, నరుకులు వంటివి సంభవించినపుడు ఆ ప్రాంతం నుండి రక్తస్రావం అవుతుంది.
- ★ ఎర్రరక్త కణాల నిర్మాణంలో, ఆకారంలో కలిగే లోపం వల్ల కలిగే రక్తహీనత, దీనినే 'ఎప్లాస్టిక్ అనీమియా' అంటారు.
- ★ ఎర్రరక్త కణాల సైజు, హిమోగ్లోబిన్ శాతం సరిగా లేక పోవడం వల్ల కలిగే రక్తహీనత.
- ★ ఎర్రరక్త కణాలు విచ్ఛిన్న అవడం వల్ల కలిగే రక్తహీనత.
- ★ కొందరికి రక్తస్రావం కలిగినప్పుడు త్వరగా ఆ ప్రాంతంలో రక్తం గడ్డకట్టి ఆ ప్రాంతం నుండి అధిక స్రావం జరగకుండా అవుతుంది. కాని కొందరి రక్తం చాలా ఆలస్యంగా గడ్డ కట్టడం గాని లేక అసలు గడ్డకట్టక పోవడం గాని వుంటుంది. దీనిని 'హిమోఫీలియా' అంటారు. ఇది జన్యుపరమైన కారణాల వల్ల వస్తుంది. దీనివల్ల కూడా అనీమియా వస్తుంది.
- ★ థలసేమియా వ్యాధి వల్ల రక్తహీనత ఏర్పడుతుంది.
- ★ ఇనుపధాతు లోపం శరీరంలో ఏర్పడడం వల్ల అనీమియా వస్తుంది.
- ★ ఇంకా ఫోలిక్ యాసిడ్ లోపం వల్ల, విటమిన్ $B_{12}$ లోపం వల్ల, ప్రొటీన్ లోపం వల్ల కూడా అనీమియా వస్తుంది.
- ★ దీర్ఘకాలంగా వున్న అనారోగ్యం వల్ల, మూత్ర పిండాల వ్యాధి వల్ల, ల్యుకేమియా, కేన్సర్ వంటి వ్యాధులవల్ల, ఎముక మూలగ దెబ్బతినడం వల్ల, థైరాయిడ్ లోపం వల్ల కూడా అనీమియా వస్తుంది.

### లక్షణాలు

- ★ రక్తహీనత ఏ వయసు వారికైనా సరే రావచ్చు. అది వచ్చినపుడు దానిని గుర్తించి అది ఎందువల్ల వస్తుంది అనేది తెలుసుకుని దానికి చికిత్స చేసినట్లయితే రక్తహీనత తగ్గుతుంది.
- ★ రక్తహీనత వున్నప్పుడు పాలిపోయి తెల్లగా కనబడతారు. శరీరం లేతపసుపు వర్ణంలో కనబడుతుంది. తేలికగా అలసిపోతారు.
- ★ దీర్ఘకాలంగా ఎనీమియా లేక రక్తహీనతతో బాధపడే వాళ్ళ చేతి గోళ్ళు గుంటలు పడి వుంటాయి. అంటే 'స్పూన్' వలె వెనుకకు వంగి వంటాయి. గోళ్ళ మీద నిలువుగా గీతలు, పగుళ్ళు ఏర్పడతాయి.

★ కంటి రెప్ప లోపలి వైపున (క్రింది రెప్ప లోపలి వైపున) తెల్లగా పాలిపోయి కనిపిస్తుంది.

★ గుండె పెరుగుతుంది.

★ గుండె చప్పుళ్ళను వింటే అసాధారణ ధ్వనులు వినిపిస్తాయి.

★ ప్లీహము (స్ప్లీన్) పెరుగుతుంది.

★ నాలుక తెల్లగా బూడిద పూసినట్లు వుంటుంది. కొందరికి నాలుకవాచి ఎర్రగా వుంటుంది నాలుకపూత కూడా వుంటుంది.

★ నోటి చివళ్ళలో పగుళ్ళు వుండవచ్చు.

★ ఎముకలు మెత్తగా మారుతాయి. కొందరికి గొంతులో ఏదో బంతి వున్నట్లుగా ఫీలవుతారు.

★ ఇనుపధాతు లోపం వల్ల వచ్చే అనీమియా సాధారణంగా రెండు సంవత్సరాల వయస్సున్న పిల్లల్లోను, పదినుండి పదిహేను సంవత్సరాల వయసున్నవారిలోను ఎక్కువగా వుంటుంది.

★ కొందరు స్త్రీలకు బహిష్టు సమయంలో అధికంగా రక్తస్రావం అవుతుంది. ఇలాటి వారిలో ఐరన్ లోపం వల్ల వచ్చే రక్తహీనత వుంటుంది.

★ జీర్ణాశయానికి శస్త్రచికిత్స జరిగినవారిలో కూడా ఐరన్ లోపం వచ్చి అనీమియా రావచ్చు.

★ ఐరన్ లోపం వల్ల వచ్చే అనీమియాలో రోగి అతి త్వరగా అలిసిపోతాడు. రోగికి తలనొప్పి ఎప్పుడూ వుంటుంది.

★ వళ్ళునొప్పులు వుంటాయి. నీరసం అధికంగా వుంటుంది.

★ దేనిపైనా మనస్సు కేంద్రీకరించక పోవడం ప్రధాన లక్షణం.

★ తలతిరగడం, గుండెదడ ఛాతీలో నొప్పితో ఆయాసంగా వుండడం కూడా ఐరన్ లోపం వల్ల జరుగుతుంది.

★ నాలుకపైన మ్యూకస్ పొర లేకపోవడంతో నాలుక ఎర్రగా వుండి నున్నగా కనబడుతుంది.

★ ఐరన్ లోపం వల్ల వచ్చే అనీమియాలో కూడా చేతిగోళ్ళు గుంటల పడి స్పూన్‌లాగా వెనుకకు వంగుతాయి. అంతేగాక గోళ్ళు పలుచనయి, మట్టిగడ్డలు, గోడసున్నం, సుద్ద ముక్కలు తినాలనిపిస్తుంది.

★ ఎముకలలోని మజ్జ ప్రాంతం దెబ్బతినడం వల్ల ఎర్రరక్తకణాల ఉత్పత్తి కుంటుపడుతుంది. తద్వారా అది రక్తహీనతకు దారితీస్తుంది.

★ ఎముక మజ్జ ప్రాంతం దెబ్బతినడం వల్ల వచ్చే రక్తహీనతను ఎప్లాస్టిక్ అనీమియా అంటారు. క్లోరోమైసిన్ వంటి మందుల వల్ల, కొన్ని విషపదార్థాల వల్ల, కొన్ని రసాయనాల వల్ల, రేడియేషన్ వల్ల వస్తుంది. దీనివల్ల ఎర్ర రక్త కణాల ఉత్పత్తి తగ్గిపోతుంది.





★ ఎప్లాస్టిక్ అనీమియా ఒక్కసారిగా గాని, నిదానంగాగాని బయటపడవచ్చు. వీరికి నోట్లో పుళ్ళు పడతాయి.

★ ఎప్లాస్టిక్ అనీమియాలో గొంతునొప్పితో జ్వరం వస్తుంది. వంటి నిండా చెమటలు పట్టడం, ఒకొక్కసారి ఛాతీలో నొప్పి కూడా వుంటుంది.

★ నీరసంగాను, త్వరగా అలసిపోవడం, ఆయాసం, వళ్ళు, ముఖం పాలిపోవడం జరగుతుంది.

★ ఫోలిక్ ఏసిడ్ లోపం వల్ల లేదా $B_{12}$ విటమిన్ లోపం వల్ల ఎర్రరక్త కణాల నిర్మాణంలో లోపం వుండడం వల్ల 'మెగలోబ్లాస్టిక్' అనీమియా వస్తుంది.

★ పుష్టికరమైన, సమతులాహారం తీసుకోని వారిలో, శాఖాహారుల్లో $B_{12}$ విటమిన్ లోపం వుంటుంది.

★ వీరిలో జీర్ణకోశ వ్యాధులు ఎక్కువగా వుంటాయి. ఆహారం జీర్ణం కాదు.

★ కొన్నిరకాల మందులు వాడడం, దీర్ఘకాలంగా, విడనవి జబ్బులవున్నా 'మెగలోబ్లాస్టిక్ అనీమియా' వస్తుంది.

★ ముఖ్యంగా మధ్యపానం చేసేవారిలో ఎక్కువగా ఈ రకమైన అనీమియా వస్తుంది.

★ ఛాతీనొప్పి, ఆయాసం, శరీరం పాలిపోవడం, ఈ మొగలో బ్లాస్టిక్ అనీమియాలో వుంటాయి.

★ ఆకలి వుండదు, నోటిపూత వుంటుంది.

★ ఛాతీ నిండుగా గాలి పీల్చలేకపోవడం, బరువు తగ్గడం, కాళ్ళు, చేతుల్లో తిమ్మెరలు, చూపు మందగించడం, కొద్దిపాటి జ్వరం తరచుగా రావడం వంటి లక్షణాలు ఈ రకమైన అనీమియాలో వుంటాయి.

★ మొగలో బ్లాస్టిక్ అనీమియా వచ్చిందనడానికి గుర్తుగా రక్త పరీక్షలో హిమోగ్లోబిన్ శాతం తక్కువగా వుంటుంది. ఎర్రరక్త కణాలు గుండ్రంగా కాక కోడిగ్రుడ్డులాగా సాగి కనబడతాయి. 'సీరం'లో ఐరన్ శాతం పెరుగుతుంది.

★ జన్యులోపం వల్ల 'హిమోలైటిక్ అనీమియా' అనేది వస్తుంది. దీనిలో ఎర్ర రక్తకణాల పుట్టుకతోనే నాశన చేయబడతాయి. కొంతమందిలో ఈ లోపం కాస్త పెరిగిన తరువాత రావచ్చు.

★ హిమోలైటిక్ అనీమియాతో పుట్టిన బిడ్డ మూడవ నెలలో పాలిపోయినట్లు కనిపిస్తుంది. పచ్చకామెర్లు వుంటాయి.

★ దీనిలో కూడా జ్వరం వస్తుంది. అంతేగాక వయసు పెరుగుతున్న కొద్దీ తరుచు ఏదో ఒక వ్యాధితో బాధపడతారు.

★ ఈ రకమైన అనీమియాను 'సికిల్‌సెల్ అనీమియా' అని కూడా అంటారు. ఎర్ర రక్త కణం గుండ్రంగానో, నొక్కబడిగాని, గ్రుడ్డు ఆకారంలో గాని వుండక పొడవైన రిబ్బన్‌వలె వుండడం ఈ వ్యాధి లక్షణం.

★ రక్త మార్పిడి చేయడం, రెగ్యులర్‌గా ఫోలిక్ ఏసిడ్ ఇవ్వడం తప్ప వేరే చికిత్స ఏమీలేదు. థలసేమియా కూడా ఇలాంటి వ్యాధే! ఇది కూడా జన్యుపరంగా వచ్చేదే - ఇలా జన్యుపరమైన వ్యాధులకు పూర్తినివారణ లేదు.

**చికిత్స**

★ అనీమియా ఏదైనప్పటికీ దానిని గుర్తించి సరైన చికిత్స చేయించుకోవాలి. ఆహారంలో పౌష్టిక విలువల్ని పెంచుకోవడం వల్ల రక్తహీనతలను అరికట్టవచ్చు.

★ ఐరన్ లోపం వల్ల కలిగే రక్తహీనతకు ఐరన్ మందుల్ని వాడడం, ఆకుకూరలు, పళ్ళు వాడడంవల్ల ఉపయోగం వుంటుంది.

★ ఐరన్ మందులలో

అరటిన్ - కాప్సుల్స్    గ్లోబాక్ - టానిక్

ఫెసోవిల్ - కాప్సుల్స్    ఫెఫాల్ - కాప్సుల్స్

హెమ్‌ఫెర్ - సిరప్    ఇబెరాల్ - టాబ్లెట్స్

వీటిలో ఏదైనా వాడవచ్చు.

★ మెగలోబ్లాస్టిక్ అనీమియాకు -

విటమిన్ $B_{12}$ ఇంజక్షన్స్ - ప్రతి మూడు రోజులకు 1000 మైక్రోగ్రామ్స్ (Mcg) చొప్పున వాడాలి. ఫోలిక్ ఏసిడ్ రోజు 5 మి.గ్రా. చొప్పున ఇవ్వాలి.

★ ఎప్లాస్టిక్ అనీమియాకు -

ముందుగా మూల కారణాన్ని గుర్తించాలి. లేకుంటే వ్యాధి నివారణకు ఎన్ని మందుల్ని వాడినా ఉపయోగం వుండదు. శరీరంలో వున్న రోగానికి ముందుగా చికిత్స చేయాలి. యాంటిబయాటిక్స్ వాడాలి. రోగనిరోధర శక్తి పెంపొందడానికి కార్టికోస్టిరాయిడ్స్ వాడాల్సి వుంటుంది.

★ అనీమియాకు వాడే ఐరన్ మందులలో ఫెర్రస్ సల్ఫేట్ అనే మందువాడతారు. దీనిని 300 మి.గ్రా. మాత్రల్ని ఆరు చొప్పున ప్రతి రోజు వాడాలి. పూటకు రెండేసి చొప్పున మూడు పూటలా వాడాలి. ఈ విధంగా కనీసం మూడు నెలలు వాడాలి. అప్పటికీ అనీమియా తగ్గకపోతే దానికి కారణం ఐరన్ కాక వేరే ఏదైన అని భావించాలి.

★ కొందరికి ఫెర్రస్ సల్ఫేట్ పడదు. దీనివల్ల వారికి కడుపులో నొప్పి, వికారం, వాంతులు - ఇలాటి లక్షణాలు కలగవచ్చు. అలాటప్పుడు ఫెర్రస్ సల్ఫేట్ కుబదులు ఫెర్రస్ ఫ్యూమరేట్‌ని వాడాలి.





అనెమిడాక్స్ - కాప్సుల్స్    ఆట్రిన్ - కాప్సుల్స్

బెనోజెన్ - కాప్సుల్స్    కాప్సావిట్ - కాప్సుల్స్

ఫెరవిట్ - కాప్సుల్స్

వీటిలో ఏదైనా వాడవచ్చు.

ఇవి రెండే కాక ఐరన్ కలిసిన ఇతర మందులు కూడా వున్నాయి

హెమ్ అప్ - కాప్సుల్స్    హిమాట్రిన్ - కాప్సుల్స్

ఇబెరాల్ - టానిక్

లివోజెన్ - టానిక్    రోజుకు రెండేసి చెంచాలు వాడాలి.

★ 'ఫోలిక్ ఏసిడ్' మాత్రలు (5 మి.గ్రా.) కూడా అన్ని రకాల రక్తహీనతలకు వాడతారు వీటిని మూడు సంవత్సరాల లోపు పిల్లలకు 2.5 మి.గ్రా. (1/2 మాత్ర). మూడేళ్ళు దాటిన వారందరికీ రోజుకు ఒక మాత్ర (5 మి.గ్రా) చొప్పున వాడవచ్చు.

'ఫోలిక్ ఏసిడ్'ను గర్భవతులు తప్పనిసరిగా వాడాలి. గర్భందాల్చిన తరువాత నుండి ప్రసవం అయ్యేదాకా వాడాలి.

★ రక్తహీనత వున్నవారు వాడే ఐరన్ మాత్రలు వంటబట్టాలంటే వీటితో పాటుగా విటమిన్ 'సి' కలసిన మాత్రలు వాడాలి. లేదా 'సి' విటమిన్ పుష్కలంగాగల, నిమ్మ, నారింజ, బత్తాయి, ద్రాక్ష, కమలాలు, రేగు, ఉసిరి, జామ వంటి ఫలాల్ని వాడాలి.

★ ఫోలిక్ ఏసిడ్ మలేరియా, టైఫాయిడ్ వంటి వ్యాధులలో కలిగే రక్తహీనతకు పని చేస్తుంది.

★ ఐరన్ మందులు వాడేటప్పుడు మలము నల్లగా వస్తుంది. దీని గురించి ఆందోళన చెందనవసరం లేదు.

★ ఇనుము ఇంజక్షన్స్ వాడాల్సి వచ్చినప్పుడు ఎట్టి పరిస్థితులలోను పిరుదులకు మాత్రమే చేయాలి. చేతికి తీసుకోరాదు. ఈ ఇంజక్షన్స్ వాడడం వల్ల ఒకొక్కసారి కీళ్ళు వాపు రావడం, కీళ్ళలో నొప్పులు రావడం జరగవచ్చు.

★ కాఫీ, టీ వంటి పానీయాలలో 'టానిన్' అనే పదార్థం వుంటుంది. ఇది ఇనుమును మన శరీరం గ్రహించకుండా అడ్డుకుంటుంది. అలాగే ఈ పదార్థం చింతపండులో కూడా వుంటుంది.

★ చాలా అరుదైన సందర్భాలలో రక్తహీనతలో రక్తాన్ని ఎక్కించాల్సి రావచ్చు. అప్పుడు తప్పనిసరిగా పరీక్షించిన రక్తాన్ని డాక్టరు పర్యవేక్షణలో ఎక్కించాలి.

★ ఐరన్ మాత్రల్ని భోజనానికి ఒక గంట ముందుగాని ఒక గంట తరువాతగాని వాడాలి.

★ రక్తహీనత ఎన్ని ప్రయత్నాలు చేసినా తగ్గకపోతే తగు పరీక్షలు చేసి నిపుణులైన డాక్టరు పర్యవేక్షణలో చికిత్స చేయాలి.

# శ్వాసకోస వ్యాధులు

రక్త ప్రసరణ మండలం ఎంత ముఖ్యమైనదో - అలాగే శ్వాసక్రియా వ్యవస్థ కూడా ముఖ్యమైనదే. "ఊపిరి చొరబడితే పుట్టాడని ... ఊపిరి నిలబడితే పోయాడంటారని" వెనుకటికి ఒక కవిగారు చెప్పారు. అది నిజమే. ఊపిరి పీల్చినంత సేపు ప్రాణం వుంటుంది.

—Action of diaphragm




ముక్కుతో గాలి పీల్చి వదలడమే శ్వాసక్రియ. అయితే ముక్కులోనికి వెళ్ళిన గాలి ఊపిరితిత్తుల లోనికి ప్రవేశిస్తుంది. అక్కడ రక్తాన్ని శుభ్రపరచి మరలా బయటకు పోతుంది. రక్తం ద్వారా ప్రాణ వాయువు శరీరంలోని ప్రతి కణానికీ అందుతుంది. శరీరంలో తయారయ్యే మలిన పదార్థం (కార్బన్ డయాక్సైడ్) రక్తం ద్వారా మళ్ళీ ఊపిరితిత్తుల లోనికి చేరి బయటకు శ్వాసక్రియ ద్వారా పోతుంది. మన ప్రాణానికి అత్యంత ఆవశ్యకమైన ఈ శ్వాసక్రియకు అవరోధం ఏర్పడితే, లేదా ఏదైనా ఇన్‌ఫెక్షన్ సోకితే చాలా తీవ్రమైన పరిణామాలు సంభవిస్తాయి. శ్వాసక్రియ, రక్తప్రసరణ వ్యవస్థ, నాడీ వ్యవస్థ అన్నీ ఒకదానితో ఒకటి ప్రత్యక్ష సంబంధాల్ని కలిగి వున్నాయి. వీటికి సంబంధించిన ఎలాటి ఇన్‌ఫెక్షన్ అయినా శ్వాసక్రియపైన ముఖ్యంగా ప్రభావం చూపుతుంది.

## జలుబు (Cold)

శ్వాసక్రియకు తీవ్ర అవరోధాన్ని కలిగిస్తూ మనలను చికాకుపరిచే జలుబు గురించి ప్రపంచంలో తెలియనివారు వుండరనడంలో అతిశయోక్తి లేదు. ఇది వైరస్ వల్ల వచ్చే వ్యాధి. జలుబుకు దాదాపు వంద రకాల వైరస్‌లు కారణం. ఈ వంద రకాల వైరస్‌లలో ఏ ఒక్క వైరస్ సోకినా జలుబు వస్తుందన్న మాట.

జలుబు మందువేసుకుంటే ఏడు రోజులు లేకపోతే వారం రోజులలో తగ్గుతుందని అంటారు. అందుచేత జలుబుకు మందులు వాడనవసరం లేదని కాదు. పెద్దవారిలో వాడకపోయినా ఫరవా లేదు గాని చంటి పిల్లల్లో (శిశువులలో) దీనివల్ల ఊపిరి అందకపోయే ప్రమాదం వుంది.

జలుబు చేస్తే వంట్లో నీరసం అనిపిస్తుంది. ముక్కులోని మ్యూకస్ పొరకు ఇన్‌ఫెక్షన్ వస్తుంది. గొంతులో కూడా జలుబు వైరస్ ప్రవేశంతో ముక్కు మండడం, తుమ్ములు రావడం, గొంతు నొప్పి రావడం వుంటాయి. అంతేగాక ముక్కులమ్మట నీరుకారడం, ముక్కు





దిబ్బడవేయడం, వుంటుంది. ముక్కులోని మ్యూకస్ పొర పై వైరస్ దాడి చేసి దాని నిండా వైరస్ పేరుకుపోతుంది. దానితో అది ఉబ్బి నీరువంటి పదార్థాన్ని విడుదల చేస్తుంది. అందుచేతనే ముక్కు దిబ్బక ఎంత వున్నప్పటికీ ముక్కు రంధ్రాల నుండి నీరు కారుతూనే వుంటుంది. గట్టిగా చీదినప్పటికీ మళ్ళా రెండు మూడు నిముషాలలో ముక్కుదిబ్బడ మొదలవుతుంది. జలుబు వచ్చిన వారికి తలనొప్పి కూడా వుంటుంది. తలనొప్పి, వళ్ళునొప్పులు, కొద్దిపాటి జ్వరం కూడా రావచ్చు.

జలుబు రావడం వల్ల రోగనిరోధక శక్తి పెరుగుతుందని అంటారు. కొందరిలో జలుబు వారం రోజులకు మించి కూడా వుంటుంది. చాలా మందిలో ఇది ఎలాటి ఇబ్బంది కలిగించదుగాని కొందరిలో మాత్రం బ్రాంకైటిస్, సైనుసైటిస్ వంటి వ్యాధులకు కారణం అవుతుంది.

జలుబు చేసినప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే అది ఇతరులకు రాకుండా వుంటుంది. జలుబు చేసినవారి ముక్కు ద్వారా నీరు అధికంగాపోతుంది. కాబట్టి వీలైనంత ఎక్కువ నీటిని త్రాగాలి. ఎక్కడబడితే అక్కడ చీదరాదు. దగ్గు వచ్చినా, తుమ్ము వచ్చినా, ముక్కుకు, నోటికి చేతి రుమాలు వుంచుకోవాలి. వైరస్ గాలి ద్వారా వ్యాపిస్తుంది. ముక్కు దిబ్బడ వున్నప్పుడు తాత్కాలిక ఉపశమనం కోసం వాడవచ్చు. దగ్గుతో పాటు గళ్ళ కూడా పడుతుంటే యాంటీ బయాటిక్స్ వాడాలి. మామూలు జలుబు, దగ్గు అయితే మాత్రం యాంటీబయాటిక్స్ అవసరం లేదు.

జలుబు వచ్చిన వారు నీటి ఆవిరి పీలిస్తే గళ్ళ పల్చబడి బయటకు వస్తుంది. నీటి ఆవిరి పీల్చేటప్పుడు దానిలో విక్స్ వంటివి వేస్తే మంచిది. జలుబు చేసినవారు చంటి పిల్లలకు కొంచెం దూరంగా వుండడం మంచిది. కొందరికి జలుబు ఎక్కువగా అకస్మాత్తుగా వస్తుంది. మరికొందరికి జలుబు చేసినా అంతబాధ వుండకపోగా రెండు మూడురోజుల్లోనే తగ్గిపోవచ్చు. దానికి కారణం అంతర్గతంగా వారి శరీరంలో ఉన్న రోగనిరోధక వ్యవస్థ. మన శరీరంలో రోగనిరోధకవక్తి బాగా వుంటే వారికి జలుబు రాదు. వచ్చినా త్వరగా తగ్గుతుంది.



—Use of handkerchief

జలుబు చేసినవారు చీటికీ మాటికీ చీదుతూ వుంటారు. అది సహజమే! అయితే చీదేటప్పుడు ఒక ముక్కు రంధ్రాన్ని మూసి మరో రంధ్రం ద్వారా ఒకసారి ఆ తర్వాత ఈ రంధ్రాన్ని మూసి మరో రంధ్రం ద్వారా మరొకసారి. చీదడం మంచిది. దీనివల్ల జలుబు వల్ల ఏర్పడిన మ్యూకస్ బయటకు వచ్చి ముక్కు దిబ్బడ తొలగడమే కాక జలుబు కూడా త్వరగా తగ్గుతుంది.

జలుబుకు ఆవిరి పీల్చి ఉపశమనం పొందాలనుకునే వారు వెడల్పాటి గిన్నెలో నీరు కాచి పోసి దానిలో జామాయిల్‌గాని, విక్స్‌గాని వేసి ఆవిరి పడతారు. కానీ ఇలా వెడల్పాటి

గిన్నెలో ఆవిరి పట్టడం ద్వారా ఆవిరి నష్టం ఎక్కువ అవుతుంది. అలాకాక వెడల్పు తక్కువగా వున్న పాత్రలో ఆవిరి పట్టాలి. దానికి ఒక పెద్ద న్యూస్‌పేపర్ తీసుకుని నాలుగు మడతలు పెట్టాలి. మిఠాయి పొట్లంలాగా దానిని తీసి, దాని కొనను కొద్దిగా చించి, దాని ద్వారా ఆవిరి వెళ్ళేట్లుగా చేసి దానిని పీలిస్తే ఆవిరి నేరుగా ముక్కుల్లోనికి వెళ్ళే అవకాశం వుంటుంది. ఆవిరిని పీల్చేటప్పుడు మనకు ఊపిరి సలపనంతగా పీల్చరాదు. అలాగే ముక్కులు మండుతుంటే ఆవిరిని పీల్చడం ఆపెయ్యాలి.

జలుబు, దగ్గు వారాల తరబడి వుంటే డాక్టరు వద్దకు వెళ్ళి తగు పరీక్షలు చేయించాలి. జలుబుతో పాటు తలనొప్పి వుంటే అది సైనుసైటిస్‌కు దారి తీయవచ్చు. దానివలన జలుబు లేకపోయినా తల నొప్పి వస్తుంది. ముఖంలోని కళ్ళ క్రింద, ముఖంలోని ఎముకల భాగాలలో మ్యూకస్‌పొర ఇన్‌ఫెక్షన్‌కు గురి అవ్వడాన్ని సైమాసైటిస్ (Simusitis) అంటారు. దీనిని పోగొట్టడానికి ఆపరేషన్ చేసి ఆ ప్రాంతాలలోని చీమును లాగివేస్తారు. ఈ విధంగా సైను సైటిస్ రాకుండా వుండాలంటే జలుబును ప్రారంభంలోనే వీలైనంత త్వరగా తగ్గించుకోవాలి.

**చికిత్స**

★ జలుబు చేసినప్పుడు సాధారణంగా వాడే మందులు చాలా మత్తును కలిగించేవి. ఈ మందుల్ని వాడేటప్పుడు అందుకునే యంత్రాల వద్ద పని చేయకూడదు. మంటల వద్ద కూడా పని చేయరాదు మోటారు వాహనాల్ని నడపరాదు.

★ జలుబు వైరస్‌వల్ల వచ్చే వ్యాధి కాబట్టి ఎలర్జీకి - యాంటీ హిస్టమిన్‌లు వాడవచ్చు. చాలా మంది జలుబుకు కూడా మందు ఏమి వేసుకుంటాములే అని అశ్రద్ధ చేస్తారు. కానీ మందులు వేసుకుంటే జలుబు వెంటనే తగ్గకపోయినా పడిశం భారం త్వరగా తగ్గుతుంది. అలాగే దగ్గు మందులు కూడా మత్తును కలిగించేవి. సాధారణంగా దగ్గు మందులు, జలుబు మందులు కలిసి వుండవచ్చు.

జలుబుకు సాధారణంగా ఈ క్రింది విధంగా మందుల్ని వాడవచ్చు

★ ఏక్టిఫెడ్ - టాబ్లెట్స్ రోజుకు మూడు

జలుబుతో పాటు జ్వరం వుంటే -

★ ఏక్టిఫెడ్ ప్లస్ - టాబ్లెట్స్ రోజుకు మూడుచొప్పున వాడాలి.

★ ఫెస్టాన్ ఎక్స్‌పెక్టోరంట్ - సిరప్ - రోజుకు ఆరు చెంచాలు (పెద్దలకు), (పూటకు రెండు) పిల్లలకు మూడు చెంచాలు (పూటకు ఒకటి)

★ కోసావిల్ - టాబ్లెట్స్ - రోజుకు మూడు చొప్పున వాడాలి.

జలుబులో ముక్కు దిబ్బడ వుంటే -





★ డకాన్ డ్రాప్స్ - చిన్న పిల్లలకు ఒకటి, పెద్దలకు ఒకటి లేక రెండు చుక్కలు ముక్కులో వేయాలి.

★ నాసావిన్ - డ్రాప్స్ - పై విధంగానే

★ ఆట్రివిన్ - పీడియాట్రిక్ - డ్రాప్స్ - ఇది పూర్తిగాపిల్లలకు మాత్రమే.

★ ఆట్రివిన్ నాసల్ - డ్రాప్స్ - పెద్దలకు

ఒకటి, రెండు చుక్కలు ముక్కులో రోజూ మూడుసార్లు వాడాలి.

జలుబుతో పాటు దగ్గు కూడా వుంటే -

★ ఫెస్టాన్ ఎక్స్‌పెక్టొరెంట్

★ జీట్ ఎక్స్‌పెక్టొరెంట్

★ ఫెన్సిడిల్ ఎక్స్ పెక్టోరంట్

★ పిరిటాన్ ఎక్స్‌పెక్టోరంట్

★ మ్యూకోడైన్ సిరప్

★ పాన్‌థర్ కఫ్ సిరప్

జలుబుతో పాటు జ్వరం కూడా వుంటే -

★ పారాసిటమాల్ మాత్రలు పూటకు ఒకటి చొప్పున మూడు పూటలా వాడాలి.

## దగ్గు (Cough)

దగ్గు అనేక కారణాల వల్ల వస్తుంది. అనేక రోగాలలో జ్వరం ఎలా వుంటుందో - అదే విధంగా దగ్గు కూడా వుండవచ్చు. అంతేగాని ఇది ప్రత్యేకించి జబ్బేమీ కాదు. పైగా గొంతులోను, ఊపిరితిత్తులలోను ఏదైనా రోగం వచ్చినప్పుడు ప్రతిగా మన శరీరంలో తయారయ్యే ద్రవం తన పని పూర్తి చేశాక బయటకు వెలువడే ప్రక్రియనే దగ్గు అనవచ్చు.

గాలిలో వుండే దుమ్ము, ధూళి, పొగ, పుప్పొడి రేణువులు ఇంకా సూక్ష్మక్రిములు వంటివి మనముక్కు రంధ్రాల ద్వారా శ్వాస మండలంలోనికి ప్రవేశిస్తే వాటిని వెలుపలకు పంపేందుకు మన శరీరం ప్రయత్నిస్తుంది. అప్పుడు దగ్గు వస్తుంది. దగ్గు రెండు రకాలుగా వుంటుంది. అవి:

1. పొడిదగ్గు (Dry cough)
2. గళ్ళతో వుండేదగ్గు

★ పొడిదగ్గు చాలా చికాకు పెడుతుంది. గొంతులో కితకితలు పెట్టినట్లుగా అనిపించి దానిని తగ్గించే ప్రయత్నంలో దగ్గువస్తుంది.

★ పొడిదగ్గు ఎడతెరపి లేకుండా వస్తుంది. ఇది ఎక్కువైతే ఊపిరితిత్తులకు ప్రమాదం కలుగుతుంది.

- ★ పొడిదగ్గువలన కడుపులోని కండరాలుకదిలి కడుపు నొప్పి, వెన్నునొప్పి కూడా మొదలవుతాయి.
- ★ ఊపిరి పీల్చుకోనివ్వకుండా వచ్చే పొడి దగ్గు వల్ల నీరసం కలుగుతుంది.
- ★ దగ్గు పొగత్రాగేవారిలో ఎక్కువగా కనిపిస్తుంది. వీరిలో మొదట పొడి దగ్గు వచ్చినా తరువాత గళ్ళ పడడం మొదలవుతుంది. ఈ రకమైన దగ్గు లక్షణాన్ని స్మోకర్స్ కఫ్ అని, స్మోకర్స్ బ్రాంకైటిస్ అని కూడా అంటారు.
- ★ కొందరికి వాతావరణంలో వుండే కొన్ని రకాలు పదార్థాలు గిట్టక పోవడంవల్ల పొడి దగ్గు వస్తుంది. దీనిని ఎలర్జీ దగ్గు అంటారు.
- ★ ఎలర్జీ దగ్గు కూడా ఎడతెరిపి లేకుండా వస్తూనే వుంటుంది. దీనిలో జిగటగా తెల్లగా కొద్ది మోతాదులో గళ్ళ కూడా పడవచ్చు.
- ★ ఎలర్జీ దగ్గు వున్నవారు వీలైనంతవరకు వారికి సరిపడని వస్తువులకు దూరంగా వుండాలి. అలాగే వారికి సరిపడని వస్తువులు ఏమేమి వున్నాయో వాటిని ఒకలిస్ట్ రాసి దగ్గర పెట్టుకొని వాటికి దూరంగా వుండేందుకు ప్రయత్నిస్తే పొడి దగ్గు రాకుండా వుంటుంది.
- ★ పొడి దగ్గు క్షయవ్యాధి మొదటి దశలోను, లంగ్ కేన్సర్‌లోను ధూమపానం చేసేవారిలోను, ఇసినోఫీలియా వున్న వారిలోను దీర్ఘకాలంగా ఉబ్బసం వున్నవారిలోను ఇంకా ఇతర మానసిక వ్యాధులలోను వుంటుంది.
- ★ గళ్ళతో వచ్చే దగ్గులో గళ్ళ పచ్చగాగాని, తెల్లగాగానీ పడవచ్చు. తెల్లగా గళ్ళ పడుతుంటే దగ్గు దానంతట అదే తగ్గిపోతుంది. కానీ గళ్ళ పచ్చగా పడుతుంటే మాత్రం ఇన్‌ఫెక్షన్ వుందన్న మాట.
- ★ గళ్ళ లేక తెమడతో కూడిన దగ్గు శ్వాసకోశాల వ్యాధుల వల్ల వస్తుంది.
- ★ గళ్ళను పోగొట్టడానికి నీటి ఆవిరిని ముక్కుతో పీల్చాలి. జలుబు చేసినప్పుడు పీల్చేట్లుగానే పీల్చాలి.
- ★ గళ్ళ పచ్చగా పడే ముందు తెల్లగానే పడుతుంది. ఆ తరువాత మన శరీరంలో బాక్టీరియా క్రిములు చేరడంతో పచ్చగా మారుతుంది.
- ★ గళ్ళ పచ్చగా పడడం ప్రారంభించాక రెండు మూడు రోజులు మందులు వాడడం కంటే శరీరం తన రోగనిరోధక శక్తిని ఉపయోగించుకునే అవకాశం కలిగించడం మంచిది. ఒకవేళ ఎలాటి మందులు వాడకుండానే వ్యాధి తగ్గవచ్చు.
- ★ దగ్గులలో అనేక రకాలు వున్నాయి. అన్నది ఇంతకు ముందే తెలుసుకున్నాం. దగ్గువల్ల మెదడుకు రక్త ప్రసారం తగ్గి కళ్ళు బైర్లుక్రమ్ముతాయి. కొందరికి పక్కటెముకలు నొప్పి చేస్తాయి. ఒకొక్కసారి అవి విరిగి పోవచ్చు కూడా.





- ★ అతిగా దగ్గడం వల్ల కొందరిలో ఊపిరితిత్తులకు కన్నం పడుతుంది. పుపుసావరణ కుహరంలో వాయువు చేరడం (న్యూమోథొరాక్స్) వచ్చే ప్రమాదం వుంది.

## చికిత్స

- ★ దగ్గు ఏకరకంగా వచ్చినా ముందుగా అది రావడానికి గల కారణాన్ని గుర్తించిదానికి చికిత్స చేస్తే వ్యాధి త్వరగా తగ్గుతుంది.
- ★ మామూలు దగ్గుకు ఈ క్రింది మందులు వాడవచ్చు.

  పిరిటాన్ - టాబ్లెట్స్

  పోలారమిన్ - 2 మి.గ్రా. టాబ్లెట్స్

  ఫెనిర్గాన్ - టాబ్లెట్లు / ఇంజక్షన్

  ఎవిల్ - 25 మి.గ్రా / 50 మి.గ్రా. టాబ్లెట్సు

  కొడీన్ - టాబ్లెట్సు

  పై మందులన్నీ నిద్రను కలిగించేవి. కాబట్టి ఇవి వాడినప్పుడు యంత్రాల దగ్గర పని చేయడం, మోటార్లు నడపడం చేయరాదు. ఇవన్నీ పొడి దగ్గుకు వాడవచ్చు. వీటిలో టాబ్లెట్స్ రోజుకు మూడు చొప్పున మూడు పూటలా వాడాలి.
- ★ దగ్గుతో పాటుగా కళ్ళె పడుతుంటే, అది పచ్చగా వుంటే ముందుగా కళ్ళెను పల్చబడేట్లు చేసేందుకు నీటి ఆవిరిని పీల్చాలి. నీటిలో బెంజాయిన్ గాని, యుకలిప్టస్ ఆయిల్‌గాని, విక్స్‌గాని వేసి బాగా మరిగించి ఆవిరి వచ్చాక దానిని పీల్చాలి.
- ★ దగ్గు వున్నప్పుడు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వుంటే

  స్టాన్ డి.యస్ - టాబ్లెట్స్

  సిప్లిన్ డి.యస్ - టాబ్లెట్స్

  సెప్ట్రాన్ - టాబ్లెట్స్

  బాక్ట్రిం - టాబ్లట్స్

  వీటిని రోజు రెండు పూటలా పూటకు ఒకటి చొప్పున వాడాలి. లేదా

  డాక్సి-1 - కాప్సుల్

  మినిసైక్లిన్ - కాప్సుల్

  టెట్రాడాక్స్ - కాప్సుల్

  వీటిని పరగడపున రోజుకొక కాప్సుల్ చొప్పున పది రోజుల పాటు వాడాలి. పై మందులకు తగ్గకపోతే డాక్టరు వద్దకు వెళ్ళాలి.

## ఆయాసం (Dyspnoea)

ఆయాసం అనేది జబ్బు కాదు. ఇది అనేక జబ్బులలో వుండే ఒక లక్షణం మాత్రమే. అలవాటు లేని పని చేసినా, ఊపిరితిత్తులలో నిమ్ము, బ్రాంకైటిస్, గుండెకు చెందిని ఇతర జబ్బులు వున్నా, రక్తహీనత వున్నా, అలర్జీ వున్నా ఉబ్బసంలోను ఆయాసం వస్తుంది.

పిల్లలలో అయితే వారు ఆటలాడుకునే సమయంలో ఆయాసం వస్తుంది. ఇంకా మరీ చిన్న పిల్లలలో గొంతులో ఏదైనా పొరపాటున పరాయి వస్తువు (Foreign body) వేసుకోవడం వల్ల కూడా ఆయాసం వస్తుంది. ఆటలాడుకునే సమయంలో వచ్చేదైనా ఏదైనా పని చేయడం వల్ల వచ్చేదైనా ఆయాసం దానంతట అదే తగ్గిపోతుంది. ఉదాహరణకు ఏదైనా బరువైన వస్తువుల్ని ఎత్తి వేరే చోట పెట్టినా, లేక సిటీ బస్సు కోసం పరుగెత్తినా వచ్చే ఆయాసం దానంతట అదే తగ్గుతుంది.

మితిమీరి బరువు వున్నవారు (స్థూలకాయం వున్నవారు) కొస్తంత దూరం నడిచినప్పటికీ ఆయాసం వస్తుంది. చంటి పిల్లలు ఆడుకునేటప్పుడు చిన్న చిన్న రబ్బరు మూతలు, గుండీలు, బఠాణీ, వేరుశనగ గింజలు, చిల్లర నాణేలు (పావలా వంటివి) పొరపాటున నోట్లో పెట్టుకుని మింగితే అవి గొంతులో అడ్డుపడి అకస్మాత్తుగా ఆయాసం వస్తుంది. ఈ పరిస్థితిలో మనకు వారు ఏదైనా వస్తువుల్ని గొంతులో వేసుకున్నారని అనుమానం కలిగితే వెంటనే వాళ్ళను తలక్రిందుగా పట్టుకుని రెండు భుజాల మధ్య తేలికగా గుద్దితే గొంతులో ఇరుక్కున్న వస్తువు బయటకు వస్తుంది. కొంచెం పెద్ద పిల్లలయితే పొట్టపైన చేత్తో నొక్కి పట్టుకుని మరో చేత్తో తలని కొంచెం ముందుకు వంచుతూ వీపు పైన చిన్నగా గుద్దుతుంటే పొరపాటుగా గొంతులో అడ్డుపడిన వస్తువు బయట పడుతుంది.

బ్రాంకైటిస్ వున్నవారిలో కళ్ళె గొంతుకలో శ్వాసకు అడ్డుపడడం వల్ల ఊపిరి పీల్చుకోలేక పోవడం వల్ల ఆయాసం వస్తుంది. రక్తహీనత వున్న, పొగత్రాగడం, సారాయి త్రాగడం వంటి అలవాట్లు వల్లా, రక్తపోటు (B.P) వున్నా ఆయాసం వస్తుంది. ఆయాసం ఏ కారణాల వల్ల వస్తుందో ముందు తెలుసుకుని దానికి ముందుగా చికిత్స చేయించుకుంటే ఆయాసాన్ని అదుపులో వుంచుకోవచ్చు.

### చికిత్స

★ ఇన్‌ఫెక్షన్ ఏదైనా రావడం వల్ల ఆయాసం వస్తే

సెప్ట్రాన్ - టాబ్లెట్లు బాక్ట్రిం - టాబ్లెట్లు

డాక్సి-1 - గొట్టాలు టెట్రాడాక్స్ - గొట్టాలు

మినిసైక్లిన్ - గొట్టాలు

పై మందుల్లో ఏదైనా సరే ప్రతి ఎనిమిది గంటలకు ఒకటి చొప్పున వాడాలి.





★ ఎలర్జీ వలన ఆయాసం వస్తే

పోలారమిన్ - 2 మి.గ్రా. టాబ్లెట్లు

పిరిటాన్ - 4 మి.గ్రా. టాబ్లెట్లు

కాడిస్టిన్ - 4 మి.గ్రా. టాబ్లట్లు

వీటిలో ఏదో ఒకటి పూటకు ఒకటి చొప్పున వాడాలి.

★ గుండె కోసం బంధించిన సమస్యల వల్ల ఆయాసం వస్తే వెంటనే గుండె వ్యాధులనిపుణుల (Cardialogist) వద్దకు వెళ్ళి తగిన చికిత్స చేయించుకోవాలి.

★ రక్తపోటు వున్నవారికి ఆయాసం వస్తే స్వంత వైద్యం పనికిరాదు.

★ పొగత్రాగేవారికి ఆయాసం వస్తే పొగత్రాగడం మానేసి చూడాలి. అప్పుడు ఆయాసం తగ్గవచ్చుకూడా!

## ఉబ్బసం (ఆస్తమా) (Asthma)

ఇది ఆయాసంలాగా వుంటుంది. కానీ ఈ వ్యాధిలో ప్రధాన కారణం ఎలర్జీ. ఉబ్బసం వ్యాధి అకస్మాత్తుగా వస్తుంది. వ్యాధి తెరలు తెరలుగా వస్తుంది. దగ్గుతో బాటుగా ఆయాసం కూడా వస్తుంది. పిల్లికూతలుగా ఆయాసంతో బాటు ధ్వనులు వినిపిస్తాయి. ఊపిరి ఆడకుండా గుండె బిగబట్టడం ఈ వ్యాధిలో వుం బంది. సర్వసాధారణంగా రాత్రిపూట ఈ విధంగా వుంటుంది.

ఛాతీ బాధతో రోగికి ఊపిరాడక కూర్చుండి పోతాడు. వళ్ళంతా చెమటలు కూడా వస్తాయి. రోగికి మొదట రొమ్ము బిగబిట్టి తరువాత ఉచ్ఛ్వాస, నిశ్వాసములు అసాధారణంగా వుండి గురక పెరుగుతుంది. దీనిని బ్రాంకియల్ ఆస్మా అని కూడా అంటారు. ఊపిరితిత్తుల్లో వున్న చిన్న, పెద్ద శ్వాసనాళాలు మూసుకుని పోతాయి. శ్వాసనాళ పొరలు ఉబ్బివాటి నుండి నీరు ఊరుతుంది. దీనివల్ల శ్వాసనాళాలలో వుండే మ్యూకస్ పొర జారి శ్వాస నాళాలకు అడ్డుపడుతుంది. అందుకనే ఊపిరితిత్తులలోనికి వెళ్ళిన గాలి బయటకు రావడం కష్టం అయి, ఎక్కువ సమయం తీసుకుంటుంది.

ఉబ్బసం రావడానికి చిన్నా పెద్దా, పేదా, గొప్ప తారతమ్యం ఏమీ లేదు. వంశపారం పర్యంగా కూడా ఉబ్బసం రావచ్చు. అప్పటిదాకా ఉబ్బసం ఉన్నట్లు లేని వారు అకస్మాత్తుగా వ్యాధి బయట పడేసరికి కంగారు పడవచ్చు. ఈ వ్యాధి అలాగే అకస్మాత్తుగా వస్తుంది. ముఖ్యంగా కొన్ని ఆహార పదార్థాలు తిన్నప్పుడు అవి మన వంటికి సరిపడక పోవడం వల్ల ఉబ్బసం వస్తుంది.

ఉబ్బసం వున్న వారికి దగ్గు కూడా ఏస్తుంది. ఉబ్బసం రావడానికి అనేక కారణాలు వుంటాయి. మనుషుల శరీర తత్వాలను బట్టి కొందరికి చలిగాలి వల్ల ఉబ్బసం వస్తే మరి కొందరికి శీతాకాలం అంతా బాగానే వుండి వేసవి కాలం వస్తే వ్యాధి మొదలవ్వవచ్చు.

## ఉబ్బసం రావడానికి కారణాలు

★ ముఖ్యంగా కొన్ని రకాల పదార్థాల వల్ల ఉబ్బసం వస్తుంది. వాటిలో వాతావరణ కారణాలు ఒక భాగం అయితే - వారి మానసిక వత్తిడి మూలాన కూడా కొందరికి ఉబ్బసం వస్తుంది.

★ పూలపుప్పొడి వల్లను

★ తేనెలాంటి 'స్వీట్' పదార్థాల వల్ల కూడా కొందరికి ఉబ్బసం రావచ్చు.

★ క్రొవ్వు పదార్థాలు లేక నెయ్యి కలిసిన పదార్థాల వల్ల

★ పుస్తకాల అలమరలో వుండే దుమ్ము వల్ల

★ రద్దీగా వుండే ప్రాంతంలో వుండే దుమ్ము వల్ల

★ ఆందోళన, అశాంతి, అలసట, ఆదుర్దాగా వుండడం, దిగులుగా వుండడం, అతిగా భయపడడం ఇవన్నీ కూడా ఉబ్బసం రావడానికి కారణము కావచ్చు.

★ వంశపారంపర్యంగా ఉబ్బసం వ్యాధి ఉన్నప్పుడు కూడా వ్యాధి బయటపడుతుంది.

★ కడుపులో ఏలిక పాముల వంటివి వుండడం వల్లను

★ కొందరు స్త్రీలలో బహిష్టు సమయంలో హార్మోన్ల లోపం వల్ల కూడా బహిష్టుకు ముందు ఉబ్బసానికి గురవుతారు.

## ఉబ్బసంలో ముఖ్య లక్షణాలు

★ ఆయాసంతో పాటుగా కళ్ళెపడడం, వాంతులు అవడం

★ ఎగశ్వాస - దీనితో పాటు పిల్లి కూతలు - గురగుర శబ్దాలు వినిపించడం.

★ ఫిట్స్ రావడం, శ్వాస తీసుకోలేకపోవడం.

★ కొద్దిపాటి జ్వరంతో తెల్లని జిగురువంటి కఫం (తెమడ)లో ఉండడం.

★ మెడలోని రక్త నాళాలు ఉబ్బి ఆయాసం, దగ్గు తెమడ వీటితో రోగికి శ్వాస సరిగ్గా అందక పోవడం, దీనివల్ల రోగి పెదాలు, గోళ్ళు నీలంగా మారడం - ఇవన్నీ ఉబ్బసం వ్యాధిలో వుండే ముఖ్య లక్షణాలు.

శ్వాస కష్టంగా వుండి ఆయాసంతో వున్న ప్రతివారు ఉబ్బసం వ్యాధిగ్రస్తులను కోరాదు. ఊపిరితిత్తుల వ్యాధులు, గుండె వ్యాధులలో కూడా ఆయాసం వస్తుంది. ఎంఫసిమా, బ్రాంకైటిస్, బ్రాంకియేక్టస్ వంటి వ్యాధులలో కూడా ఉబ్బసం వ్యాధి లక్షణాలుంటాయి. అదే విధంగా ఇసినోఫీలియా, రక్తహీనతల్లో కూడా ఉబ్బసం వుంటుంది.

సీజన్ మార్పు వల్ల కూడా ఉబ్బసం కొందరికి వస్తుంది. ఇటువంటివారు సీజన్ వచ్చే ముందు కాస్త జాగ్రత్త వహిస్తే సరిపోతుంది. అయినా ఉబ్బసం ఎటాక్ అయితే మందులు వాడక తప్పదు.





శ్వాసనాళాలలో ఏలిక పాములు, ఇతర క్రిములు చేరినప్పుడు ఉబ్బసంతో పాటుగా దగ్గు, ఇసినోఫీలియా, జ్వరం రావడం ఉంటుంది. శ్వాస కూడా వాసనతో వుంటుంది. దీనికి యాంటిబయాటిక్ చికిత్స చేస్తే తగ్గవచ్చు.

సాధారణంగా ఉబ్బసానికి చికిత్స డాక్టరు పర్యవేక్షణలోనే జరగాలి. ఎందుచేతనంటే ఒకొక్క సారి తీవ్రమైన ఉబ్బసం వస్తుంది. దానికి ఇంజక్షన్స్ ఇవ్వాలి. అవసరం అయితే ఆక్సిజన్ కూడా ఇవ్వాల్సి వుంటుంది. ప్రథమ చికిత్సానంతరం పన్నెండు గంటలలో ఆయాసం తగ్గకపోతే తప్పనిసరిగా డాక్టరు వద్దకు వెళ్ళాలి. డాక్టరు సలహాపైనే 'అడ్రినలిన్', డెక్సామిథాసోన్, ప్రెడ్నిసోలోన్ వంటి మందుల్ని వాడాలి. అయితే ముందుగా వ్యాధి ఉబ్బసమో ఏదో నిర్ధారించాలి.

రక్త పరీక్ష చేయడం వల్ల అది ఉబ్బసమా లేక మరేదైనా అన్నది నిర్ధారించుకోవచ్చు. అవసరాన్ని బట్టి ఛాతీ ఎక్స్‌రే కూడా తీయవచ్చు. ఉబ్బసం ఏ పదార్థం తీసుకోవడం వల్ల వస్తుందో గమనించాలి. అదికనుక్కోవడం కష్టంగా వుంటే 'డీ సెన్సిటైజేషన్' పద్ధతిలో సెన్సిటివిటీ పరీక్షలు జరపాలి.

ఉబ్బసానికి మానసిక వ్యాధి లేక మానసిక పరిస్థితి కారణం అయితే వ్యాధి రావడానికి కారణాన్ని గుర్తించి తగు మానసిక చికిత్స జరిపితే సరిపోతుంది. ఎలర్జీ క్లీనిక్స్‌లో అలర్జెన్స్ (ఉబ్బసానికి కారణమయ్యే పదార్థాలు)ను కొద్దికొద్దిగా చర్మంలోనికి ఎక్కించి ఉబ్బసాన్ని తగ్గిస్తారు. అయితే మానసిక వ్యాధిలో ఉబ్బసం వస్తే కష్టమే ! ఎందుకంటే చాలా మంది ఆరోగ్యవంతులు సైతం టెన్షన్ వల్ల ఆతృత వల్ల అకస్మాత్తుగా ఉబ్బసానికి గురవుతారు. పారాసింపథిటిక్ నాడుల చర్యల వల్ల శ్వాసనాళాలు కుచించుకుపోవడం ఈ రకమైన ఉబ్బసం రావడానికి కారణం. అయితే వీరు కోపాన్ని, టెన్షన్‌ను తగ్గించుకుంటే కాసేపటికి రిలాక్స్ అవుతారు.

ఉబ్బసం వచ్చినవారికి దాని తీవ్రత తగ్గి మళ్ళీ మాములుగా అయ్యాక నీరసం - అలసట అనిపిస్తుంది. దానికి తోడు ఉబ్బసానికి వాడే మందుల ప్రభావం వల్ల వారికి మరింత అలసట కలుగుతుంది. ఉబ్బసం రాత్రిపూట వచ్చేవారికి ఇక నిద్ర పోవడం కూడా కష్టమవుతుంది. వారు నిద్రపోబోయే ముందు ఉబ్బసానికి కొంతమోతాదులో (నిర్ణయించిన మోతాదులో) మందు తీసుకుంటే నిద్రలో ఉబ్బసం రాకుండా-వుండేందుకు అవకాశం వుంది.

ఉబ్బసం వున్నవారు శారీరక శ్రమ చేయరాదు. అంతేగాక వ్యాధి రాబోయే ముందు, వ్యాధి వచ్చిన తరువాత జాగ్రత్త వహించాలి. కొందరు ఉబ్బసం రోగులకు భయం అధికంగా వుంటుంది. వీరికి ధైర్యం చెప్పాలి. లేకపోతే వారు తాము ఊపిరి ఆడక పోవడం వల్ల మరణిస్తామేమోనని భయపడి శ్వాసను మరింత వేగంగా తీసుకోవడానికి ప్రయత్నిస్తారు. పరిస్థితి తీవ్రమై మరణించే ప్రమాదం కూడా వుంది. ఇటువంటి పరిస్థితి (భయంవల్ల ఉబ్బసం తీవ్రం అయ్యే పరిస్థితిని స్టేటస్ ఆస్మాటికస్ (Status asthmaticus) అని అంటారు. పరిస్థితులలో

పలచగా వున్న కఫం శ్వాసనాళాలలో చిక్కబడి అవి ఎండిపోయినట్లు అయిపోయి గట్టిపడి పోతుంది. ఇలాటి స్టేటస్ ఆస్మాటికస్ పరిస్థితి చాలా అరుదుగానే వస్తుంది.

## జాగ్రత్తలు

★ ఉబ్బసం వున్నవారు వారికి-సరిపడని వస్తువుల్ని గుర్తించి వాటిని ఒక పేపరు పై రాసి పెట్టుకుని దగ్గర పెట్టుకోవాలి. దీనివల్ల ఇతరులకు వారి పరిస్థితి అర్థం అయి వారికి ఆ వస్తువులు దూరంగా వుంచేట్లు చూస్తారు.

★ ఉబ్బసం వున్నవారు పొగ పీల్చరాదు. కొలిమి వద్దపని చేయరాదు. దీనివల్ల ఊపిరితిత్తులు దెబ్బతింటాయి.

★ ఊపిరిని లయబద్ధంగా తీస్తూ ఊపిరితిత్తులకు, వ్యాయామం (Breathing Exercise) చేయాలి. దీనిని ఉబ్బసం లేని సమయంలో కూడా చేయవచ్చు.

★ చిన్న తనంలో వచ్చే ఉబ్బసం (దీనినే బాలు ఉబ్బసం అంటారు) వారు ఎదిగేకొద్దీ క్రమేణా తగ్గి పోతుంది. కొందరిలో మాత్రం అలాగే వుండిపోవచ్చు.

★ ఉబ్బస రోగులు ఏ మందులు పడితే వాటిని వాడరాదు. ముఖ్యంగా కాంబినేషన్ మందుల్ని అవసరం అయితేనే తప్పవాడరాదు.

★ వెల్లికిలాపడుకోవడంవల్లను, బోర్లా పడుకోవడంవల్లను, వంగి పని చేయడం వల్లను ఉబ్బసం పెరగవచ్చు. ఏ విధంగా పడుకుంటే ఉబ్బసం తగ్గుతున్నట్లుగా వుంటుందో రోగిని అదే విధంగా వారికి అనుకూలంగా ఉండేట్లు పడుకోనివ్వాలి. అలాగే అదే విధంగా పని చేసుకోనివ్వాలి.

★ ఉబ్బసం రోగులు వేడి నీటిని త్రాగడం మంచిది. ఉబ్బసం వచ్చి అది నెమ్మదించాక టీగాని, కాఫీగాని వేడిగా వున్నది త్రాగితే ఊపిరితిత్తులలో చిక్క బడుతున్న కఫం పల్చబడుతుంది. తద్వారా ఉపశాంతిగా వుంటుంది.

★ ఉబ్బసం 12 గంటలలోపు తగ్గకపోతే తప్పకుండా డాక్టరును కలవాలి. ఉబ్బసం తగ్గిపోయినా కూడా డాక్టరు వద్దకు వెళ్ళి పూర్తి పరీక్షలు జరిపించుకోవాలి. ఇంజక్షన్స్ ఏవైనా చేయించుకోవాల్సివస్తే అనుభవం ఉన్న వారితోనే చేయించుకోవాలి. ఉబ్బసానికి వాడే ఇంజక్షన్స్ ఒకొక్కసారి ప్రాణాపాయాన్ని కూడా కలిగిస్తాయి. అలాగే ఉబ్బసానికి వాడే క్సామిథాసోన్, ప్రెడ్నిసోలోన్, బీటామిథాసోన్ వంటి మందుల్ని డాక్టరు సలహాననుసరించే వాడాలి.

## చికిత్స

ఉబ్బసానికి చికిత్స దీర్ఘ కాలం పట్టవచ్చు. కొందరికి జీవితాంతం ఉబ్బసం ఉంటుంది. కొందరికి తాత్కాలికంగానే ఉబ్బసం ఉంటుంది. అలాగే మరికొందరికి మందులు వాడితే





తగ్గిపోతుంది. కొంతమంది మందులు వాడినా అలావాడినంత సేపు ఉబ్బసం కనిపించక, ఎప్పుడైతే మందులు వాడడం ఆపేశారో అప్పుడు మళ్ళీ ఉబ్బసం కనిపిస్తుంది.

ఉబ్బసానికి మాత్రల రూపంలోను, సిరప్‌లు, నాలుక క్రింద ఉంచి కరిగించే గ్లాసెట్స్ (Glossets) రూపంలోను, స్ప్రే రూపంలోను మందులు ఉన్నాయి. ఉబ్బసం తీవ్రత, రోగి శారీరక పరిస్థితిని బట్టి మందుల మోతాదు నిర్ణయిస్తారు. ఉబ్బసానికి ముఖ్యంగా ఐదు రకాల మందుల్ని వాడుతున్నారు. అవి :

(a) సాల్‌బ్యుటమాల్ గ్రూప్

(b) అమినోఫిలిన్ గ్రూప్

(c) థియోఫిలిన్ గ్రూప్

(d) క్లోరోఫెనిరమైన్ గ్రూప్

(e) డెక్సామిథాసోన్ గ్రూప్

ఈ గ్రూప్‌లలోని మందులు రోగ తీవ్రతను బట్టి, రోగి శారీరక పరిస్థితిని బట్టి ఏదో ఒక దానితో చికిత్స చేస్తారు. డాక్టరు పర్యవేక్షణలో చికిత్స జరిపితే అవసరాన్ని బట్టి మందులు వాడడంలో తగు సూచనలు తీసుకునే వీలు ఉంటుంది.

★ సాల్‌బ్యుటమాల్ గ్రూప్‌లో -

ఆస్థలిన్ - 2 మి.గ్రా. / 4 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

వెంటోర్లిన్ - 4 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

సాల్‌బెటూల్ - 2 మి.గ్రా. / 4 మి.గ్రా. టాబ్లెట్స్

బ్రాంకోటాబ్ - 4 మి.గ్రా. టాబ్లెట్స్

పై టాబ్లెట్స్ రోజుకు రెండు చొప్పున వాడాలి.

★ అమినోఫిలిన్ గ్రూప్‌లో -

అమినోఫిలిన్ 100 మి.గ్రా. టాబ్లెట్స్ / ఇంజక్షన్

★ థియోఫిలిన్ గ్రూప్‌లో -

డెరిఫిలిన్ ఇంజక్షన్ / రిటార్డ్ 150 మి.గ్రా. టాబ్లెట్స్

T.R. ఫిలిన్ - 125 మి.గ్రా. టాబ్లట్స్

వీటిని రోజుకు రెండు సార్లు వాడాలి.

డెరిఫిలిన్, లేక థియోఫిలిన్ టాబ్లెట్లు వాడితే కొందరికి కడుపులో మంటవస్తుంది. కాబట్టి అన్నం తిన్న తరువాత వీటిని వాడితే సరిపోతుంది.

★ క్లోరో ఫెనిరమైన్ గ్రూప్‌లో -

పోలారమైన్ - 2 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

కాడిస్టిన్ - 4 మి.గ్రా. టాబ్లెట్స్

పిరిటాన్ - 4 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

వీటిని రోజూ రెండు పూటలా ఒకొక్కటి చొప్పున వాడాలి. వీటిని వాడితే మత్తుగా అనిపిస్తుంది కాబట్టి యంత్రాల వద్ద, నిప్పు దగ్గర పనిచేసేవారు వీటిని వాడాక పని చేయరాదు. అలాగే మోటారు వాహనాలు కూడా నడపరాదు.

★ డెక్సామిథాసోన్ గ్రూప్‌లో -

డెక్సోనా - 0.5 మి.గ్రా. / 4 మి.గ్రా. టాబ్లెట్స్ / ఇంజక్షన్స్

డెక్డాన్ - 0.5 మి.గ్రా. టాబ్లెట్స్ / ఇంజక్షన్స్

ఐడిజోన్ - 0.5 మి.గ్రా. టాబ్లెట్స్ / ఇంజక్షన్స్

వీటిని రోజుకు రెండు చొప్పున వాడాలి.

ఉబ్బసానికి మందులు దీర్ఘకాలం వాడాలి. వాడినంతకాలం తగిన విటమిన్‌లు, పౌష్టికాహారం, తప్పనిసరిగా తీసుకోవాలి. మందుల్ని వాడుతూనే యోగా వంటివాటిని చేయడం వల్ల చాలా ఉపయోగం వుంటుంది. ప్రయాణాలలో ఉబ్బస వ్యాధిగ్రస్తులు తాము రెగ్యులర్‌గా వాడే మందుల్ని తమవెంట తీసుకెళ్ళడం మరిచిపోరాదు. అంతేగాక తమకు సంబంధించిన 'కేస్‌షీట్'. ను లేక తమ వ్యాధికి సంబంధించిన ఫైల్‌గాని - తాము ఇంతకు ముందు వాడిన మందుల్ని, రిపోర్టులను కూడా వెంట తీసుకెళ్ళడం మంచిది. రోగి పరిస్థితి తీవ్రంగావుంటే అన్ని సదుపాయాలు గల ఆసుపత్రిలో ఉంచి చికిత్స చేయించాలి.

## ఊపిరితిత్తులకు నీరుపట్టుట (Pulmonary odema)

ఊపిరితిత్తులలో వుండే కణజాలాల మధ్య నీరు చేరుతుంది. దీనిని ముఖ్యమైన కారణం బాక్టీరియా ఇన్‌ఫెక్షన్. దీనిలో ఊపిరితిత్తులు వాచినట్లుగా అవుతాయి. ఊపిరి పీల్చుకోవడం కష్టం అవుతుంది. రోగి చాలా బాధ పడతాడు. ఈ విధంగా నీరు పట్టిన ఊపిరితిత్తుల పరిస్థితిని పల్మోనరీ ఎడిమా (pulmonary odema) అంటారు.

### కారణాలు

★ గుండె జబ్బులున్నవారికీ, గుండె పోటు, రక్తపోటు మొదలైన జబ్బులలో ఈ రకమైన pulmonary ఎడిమా వస్తుంది.

★ ఊపిరితిత్తులలో రక్త ప్రసరణ ఆగిపోవడం, మైట్రెల్ కవాటంలు సన్నబడడం వల్ల, ఇంకా గుండె ఎడమ వైపుకు పెరగడంవల్ల ఈ జబ్బు వస్తుంది.





★ నీళ్ళలో మునిగినవారికి

★ అధికంగా నరాలకు సెలైన్ఎక్కించడం వల్లను

★ తలకు గట్టిగా ఏదైనా దెబ్బ తగిలినవారికీ, షాక్ పరిస్థితి ఉన్నవారికీ పల్మోనరీ ఎడిమా రావచ్చు.

★ విష వాయువులు పీల్చినా కూడా ఇలా ఎడిమా రావచ్చు.

★ యురేమియా (యూరిన్‌లో రక్తం పోవడం) ఉన్నవారికి

★ ఒకొక్కసారి వేరే జబ్బులకు వాడే మందులు సరిపడక పోయినా కూడా పల్మోనరీ ఎడిమా లేక ఊపిరితిత్తుల వాపు (నీరు పట్టుట) వస్తుంది.

### లక్షణాలు

★ వ్యాధి అకస్మాత్తుగా ప్రారంభం అవుతుంది. దీనిలో కూడా ఆయాసం వుంటుంది.

★ ఆయాసం తీవ్రంగా వుండడంతో ఇది ఉబ్బసం అనుకునే ప్రమాదం కూడా వుంది.

★ దగ్గు, చీటికీ మాటికీ ఉమ్మడం, దగ్గుతో పాటు నీరు తెమడవలె రావడం వుంటాయి.

★ దగ్గు విడవకుండా రావడం, నాడి బలహీనంగా వుండడం, చెమటలు-విపరీతంగా పోయడంతో వళ్ళ చల్లగా మారి రక్తపోటు పడిపోతుంది.

### చికిత్స

★ వ్యాధి రావడానికి మూలకారణాన్ని కనుగొని చికిత్స చేయాలి. యాంటిబయాటిక్స్ వాడాలి.

★ మామూలుగా అంత ప్రమాదకరమైనది కాదు గానీ ఒక్కోసారి ఇది ప్రమాదకరమైన వ్యాధిగా మారవచ్చు.

★ వీలైతే డాక్టర్ పర్యవేక్షణలో నర్సింగ్ హోంలో వుంచి చికిత్స చేయవలసి వుంటుంది. ఆక్సిజన్ పెట్టడం, గొంతులో అడ్డుపడిన తెమడను తొలగించడం - బి.పిని నార్మల్‌కు వచ్చేట్లు చేయడం వంటివి ఆసుపత్రిలోనే సాధ్యమవుతాయి.

## ఊపిరితిత్తులకు ఫంగస్

దీర్ఘకాలంపాటు ఊపిరితిత్తులకు చెందిన వ్యాధితో బాధపడుతున్నవారికి ఊపిరితిత్తులలో ఫంగస్ చేరే అవకాశం వుంది. అంతేగాక చెక్కెర వ్యాధి, పౌష్టికాహారలోపం, ఎయిడ్స్, లింఫోమా వ్యాధిలోను ఊపిరితిత్తులకు ఫంగస్ చేరే అవకాశం వుంది. టెట్రాసైక్లిన్, కార్టికోస్టిరాయిడ్స్ వంటి మందులు ఎక్కువగా వాడడం వల్లను, బ్లడ్ కాన్సర్ మందులు వాడడం వల్ల, ఊపిరి తిత్తులకు ఫంగస్ చేరేందుకు అవకాశం వుంది.

### లక్షణాలు

★ ఊపిరితిత్తులకు ఫంగస్ చేరినప్పుడు మామూలుగా ఊపిరితిత్తులకు ఇన్‌ఫెక్షన్ వస్తే వచ్చే లక్షణాలే వుంటాయి.

★ దగ్గు, జ్వరం, కళ్ళె పడడం, కళ్ళె దుర్వాసనగా వుండడం జరుగుతుంది.

★ నీరసంగా వుండడం, నోరు దుర్వాసనతో వుండడం దీనితో పాటు జ్వరం తరచుగా నిలబడి పోవడం కూడా కనబడుతుంది.

★ ఈ వ్యాధిని ఎక్స్‌రే తీయడం, కళ్ళె పరీక్ష జరపడం, రక్త పరీక్ష జరిపి నిర్ధారించుకోవచ్చు.

## చికిత్స

సాధారణంగా ఏక్టినో మైకోసిస్, ఈస్ట్, ఫిలమెంటస్ ఫంగస్, డైమార్ఫిక్ ఫంగస్ వంటి పలు రకాల ఫంగస్ ఈ వ్యాధికి కారణం

★ ఏక్టినోమైకోసిస్ (Actinomycosis) వల్ల వచ్చే ఫంగస్ వ్యాధులకు

స్ట్రెప్టోమైసిన్ - ఇంజక్షన్ - 0.75 gr / 1 gr ప్రతి ఎనిమిది గంటలకు ఒక సారి చొప్పున ఆరు వారాల పాటు వాడాలి.

ఇది - ఏంబిస్ట్రిన్ -S

S.M-750 mg ఇంజక్షన్స్‌గా దొరుకుతుంది.

★ పెన్సిలిన్ - ఇంజక్షన్ - 2 మెగా యూనిట్స్ ప్రతి ఎనిమిది గంటలకు ఒకసారి చొప్పున ఆరు వారాలు వాడాలి. దీనిని స్ట్రెప్టోమైసిన్‌తో పాటుగా వాడవచ్చుకూడా.

★ ఏంటీఫంగల్ మందులైన

నిస్టాటిన్, ఏంఫోటెరిసిన్-B వంటి మందుల్ని కూడా వాడవచ్చు.

ఈ మందులన్నీ డాక్టరు పర్యవేక్షణలోనే వాడాలి.

## ఎంఫసీమా (వాయుకోశాలజబ్బు) (Emphysema)

ఎంఫసీమా దుమ్ము, ధూళి పరిశ్రమలలో పని చేసే వారికి వచ్చే శ్వాసకోశవ్యాధి. ముఖ్యంగా ఏస్‌బెస్టాస్ పరిశ్రమల్లో సిమెంట్ కర్మాగారాలలో ఇంకా ఇలాటి పరిశ్రమలలో పనిచేసే కార్మికులలో ఈ వ్యాధి కనిపిస్తుంది.

దుమ్ము, ధూళి పరిశ్రమలలో పని చేసేటప్పుడు కొన్ని రసాయన పదార్థాలు పీల్చడం వల్ల ఊపిరితిత్తులకు ఇన్ఫెక్షన్ వచ్చి, ఊపిరితిత్తులలోని గాలి గోళాలు పరిమితికి మించి విపరీతంగా ఉబ్బిపోతాయి. దానితో వ్యాధి బయటబడుతుంది.

### లక్షణాలు - చికిత్స

★ ఊపిరితిత్తులలోని వాయు గోళాలు వాపు చూపడం వల్ల అనేక ఇబ్బందులు, బాధలు వస్తాయి. ఆయాసం వంటివి వస్తాయి.





★ ఎంఫసీమా గాలి గొట్టాల్లో అడ్డంకి ఏర్పడడం వల్ల కూడా వస్తుంది. ఎంఫసీమాలో దగ్గు కూడా వస్తుంది.

★ ఎంఫసీమాలో ఛాతీ టైట్‌గా బిగబట్టినట్లు అనిపిస్తుంది. ఛాతీ ఎక్స్‌రే తీస్తే తెలుస్తుంది. ఇది ప్రమాదకరమైన జబ్బు. దీనికి నిపుణులతోనే వైద్యం చేయించాలి. వీటిలో కొన్ని రకాల ఎఫసీమాలను నయం చేయడం కుదరదు.

## ఎంఫయీమ

ఎంఫసీమా వలెనె ఇది కూడా ఊపిరితిత్తులకు సంబంధించిన జబ్బు. ఊపిరితిత్తులలో వుండే ప్లూరల్ స్పేస్‌లో చీము చేరడం ఈ వ్యాధి లక్షణం.

### కారణాలు

న్యూమోనియా, బ్రాంఖియాక్టైసిస్, యాక్టినోమైకోసిస్, లంగ్‌యాబ్సెస్ గాని, ఛాతీకి లోతైన గాయం అవడంవల్ల పుండుపడి రక్తం ద్వారా చీము క్రిములు ప్లూరా (ఊపిరితిత్తుల పొర)కు వ్యాపించడం ఈ వ్యాధి రావడానికి కారణాలు

### లక్షణాలు

★ జ్వరం అకస్మాత్తుగా వస్తుంది.

★ చెమటలు ఎక్కువగా పోయడం, తీవ్రస్థాయిలో జ్వరం వుంటాయి.

★ ఆకలి ఉండకపోవడం

★ జ్వరంతో పాటుగా దగ్గు, ఛాతీలో నొప్పి కూడా వస్తుంది.

★ రక్త పరీక్ష జరిపితే దానిలో తెల్లరక్త కణాల సంఖ్య విపరీతంగా పెరిగి పోతుంది.

★ ఛాతీఎక్స్‌రే, కళ్ళె, ప్లూరల్ స్పేస్‌లోని చీమును పరీక్షించి వ్యాధిని నిర్ధారించుకోవాలి.

ప్లూరల్ స్పేస్‌లోని చీమును బయటకు తీయాలి. నిపుణులైన డాక్టర్లు మాత్రమే ఆపని చేయగలుగుతారు. ఈ ప్లూరల్ స్పేస్‌లోని చీమును కల్చర్ పరీక్ష చేయడం ద్వారా తగిన ఏంటీబయోటిక్ మందులు వాడాలి. బ్రీథింగ్ ఎక్సర్‌సైజ్ చేయాలి.

ఎంఫయిమాలో చీము మూడు నెలల వరకు తగ్గకపోతే అది క్రానిక్‌గా మారినట్లు లెక్క. క్రానిక్ ఎంఫయిమా ఏర్పడడం అంటే ప్లూరల్ స్పేస్‌లో వున్న చీము మొత్తం బయటకు తీయక పోవడమే కాక సరైన యాంటీబయాటిక్స్ వాడకపోయి అయినా వుండాలి. ఊపిరితిత్తుల క్షయ వ్యాధి. బ్రాంకైటిస్ వంటి వ్యాధులలో ప్లూరల్ స్పేస్‌లో చేరిన చీము తేలికగా తగ్గదు. దీనికి శస్త్ర చికిత్స చేస్తే క్రానిక్ ఎంఫయిమా తగ్గిపోవచ్చు. అయితే ముందుగా యాంటీబయాటిక్స్ వాడి చూడాలి. తగ్గకపోతే ఆపరేషన్ చేయవలసిందే. దీనిలో 'రిబ్‌రిసెక్షన్ వంటి శస్త్రచికిత్స చేసి డ్రైన్ ఏర్పాటు చేస్తే క్రానిక్ ఎంఫయిమా తగ్గుతుంది.

# బ్రాంకైటిస్

గొంతులో గురగురతో తెరలు తెరలుగా దగ్గుతో బ్రాంకైటిస్ వ్యాధి వుంటుంది. జలుబులాగా చాలా సందర్భాలలో ఇది కూడా వైరస్ వ్యాధి. ఇది రెండు రకాలుగా వుంటుంది.

1. ఎక్యూట్ బ్రాంకైటిస్.
2. క్రానిక్ బ్రాంకైటిస్

ఎక్యూట్ బ్రాంకైటిస్‌లో శ్వాసకోశాల గొట్టాలలోని మ్యూకస్ పొర వైరస్, బాక్టీరియా క్రిముల వల్ల ఉబ్బుతుంది. ఈ పరిస్థితి అకస్మాత్తుగాను, ఎక్కువగాను వస్తుంది. సుమారు ఐదు సంవత్సరాల వయసున్న పిల్లల్లోను బాగా వయసు మళ్ళిన వృద్ధులలోను ఇది కనిపిస్తుంది.

## కారణాలు

- ★ గుండెజబ్బులు, ఫ్లూ జ్వరం వున్న వారిలో ఎక్యూట్ బ్రాంకైటిస్ ఎక్కువగా కనబడుతుంది. క్రానిక్ బ్రాంకైటిస్ వున్నవారిలో ఎక్యూట్ బ్రాంకైటిస్ కూడా అప్పుడప్పుడు కనిపిస్తుంది.
- ★ వైరల్ డిసీజ్ అయిన పొంగు, కోరింత దగ్గు, ఎలర్జీ వున్న వారిలోను బ్రాంకైటిస్ వస్తుంది.

## లక్షణాలు

- ★ విపరీతంగా దగ్గు వుంటుంది.
- ★ గొంతులో గురగుర, పిల్లి కూతలు వినిపిస్తుంటాయి.
- ★ గుండె నొప్పి అనిపించేటట్లు ఛాతీలో నొప్పిగా వుంటుంది.
- ★ దగ్గుతో పాటుగా కళ్ళెగాని, తెమడగాని పడుతుంది.
- ★ జ్వరం కొంచెంగా వుంటుంది. కొందరిలో 101°F వరకు జ్వరం ఉండవచ్చు.
- ★ నీరసం, అలసట, అతిగా చెమటలు పట్టడం వుంటాయి.

క్రానిక్ బ్రాంకైటిస్‌లో ఊపిరితిత్తులలోని గాలి గొట్టాలలో క్రానిక్‌గా వాపు వుంటుంది. దీనిలో కూడా ఇన్‌ఫెక్షన్ రావడం వల్ల దగ్గు, దగ్గుతో తెమడ, కళ్ళె వస్తాయి. పైగా క్రానిక్ బ్రాంకైటిస్‌లో తెమడ అధికంగా వుంటుంది.

## కారణాలు

- ★ క్రానిక్ బ్రాంకైటిస్ రావడానికి బాక్టీరియా, వైరస్ క్రిములు కారణం కావచ్చు.
- ★ గొంతులో ఇన్‌ఫెక్షన్ రావడం, టాన్సిల్స్, ముక్కులో వుండే ఇన్‌ఫెక్షన్ శ్వాసకోశాలలోనికి ప్రాకడం వల్ల క్రానిక్ బ్రాంకైటిస్ వచ్చే అవకాశం వుంది.
- ★ ఎక్యూట్ బ్రాంకైటిస్ కొద్ది కాలానికి క్రానిక్ బ్రాంకైటిస్‌గా మారే అవకాశం వుంది.





- ★ దుమ్ము, ధూళిలో తిరిగేవారిలో కూడా ఈ క్రానిక్ బ్రాంకైటిస్ వచ్చేందుకు వీలుంది.
- ★ కొన్ని దీర్ఘ వ్యాధులలో కూడా క్రానిక్ బ్రాంకైటిస్ కనబడవచ్చు. ఉదాహరణకు - టి.బి (క్షయ) వంటి వ్యాధులలో బ్రాంకైటిస్ కనబడుతుంది.
- ★ పొగత్రాగే అలవాటు వున్నవారిలో క్రానిక్ బ్రాంకైటిస్ కనబడుతుంది.

## లక్షణాలు

- ★ క్రానిక్ బ్రాంకైటిస్‌లో కూడా ఎక్యూట్ బ్రాంకైటిస్‌లో వుండే లక్షణాలే వుంటాయి.
- ★ తరచుగా దగ్గు రావడం, దగ్గుతో పాటుగా కళ్ళె పడడం వుంటాయి. సీజనల్‌గా అంటే వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వ్యాధి లక్షణాలు బయటపడతాయి.
- ★ గొంతులో గురుగుర, ఆయాసం వుంటాయి.
- ★ జ్వరం కూడా అప్పుడప్పుడు వస్తుంది.
- ★ క్రానిక్ బ్రాంకైటిస్ దగ్గుతో పాటు రక్తం కూడా రావచ్చు.

## నిర్ధారణ

బ్రాంకైటిస్ ఏ రకమైనదైనా సరే దానిని నిర్ధారించుకోవాలంటే రక్త పరీక్షలు చేయడం, ఛాతీ ఎక్స్‌రే తీయడం, లంగ్ కెపాసిటీ పరీక్షలు చేయించాలి.

## చికిత్స

- ★ ఎక్యూట్ బ్రాంకైటిస్‌లోపూర్తి విశ్రాంతి అవసరం.
- ★ జ్వరం వుంటుంది. నిరసంగా వుంటుంది. కాబట్టి తేలికగా అరిగే ఆహారం తీసుకోవాలి. అంటే పాలు, రొట్టె, పళ్ళరసాలు ఇంకా ఇతర ద్రవపదార్థాలు తీసుకోవచ్చు.
- ★ ఊపిరితిత్తులలో కఫం పేరుకు పోతుంది. దీనికి ఆవిరి పట్టాలి.
- ★ క్రానిక్ బ్రాంకైటిస్‌లో ధూమపానం, పరిసరాలలో దుమ్ము వంటివి వుండరాదు. ముక్కు వ్యాధులు, గొంతు వ్యాధులు కూడా కారణం కావచ్చు.
- ★ రోగిలో వున్న ఇతర అనారోగ్య పరిస్థితులను సరి చేయాలి. బ్రీతింగ్ ఎక్సర్ సైజులు చేయాలి. శారీరక వ్యాయామం చేయాలి.
- ★ దగ్గుకు లింక్టస్, కోడీన్ వంటి దగ్గు మందులు వాడాలి.
- ★ ఇన్‌ఫెక్షన్‌కు యాంటిబయాటిక్స్ వాడాలి.

  ఏంపిసిలిన్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. కాప్సుల్స్

  ఎమాక్సిసిలిన్ - 250 మి.గ్రా / 500 మి.గ్రా. కాప్సుల్స్

సిప్లక్సిన్ - 250 మి.గ్రా. కాప్సుల్స్

వీటిలో ఏదైనా సరే ప్రతి ఎనిమిది గంటలకు ఒకసారి వాడాలి. వ్యాధి తీవ్రంగా వుంటే ప్రతి ఆరుగంటలకు ఒకసారి 250 మి.గ్రా. మోతాదుగాని లేదా ప్రతి ఎనిమిది గంటలకు ఒకసారి 500 మి.గ్రా. మోతాదు వాడాలి.

★ అవసరం అయితే వ్యాధి ఎక్కువగా వున్నప్పుడు ప్రెట్నిసోలోన్ లేక బెట్నిలాల్ టాబ్లెట్లు వాడాలి.

## న్యూమోనియా (Pneumonia)

న్యూమోనియా వ్యాధిలో ఊపిరితిత్తుల కణజాలం నీరు పట్టినట్లుగా బాగా ఉబ్బి వుంటాయి. ఈ వ్యాధి అకస్మాత్తుగా వస్తుంది. లేదా ఏదైనా జబ్బు చేసినప్పుడు ఆ జబ్బుతో పాటుగా ఇది కూడా రావచ్చు. కొందరికి ఆసుపత్రులలో వుండే వైరస్, బాక్టీరియా, ఫంగస్ వంటివి సోకడం వల్ల (Nosocomial infections) కూడా న్యూమోనియా రావచ్చు. మరికొందరికి 'పొర బారితే' (choking) ఆహార పదార్థాలు పొరబాటున శ్వాసనాళం లోనికి పోయి న్యూమోనియాను తెచ్చి పెడతాయి.

న్యూమోనియాకు అనేక జీవులు బాక్టీరియా, వైరస్, ఫంగస్ వంటివి కారణమైనా వీటిలో ముఖ్యమైనది బాక్టీరియాల్ న్యూమోనియా వ్యాధి

### బాక్టీరియల్ న్యూమోనియా

స్టెఫైలో కోకస్, స్ట్రెప్టోకోకస్, మైకోప్లాస్మా, క్లెబ్సియెలా వంటి అనేక రకాలైన బాక్టీరియా కణాల వలన ఈన్యూమోనియా వ్యాధి వస్తుంది. న్యుమోనియా ఏ వయసు వారికైనా రావచ్చు. చిన్నా, పెద్ద, పేద, గొప్ప తారతమ్యం లేదు. న్యూమోనియా వ్యాధి ఆస్మా ఉన్న రోగులకు వస్తే చాలా ప్రమాదం. అంతే కాదు ఇది పిల్లలలోను ముసలివారిలోను తీవ్రమైన ప్రభావాన్ని చూపుతుంది. అలాగే సారాయి త్రాగడం పొగ త్రాగడం వల్ల న్యుమోనియా వస్తే ప్రమాదం.

### లక్షణాలు

★ న్యుమోనియా లక్షణాలు అకస్మాత్తుగా బయటబడతాయి.

★ జ్వరం. చలితో వణికించుతుంది.

★ ఆయాసము. దగ్గు వస్తాయి. అంతేగాక తుప్పు రంగులో కళ్ళె కూడా పడవచ్చు. అయితే వ్యాధి ప్రారంభంలో కళ్ళెలో ఈ విధంగా తుప్పు రంగు కనిపించక పోవచ్చు. వ్యాధి ముదిరిన తరువాత కళ్ళెలో రక్తపు జీరలు (తుప్పురంగు) కనిపిస్తుంది.

★ వాంతులు కూడా వస్తాయి.

★ నాడ ఎక్కువ సార్లు కొట్టు కొంటుంది. ఊపిరి కూడా ఎక్కువ సార్లు పీల్చుకోవాల్సి వుంటుంది.





※ దగ్గినా తుమ్మినా ఎదురు రొమ్ములో నొప్పివచ్చి. అది అంతకంతకు పెరుగుతుంది.

※ ఊపిరి నిముషానికి 30 సార్లకంటే అధికంగా వుంటే లేక అరవై సంవత్సరాల వయసు పై బడిన వారిలోను, రక్తపోటు (డయాస్టోలిక్) 60 మి.మీ. పాదరస మట్టం కంటే తక్కువగా వుంటే, ఎక్సరేలో ఊపిరితిత్తులలో సగానికి పైగా జబ్బు వుంటే, ఈ జబ్బుతో పాటుగా వేరే ఏదైనా దీర్ఘవ్యాధి వుంటే ప్రమాదకరం.

### నిర్ధారణ

రక్తపరీక్ష, ఛాతీ ఎక్సరే తీయడం, రక్తాన్ని కల్చర్ చేయడం, కళ్ళె పరీక్ష, కళ్ళెను కల్చర్ చేయడం, బ్లడ్ గ్యాస్ ఎస్టిమేషన్ వంటి పరీక్షలు చేయడం వల్ల వ్యాధిని నిర్ధారించవచ్చు.

### చికిత్స

※ ఊపిరి అందకపోయే పరిస్థితి వుంటే ప్రాణ వాయువు (ఆక్సిజన్) అందించవచ్చు, దీని కోసంరోగిని ఆసుపత్రిలో వుంచి చికిత్స చేయించాలి.

※ ఊపిరి పీల్చడం మాములుగా జరిగేటప్పుడు కూడా దగ్గుతో తెమడను, కళ్ళెను ఊసెయ్యడం మంచిది. నీటి ఆవిరిని పీల్చడం వల్ల కళ్ళె పలచబడుతుంది. తేలికగా బయటకు వస్తుంది.

※ ఛాతీ నొప్పి తగ్గడానికి, జ్వరం తగ్గడానికి మందుల్ని వాడాలి. కల్చర్ పరీక్షలు జరిపి (రక్తానికి, కళ్ళెకు) ఏ రకమైన క్రిములవల్ల న్యుమోనియా వచ్చిందో తెలుసుకుని ఆరకమైన క్రిముల నివారణకు సరిపడిన మందుల్ని వాడవచ్చు.

※ కళ్ళెను ఎక్కడబడితే అక్కడ ఊయడం అంతమంచిది కాదు. దీనివల్ల జబ్బును ఇతరులకు అంటించిన వారవుతారు.

※ జబ్బు కనబడిన వెంటనే వైద్యం చేస్తే మంచిది. తీవ్రం అయిన పరిస్థితిలో వైద్యం చాలా ఖర్చుతో కూడుకుని వుంటుంది.

※ వేరే జబ్బు న్యుమోనియాకు కారణమైతే ముందు దానిని నివారించాలి.

※ న్యుమోనియా వచ్చిన వారు పొగత్రాగరాదు. దీనివల్ల ఊపిరితిత్తులు పాడయ్యే ప్రమాదం వుంది.

※ న్యుమోనియాను అశ్రద్ధ చేస్తే ఊపిరితిత్తుల పై పొరల్లో నీరు చేరవచ్చు. ఊపిరితిత్తులలో చీము చేరే ప్రమాదం ఉంది. ఇంకా ప్లూరసీ, ఊపిరితిత్తులలో చీముగడ్డ, పసిరికలు, మయోకార్డైటిస్, రక్తంలో చీము చేరడం వంటి అనేక ఇబ్బందులు రావచ్చు. కాబట్టి న్యుమోనియా వ్యాధి ప్రారంభ దశలోనే గుర్తించి తగు చికిత్స చేయించుకోవాలి. ఒకప్పుడు న్యుమోనియా వ్యాధి వలన కొన్ని వేల మంది ప్రజలు మరణించేవారు. నేడు శక్తివంతమైన

యాంటీ బయాటిక్స్, అత్యంతఆధునికమైన వైద్య సదుపాయాలు వుండడం వల్ల వ్యాధి నుండి కోలుకోవడానికి అవకాశం ఏర్పడింది.

* న్యుమోనియాలో ఈ క్రింది మందుల్ని వాడవచ్చు.

(a) **ఏంపిసిలిన్** : 250 మి.గ్రా. / 50 మి.గ్రా. ఇది,

రోసిలిన్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. కాప్సుల్స్

క్యాంపిసిలిన్ - క్యాప్సుల్స్

ఏంపిల్లిన్ - క్యాప్సుల్స్

బాసిల్లిన్ - క్యాప్సుల్స్

ఇటువంటి పేర్లతోదొరుకుతాయి అంతేకాక వీటిని ఇంజక్షన్స్‌గా కూడా ఇవ్వవచ్చు.

(b) **ఎమాక్సిల్లిన్** : 250 మి.గ్రా. / 500 మి.గ్రా.

ఎమాక్సిన్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. కాప్సుల్స్

ఎమాక్సిన్ - డిస్‌టాబ్లెట్స్ (250 మి.గ్రా).

ఎమాక్సిన్ - కిడ్స్ టాబ్లెట్స్ (125 మి.గ్రా.)

నోవమాక్స్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. కాప్సుల్స్

నోవమాక్స్ - కిడ్స్ (Distab) - 125 మి.రగా.

నోరమాక్స్ - డ్రాప్స్ - 100 మి.గ్రా. / ml.

నోవమాక్స్ - సిరప్ - 125 మి.గ్రా.

ఇలా ఇంకా. మాక్సిడిల్, వెర్‌మాక్స్, నేటామాక్స్, రోమెక్సైల్, అప్టిమాక్స్, వంటి పలు పేర్లతో దొరుకుతుంది.

(c) **జెంటామైసిన్**: 20 మి.గ్రా / 80 మి.గ్రా. / 2 m,

గారామైసిన్ - ఇంజక్షన్ జెంటామైసిన్ - ఇంజక్షన్

జెంటిసిన్ - ఇంజక్షన్ గారోసిన్ - ఇంజక్షన్

వంటి పలు పేర్లతో దొరుకుతుంది.

(d) **సిప్రోఫ్లోక్సాసిన్** : 250 మి.గ్రా. / 500 మి.గ్రా. ఇది.

సిప్రాన్ - 250 మి.గ్రా / 500 మి.గ్రా టాబ్లెట్స్

సిప్రాడ్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. టాబ్లెట్స్

క్విన్‌టార్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. టాబ్లెట్స్





సెబ్రాన్ - 250 / 500 మి.గ్రా. / 750 మి.గ్రా. 200mg / 100 ml సిరప్ ఇంజక్షన్.

సిప్రాలెట్ - 250 మి.గ్రా. / 500 మి.గ్రా. / 200mg/ 100ml - ఇంజక్షన్.

వంటి పేర్లతో దొరుకుతుంది.

పైనున్న మందుల్ని వారి వయసు, వ్యాధి తీవ్రతను బట్టి ఇవ్వాలి. డాక్టరు సలహాపైన మోతాదుని నిర్ణయించి వాడాలి.

## ఫ్లూ (Influenza) (Flu)

ఒకప్పుడు ఫ్లూ వ్యాధి చాలా తీవ్రమైన వ్యాధిగా భావించబడేది. 1918 - 1919 మధ్యనున్న ఒక సంవత్సరంలోనే ప్రపంచ వ్యాప్తంగా సుమారు రెండు కోట్ల మంది ప్రజలు ఫ్లూజ్వరం వల్ల చనిపోయారు. 1957లో మార్చిలో మరలా ఫ్లూజ్వరం చైనాలో వచ్చి ఆ సంవత్సరం అంతానికి ప్రపంచంలోని అన్ని ఖండాలకూ పాకింది. ఫ్లూవైరస్ వల్ల వస్తుంది. ఈ వైరస్ మన శరీరంలోనికి గాలి ద్వారా ప్రవేశిస్తాయి. ఫ్లూవైరస్ మన శరీరంలోనికి ప్రవేశించిన తరువాత ఒకటి నుండి నాలుగు రోజులలోనే వ్యాధి లక్షణాలు బయటబడతాయి.

**లక్షణాలు :**

★ ఫ్లూ వ్యాధి అకస్మాత్తుగా వస్తుంది. ఫ్లూ వ్యాధిని కలిగించేవి రెండు రకాల వైరస్ రకాలు. అవి ఇన్‌ఫ్లూయెంజా - A, ఇన్‌ఫ్లూయెంజా - B రెండు రకాలైనప్పటికీ లక్షణాలలో ఏ మాత్రం తేడా వుండదు.

★ ఫ్లూవ్యాధిలో జ్వరం, చలి, తలనొప్పి, వళ్ళునొప్పులతో బాటుగా బాగా నీరసం గూడా వుంటుంది.

★ ఫ్లూ వ్యాధి రావడానికి ముందుగా జలుబు దగ్గు వస్తాయి. గొంతునొప్పి ఏ మాత్రం ఆహారం మింగడానికి ప్రయత్నం చేసినా గొంతు నొప్పి పెట్టడం వుంటాయి.

★ వంటిపైన దద్దుర్లు (Rash) కూడా రావచ్చు.

★ శ్వాస అవయవాల లోపల వుండే జిగురుపొరలు (Mucous Membranes) వాచి పోతాయి. ఫ్లూ జ్వరం సాధారణంగా చలికాలంలో ప్రారంభమౌతుంది.

★ ఫ్లూ జ్వరంతో వున్న రోగి దగ్గినా,, తుమ్మినా వ్యాధి ఇతరులకు వ్యాపిస్తుంది.

★ ఫ్లూ వ్యాధిలో జ్వరం 102, 103 డిగ్రీల వరకు వుంటుంది. వళ్ళునొప్పులు వుంటాయి.

★ పొడిదగ్గు, ఛాతీలో మంట వుంటాయి. దగ్గు బాగా ముదిరిన తరువాత కఫం వస్తుంది.

★ ఫ్లూ వచ్చిన వారి గొంతు పరీక్షిస్తే ఎర్రగా వుంటుంది.

★ చిన్నపిల్లలకు ఫ్లూ వ్యాధి వస్తే వారికి వికారం, వాంతులు వుంటాయి.

* ఫ్లూ వ్యాధి చిన్నపిల్లలోనూ, వృద్ధులలోనూ తీవ్ర ప్రభావం చూపుతుంది. చికిత్స పూర్తి అయ్యేలోగా బాగా నీరస పరుస్తుంది. చిన్న పిల్లలో ఒక్కొక్కసారి మరణం కూడా సంభవించవచ్చు.

ఫ్లూ జ్వరాలు ఐదు రకాలు వున్నాయి. అవికాక ఇంకా చాలా వున్నాయి. కానీ ఐదు రకాలు ముఖ్యమైనవి. అవి

## నరాలకు చెందిన ఫ్లూ జ్వరం

దీనిలో విపరీతమైన తలనొప్పి వుంటుంది. సంధి లక్షణాలు కనబడతాయి. మెదడువాపు రావచ్చు.

## జీర్ణకోశానికి చెందిన లేదా పేగులకు చెందిన ఫ్లూ జ్వరం

ఈ రకమైన ఫ్లూ జ్వరంలో కూడా సాధారణ ఫ్లూ జ్వరానికి ఉండే లక్షణాలే వుంటాయి. వీటితో పాటుగా ఆకలి ఉండకపోవడం, వికారం, కడుపునొప్పి, వాంతులు, విరేచనం సరిగ్గా కాకపోవడం ముఖ్యమైన లక్షణాలు. కొంతమందికి బాగా విరేచనాలు కూడా అవుతాయి.

## మాలిగ్నెంట్ ఫ్లూ జ్వరం

ఈ ఫ్లూ జ్వరాన్ని విషజ్వరం అని కూడా అంటారు. ఈ జ్వరంలో గుండె బలహీనమవుతుంది. దానివల్ల రక్తప్రసరణ సరిగా జరగదు. వళ్ళంతా నీలంరంగులోనికి మారుతుంది. ఇది చాలా ప్రమాదకరమైన ఫ్లూ వ్యాధి. దీనిలోనూ ప్రాణాలు పోయే పరిస్థితి వుంది.

## శ్వాసకోశాలకు సంబంధించిన ఫ్లూ వ్యాధి

ఈ జ్వరం, బ్రాంఖోన్యూమోనియా, బ్రాంకైటిస్, న్యుమోనియా, ప్లూరసీ వంటి వ్యాధులు వస్తాయి. కళ్ళె పడుతుంది. కళ్ళె జిగురుతోనూ రక్తచారికలతో వుంటుంది. ఈ రకమైన ఫ్లూ జ్వరం చాలా ప్రమాదకరమైనది.

## మామూలు ఫ్లూ జ్వరం

ఈ రకమైన జ్వరంలో కేవలం ఒళ్ళు వేడిగా వుడడం, వళ్ళు నొప్పులు, జలుబు, కళ్ళు ఎర్రబడడం, నీరసం. పొడిదగ్గు, గొంతునొప్పి ముఖ్యంగా వుంటాయి. అయితే ఊపిరితిత్తులు నిమ్ముగాని, ఛాతీ మంట గాని అనిపించదు.

ఫ్లూ వ్యాధిలో వుండే బాధలన్నీ రెండు మూడు రోజుల్లోనే తగ్గిపోతాయి. జ్వరం కూడా నాలుగు లేక ఐదు రోజుల్లో తగ్గుతుంది. కొన్ని కేసులలో జ్వరం మరో రెండు రోజులు వుండవచ్చు. జ్వరంతో పాటుగానే మిగిలిన బాధలన్నీ తగ్గుతాయి.

ఫ్లూ వ్యాధిని తేలికగా తీసుకోరాదు. దీనివల్ల అనేక ఇబ్బందులు వస్తాయి. ఊపిరితిత్తులలో నిమ్ము, బ్రాంకైటిస్ వుంటాయి. ముఖ్యంగా రక్తంతో కూడిన కళ్ళె కనిపించే బ్రాంఖైటిస్ (Heamorrhagic bronchitis) వుండవచ్చు. సర్వసాధారణంగా ఫ్లూ జ్వరం నుండి పది రోజులలోగా కోలుకోవచ్చు. అయితే పసిపిల్లల్లోనూ వృద్ధులలోనూ ఫ్లూ వస్తే మరణం కూడా





సంభవించేంత ప్రమాదం. అదేవిధంగా నరాలవ్యాధులు, శ్వాసవ్యాధులు గుండె వ్యాధులు వున్నవారికి కూడా ఈ వ్యాధి ప్రమాదాన్ని కలిగిస్తుంది.

ఇంకా మెదడు, గుండె కండరాలకు సంబంధించిన ఎన్‌కెఫలైటిస్, మయోకార్డైటిస్, మయోసైటిస్ వంటి వ్యాధులు వస్తాయి. ఫ్లూ జ్వరం వచ్చిన చిన్న పిల్లలకు ఏస్ప్రిన్ వంటి మందులు వాడరాదు. అలావాడితే రేయిస్ సింద్రోమ్ (Reyes Syndrome) అనే జబ్బు వచ్చే ప్రమాదం వుంది.

ఫ్లూ జ్వరం వలన మతిభ్రమణం, చెవిలో చీము, మూత్రపిండాల వ్యాధి, బీర్జాల వాపు వంటివి సంభవిస్తాయి.

## చికిత్స

* ఫ్లూ వైరస్ వలన వచ్చే వ్యాధి కాబట్టి దీనికి ప్రత్యేకమైన మందులేమీ లేవు. పూర్తిగా విశ్రాంతి తీసుకోవడం ముఖ్యమైన విషయం.
* జ్వరానికి పారాసిటమాల్ వాడాలి. ఇది మెటాసిన్, క్రొసిన్ వంటి పలు పేర్లతో వుంటుంది.
* దగ్గుతో పాటు కళ్ళె పచ్చగా వుంటే బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ వున్నట్లు భావించాలి. దీనికి యాంటిబయాటిక్స్ వాడాలి.

సెప్ట్రాన్ - టాబ్లెట్స్

బాక్ట్రిం - డియస్ టాబ్లెట్స్

స్టాన్ డి.యస్ టాబ్లెట్స్ వీటిలో ఏదైనా సరే రెండు పూటలా వాడాలి.

# నాడీ వ్యవస్థ

మన శరీరంలోని పలు వ్యవస్థలను నియంత్రించేటటువంటి ముఖ్యమైన వ్యవస్థ - నాడీవ్యవస్థ. బాధ, నొప్పి, రుచి, వాసన వంటి వాటిని మనకు తెలియజేసేది నాడీవ్యవస్థ. నాడులు కూడా మన శరీరంలో రక్తనాళాల వలె అంతటా విస్తరించి వుంటాయి. నాడుల ప్రధాన కేంద్రము మెదడు. శరీరంలో రక్తప్రసరణ కూడా నాడులు అదుపులో వుంచుతాయి. ఇంకా శరీరంలోని వివిధ హార్మోనులను నియంత్రించునది కూడా మెదడే.

మనిషి అంటేనే మెదడు. మెదడు అంటే మనిషి అని చెప్పడంలో అతిశయోక్తి లేదు. వ్యక్తి తన పేరు, ఊరు, తన తల్లిదండ్రులు, తోబుట్టువులు, బంధువులు, స్నేహితులు ఇంకా ఇతర జ్ఞాపకాలు. వారి అందరి గురించిన విషయాలను గుర్తించుకోవడం మెదడుని. అంతేగాక కోపం, భయం, ఆందోళన, సంతోషం వంటివి కూడా మెదడుకు సంబంధించినవే.

మానవునినాడీమండలంలో సుమారు 130 కోట్ల నరాల కణాలు వున్నాయి. వీటిలో సుమారు నూరు కోట్ల నరాల కణాలు మెదడులోనే వున్నాయి. మెదడులో సుమారు మూడు వేలకోట్ల న్యూరాన్లు వుంటాయి. వీటికి ఐదు నుండి పదిరెట్లు గ్లియల్ కణాలు వుంటాయి. వీటిలో సమాచారం అంతా కంప్యూటర్లో పదిలపరచబడినట్లు అంటుంది. అంతేగాక మనం చేసే ప్రతి పనికీ వీటి ప్రేరణ, అనుమతి, ఆజ్ఞ కావాలి.



-Nervous system

మన శరీరంలో ఎన్నో ముఖ్యమైన విధులను నిర్వహించేటటు వంటి మెదడు మానవ శరీరంతో పోల్చితే కేవలం రెండు శాతం మాత్రమే వుంటుంది. అయితే మనం వినియోగించే ఆక్సిజన్ మొత్తంలో ఇరవైశాతాన్ని మెదడే వినియోగించుకుంటుంది. అంతేగాక గుండె శుద్ధి చేసిన రక్తంలో ఐదవ వంతు మెదడుకే ఉపయోగపడుతుంది. మెదడు పని తీరు - మెదడు కణజాలం ఆరోగ్యంగా వుండాలన్నా రక్తం ఉపయోగపడుతుంది.

మెదడు మన శరీరంలో కపాలంలో భద్రపరచ బడి వుంటుంది. ఇది 1350 గ్రాముల బరువు





వుంటుంది. స్త్రీలలో కాస్త తక్కువ బరువు వుంటుంది. మెదడుకు సంబంధించిన భాగాన్నంతా సెంట్రల్ నెర్వస్ సిస్టమ్ (CNS) అంటారు. దీన్ని సొమాటిక్ నాడీ వ్యవస్థ అని అటానమిక్ నాడీ వ్యవస్థ అని రెండు రకాలుగా వర్గీకరించారు. సొమాటిక్ నాడీ వ్యసవ్థ కండరాల కదలికలను శాసిస్తే, అటానమిక్ నాడీ వ్యవస్థ ప్రేగులను, గ్రంథులను శాసిస్తుంది.

## మెదడు నిర్మాణం

మెదడును నిలువుగాగానీ, అడ్డంగా గాని కోసి చూస్తే మధ్య ఖాళీ ప్రదేశం ఉన్నట్లు, మెదడు ఉపరిభాగం బూడిదరంగులోను, లోపలి భాగం తెల్లగాను వున్నట్లు తెలుస్తుంది. బూడిద రంగు భాగంలో నాడీ కణములు అధికంగాను తెల్లని భాగంలో నాడీ కణములు తక్కువగాను నాడీ కణ పోగులు ఎక్కువగాను వుంటాయి. మెదడును పెద్ద మెదడు, చిన్న మెదడు, మెడుల్లా అని విభజించవచ్చు.

పెద్ద మెదడు (సెరిబ్రం) బూడిద వర్ణంతో ఎగుడు దిగుడులుగా మడతలతో వుంటుంది. దీని భారం మెదడు భారంతో పోలిస్తే 66 శాతం వుంటుంది. పెద్ద మెదడులోనే జ్ఞాపకశక్తి, ఆలోచన, నొప్పి, స్పర్శ, వాసన, వినికిడి, చూపు సంబంధమైన జ్ఞాన కేంద్రాలు వుంటాయి. చిన్న మెదడు (సెరిబెల్లమ్) పెద్ద మెదడుకు క్రిందుగా మెడుల్లాకు పై భాగాన వుంటుంది. పరుగు పెట్టడం, నడవడం, చదవడం, గెంతడం వంటి పనులు ఈ చిన్న మెదడు చూస్తుంది. కండరాల చలనానికి సహాయ పడుతుందన్నమాట. అయితే ఒకొక్కసారి పెద్ద మెదడు కూడా ఈ విషయాలలో జోక్యం చేసుకుంటుంది. చిన్న మెదడు దెబ్బతింటే కండరాల వణుకు వస్తుంది.

పెద్ద మెదడు క్రిందుగా - చిన్న మెదడు ముందు భాగాన్ని 'మెడుల్లా' అంటారు. శరీర భాగాల నుండి వచ్చే ప్రేరణలకు మెదడు నుండి వచ్చే సందేశాలకు ఇది సమన్వయ కేంద్రంగా పని చేస్తుంది. ఇందులోని బూడిదరంగు పదార్థంతో ఉన్న కొన్ని జీవకణాలు హృదయస్పందనాన్ని, శ్వాసక్రియా వేగాన్ని, రక్తప్రసరణం మొదలైన పనులు (అసంకల్పితమైన పనులు) సరిగ్గా జరిగేటట్లు చూస్తుంది. ఈ భాగం చెడిపోతే మరణం సంభవిస్తుంది. ఇందులో ఉన్న బూడిద రంగు పదార్థం ద్వారా మెదడుకు వెళ్ళే లేదా మెదడు నుండి వచ్చే బోధన నాడీ పోగులు ప్రయాణం చేస్తాయి. ఇందులో అసంకల్పిత ప్రతీకార చర్యల కేంద్రాలు కొన్ని ఉన్నాయి. వీటివల్ల ఏదైనా హఠాత్ సంఘటనలకు ప్రతిస్పందించడంజరుగుతుంది. అంటే ఈ పనులు మెదడు అనుమతి లేకుండానే జరుగుతాయన్నమాట.

మన శరీరంలో ఏదైనా భాగం తీసివేస్తే ఆ భాగంలో మరలా కొత్త కణాలు వస్తాయి. అయితే మెదడులోని ఏ భాగంలో దెబ్బతగిలి కణాలు నశించినా తిరిగి ఆ భాగంలోని కణాలు పెరగవు. మనిషి పుట్టినప్పుడు ఎన్ని నాడీ కణాలు వున్నాయో పెరిగి పెద్దయిన తరువాత కూడా అన్నే కణాలు వుంటాయి. పైగా వయసు పైబడే కొద్దీ ప్రతి రోజు సుమారు వెయ్యి కణాలు నాశనం అవుతాయి. గాని కొత్త కణాలు పుట్టవు.

రక్తపోటు అధికంగా వుండడం వల్ల మెదడు దెబ్బతినవచ్చు. దీనివల్ల పక్షవాతం వచ్చే ప్రమాదం వుంది. ఏ కారణం చేతనైనా రక్త ప్రసరణ మెదడు కణాలకు మెదడులోని భాగాలకు నిలిచిపోతే అపోప్లెక్సీ (Apoplexy) అనే వ్యాధివస్తుంది. రక్తప్రసరణ లోపం వున్న వారికి గుండె పోటులాగా ఇలా బ్రెయిన్ స్ట్రోక్ వస్తుందన్న మాట. మెదడు లోపల రక్త ప్రసరణ వున్నట్లుండి రక్తపోటు వల్ల అధికంగా జరగడంవల్ల రక్త నాళాలు చిట్లి హె మరేజ్ వచ్చే అవకాశం వుంటుంది. ఈ పరిస్థితి వల్ల వచ్చే మెదడు పక్షవాతం సాధారణంగా '50' సంవత్సరాలు వయసు పైబడిన వారిలోను చక్కెర వ్యాధిగ్రస్తులలోను, రక్తపోటు వంశపారం పర్యంగా వుండేవారిలోను, ముఖ్యంగా స్త్రీలలో కన్నా పురుషులలోను ఎక్కువగా వస్తుంది.

సాధారణంగా మెదడు పక్షవాతం అధిక రక్తపోటు వున్న వారిలో కేవలం మెదడులో రక్తనాళాలు మాత్రమే చిట్లనక్కనరలేదు. శరీరంలో ఎక్కడ రక్తనాళాలు చిట్లినా, స్థానికంగా అక్కడి రక్తం గడ్డకట్టి ఏర్పడిన చిన్న చిన్న రక్తపు గడ్డలు రక్త ప్రవాహంతో పాటుగా మెదడు వరకు వచ్చి అక్కడి రక్తనాళాలలో అడ్డం పడినా కూడా మెదడు స్ట్రోక్ వచ్చే అవకాశం వుంటుంది.

కొంతమందిలో గుండె లోపలి పొరలలో చిన్న చిన్న రక్తపు గడ్డలు రక్త ప్రవాహంలో బయటకు వచ్చి మెదడుకు చేరి రక్తనాళాలకు అడ్డుపడి రక్తం మెదడుకు చేరదు. దీనివల్ల మెదడు కణాలు చనిపోతాయి. ఈ రకమైన స్థితిని సెరిబ్రల్ ఎంబోలిజం అంటారు.

కొందరిలో రక్తపోటు ఏమీ లేకపోయినా మెదడులోని రక్తనాళాలు బలహీనంగా ఉండడం వల్ల ఉబ్బుతాయి. ఈ విధంగా ఉబ్బి అకస్మాత్తుగా పగిలి రక్తస్రావం జరిగి ప్రాణాపాయం కలగవచ్చు. ఈ స్థితిని అన్యూరిజమ్ అంటారు.

మెదడులో కణితి ఏర్పడడం వల్ల కూడా రక్త ప్రసరణకు ఆటంకం కలగవచ్చు. మెదడులో ఇలాటి స్ట్రోక్స్ వచ్చేట్లయితే వారిలో కొన్ని లక్షణాలు బయటపడవచ్చు. అవి - మతిమరుపు, అనిశ్చితత్వం, శరీరంలోని అవయవాలు మొద్దుబారినట్లు అనిపించడం, మెడలోను, తల వెనుక భాగంలో నొప్పి, వినికిడి దోషం, దృష్టిలో మార్పు, మాట ముద్దగా రావడం, ఇంకా ఇలాటి లక్షణాలు కనబడవచ్చు. ఇంటి లక్షణాలను ఇంకా వేరే జబ్బులలో కూడా గమనించవచ్చు. అయితే వీటిని గమనించిన తరువాత డాక్టరును సంప్రదించి, తగు పరీక్షలు జరిపి చికిత్స చేయించుకోవాలి.

నాడీ వ్యవస్థలో మెదడు ముఖ్యమైన భాగం అయితే దాని నుండి వచ్చు దారపు పోగుల వంటి నాడులు కూడా ముఖ్యమైనవే. వీటిలో కూడా కపాల నాడులు ముఖ్యమైన నాడులు. ఇవి పన్నెండు జతలు వుంటాయి. అవి :

I. **అల్ఫాక్టరీ నెర్వ్ (Olfactory nerve) (ఘ్రాణనాడులు)** : ఇవి ముక్కు రంధ్రంలో వుంటాయి. వీటివలన వాసన గ్రహించగలము. ఇది సెన్సరీ (జ్ఞాన) (sensory) నాడి. ఇది దెబ్బతింటే వాసన తెలీదు.





II. **అప్టిక్ నెర్వ్ (Optic nerve) (దృష్టి నాడి)** : మధ్య మెదడు పైన అప్టిక్‌లోబ్ నుండి వస్తుంది. ఇది కంటిలోని రెటీనాలో వుంటాయి. వీటివలన వెలుతురు గ్రహించ గలుగుతాం. ఇది దెబ్బ తింటే చూపు దెబ్బ తింటుంది.

III. **అక్యులోమోటార్ నెర్వ్ (Oculomotor nerve)** : దీనిని అక్షిచాలక నాడి అంటారు. మధ్య మెదడు నుండి ఇవివస్తాయి. కంటిలోను కనుగ్రుడ్డు చుట్టూ వుండే నాలుగు కండరాలకు అనుసంధానించి వుంటాయి. ఇవి మోటర్ నాడులు కనుగ్రుడ్డు కదలికలకు, ఐరిస్ (కంటిపాప), ఐలిడ్స్ (కనురెప్పలు)ను అదుపులో వుంచుతాయి. ఇది దెబ్బ తింటే కనురెప్పవాలి పోతూ వుంటుంది.

IV. **ట్రాక్లియర్ నెర్వ్ (Trochlear nerve)** : ఇది కూడా మధ్య మెదడు నుండి వస్తుంది. కంటి పైనున్న కండరాలను ఇది అదుపులో వుంచుతుంది. ఇది కూడా మోటార్ నెర్వ్ రకానికి చెందినదే. కనుగ్రుడ్డు తిరగడానికి ఇది తోడ్పడుతుంది. ఇది దెబ్బతింటే కనుగ్రుడ్డు పైకి పక్కకి కదలదు. వస్తువు రెండుగా కనుబడుతుంది.

V. **ట్రై జెమినల్ నాడి (Irigeminal Nerve)** : ఇది మెదుల్లాకు ప్రక్క నుండి వస్తుంది. తల, ముఖం, దవడలు, పళ్ళలోను ఈ నాడీ కొసలు వుంటాయి. ఈ నాడి రెండు రకాలుగా వుంటుంది. సెన్సరీ (sensory) గా వుంటే ఫాలభాగం, కపాలం, కంటి పై రెప్ప, ముక్కు ఒక ప్రక్క, పళ్ళు దీని ఆధీనంలో వుంటాయి. మోటార్ నెర్వ్‌గా వుంటే నాలుక కదలికలు, చప్పరించడంలో, దవడ కండరాలను అదుపు చేయడంలో ఇవి ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఇది దెబ్బ తింటే ముఖంలో నొప్పి, స్పర్శ తెలియదు.

VI. **అబ్డుసెన్స్ నెర్వ్ (Adbucens Nerve)** : ఇవి కూడా మెదుల్లా ప్రక్కనుండి వస్తాయి. కంటి కండరాలను అదుపు చేస్తాయి. కనుగ్రుడ్డు తిరగడానికి ఉపకరిస్తాయి. ఇది మోటారు నెర్వ్ ఇది దెబ్బతింటే కనుగుడ్డు పక్కకులాగ బడుతుంది. ఒక వస్తువు రెండుగా కనబడుతుంది.

VII. **ఫేషియల్ నెర్వ్స్ (Facial Nerves)** : ఇవి ముఖంలో వున్న కండరాలను అదుపులో, వుంచుతాయి. ఈనాడి అదుపు తప్పిత ముఖం ఒక ప్రక్కకు పడిపోయే (Bell's palsy) వ్యాధి వస్తుంది. ఇవి సెన్సరీగా రుచిని, మోటార్ నెర్వ్‌గా ముఖ కవళికలను, మెడ కదలికలను అదుపు చేస్తుంది.

VIII. **ఆడిటరీనెర్వ్ (Auditory Nerve)** : ఇవి వినికిడికి ఉపకరిస్తాయి. అంతేగాక శరీర సమతుల్యతకు కూడా ఉపయోగపడతాయి. ఇది దెబ్బ తింటే చెవిలో హోరు వస్తుంది. తల తిరుగుతుంది.

IX. **గ్లోసోఫారింజియల్ నెర్వ్** : ఇవి పరాంతంలో 1/3 నాలుకను అదుపు జేస్తాయి. మిగిలిన 2/3 నాలుకను ఫేషియల్ నెర్వ్ అదుపు జేస్తుంది. గొంతులో కండరాలను అదుపు జేస్తుంది. రుచిని, స్పర్శను కలిగిస్తుంది. మ్రింగడానికి ఈ నాడులు ఉపయోగిస్తాయి. ఇది దెబ్బ తింటే రుచి తెలియదు. అహారం మింగుడు పడదు.

X. **వాగస్ (Vagus) నాడి** : దీనిని సంచారక నాడి అంటారు. అంటే ఇది మెడకు, ఛాతీకి ఉదరమునకు పాకుతుంది. ఇది స్వరపేటిక, ఊపిరితిత్తులు, జఠర గ్రంధులను అదుపులో వుంచుతుంది. అంతేగాక గుండె కొట్టుకొనే వేగాన్ని కూడా అదుపులో వుంచుతుంది. ఇది దెబ్బతింటే మాట బొంగురుగా వస్తుంది. ఆహారం, నీరు మింగుడు పడదు.

XI. **స్పైనల్ అసెసరి** : ఇది 11వ కపాలనాడి. ఇది గొంతు, స్వరపేటిక, తాలువు (అంగిలి), మెడ, భుజాలకదలికలు అదుపులో వుంచుతుంది. ఇది దెబ్బతింటే తలెత్తలేరు. తల త్రిప్పడము కష్టము.

XII. హైపోగ్లోసల్ : ఇది నాలుక కండరాలను, మెడ కండరాలను నాలుక కదలికలను అదుపు చేస్తుంది. ఇది దెబ్బతింటే మాట ముద్దగా వస్తుంది

నాడీ వ్యవస్థలో నాడీ దండము కూడా ముఖ్యమైన భాగము నాడీ దండము మెడుల్లా నుండి వెన్ను పూసలలోనికి ప్రయాణిస్తుంది. మెదడుకు సంబంధించిన మస్తిష్క మేరు ద్రవము (Cerebro spinal fluid - దీనినే 'CSF' అంటారు) కూడా వెన్ను పూసలోనికి నాడీ దండము వెంట వుంటుంది. అందుకే మెదడు జబ్బులలో CSF ను వెన్ను నుండి తీసి పరీక్షిస్తారు.

వెన్నుపూస మొత్తం నాలుగు భాగాలుగా వుంటాయి అవి :

1. మెడవెన్ను పూసలు (Cervical spine)
2. వక్షీయవెన్నుపూసలు (Thoracic spine)
3. కటివెన్నుపూసలు (Lumbar spine)
4. త్రికవంపు (Scial curve)

కపాలనాడులకు చెందిన వ్యాధుల్లో - బెల్స్‌పాల్సీ, ట్రైజెమినల్ న్యూరాల్జియా ముఖ్యమైనవి.

## బెల్స్‌పాల్సీ

వీరిలో శరీరం అంతా భాగానే వుంటుంది. కానీ ముఖం మాత్రం ఒక వైపు పక్షవాతానికి గురవుతుంది. మూతి వంకరపోతుంది. ముఖంలో హఠాత్తుగా ఈ విధంగా రావడంతో గాబరాపుడుతుంది. పక్షవాతం వస్తుందేమోనని భయపడతారు. కానీ ఇది అంత ప్రమాదకరమైనది కాదు.

కపాల నాడులలో 7వ పాల నాడి అయిన ఫేషియల్ నెర్వ్ పైన వత్తిడి తగలడం వల్ల ఇలా వస్తుంది. ఈ రకమైన స్థితి చలికాలంలో చలిగాలి వల్ల రావచ్చు. జబ్బు వచ్చిన వైపు కళ్ళు మూసుకుందాం అనుకున్నా కనురెప్పలు మూతపడవు. కళ్ళు మూసుకోమంటే కనుగుడ్డును తిప్పుతారు. ఇలా కళ్ళు మూసుకోవడం కష్టం అయినప్పుడు కంట్లో దుమ్ము పడి కెరటైటిస్ అనే కంటి వ్యాధి వచ్చే అవకాశం వుంది. దీనివల్ల కంటి వెంటనీరు కూడా కారుతుంది. భోజనం చేసేటప్పుడు మింగుడు పడడం కష్టంగా వుంటుంది. మూతి ఒక ప్రక్కకు లాక్కు పోవడంతో





నోట్లో జబ్బు వచ్చిన వైపు చొంగ కారుతుంది. మాట తొట్రు పడుతుంది. ఈ లక్షణాలతో పాటుగా చెవిలో చీము కారడం, చెవి నొప్పి, గవదలవాపు, మూర్ఛరావడం, తలనొప్పి, చూపులో దోషం వంటివి కూడా కనబడవచ్చు. వీటిలో ఏ ఒక్క లక్షణం బయటబడినా వెంటనే వైద్య సహాయం తీసుకోవాలి.

## చికిత్స

దీనికి ప్రత్యేకించి వైద్యం అవసరం లేదు. నూటికి ఎనభై మందిలో కొంత కాలానికి వ్యాధి నయం అవుతుంది. అయితే వ్యాధిని గుర్తించిన రెండు రోజుల్లో ఈ క్రింది మందులు వాడుకుంటే మంచి ఫలితం వుంటుంది.

★ డెకాడ్రాన్ - 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ డెసికార్ట్ - 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

★ డెక్సోనా - 0.5 మి.గ్రా. టాబ్లెట్స్

వీటని రోజుకు మూడుచొప్పున ఐదు రోజులు వాడాలి.

ప్రెడ్నిసోలోన్ అనే మందు కూడా వాడవచ్చు. ఇది

వైసోలోన్ - 5. మి.గ్రా. టాబ్లెట్స్

ఎమ్‌సోలోన్ - 5 మి.గ్రా. టాబ్లట్స్

అమ్నాకార్టిల్ - 5 మి.గ్రా. టాబ్లెట్స్

డెల్టాకార్టిల్ - 5 మి.గ్రా. టాబ్లెట్స్

వంటి పలుపేర్లతో దొరుకుతుంది. దీనిని రోజుకు 40 మి.గ్రా. చొప్పున రెండు లేక మూడు డోసుల క్రింద విభజించి తీసుకోవాలి. లక్షణాలు తగ్గే దాకా ఈ విధంగానే వాడాలి. ఆ తరువాత నిదానంగా డోసును తగ్గిస్తూ రావాలి. అంతేగాని లక్షణాలు తగ్గాయి కదా అని అకస్మాత్తుగా ఆపకూడదు. దీనిని జబ్బును గుర్తించిన 48 గంటలోగా వాడాలి.

నరాలు బలహీనతకు వాడే న్యూరోబియన్ వంటి మందులు వాడవచ్చు. వాడక పోయినా నష్టం లేదు. కనుగ్రుడ్డు ఆరిపోయి 'కెరటైటిస్' అనే జబ్బు రాకుండా అప్పుడప్పుడు కనురెప్పను క్రిందికి లాగి కంటిని మూసివేస్తూ ఉండవచ్చు. కంటి లోపల యాంటి బయాటిక్ ఆయింట్‌మెంట్ వేసి కంటి పై కట్టుకడితే మంచిది.

## ట్రైజెమినల్ న్యూరాల్జియా

క్రేనియల్ నెర్వ్‌కు సంబంధించిన మరొక సమస్య ఇది. ఐదవ కపాలనాడి అయిన ట్రైజెమినల్ న్యూరాల్జియా వ్యాధి గ్రస్తమవడంతో నరాల నొప్పి కలుగుతుంది. దీనినే ట్రైజెమినల్ న్యూరాల్జియా అంటారు.

కేవలం చల్లగాలి తగలడంవల్ల లేదా అతి చల్లని పదార్థాలు తాగినా, తిన్నా, వేడి పదార్థాలు తిన్నా ఆకస్మాత్తుగా వ్యాధి రావచ్చు. ముఖానికి ఒక వైపున నరాల నొప్పి వస్తుంది. ఈ నొప్పి సూదులతో పొడుస్తున్నట్లుగా అనిపిస్తుంది. కాసేపుగాని - లేక రోజు మొత్తం చాలాసార్లుగానీ ఈనొప్పి రావచ్చు. ఈ నొప్పి వచ్చినప్పుడు ముఖం కండరాలు బిగదీసుకుంటాయి. నోటి వెంట లాలాజలం ఊరుతుంది.

నొప్పి తగ్గిన తరువాత కూడా ముఖం అంతా మొద్దుబారినట్లు వుంటుంది. ఆహారం తీసుకోలేడు కూడా ఒక్కొక్క సారి ఈ నొప్పిని పంటి నొప్పిగా భావించే అవకాశము కూడా వుంది. కాని వీరికి పిప్పిపళ్ళు ఏవీ వుండవు. మరొకసారి ఈ నొప్పి వల్ల పార్శ్వ నొప్పి కూడా రావచ్చు.

**చికిత్స**

దీనికి శక్తి వంతమైన పెయిన్ కిల్లర్స్ డాక్టరు సలహా పైన వాడాలి. కార్బమజపిన్ 100 mg రోజుకు 3 సార్లు వాడాలి. డోసు అవసరాన్ని బట్టి పెంచుకోవచ్చు. దీనికి శస్త్రచికిత్స కూడా చేసి నయం చేయవచ్చు.

## ఫిట్స్ (Fits) (Epilepsy)

కొందరు మామూలుగా నడుస్తూ వుండగానో లేదా ఏదైనా పని చేసుకొంటూ వున్నప్పుడో అకస్మాత్తుగా క్రిందబడి కొట్టుకుంటారు. లేకపోతే చలనం లేక అలాగే కాసేపు వుండి పోతారు. దీనినే ఎపిలెప్సి లేక మూర్ఛ అంటారు. ఈ స్థితిని ఫిట్స్ అని కూడా అంటారు.

**కారణాలు**

ఎపిలెప్సి లేదా మూర్ఛ వ్యాధి రావడానికి అనేక కారణాలు వున్నాయి.

★ మెదడులో కంతులు ఏర్పడితే ఫిట్స్ రావచ్చు.

★ మెదడులో రక్త ప్రసరణకు ఆటంకం ఏర్పడినా లేక రక్తం గడ్డకట్టినా - హెమరేజ్ వచ్చినా ఫిట్స్ వస్తాయి.

★ మెనింజైటిస్ అనే మెదడు పొరల వాపు వంటి వ్యాధి వున్నప్పుడు కూడా మూర్ఛలేక ఎపిలెప్సి వస్తుంది. అలాగే ఎన్‌కెఫలైటిస్‌లో కూడా రావచ్చు.

★ మెదడు కణాలు చనిపోయినా, మెదడుకు తగినంత ఆక్సిజన్ అందకపోయినా, పుట్టుకలోనే మెదడు లోపాలు వున్నవారికి ఫిట్స్ వస్తాయి.

★ అతిగా ఆల్కహాల్ సేవనం వల్ల కూడా ఫిట్స్ రావచ్చు.

★ కొందరకు కొకైన్ వంటి డ్రగ్స్ అలవాటయితే వారిలో ఫిట్స్ వచ్చే ప్రమాదం కూడా వుంది.

★ రక్తంలో చక్కెర శాతం తగ్గిపోతే కూడా (చక్కెర వ్యాధిలో ఇలా జరగవచ్చు) ఫిట్స్ వస్తాయి.





★ మూత్రం వెంట రక్తం పోవుట, లెడ్ వంటి విషపదార్థాల ప్రభావం వల్ల కూడా ఫిట్స్ వస్తాయి.

★ గుర్రపు వాతం (Eclampsia), ధనుర్వాతం (Tetanus) వంటివిరావడం వల్ల కూడా ఫిట్స్ వస్తాయి.

★ రక్తంలో కాల్షియం శాతం తగ్గినా కూడా ఫిట్స్ వచ్చే అవకాశం వుంది.

★ చిన్న పిల్లలకు తీవ్రమైన జ్వరం వచ్చినప్పుడు కూడా ఫిట్స్ వస్తాయి.

**ఫిట్స్‌లో రకాలు**

ఫిట్స్ వ్యాది వంశపారంపర్యంగా కనబడవచ్చు. వీరికి ఒక్కొసారి చిన్న చిన్న కారణాల వల్ల ఫిట్స్ వస్తాయి. ఉదాహరణకు ఏదైనా దెబ్బ తగిలినా, భోజనం వేళకు చేయకపోయినా, తీవ్రమైన ఆవేశం వచ్చినా - బాగా పని చేసి అలసిపోయినా మూర్ఛ వ్యాధి రావచ్చు.

1. గ్రాండ్‌మాల్ ఎపిలప్సి **(Grandmal epillepsy)** :రోగికి ఫిట్స్ వచ్చే ముందు తెలుస్తుంది. ఫిట్స్ వస్తాయని కొన్ని రకాల లక్షణాల వల్ల రోగికి ఫిట్స్ రాబోతున్నాయని తెలుస్తుంది. అయితే ఫిట్స్ అకస్మాత్తుగానే వస్తాయి. వీరికి తలనొప్పి, ముఖం లోనికి రక్తం చేరినట్లయి ఎర్రగా మారడం, అకస్మాత్తుగా స్పృహ కోల్పోవడం, నోటి వెంట నురగ రావడం, గుండెదడ, రుచిలోను, వాసనలోను మార్పు రావడం, చెవుల్లో హోరు, కళ్ళ ముందు నల్లని చుక్కలున్నట్లు, తెల్లని మెరుపులు మెరుస్తున్నట్లుగా అనిపిస్తుంది. కొందరిలో చేతుల, కాళ్ళ నరాలు బిగుసుకుంటాయి.

   కనుగ్రుడ్లు బొంగరాల్లా గిరగిరా తిరుగుతాయి. మరికొందరికి రక్త సరఫరా లేకుడా పోయి చేతిగోళ్ళు, పెదవులు నీలం రంగులోనికి మారతాయి. కొంతమందికి మల మూత్రాలు బట్టలలోనే అయిపోతాయి. ఫిట్స్ వచ్చిన వ్యక్తి నిదానంగా తెలివిలోనికి వస్తాడు. అయినా వారికి అంతా అయోమయంగా అనిపిస్తుంది. కొందరు ఫిట్స్‌లోనే నిద్ర పోతారు. వీరికి తరువాత మెలకువ వస్తుంది.

2. పెటిట్‌మాల్ ఎపిలెప్సి **(Petitmal epilepsy)** : ఇది ఎక్కువగా చిన్న పిల్లలలో వస్తుంది. ఆడుతూ పాడుతూనే అకస్మాత్తుగా మూర్ఛపోతారు. కళ్ళు తిన్నగా చూస్తున్నట్లుగానే ఉన్న జీవం లేనివాళ్ళులాగా కనురెప్పలు కూడా అల్లార్చకుండా వుంటారు. చేతివేళ్ళు చీటికి మాటికి కదల్చుతూ వుంటారు. అలాగే పెదాలు కూడా చప్పరిస్తూ అంటారు. చేతితో పట్టుకున్న వస్తువు ఏదైనా సరే జారిపడిపోతుంది. ఒక్క క్షణం ఏమీ తెలియదు. ఆ తరువాత వాళ్ళు తిరిగి పూర్తి స్పృహలోనికి వస్తారు. వారికి తమ స్థితి ఏమిటో తెలియదు. అంతకు మునుపు చేసుకుంటున్న పనిని కూడా కొనసాగిస్తారు. ఈ మూర్ఛ సుమారు రెండు నుండి పది సెకన్ల పాటు వుంటుంది.

3. ఫోకల్ ఎపిలెప్సీ (Focal epilepsy) : దీనినే జాక్సోనియన్ ఎపిలెప్సీ (Jacksonian epilepsy) అని కూడా అంటారు. దీనిలో చివుక్కుమని ఈడ్చే శరీర కదలికలు ఒక భాగంలో మొదలై మిగతా ప్రాంతాలకు వ్యాపిస్తాయి. ఈరకమైన ఎపిలెప్సీలో మూర్ఛపోవడం అనేది ఉండదు. శరీరంలో ఒక అవయవంలో మాత్రమే ఫిట్స్ వస్తాయి. మెదడులో ఒక ప్రత్యేక భాగంలో అసాధారణ ప్రేరణ కలిగి వుండడం వల్ల ఫోకల్ ఎపిలెప్సీ వస్తుంది. మెదడులో కణితి, మెదడులో క్షయ, మెదడు వాపు వంటివి వచ్చినప్పుడు ఈ రకమైన ఫిట్స్ వస్తాయి. ఫిట్స్ శరీరంలోని ఒక అవయవంలో మాత్రమే కనిపించ వచ్చు. ఫిట్స్ వచ్చి తగ్గాక కూడా ఆ వచ్చిన భాగం కొద్ది సమయం దాకా బలహీనంగా వుంటుంది. ఈ రకమైన ఎపిలెప్సీ వంటిదే మరొకటి వుంటుంది. దాని పేరు టెంప్రల్ లోబ్ సీజర్ లేదా సైకోమోటార్ ఎపిలెప్సీ అంటారు. వీ పరిస్థితి విచిత్రంగా వుంటుంది. అసాధారణంగా ప్రవర్తిస్తుంటారు. రకరకాల భ్రమలలో మునిగిపోతారు. కలలలో తేలిపోతూ వుంటారు. వీరు ఈ స్థితిలో దుస్తులు కూడా విచిత్రంగా ధరిస్తారు. మాటలు కూడా ఏదో అసందర్భంగా మాట్లాడతారు. ఈ స్థితి నుండి బయట పడిన తర్వాత వీరికి తాము అంతకు మునుపు చేసింది ఏదీ గుర్తుండదు.

4. జ్వరంతో వచ్చే ఫిట్స్ (Febrile Convulsios) : చాలా మంది పిల్లలకు జ్వరం వచ్చినప్పుడు ఫిట్స్ వస్తాయి. ముఖ్యంగా పదేళ్ళలోపు వయస్సుగల పిల్లలకు ఈ విధంగా ఫిట్స్ వచ్చే అవకాశాలు ఎక్కువ. టెంపరేచర్ నూటరెండు డిగ్రీలకు మించి వుంటే ఫిట్స్ వస్తాయి. వీరికి జ్వరాన్ని తగ్గించే పేరాసిటమాల్ టాబ్లెట్స్ వాడితే జ్వరంతో బాటుగా ఫిట్స్ కూడా తగ్గుతాయి. అవసరం అయితే జ్వరం పెరగకుండా తడిగుడ్డతో వళ్ళంతా తుడవాలి. వీరిలో ఫిట్స్ వచ్చి - అది ఒక గంటకంటే ఎక్కువగా వున్నా, ఫిట్స్ వచ్చాక ఏదైన అవయవం - అంటే కాలు గాని, చెయ్యిగాని కాసేపు బలహీనంగా వున్నా, ఫిట్స్ కూడా ఏదైనా ఒక అవయవానికి మాత్రమే పరిమితమైవుంటే మాత్రం వారికి వ్యాధి దీర్ఘకాలం వుంటుందని గుర్తుంచుకోవాలి. అంటే వీరికి ఎప్పుడు జ్వరం వచ్చినా ఈ విధమైన లక్షణాలు వస్తాయి. కాబట్టి ఎప్పుడూ జ్వరం తీవ్రంగా రాకుండా చూసుకోవాలి.

గ్రాండ్‌మాల్ మూర్ఛ వున్నవారు నీళ్ళ వద్ద, నిప్పుల వద్ద, (కొలిమి దగ్గర), యంత్రాల వద్ద పని చేయరాదు. ఒకవేళ మూర్ఛ వస్తే వారిని అవతలకు తీసుకెళ్ళి బాగా గాలి తగిలేటట్లు చూడాలి. రోగికి 'ఫినోబార్బిటోన్' అనే మందును రోజుకు 60-180 మి.గ్రా. వరకు యివ్వాలి ఇది.

★ గార్డినాల్ - 30 మి.గ్రా. / 60 మి.గ్రా. టాబ్లెట్స్

★ లుమినాల్ - 30 మి.గ్రా. టాబ్లెట్స్

★ ఎమ్‌గార్డ్ - 15 మి.గ్రా./ 30 మి.గ్రా. / 60 మి.గ్రా. టాబ్లెట్స్





★ ఫినోబార్బిటోన్ సోడియం - ఇంజక్షన్

రూపంలోను దొరుకుతుంది. దీనిని ఆరు సంవత్సరాలు పైబడిన పిల్లలు, పెద్దవారు 100 మి.గ్రా. చొప్పున రోజుకు రెండు లేదా మూడు మాత్రలు చొప్పున మింగాలి. ఆరు సంవత్సరాల లోపు పిల్లలకు వారి బరువును బట్టి kgకు 5 మి.గ్రా.చొప్పున మొత్తం ఎంతో దానిని మూడు లేదా రెండు సమానమైన డోసుల్లో ఇవ్వాలి.

ఫెనిటాయిన్ సోడియం అనే మరొక మందు కూడా వాడతారు. ఇది :

★ డైలాన్‌టిన్ - 100 మి.గ్రా. కాప్సుల్స్ / సిరప్

★ ఎప్సొలిన్ - 100 మి.గ్రా. కాప్సుల్స్

★ ఎపిలెప్టిన్ - 100 మి.గ్రా. కాప్సుల్స్

★ ఎప్టొయిన్ - 100 మి.గ్రా. టాబ్లెట్స్

వంటి పలు పేర్లతో దొరుకుతుంది. ఈ మందుగాని, ఇంతకు ముందు చెప్పిన ఫినోబార్బిటోన్ గాని, ఏదైనా సరే ఒకటిగాగాని, రెంటినీ కలిపిగాని మూడు నుండి ఐదు సంవత్సరాలు వాడాలి. ప్రతిరోజు క్రమం తప్పకుండా వాడాలి. ఒకొక్క సందర్భంలో అంతకంటే ఎక్కువ సంవత్సరాలు కూడా వాడాల్సి వుంటుంది. ఒక్కరోజు కూడా ఆపరాదు.

పెటిట్‌మాల్ మూర్ఛకు రోగికి 'సోడియం వాల్‌ప్రోయేట్'ను ఇవ్వాలి. ఇది :

ఎపివల్ - 200 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

వాల్పారిన్ - 200 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

ఎపిలెక్స్ - 200 మి.గ్రా. టాబ్లెట్స్ / సిరప్

వంటి పేర్లతో వుంటుంది. దీనిని 400 మి.గ్రా. నుండి (పెద్దలకు) 3000 మి.గ్రా. వరకు రెండు లేదా మూడు దోసుల్లో వాడాలి. ఈ మందు కాకపోతే 'ఎథోసక్సిమైడ్' అనే మదును కూడా వాడవచ్చు. ఇది

జరోన్‌టిన్ - 50 మి.గ్రా. సిరప్‌గా దొరుకుతుంది. ఇమన్నీ సంవత్సరాల తరబడి వాడాల్సిందే.

ఫోకల్ ఎపిలెప్సీకు అదిరాడానికి గల కారణాన్ని గుర్తించి దానికి చికిత్స చేస్తే క్రమేణా ఎపిలెప్సీ తగ్గుతుంది. టెంపోరల్ లోబ్‌లో అయితే 'కార్బమజిపిన్' అనే మందు వాడతారు. ఇది

జెప్టాల్ - 100 మి.గ్రా / 200 మి.గ్రా / 400 మి.గ్రా టాబ్లెట్స్

మెజెపిన్ - 200 మి.గ్రా. టాబ్లెట్స్

మజెటాల్ - 200 మి.గ్రా. /400 మి.గ్రా / 100 మి.గ్రా టాబ్లెట్స్ / సిరప్

కార్బాజిన్ - 200 మి.గ్రా. టాబ్లెట్స్

కార్బటాల్ - 100 మి.గ్రా / 200 మి.గ్రా / 400 మి.గ్రా. టాబ్లెట్స్ వంటి పలు పేర్లతో వుంటుంది.

దీనిని 200 మి.గ్రా. నుండి 2000 మి.గ్రా. వరకు వయసుని బట్టి 2 లేదా మూడు డోసులలో తీసుకోవాలి.

ఎవరికైనా హఠాత్తుగా ఫిట్స్ కనబడితే వెంటనే డాక్టరును సంప్రదించాలి. దానివల్ల అసలు రోగం ఏ కారణం చేత వస్తుందో కూడా తెలుసుకోవచ్చు. అయితే ఒక్కొక్కసారి అలా గుర్తించడం సాధ్యం కాకపోవచ్చు. ఎందుచేత నంటే ఫిట్ వచ్చిన కొద్ది సేపట్లోనే రోగికి పూర్తిగా తెలివి వస్తుంది. తనకు అంతకు ముందు జరిగిన విషయాలతో సంబంధం లేకుండా తాను పూర్తి ఆరోగ్యంగానే వున్నట్లు చెపుతారు. కాబట్టి ఒకటి రెండుసార్లు ఫిట్స్‌కు గురైతే వారి స్థితి ఏమిటనేది తెలుస్తుంది. వ్యాధి రాకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవచ్చు.

ఫిట్స్‌కు వాడే మందుల్ని సంవత్సరాల తరబడి వాడాలి. మధ్యలో ఒక్క రోజు కూడా మానరాదు. అలా ఒకవేళ మానివేస్తే మరలా అదే రోజు నుండి చికిత్సను మొదలు పెట్టవలసి వుంటుంది. తరచూ ఫిట్స్ వచ్చే వారు తమ వెంట మందులు, వాటితో పాటుగా తమకు ఫిట్స్ వ్యాధి వున్నట్లుగా తెలిపే గుర్తింపు కార్డును వుంచుకుంటే మంచిది.

## పక్షవాతం (Hemiplegia)

పక్షవాతాన్ని స్ట్రోక్ అని కూడా అంటారు. రక్తనాళాలలో ప్రవహించే రక్తం మెదడుకూ చేరుతుంది. మెదడులో రక్తనాళాలు ఏ కారణం చేతనైనా చిట్లి రక్తస్రావం జరిగితే 'పక్షవాతం' వస్తుంది. ఈ పరిస్థితిని సెరిబ్రో వాస్క్యులర్ ఏక్సిడెంట్ (Cerebro Vascular Accident) అని పిలుస్తారు.

### పక్షవాతం రావడానికి కారణాలు :

★ మెదడులో ప్రవహించే రక్తనాళాలు అధిక రక్తపోటువలన చిట్లి రక్తస్రావం అయితే పక్షవాతం వస్తుంది.

★ రక్తనాళాల్లో ప్రవహించే రక్తం గడ్డకట్టడం వలన కూడా పక్షవాతం వస్తుంది.

★ రక్తం గుండె నుండి గాని ఇతర చోట్ల నుండి గానీ చిన్న చిన్న రక్తం ముద్దలు (Emboli) రక్తంతో పాటుగా ప్రవహించి మెదడులోని రక్తనాళాలకు అడ్డం పడడం వల్ల కూడా పక్షవాతం రావచ్చు.

★ మెదడువాపు, మెదడులో కంతులు ఏర్పడడం వల్ల కూడా పక్షవాతం వస్తుంది.





★ మెదడులో కుడివైపు రక్తస్రావం అయితే ఎడమవైపు అవయవాలకు, ఎడమవైపు రక్తస్రావం అయితే కుడివైపు అన్ని అవయవాలకు పక్షవాతం వస్తుంది.

### వ్యాధి నాలుగు రకాలుగు వుంటుంది.

1. కంప్లీటెడ్ స్ట్రోక్
2. ఎవాల్వింగ్ స్ట్రోక్
3. ట్రాన్సియంట్ ఇస్కమిక్ ఎటాక్
4. మైనర్ స్ట్రోక్

1. **కంప్లీటెడ్ స్ట్రోక్ (Completed Stroke) :** మెదడులోని కొంత భాగానికి మెదడులోని రక్తనాళాలు చిట్లడంవల్ల, రక్తం సరఫరా జరగకపోవడం వల్ల పక్షవాతం లక్షణాలు క్షణక్షణానికీ పెరిగిపోయి గంట, రెండు గంటల్లో పూర్తిస్థాయి పక్షవాతంగా మారుతుంది. కొందరిలో ఈ లక్షణాలు పూర్తిగా బయటబడటానికి ఒక రోజు సమయం పట్టవచ్చు. రోగికి పక్షవాతం వచ్చే ముందు వారికి విపరీతంగా తలనొప్పివస్తుంది. కొందరికి ఫిట్స్ కూడా రావచ్చు. రోగికి వాంతులు రావడం, మందకొడిగా వుండడం మాత్రే కాక రోగికి తెలివితప్పితే కంప్లీటెడ్ స్ట్రోక్, ప్రమాదకరమైనదిగా భావించాలి.
2. **ఎవాల్వింగ్ స్ట్రోక్ (Evolving Stroke) :** ఈ రకమైన స్ట్రోక్‌లో పక్షవాతం లక్షణాలు నిదానంగా రోజుల తరబడి వస్తాయి. మెదడుకు రక్తం సరఫరా చేసే రక్తనాళాలలో ఏదైనా క్రమేపీ సన్నబడడం వల్ల ఈ రకమైన ఎవాల్వింగ్ స్ట్రోక్ (కొనసాగుతున్న స్ట్రోక్) వస్తుంది.
3. **ట్రాన్సియంట్ ఇస్కమిక్ ఎటాక్ (Transient Ischamic Attack) :** ఇది తాత్కాలికంగా కనబడే పక్షవాతం లక్షణాలతో వస్తుంది. మెదడులోని అతి కొద్ది భాగానికి రక్తం అందకపోవడంతో ఆ భాగం దెబ్బతింటుంది. గుండె నుండి గాని లేక ఇతర భాగాల నుండి గాని రక్తం గడ్డకట్టగా ఏర్పడిన రక్తపుముద్ద (Emboli) వలన మెదడుకు రక్తపు సరఫరా ఆకస్మికంగా ఆగిపోవడం వల్ల తాత్కాలికంగా పక్షవాతం వస్తుంది.
4. **(తాత్కాలిక) మైనర్ స్ట్రోక్స్ (Minor Strokes) :** ఇవి వచ్చే ముందు కళ్ళుమసకబారడం, సరిగా నిలబడలేకపోవడం, కళ్ళుతిరగడం, వంటి లక్షణాలు కనబడవచ్చు. అయితే ఈ మైనర్‌స్ట్రోక్స్ ముందు ముందు పక్షవాతం శాశ్వతంగా వచ్చేందుకు హెచ్చరికలుగా భావించవచ్చు.

### వ్యాధి నిర్ధారణ పరీక్షలు :

పక్షవాతం వ్యాధి నిర్ధారణ కొరకు తలకు స్కాన్ చేయించాలి. CAT Scan – MMR Scan వంటివి చేయించాలి. గుండె నుండి రక్తం గడ్డలుగా వుండి రక్తంలో కలిసేది గుర్తించేందుకు 'ఎకో' అనే పరీక్ష కూడా చేయించాలి.

**జాగ్రత్తలు :**

★ పక్షవాతం లక్షణాలు కనబడిన వెంటనే డాక్టరుకు చూపాలి. అంతేగాక పక్షవాతం వచ్చి స్పృహ తప్పిపడిపోయినా వెంటనే డాక్టరును కలవాలి.

★ పక్షవాతం వచ్చి దానితో జ్వరం, ఫిట్స్ కనబడినా కూడా డాక్టరుకు చూపాలి.

★ పక్షవాతం వ్యాదితో రోగి అపస్మారక స్థితిలోనికి వెళ్ళవచ్చు. ఈ పరిస్థితిలో రోగికి ఆక్సీజన్ అందించగలిగితే రోగి కోలుకోవచ్చు.

★ పక్షవాతంతో రక్తపోటువుంటే డాక్టరు సలహాపై మందులు వాడాలి. రోగి స్పృహ తప్పిపోతే స్పృహలోకి వచ్చిన వెంటనే రోగికి ధైర్యం చెప్పాలి.

★ పక్షవాతంతో మెడనీలుక్కుపోయినట్లయితే వెంటనే డాక్టరుకు చూపాలి.

★ పక్షవాతం వ్యాధి వచ్చినవారు రక్తపోటు పరీక్ష చేయించుకుని ఉంటే మందుల్ని జీవితాంతం వాడాలి. అదే విధంగా వారి. చక్కెర వ్యాధి వుంటే దానికి సంబంధించిన మందులు కూడా క్రమం తప్పకుండా వాడుకోవాల్సిందే.

★ పక్షవాతం వచ్చిన రోగులు తమ గురించి తాము దిగులు పడితే తరువాత కాలంలో వ్యాధి మరింత పెరిగే ప్రమాదం కూడా వుంది. కాబట్టి వీరు తమకు వచ్చిన వ్యాధితో సహజీవనం చేయడం ఒక్కటే సరైన మార్గం.

★ పక్షవాతం వచ్చిన భాగాలకు 'ఫిజియోథెరపీ' చేయించడం ద్వారా ఆయా భాగాలకు బలం వచ్చే అవకాశం వుంది.

★ స్థూలకాయం వుంటే దానిని తగ్గించుకోవాలి. సారాయి, పొగ త్రాగరాదు. కొవ్వు పదార్థాలు కూడా ఎక్కువగా తీసుకోరాదు.

★ పక్షవాతం వచ్చిన తరువాత రెండు సంవత్సరాల వ్యవధిలో ఎంత కోలుకుంటే అంతే, ఆ తరువాత ఇక బాగయ్యేది ఏమీ లేదు.

**చికిత్స :**

★ పక్షవాతం రావడానికి అధిక రక్తపోటు కారణం కావచ్చు. రక్తపోటు చూసి అధికంగా వుంటే తగ్గించాలి. అయితే వేగంగా రక్తపోటు తగ్గించడం ప్రమాదం.

★ పక్షవాతానికి చికిత్సకన్నా 'ఫిజియోథెరపీ' మంచి ఉపయోగాన్నిస్తుంది.

★ పక్షవాతం ఎంబోలి (రక్తంగడ్డలు) వలన వస్తే వీరికి వ్యాధి నిర్ధారణ చేసి 'హెపారిన్'ను ఇస్తే ఉపయోగం వుంటుంది. ఇది ఇంజక్షన్‌గా ఇవ్వవచ్చు. అయితే వీరిలో క్యాన్సర్ కంతి గాని, మెదడులో రక్తస్రావం జరిగి పక్షవాతం వస్తే ఈ మందు వాడరాదు. దీనిని నిర్ధారించుకోవడానికి 'క్యాట్ స్కాన్' (CAT Scan) తీసిచూడాలి.





★ మెదడువాపు వలన పక్షవాతం వస్తే మానిటాల్ - 20% - 200 ml ను నరంలోనికి ఇవ్వాలి. అలాగే డెక్సామిథాసోన్ - 4 మి.గ్రా ఇంజక్షన్ కూడా రోజుకు నాలుగుసార్లు ఇవ్వాలి.

★ 'ఏస్ప్రిన్' 75 మి. గ్రా లేక 150 మి.గ్రా డోసు ప్రతిరోజూ జీవితాంతం మింగాలి.

## పార్శ్వనొప్పి (Migraine)

తలనొప్పి ఒక భాగానికి మాత్రమే వస్తే దానిని 'పార్శ్వనొప్పి' లేక 'మైగ్రేన్' తలనొప్పి అని అంటారు. దీనినే 'వాస్క్యులర్ తలనొప్పి' (Vascular headache) అని కూడా అంటారు. అంటే తలలోపల వుండే రక్తనాళాలలో ఏర్పడే సమస్యవలన తలనొప్పి వస్తుందన్నమాట.

**కారణాలు :**

★ పార్శ్వనొప్పి రావడానికి అనేక కారణాలు వుంటాయి. వాటిలో ముఖ్యంగా మెదడుకు వెళ్ళే రక్తనాళాలలో వత్తిడి (Stress) వల్ల ఆ రక్తనాళాలు ఉబ్బి మెదడుకు రక్తసరఫరా తగ్గి, ఆక్సిజన్ అందకపోవడంవల్ల పార్శ్వనొప్పి వచ్చే అవకాశం వుంది.

★ మైగ్రేన్ తలనొప్పి మగవారిలోకంటే ఆడవారిలోనే ఎక్కువగా వుంటుంది. ప్రతిపదిమందిలో ఏడుగురు ఆడవాళ్ళే కావడం గమనార్హం.

★ మానసిక వత్తిడి (Stress వలన పార్శ్వనొప్పి వచ్చే అవకాశాలు అధికంగా వుంటాయి.

★ పార్శ్వనొప్పికి ఇంకా ఇతర రణాలు కూడా వున్నాయి. పనిచేసేటప్పుడు మెడనరాలకు వత్తిడి కలిగించడం - అంటే మెడబిగబట్టి పనిచేయడం వంటివి. అదే పనిగా దృష్టిసారించి పనిచేయడం వంటి కారణాలవల్ల కూడా పార్శ్వనొప్పి వస్తుంది.

**లక్షణాలు :**

★ పార్శ్వతలనొప్పి సర్వసాధారణంగా ఉదయం పూట మొదలై సూర్యాస్తమయంతో తగ్గిపోతుంది.

★ నొప్పి హఠాత్తుగా ప్రారంభం అవుతుంది. తలంతా దిమ్ముగా సుత్తితో ఒక ప్రక్కన బాదుతున్నట్లుగా వుంటుంది.

★ వెలుతురు చూడాలంటే కష్టంగా వుంటుంది. కళ్ళు మసగ్గా వుండి, కళ్ళముందు తెల్లని మెరుపులు ఆకాశంలో తేలుతున్నట్లు కనిపిస్తుంది.

★ తలనొప్పి మాత్రమే కాక వికారం కూడా వుంటుంది. వాంతి అవక - చాలా సేపు ఇబ్బంది పడ్డాక వాంతి అయి, తలనొప్పి కాస్త తగ్గవచ్చు.

★ వీరికి ఏ కాస్త టెన్షన్ పెరిగే పరిస్థితి వచ్చినా తలనొప్పి ఎక్కువ అవుతుంది. ఆవేశం, కోపం వంటివానివల్ల టెన్షన్ రావచ్చు. తలనొప్పితోపాటు చలి, చెమట, వణుకు కూడా వుండవచ్చు.

- ★ నిద్రపట్టదు. అయితే కష్టంపైన నిద్రపోతే లేచిన తరువాత తలనొప్పి తగ్గవచ్చు. కానీ వీరికి నిద్రపూర్తిగారాదు. తరచుగా మెలకువ వస్తుంది. మెలకువ వచ్చాక మరి నిద్రరాదు సరికదా మరలా తలనొప్పి మొదలవుతుంది.
- ★ ఏ కాస్త శబ్దం అయినా వీరు భరించలేరు.
- ★ చాలామందిలో ఈ తలనొప్పి రెండులేక మూడుగంటలపాటు మాత్రమే వుంటుంది. కానీ కొందరిలో ఇది రోజుల తరబడి వుండవచ్చు.
- ★ తలనొప్పి వచ్చినప్పుడు కణతల వద్ద వున్న రక్తనాళాలు ఉబ్బి, చేతికి తలుగుతాయి.
- ★ స్త్రీలలో బహిష్టు సమయంలో పార్శ్వనొప్పి రావచ్చు.
- ★ తలనొప్పి తీవ్రంగానూ, హఠాత్తుగానూ ప్రారంభం అయితే వెంటనే డాక్టరును సంప్రదించాలి.
- ★ పార్శ్వనొప్పి తలకు దెబ్బలు తగలడం వల్ల వస్తే, మగతకూడా తలనొప్పితోపాటు వుంటే, తలనొప్పితోపాటు కంటిదోషాలు కూడా వుంటే, వాంతులు అవుతున్నా, తలనొప్పితోపాటు పక్షవాతం, రక్తపోటు పెరుగుతూ వుంటే డాక్టరు సలహాపైన చికిత్స చేయించుకోవాలి.
- ★ సాధారణంగా పార్శ్వనొప్పి రెండు లేక మూడు రోజులపాటు వుండి తగ్గిపోతుంది. ఒకవేళ అలా మూడురోజులలోగా తగ్గకపోతే డాక్టరు సలహాపైన చికిత్స చేయించాలి.
- ★ పార్శ్వనొప్పితోపాటు జ్వరం, వాంతులు వుంటే మెదడువాపు జ్వరంగా కూడా అనుమానించవచ్చు. దీనికి ప్రత్యేక పరీక్షలు జరిపి వ్యాధి నిర్ధారించాక చికిత్స చేయించుకోవాలి.
- ★ పార్శ్వనొప్పి తలను ముందుకు వంచినా, దగ్గినా, తుమ్ముతున్నా ఎక్కువ అవుతుంటే 'సైనుసైటిస్' కావచ్చు లేక చెవిలో చీమువల్ల కూడా ఆవైపు తలనొప్పి రావచ్చు.
- ★ కొందరికి పిప్పి పన్ను వల్ల తలనొప్పిరావచ్చు. ముఖ్యంగా పైపళ్ళపిప్పి అయితే తలనొప్పి వస్తుంది.

**చికిత్స :**

- ★ రోగిని చీకటి గదిలో ఉంచి చికిత్స చేయడం మంచిది.
- ★ చీకటిగదిలోనికి శబ్దాలు వినిపించకుండా జాగ్రత్తపడాలి.
- ★ మితాహారం తీసుకుంటే వాంతి అయ్యే ప్రమాదం లేదు.
- ★ రోగికి తరచుగా తలనొప్పి వస్తుంటే డాక్టరును సంప్రదించి అవసరమైన వైద్యపరీక్షలు జరిపించాలి.

**మందులు :**

అవసరాన్ని బట్టి ఈ క్రింది మందులలో రెండు లేక మూడురకాలు కలిపి వాడవచ్చు.

A. ఎర్గాటమైన్ కలిసి ఉన్న ఈ క్రింది మందులు వాడవచ్చు.





★ మైగ్రానిల్ - టాబ్లెట్స్

★ వాసోగ్రెయిన్ - టాబ్లెట్స్

★ మైగ్రిల్ - టాబ్లెట్స్

వీటిలో ఏదైనా రోజుకు రెండు లేక మూడు, పూటకు ఒకటి చొప్పున

B. 'ఫ్లునరిజైన్' కలిసి ఉన్న ఈ క్రింది మందులు కూడా వాడవచ్చు.

★ ఫ్లునరిన్ - 5 మి.గ్రా/10 మి.గ్రా టాబ్లెట్స్

★ మిగాజిన్ - 5 మి.గ్రా/10 మి.గ్రా టాబ్లెట్స్

★ నోమైగ్రెయిన్ - 5 మి.గ్రా/10మి.గ్రా టిబ్లెట్స్

వీటిలో ఏదైనా రోజుకు 5 మి.గ్రా లేక 10 మి.గ్రా రాత్రిపూట వాడాలి.

C. 'ప్రాపనొలాల్' కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ బిటాబ్లాక్ - 10 మి.గ్రా టాబ్లెట్స్

★ బిటాకాప్ - టి.ఆర్. 40 మి.గ్రా/80 మి.గ్రా టాబ్లెట్స్

★ బిటాబ్లాక్ ఫోర్ట్ - 40 మి.గ్రా. టామ్లెట్స్

★ సిప్లార్ - 10 మి.గ్రా/40 . .గ్రా/80 మి.గ్రా టాబ్లెట్స్

★ ఇండెరాల్ - 20 మి.గ్రా. .బ్లెట్స్

★ ప్రొపాల్ - 10 మి.గ్రా/40 మి.గ్రా టాబ్లెట్స్

వీటిలో ఏదైనా సరే రోజుకు రెండు మాత్రలు వాడాలి. ఇవి డాక్టరు సలహాపైననే వాడాలి.

D. ఆల్ప్రజోలామ్ కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ ట్రైకా - 0.25 మి.గ్రా/0.5 మి.గ్రా/1 మి.గ్రా టాబ్లెట్స్

★ ప్లాక్సిడ్ - 0.25 మి.గ్రా / 0.5 మి.గ్రా/1 మి.గ్రా టాబ్లెట్స్

★ జోపిక్ - 0.25 మి.గ్రా/0.5 మి.గ్రా/1మి.గ్రా టాబ్లెట్స్

వీటిలో ఏదైనా మోతాదు అవసరాన్ని బట్టి పెంచుకుని రోజుకు ఒకటాబ్లెట్‌గా వాడాలి. తక్కువ మోతాదు (0.25 మి.గ్రా)తో ప్రారంభించాలి. ఇవి డాక్టరు సలహా మేరకు వాడాలి.

E. 'సుమాట్రిప్టాన్' కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ మైగ్రాటాన్ - 50 మి.గ్రా/100 మి.గ్రా టాబ్లెట్స్.

★ సుమిట్రెక్స్ - 50 మి.గ్రా/50 మి.గ్రా/100 మి.గ్రా టాబ్లెట్స్

★ సుమినాట్ - 25 మి.గ్రా/50మి.గ్రా/100 మి.గ్రా టాబ్లెట్స్

ఇవి కాస్త ఖరీదు ఎక్కువ. వీటిని కూడా మొదటగా 0.25 మి.గ్రా మోతాదుతో ప్రారంభించి అవసరాన్ని బట్టి డోసు పెంచుకోవాలి. అవసరాన్ని బట్టి ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒకటాబ్లెట్ ఇవ్వవచ్చు.

'సుమినాట్' - 6 మి.గ్రా/5 మి.లీ ఇంజక్షన్ కూడా ఇవ్వవచ్చు. ఇది కేవలం డాక్టరు సలహాననుసరించే వాడాలి.

## పార్కిన్‌సన్ డిసీజ్ (Parkinson's Disease)

దీనినే పార్కిన్‌సోనిజం (parkinsonism) అని కూడా అంటారు. ఇది కూడా నరాలకు మెదడుకు సంబంధించిన వ్యాధే. నిజానికి దీనిని వ్యాధి అనడం కంటే ఇది ఒక లక్షణం లేక 'పరిస్థితి' అంటే సరిపోతుంది. పార్కిన్‌సన్ వ్యాధి రావడాన్ని మూడు ప్రత్యేక లక్షణాలను గమనిస్తే గుర్తించవచ్చు. అవి. 1) కండరాలు బలహీనం అవడం 2) కండరాలు బిగదీసుకోవడం (Stiff) 3) కండరాలు వణకడం.

### పార్కిన్‌సన్ రావడానికి కారణాలు :

★ పార్కిన్‌సన్ వ్యాధి మెదడులో 'ఎసిటైల్ కోలిన్', డోపమిన్ అనే హార్మోన్‌ల తయారీలో అపసవ్యతవల్ల వస్తుంది.

★ ఇది మెదడులో కంతులు (ట్యూమర్) ఉండడం వల్ల కూడా వస్తుంది.

★ తలకు ఏదైనా బలమైన దెబ్బ తగిలినందువల్ల కూడా ఈ పార్కిన్‌సన్ లక్షనాలు రావచ్చు.

★ కొన్ని రకాల మందుల దుష్ఫలితాల వల్ల, మెదడులో కార్బన్ మోనాక్సైయిడ్ విషప్రభావం వల్ల కూడా పార్కిన్‌సన్ వ్యాధి లక్షణాలు కనబడవచ్చు.

★ మెదడుకు చేరే రక్తప్రసారం సరిగ్గా జరగకపోవడంవల్ల, మెదడువాపు వంటి జబ్బులురావడంవల్ల, మెదడులో కంతులు (tumours) ఏర్పడడంవల్ల కూడా పార్కిన్‌సన్ వ్యాధి లక్షణాలు కనబడతాయి.

### వ్యాధి లక్షణాలు :

★ పార్కిన్‌సోనిజంలో కనబడే మొట్టమొదటి లక్షణం వణుకు. వణుకు చేతులనుండి ప్రారంభమవుతుంది. చేతులతో ఏదైనా పనిచేస్తున్నప్పుడు వణుకు వుండక మామూలు పరిస్థితిలోనే వణుకువుంటుంది.

★ వణుకు చేతులకే పరిమితం కాకుండా కొందరికి తలకూడా ఊగుతుంది. తల ఊపడం కొంత వయసు వచ్చిన వారిలో సాధారణంగా కనబడినా పార్కిన్‌సోనిజం వ్యాధి వచ్చిన వాళ్ళకు వయసుతో నిమిత్తం లేకుండా ఊగుతుంది.





★ పార్కిన్‌సోనిజం వచ్చినవారు మానసిక వత్తిడికి లోనవుతారు.

★ కండరాలు బలహీనపడతాయి. చేతుల కండరాలలో అసలు బలం వుండదు. కనురెప్పల్ని కూడా గట్టిగా మూయలేరు. ఆహారాన్ని మింగలేరు. నమలలేరు. అంతేగాక నోటిలో ఊరే లాలాజలాన్ని కూడా మిగలేనంత బలహీనత వుంటుంది.

★ కండరాలు బలహీనంగా వున్నా ఒకొక్కసారి బిగుసుకుపోతాయి. కాలు లేక చెయ్యి అలా బిగుసుకుపోయి ఒక్కసారిగా జర్క్ ఇచ్చినట్లు కదులుతాయి.

★ నాలుక కండరాలు బలహీనం అవడంవలన వీరికి మాటలు ముద్దగా వస్తాయి.

★ కాళ్ళ కండరాలు బలహీనంగా వుండడంతో నడక సరిగ్గా వుండదు, నడిచేటప్పుడు ముందుకు వంగుతారు. వళ్ళు కూడా తూలుతుంటుంది.

★ కదలికలు ఏవీ నిద్రలో కనిపించవు.

### చికిత్స :

పార్కిన్‌సోనిజం వ్యాధి నిర్ధారించుకున్న తరువాత చికిత్సకు వాడే మందుల్ని డాక్టరు సలహాపైన వాడాలి.

లెవొడొపా మందు కలిసిన

★ లెవోపా - 500 మి.గ్రా టాబ్లెట్లు

★ బెన్‌స్పార్ - కాప్సుల్స్

పై రెండింటిలో ఏదైనా వాడవచ్చు. రోజుకు 500 మి.గ్రా చొప్పున వాడాలి. మోతాదు నిదానంగా పెంచుకుంటూ వెళ్ళాలి.

★ బెక్సోల్ - 2 మి.గ్రా టాబ్లెట్స్

★ పాసిటైన్ - 2 మి.గ్రా టాబ్లెట్స్

★ హెక్సినాల్ - 2 మి.గ్రా టాబ్లెట్స్

★ ట్రిఫెన్ - 2 మి.గ్రా టాబ్లెట్స్

ఈ టాబ్లెట్స్‌ను రోజుకు అరటాబ్లెట్ చొప్పున వాడాలి. అ తరువాత డోసుపెంచుకుంటూ పోవాలి.

★ క్రిప్టాల్ - 2.5 మి.గ్రా టాబ్లెట్స్

★ బి - క్రిప్ - 2.5 మి.గ్రా టాబ్లెట్స్

★ ప్రొక్టినాల్ - 1.25 మి.గ్రా/2.5 మి.గ్రా టాబ్లెట్స్.

★ సిక్రిప్టిన్ - 2.5 మి.గ్రా/1.5 మి.గ్రా టాబ్లెట్స్

వీటిని కూడా రోజుకు అరటాబ్లెట్ చొప్పున వాడాలి. అ తరువాత డోసు పెంచుకుంటూ పోవాలి.

## సియాటికా (Sciatica)

చాలా మందికి సియాటికా నరాలకు సంబంధించిన సమస్య వస్తుంది. ముఖ్యంగా ఎక్కువసేపు నిలబడే వారిలో ఇది ఎక్కువగా ఉంటుంది. సియాటికా అనేది 'కాలు'కు సంబంధించిన నరం. ఈ వ్యాధి వచ్చినవారు నడవడం కూడా కష్టంగా వుంటుంది.

సియాటికానరానికి వత్తిడి కలగడం వల్ల ఈ వ్యాధి వస్తుంది. ఈ వ్యాధి కొద్దికాలానికి అదే తగ్గిపోవచ్చు. అయితే ఒక్కోసారి ఇది ఇంకా అలాగే వుండడమో లేక ఇంకా పెరిగిపోవడమో జరగవచ్చు.

**లక్షణాలు :**

★ సియాటికా వ్యాధి వచ్చినవారు నడవడం కష్టం అవుతుంది.

★ కాళ్ళు, తిమ్మిరిగా వుంటాయి.

★ పాదాల వద్ద తిమ్మిరెక్కడంవల్ల అవి స్పర్శజ్ఞానాన్ని కోల్పోవచ్చు. పాదాలు మొద్దుబారతాయి.

★ రోగి కాస్తదూరం నడవాలన్నా చాలా బాధగా వుంటుంది.

★ రోగికి నడక మాత్రమే కాక, కూర్చోవాలన్నా లేక నిలబడాలన్నా కష్టంగా వుంటుంది.

★ రోగి గట్టిగా దగ్గినా, తుమ్మినా కూడా కాలు షాకు కొట్టినట్లు చురుకుమని నొప్పి కలుగుతుంది.

**వ్యాధి నిర్ధారణ :**

వ్యాధి నిర్ధారణ కొరకు సి.టి.స్కాన్ తీయవచ్చు. లేదా - ఇ.యం.జి. గానీ ఎక్స్‌రే గాని తీయవచ్చు. ఇంకామైలోగ్రామ్ కూడా తీసి వ్యాధి నిర్ధారణ చేయాలి.

**చికిత్స :**

★ సియాటికా నరానికి సంబంధించిన ఈ వ్యాధిలో రోగికి పూర్తి విశ్రాంతి అవసరం. కొన్ని రోజులపాటు మంచం దిగకుండా వుంటే మంచిది.

★ డయాథెర్మీ (Diathermy) చేయవచ్చు. అంటే దీనిలో రోగికి బాధను ఉపశమింపజేయడం కోసం వేడినీటితో కాపడం పెడతారు. లేక శరీర కణజాలమును ఎలక్ట్రికల్ అపరేటెడ్ డివైసెస్ (షార్ట్‌వేవ్ డివైసెస్)తో వేడిచేస్తారు. దానివల్ల నొప్పిలో కొంత ఉపశమనం కలుగుతుంది.

★ సియాటిక్ నరం నొక్కుకొనిపోవడం వల్ల నొప్పి ఏర్పడితే సర్జరీ చేసి దానిని సరిచేస్తారు.

★ ఫిజియోథెరపీ చేయడంవల్ల బాధ నుండి నివారణ పొందవచ్చు. అనుభవజ్ఞులైన ఫిజియోథెరపిస్టులతో చేయించుకోవాలి.





★ సియాటికా నొప్పికి 'ఇండోమెథాసిన్' కలిసిన వీటిని వాడవచ్చు.

- ఇన్‌డోకాప్ - కాప్సుల్స్

ఇన్‌మెసిన్ - 25 మి.గ్రా/50 మి.గ్రా కాప్సుల్స్

ఆర్థిసిడ్ - 25 మి.గ్రా/50 మి.గ్రా కాప్సుల్స్

25 మి.గ్రా రోజుకు రెండు లేక మూడు చొప్పున వాడవచ్చు. అవసరమైతే డోసు పెంచవచ్చు.

## మెదడులో కణితి (Brain Tumour)

వీటినే 'కపాలం'లో ఏర్పడే కణితులు లేక ఇంట్రాక్రేనియల్ ట్యూమర్స్ అని అంటారు.

**బ్రెయిన్ ట్యూమర్స్‌లో రకాలు :**

★ పిట్యూటరీ గ్రంధికి ట్యూమర్ రావడం.

★ మెదడులో వుండే రక్తనాళాలకు ట్యూమర్ రావడం.

★ మెదడు పొరలకు ట్యూమర్ రావడం.

★ మెదడులో వుండే నాడీకణాలకు ట్యూమర్ రావడం.

★ మెదడు కణజాలానికి ట్యూమర్ రావడం.

★ పరాన్నజీవులవలన ట్యూమర్స్ రావడం.

★ క్షయవ్యాధివలన ట్యూమర్ రావడం.

ఈ విధంగా రకరకాలుగా మెదడులో కణితులు వస్తాయి.

**మెదడు కణితి లక్షణాలు :**

★ మెదడులో కణితి వుంటే వారికి తరచుగా ఫిట్స్ రావడం, మగతగా అనిపించడం వుంటాయి.

★ ఉదయం నిద్ర లేచిన దగ్గర నుండి విడవకుండా తలనొప్పి వస్తుంది.

★ తలనొప్పి ఏదైనా పనిచేసినా, ఆలోచన చేసినా పెరుగుతుంది. అంతేగాక తలగట్టిగా అటూ ఇటూ తిప్పినా (విదిల్చినాక) పెరుగుతుంది.

★ వీరు దగ్గినా, తుమ్మినా కూడా తలనొప్పి ఎక్కువ అవుతుంది.

★ కొందరికి తలనొప్పి మాత్రమే కాక, తెలివితేటలు తగ్గిపోవడం, మతిమరపు రావడం వుంటాయి.

★ వీరికి అకస్మాత్తుగా వాంతులు అవుతాయి.

★ నోటివెంట చొంగ కారవచ్చు.

★ రకరకాల చిత్తభ్రమలు కలుగుతాయి.

★ పక్షవాతం లక్షణాలు కనబడతాయి.

★ కంటిచూపు మందగించడమో లేదా అకస్మికంగా చూపుపోవడమో సంభవించవచ్చు.

★ వీరు మగతలో కోమాలోనికి వెళ్ళే ప్రమాదం వుంది.

**వ్యాధి నిర్ధారణ :**

ఎక్స్‌రే తీయడం, సి.టి.స్కాన్ ద్వారా వ్యాధి నిర్ధారణ చేయవచ్చు.

**చికిత్స :**

★ వీరికి చికిత్స ఏమీ లేదు. మందులు వాడుతున్నంతకాలం రోగికి పూర్తి విశ్రాంతి (శారీరకంగా, మానసికంగా) అవసరం.

★ క్యాన్సర్ చికిత్సలో వాడే మందులతోనే ఇవి తగ్గవచ్చు.

★ రేడియో థెరపీ ద్వారా, లేజర్ పద్ధతి ద్వారా ట్యూమర్స్‌ను తొలగించవచ్చు.

★ ఆపరేషన్ (న్యూరోసర్జరీ) ద్వారా మెదడులో వుండే కణితిని తొలగించాల్సి వుంటుంది. ఇది చాలా రిస్క్‌తో కూడిన పద్ధతి. ఖర్చు కూడా ఎక్కువే.

## మెనింజైటిస్ (Meningitis)

మెదడుపైన వుండే పొరల వాపును మెనిజైటిస్ అనవచ్చు. ఇది మూడు విధాలుగా వచ్చే అవకాశం వుంది. అవి వైరల్ మెనింజైటిస్, బాక్టీరియల్ మెనింజైటిస్, టి.బి. మెనింజైటిస్. మెనింజైటిస్ వ్యాధి చిన్నపిల్లలో ఎక్కువగా కనబడుతుంది. పెద్దవారిలో చాలా అరుదుగా వస్తుంది. ముఖ్యంగా చిన్నపిల్లలలోనూ, ఐదు సంవత్సరాల వయసులోనూ వ్యాధి కనబడవచ్చు. మనదేశంలో ప్రతి వెయ్యిమంది పిల్లలో ఇద్దరు ఈ రకమైన వ్యాధికి గురవుతున్నారు. వైద్య సహాయం సరిగ్గా అందక, వ్యాధి గురించిన అవగాహనా లోపంవల్ల వ్యాధి వచ్చిన పిల్లలో చనిపోయే వారి సంఖ్య ఎక్కువగా వుంది.

చిన్న పిల్లలలో సాధారణంగా వచ్చే పొంగు, గవదలు, చెవిలో చీము, కోరింతదగ్గు, ముక్కులలో పుళ్ళు, ఇంకా ఇలాంటి వాటివల్ల మెనింజైటిస్ వ్యాధి వచ్చే ప్రమాదం వుంది. తల్లికి గనుక క్షయవ్యాధి వుంటే పుట్టిన శిశువుకు నెలరోజులలో టి.బి. మెనింజైటిస్ వ్యాధి రావచ్చు. మామూలుగా అయితే టి.బి. మెనింజైటిస్ వ్యాధి నిదానంగా వస్తుంది. మిగిలిన వైరల్ మెనింజైటిస్, బ్యాక్టీరియల్ మెనింజైటిస్‌లు చాలా తీవ్రంగా కొన్ని గొంటలు లేదా కొద్ది రోజులలోనే వస్తుంది.

**లక్షణాలు :**

★ వైరల్ మెనింజైటిస్, బాక్టీరియల్ మెనింజైటిస్‌లలో లక్షణాలన్నీ ఒక్కమారు బయట బడతాయి. టి.బి. మెనింజైటిస్‌లో వ్యాధి నిదానంగా వస్తుంది. లక్షణాలు కూడా నిదానంగా బయటబడతాయి.





★ జ్వరం ఎక్కువగా వుంటుంది. సుమారు 103 నుండి 104°F వరకు ఉంటుంది.

★ జ్వరంతోపాటుగా తలనొప్పి కూడా వస్తుంది. అయితే మరీ చిన్న పిల్లలు తమకు తలనొప్పి అని చెప్పలేరు. కాస్తమాటలు వచ్చిన పిల్లలు తలనొప్పిని తెలియజేయగలరు.

★ నడుము బిగదీసుకుపోతుంది. కనీసం తమతలను మోకాళ్ళపైకి కూడా వంచలేరు.

★ నడుముతో బాటుగా మెడకూడా బిగుసుకుంటుంది. బిడ్డ తల, మెడ వెనక్కు వంగి వుంటాయి.

★ బిడ్డకు ఫిట్స్, అసహజమైన కదలికలు వుంటాయి.

★ బిడ్డ చాలా మత్తుగా వుంటాడు.

★ సంవత్సరంలోపు వయసున్న పిల్లలకు తలపైన (మాడు) పైకివాచినట్లుగా ఉబ్బి కనబడుతుంది.

★ బిడ్డకు ఆకలి ఉండదు. ఆహారం తీసుకోవడానికి నిరాకరిస్తాడు.

★ రోగికి విపరీతంగా వాంతులు అవుతూ వుంటాయి. చివరికి నోట్లో మందు వేసినా వెంటనే వాంతి అవుతుంది.

**నిర్ధారణ :**

వైరల్ మెనింజైటిస్, బాక్టీరియల్ మెనింజైటిస్ వ్యాధులను రక్తపరీక్ష; కల్చర్ చేయడం ద్వారా, సెరిబ్రోస్పైనల్ ఫ్లూయిడ్ (CSF) పరీక్ష, CSF కల్చర్ వంటి పరీక్షల ద్వారా నిర్ధారించవచ్చు. టి.బి. మెనింజైటిస్‌ను పై పరీక్షల ద్వారానూ టి.బి. వ్యాధి నిర్ధారణ పరీక్ష ద్వారానూ నిర్ధారించవచ్చు. CSF లో వత్తిడి పెరుగుతుంది. దీనివల్ల మెదడులో వత్తిడి ఎక్కువవుతుంది. వెన్నులో నుండి నీరు (CSF) తీసి పరీక్ష చేస్తే దానిలో ప్రతి క్యూబిక్ మిల్లీమీటరుకు 50 నుండి 500 కణాలు వుంటాయి. ప్రోటీన్‌లు ఎక్కువ శాతంలో వుంటాయి. అదే విధంగా లింఫోసైట్స్ కూడా ఎక్కువగానే వుంటాయి. చక్కెర శాతం తగ్గుతుంది.

**చికిత్స :**

★ టి.బి. మెనింజైటిస్ తక్క మిగిలినవి చాలా వేగంగా అంటే గంటలలోనే వ్యాపించగలవు. కాబట్టి వీరి చికిత్సలో ప్రతి నిముషమూ విలువైనదిగా భావించాలి. వీలైతే రోగిని ఆసుపత్రిలో వుంచి చికిత్స చేయించడం మంచిది.

★ ఏ రకమైన మెనింజైటిస్ అనే దానిని తగు పరీక్షల ద్వారా నిర్ధారించుకుని మందులు వాడితే చికిత్స సులువుగా వుంటుంది.

★ మెనింజైటిస్ రోగుల రక్తం, CSF తరచు పరీక్షిస్తూ వ్యాధి నడక ఏ విధంగా వుందో గమనించుతూ చికిత్స చేయాలి. వైరల్ మెనింజైటిస్ చాలా అరుదుగా వ్యాపిస్తుంది. 'H ఇన్‌ఫ్లూయెంజే' వైరస్‌వలన ఈ వ్యాధి వస్తుంది.

★ బ్యాక్టీరియల్ మెనింజైటిస్‌కు -

'బెంజైల్ పెన్సిలిన్'ను 10 లక్షల యూనిట్స్ రోజుకు రెండుసార్లుగా పదిరోజులు వాడాలి.

'సెఫటాక్సైమ్' వున్న ఈ క్రింది మందులు వాడాలి.

బెస్‌టాక్స్ - 250 మి.గ్రా/500 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

బెస్‌టాక్స్ - 250 మి.గ్రా/500 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

సి-టాక్స్ - 250 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

సెఫాటాక్స్ - 250 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

ఫాక్సిమ్ - 250 మి.గ్రా / 1గ్రా. ఇంజక్షన్

టాక్సిం - 250 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

ఒకటి నుండి రెండు గ్రాముల వరకూ రోజుకు రెండు సార్లుగా పదిరోజులపాటు వాడాలి.

'సెఫ్‌ట్రెయాగ్జోన్ సోడియం' వున్న ఈ క్రింది మందులు వాడాలి.

బెసెఫ్ - 250 మి.గ్రా./500 మి.గ్రా/1 గ్రా ఇంజక్షన్

సెఫోగ్రామ్ - 250 మి.గ్రా. ఇంజక్షన్

గ్రామోసెఫ్ - 250 మి.గ్రా/1 గ్రా ఇంజక్షన్

అఫ్రామాక్స్ - 250 మి.గ్రా/1 గ్రా ఇంజక్షన్

పవర్‌సెఫ్ - 125 మి.గ్రా/250 మి.గ్రా/500 మి.గ్రా/1 గ్రా ఇంజక్షన్

ట్రయాక్స్ - 250 మి.గ్రా/1 గ్రా. ఇంజక్షన్

వీటిలో ఏదైనా సరే 100 మి.గ్రా/కె.జి. చొప్పున రోజుకు 4 గ్రాముల మోతాదు వరకు ప్రతి 12 గంటలకు ఒకసారి యివ్వాలి.

★ టి.బి. మెనింజైటిస్‌కు చికిత్స కూడా దీర్ఘకాలం చేయాలి. మొదట వ్యాధి నిర్ధారించిన తరువాతే మందులు వాడాలి. దీనిలో పన్నెండేళ్ళు దాటిన వారికి.

ఐసోనియాజైడ్ - 10 నుండి 12 మి.గ్రా/కె.జి. బాడీ బరువుకు ప్రతి రోజు రెండునెలలపాటు వాడాలి.

రిఫాంపిసిన్ -10 మి.గ్రా/కె.జి. బాడీ బరువుకు ప్రతిరోజూ సంవత్సరంపాటు వాడాలి.

ఇథాంబ్యుటాల్ - 600 మి.గ్రా - రోజుకు ఒక మాత్ర మొదటి రెండు నెలలు వాడాలి.

రిఫాంపిసిన్ - ఐసోనియాజైడ్ కలిసివున్న (450 మి.గ్రా + 300 మి.గ్రా) మందుల్ని కూడా రోజుకు ఒకటి చొప్పున 9 మంది పన్నెండు నెలలు వాడాలి.

ఐసోనియాజైడ్‌తో పాటుగా బి-కాంప్లెక్స్ (పైరిడాక్సిన్) కూడా వాడాలి.





పైరజినమైడ్ - 750 మి.గ్రా రోజుకు రెండుసార్లు చొప్పున మొదటి రెండు నెలలు వాడాలి.

స్ట్రెప్టోమైసిన్ - 1 గ్రాము చొప్పున రోజుకు ఒకటిగా మొదటి రెండు నెలలు ఇంజక్షన్ చేయించుకోవాలి.

వీరికి బాగా విశ్రాంతి అవసరం రోగ నిరోధక శక్తి ఎంతబాగా ఉంటే అంత మంచిది.

ప్రెడ్నిసోలాన్ - 20 మి.గ్రా చొప్పున (ప్రతిరోజూ రాత్రి) ఆరు నుండి పన్నెండు నెలలు వాడాలి.

## మెదడువాపు (Encephalitis)

ఈ వ్యాధి ప్రతి సంవత్సరం మన రాష్ట్రంలో కనబడుతూనే ఉంది. చిన్నపిల్లలో కనిపించే ఈ వ్యాధిని 'జపనీస్ ఎన్‌సెఫలైటిస్' అంటారు. ఇది వైరస్ వల్ల వచ్చే వ్యాధి.

**వ్యాధి లక్షణాలు :**

★ ఇది చిన్నపిల్లలో వస్తుంది. ముఖ్యంగా పన్నెండు సంవత్సరాల వయసులోపు పిల్లలో ఎక్కువగా కనబడుతుంది. హఠాత్తుగా జ్వరం, వళ్లు నొప్పులు వస్తాయి. జ్వరం తీవ్రంగా ఎక్కువగా వస్తుంది.

★ జ్వరంతోపాటుగా భరించలేని తలనొప్పి కూడా వుంటుంది.

★ రోగి మగతతో వుంటాడు. అంతేగాక రోగి రెండు, మూడు రోజులలోనే అపస్మారక స్థితిలోనికి వెళ్ళిపోతాడు. కాబట్టి రోగిని చాలా జాగ్రత్తగా చూడాలి.

★ మెదడువాపు వ్యాధి, మెనింజైటిస్ రెండూ ఒకే మాదిరి లక్షణాలతో వుంటాయి. తేడాని కనుక్కోవడం కష్టంగా వుంటుంది. కేవలం నడుములోనుండి నీరుతీసి (CSF) పరీక్ష చేస్తేనే అది ఏమిటి అనేది తెలియదు.

★ రోగి కాళ్ళు, చేతులు తోటకూర కాడల్లా -వేలాడతాయి.

★ రోగిలో సంధిలక్షణాలు కనబడతాయి. ఫిట్స్ కూడా రావచ్చు

**కారణాలు :**

మెదడు వాపు వ్యాధి 'జపనీస్ 'బి' ఎన్‌సెఫలైటిస్' (Japanese 'B' encephalitis) అనే వైరస్ వలన వస్తుంది. ఈ రోగం వున్నవాళ్ళను దోమలు కుట్టినప్పుడు వైరస్ క్రిములు దోమ శరీరంలోనికి ప్రవేశిస్తాయి. అక్కడ నుండి అవి పందులను కుడితే ఆ పందులలో వైరస్ క్రిములు పెరుగుతాయి. పందులు వైరస్ క్రిములకు రిజర్వాయర్లుగా పనిచేస్తాయన్నమాట. మళ్ళా ఆ పందుల్ని కుట్టిన దోమలు వేరొకరిని కుట్టినప్పుడు వారికి మెదడువాపు వ్యాధి వస్తుంది. అయితే ఇలా దోమలు కుట్టిన పిల్లలందరికీ వ్యాధి రావాలని లేదు. రోగనిరోధక శక్తి వున్న చాలా మంది పిల్లలకు వ్యాధి రాదు. కానీ కొందరు మాత్రం వ్యాధి నిరోధక శక్తి లేక వ్యాధి బారినపడుతున్నారు. మెదడు వాపు వ్యాధి కేవలం పందులవల్ల మాత్రమే కాక పక్షులవల్ల కూడా వస్తుందని ఇటీవల పరిశోధనల వల్ల తేలింది.

**జాగ్రత్తలు :**

వ్యాధి వచ్చాక బాధపడేకంటే వ్యాధి రాకుండా జాగ్రత్తలు తీసుకోవడం మంచిది. ముఖ్యంగా పందులను ఇళ్ళవద్ద పెరగకుండా చూడాలి. అలాగే దోమలు పెరగకుండా, చెత్తా, మురికి ఇళ్ళవద్ద పోగుపడకుండా ఉంచాలి. దోమలను నివారించడానికి ఫాగింగ్ చేయడం, ఇంకా రిపెల్లెంట్‌లను ఉపయోగించడం, దోమతెరలు కట్టుకోవడం వంటి పనులు చేయాలి.

**చికిత్స :**

★ ఇది వైరస్ వల్ల వచ్చే వ్యాధి కాబట్టి దీనికి సరైన మందులు ఏవీ లేవు: దానంతట అదే రోగనిరోధక శక్తి పెరగడంవల్ల తగ్గాలి. అంతే గాని వేరే మార్గం లేదు.

★ జ్వరంతో వున్నప్పుడు ఇంకా వళ్ళు నొప్పులు ఇతర సమస్యలకు పేరాసిటమాల్ వంటివి వాడవచ్చు.

★ నోటిద్వారా ఆహారం తీసుకోలేని పరిస్థితిలో సెలైన్ బాటిల్స్ ఇవ్వాలి.

★ రోగ నిరోధకశక్తి పెంపొందించడానికి రోగికి పళ్ళరసాలు ఇంకా తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాల్ని ఇవ్వాలి.

★ రోగి వంట్లో వుండే వైరస్ క్రిములు దాడిచేసినప్పుడు వాని ప్రభావాన్ని కాస్త తగ్గించేందుకు రోగికి ఎక్కువగా వారు తీసుకోగలిగినంత ద్రవ పదార్థాలు ఇవ్వాలి.

★ రోగికి 'బెల్లడోనా' వంటి హోమియో మందుల్ని ఇస్తున్నారు. ఇది పనిచేస్తుందని భావిస్తున్నారు.

★ రోగి కోలుకున్నాక కూడా కొందరిలో బుద్ధిమాంద్యం, నరాల బలహీనత, పక్షవాతం వంటి సమస్యలు తలెత్తవచ్చు. అవి కూడా కొద్దికాలానికి సర్దుకోవచ్చు.



# మూత్రమండల వ్యాధులు

మన శరీరంలోని మలినాలను బయటకు పంపి మనలను ఆరోగ్యంగా వుంచే వ్యవస్థ - మూత్రమండల వ్యవస్థ. అంతేగాక మనశరీరంలోని యితర ఏ వ్యవస్థ అయినా సరే సక్రమంగా ఎలాంటి ఇన్‌ఫెక్షన్‌లూ లేకుండా పనిచేస్తుందో లేదో మూత్ర పరీక్ష చేసి తెలుసుకోవచ్చు. మన శరీరంలో ద్రవపదార్థాల్ని సరైన స్థితిలో వుంచి కాపాడే వ్యవస్థ మూత్ర మండలవ్యవస్థ.

మూత్ర మండల వ్యవస్థలోని ప్రధానమైన అంగాలు మూత్రపిండాలే. మూత్రపిండాలు చిక్కుడు గింజ ఆకారంలో మన నడుమునకు వెనుకవైపు ఉంటాయి. మూత్రపిండాలలో అతి సన్నని సూక్ష్మ నాళికలు ఉంటాయి. ఈ నాళికలను గ్లోమెరూలస్ (glomerulus) అంటారు. ఇవి రక్తంలోని మలిన పదార్థాలను వడకట్టి బయటకు పంపుతాయి. మూత్రపిండాలు రెండు వెన్నెముకకు ఇరువైపులా వుంటాయి. మన శరీరంలోని 19 గాలన్‌ల రక్తం ప్రతి గంటకూ ఈ మూత్రపిండాల ద్వారా వడకట్టబడుతుంది. మూత్రపిండాలు మన శరీరంలో మూత్రం తయారగుటకు మాత్రమే కాక, రక్త పీడనమును నియంత్రించుటలో కూడా ఉపయోగపడతాయి.



[redacted]—Urinary system

మూత్రమండలానికి ఏదైనా వ్యాధి సోకిందనేందుకు గుర్తుగా ముఖ్యంగా మూత్రం యొక్క నడకను గమనించాలి. మూత్రం ఆగిపోవడం, మూత్రం చుక్కలు చుక్కలుగా పడడం, మూత్రం వెంట చీము రావడం, మూత్రం అధికంగా రావడం, మూత్రం పోసేటప్పుడు కడుపులో నొప్పి భరించలేనట్లుగా రావడం, మూత్రం తెల్లగా పాలలాగా రావడం, మూత్రం పోసేటప్పుడు చురుకుగా మంటగా చుక్కలుగా పడడం వంటి అనేక అంశాల్ని పరిశీలించాలి.

మూత్రంలో యూరోక్రోమ్ (Urochrome) అనే పదార్థం వుంటుంది. దీనివల్లనే ఆరోగ్యముతోనున్న వారి మూత్రంలో లేత పసుపురంగు కలుగుతుంది. మూత్రంలో పసుపురంగు వర్ణకం ఎక్కువగా ఉంటే కామెర్ల వ్యాధికావచ్చు. ఎండాకాలం శరీరంలో నీరు అధిక శాతంలో ఆవిరి అవుతుంది. దీనికి తగ్గట్టుగా తగినంత నీరు త్రాగకపోతే మూత్రం చిక్కగాను చురుకుగానూ వస్తుంది. అదే విధంగా ఎండల్లో పనిచేసే వ్యక్తులలో కూడా తగినంతనీరు త్రాగనట్లయితే మూత్రం చురుకుగా వస్తుంది. దీనిని వారు 'వేడిచేసిందని'గాని 'వళ్ళుకాక' అనిగానీ అంటారు.

'వల్ళుకాక' తగ్గాలంటే 'అల్కలిన్ సిట్రేట్' అనే మందు ఉదయం సాయంత్రం గ్లాసుడు నీటిలో రెండు చెంచాలమందు కలిపి త్రాగితే తగ్గిపోతుంది. మూత్రం ఇంకా చురుకుగా రావడం,

చీము కణాలు కనబడినా, రక్తం వచ్చినా మూత్ర పరీక్ష, 'మూత్రం కల్చర్' పరీక్ష చేయించి దానికి తగ్గ యాంటి బయాటిక్స్ ఇతర మందులు వాడాలి.

షుగర్ వ్యాధిలో మూత్రం అధికంగా వస్తుంది. దీనికి కారణం మూత్రం ద్వారా గ్లూకోజ్ బయటకు పోవడం. అలాపోయేటప్పుడు తనతోపాటు శరీరంలోని నీటిని కూడా బయటకు చేరవేస్తుంది. అందుచేతనే మూత్రం అధికంగా వస్తుంది. దానితోపాటు దాహం కూడా అధికంగా వేస్తుంది. చక్కెర వ్యాధిలో చిన్న రక్తనాళాలు పూడిపోయే ప్రమాదం వుంది. ఈ స్థితిని మైక్రోయాంజియోపతి అంటారు. ఇలాంటి పరిస్థితిలో 'కిడ్నీఫెయిల్యూర్' అయ్యే ప్రమాదం వుంది. అంటే మూత్రపిండాలలో వుండే చిన్న రక్తనాళాలు పూడిపోయి (Micro angiopathy) మూత్రపిండాలు తమ విధిని తాము నిర్వర్తించలేవు. అందుచేతనే 'కిడ్నీఫెయిల్యూర్' జరుగుతుంది.

## మూత్రపిండాలలో రాళ్ళు (Stones in Urinary Tract)

మూత్రపిండాల వ్యాధులు అనగానే మొదట గుర్తుకు వచ్చేది మూత్రపిండాలలో రాళ్లు ఏర్పడతాయని. చాలా మందికి మూత్రపిండాలలో రాళ్ళు ఎందుకు ఏర్పడతున్నాయో తెలియదు. తాము భోజనంతో పాటుగా తిన్న పదార్థాలలో వుండే రాళ్ళు, మట్టిబెడ్డలు కిడ్నీలో చేరి రాళ్ళుగా వుంటాయని భావిస్తారు. కానీ దానికీ మూత్రపిండాలలోని రాళ్లకూ సంబంధం లేదు. భోజనంతోపాటు మింగిన రాళ్లు మలవిసర్జనద్వారా బయటకు పోతాయి. మూత్రపిండాలలోని రాళ్లు మూత్రంలో వుండే లవణాలు చిక్కబడి రాళ్ళుగా మారినవి. ఇవి మూత్రం ద్వారా మూత్రనాళం నుండి బయటకు వస్తాయి.

### మూత్రంలో రాళ్ళు ఏర్పడడానికి కారణాలు :

మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడడానికి అనేక కారణాలు వున్నాయి. ముఖ్యంగా మూత్రపిండాలలోని రాళ్ళు ముప్పై సంవత్సరాలు దాటినపుడు పురుషులలో అధికంగా ఏర్పడే అవకాశం వుంది. ఆడవారిలో చాలా తక్కువమందిలోనే ఏర్పడతాయి. మనం త్రాగేనీటిలో వుండే లవణాలు మామూలు స్థాయికి మించి వుంటే చిన్న పిల్లల్లో సైతం రాళ్ళు ఏర్పడవచ్చు.

★ మనం తినే ఆహారంలో కాల్షియం లవణాలు, యూరిక్ ఆమ్లం, ఆక్సలేట్, సిస్టిన్‌వంటి పదార్థాలు అధికపరిమాణంలో వుంటే మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడే అవకాశాలున్నాయి.

★ మూత్రమండల వ్యవస్థ క్రిమిదోషాలకు గురి అయితే మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడవచ్చు.

★ విటమిన్ 'A' మన శరీరంలో తక్కువ అయితే కూడా రాళ్ళు ఏర్పడే ప్రమాదముంది.

★ ప్రొస్టేట్ గ్రంధి ఎన్‌లార్జ్ అయితే మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడవచ్చు.

★ మూత్రావయవం సన్నబడడం - అంటే స్ట్రిక్చర్ యురెత్రా (Stricture of Urethra) వున్నప్పుడు కూడా మూత్ర పిండాలలో రాళ్ళు ఏర్పడవచ్చు.





★ మూత్ర విసర్జనకు ఏదైనా అడ్డు ఏర్పడినప్పుడు రాళ్ళు ఏర్పడే ప్రమాదం వుంది.

★ మూత్ర వ్యవస్థలో లోపలి పొర దెబ్బతినడం వల్ల కూడా మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడవచ్చు.

★ మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడడానికి ముఖ్యకారణం మరొకటి వున్నది. అది భోజనానంతరం నీరు తక్కువగా త్రాగడం.

★ మూత్రపిండాల్లో రాళ్లు దీర్ఘకాలం పాటు మంచం మీద నుండి లేవలేని స్థితిలో వున్న వ్యక్తులలో కూడా వచ్చే ప్రమాదం వుంది.

### వ్యాధి లక్షణాలు :

★ మూత్రమండల వ్యవస్థలో ఏ ప్రాంతంలో రాళ్ళు ఏర్పడ్డాయో దాన్ని బట్టే లక్షణాలు కూడా ఉంటాయి.

★ ఒక్కో సందర్భంలో మూత్రపిండాలలోపల రాయి ఏర్పడినా ఎలాంటి ఇబ్బందీ లేకుండానే జీవితం హాయిగా గడచిపోవచ్చు. అయితే మూత్ర నాళం (మూత్రపిండాలకు మూత్రాశయానికి మధ్యనుండేది) లో గనుక రాయివుంటే నొప్పి భరించలేనట్లుగా వుంటుంది.

★ రాయి మూత్రకోశంలో గనుక వుంటే మూత్రకోశం గోడలకు రాయి గుచ్చుకున్నప్పుడల్లా విపరీతమైన నొప్పి పుడుతుంది. మూత్రకోశం పొత్తికడుపు ప్రాంతంలో వుంటుంది. కాబట్టి వీరికి పొత్తికడుపు విపరీతంగా నొప్పిచేస్తుంది.

★ సాధారణంగా నొప్పి స్త్రీలలో మర్మావయవాలకుగానీ తొడలలోపల వైపు గాని ప్రాకుతుంది. పురుషులలో నొప్పి నడుము వద్ద మొదలై చివరకు వృషణాలలోనికి వ్యాపిస్తుంది.

★ మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడిన వారికి నొప్పితోపాటుగా జ్వరం, విపరీతంగా వాంతులు కూడా వస్తాయి.

★ కొన్ని సందర్భాలలో ఈ జబ్బును అపెండిసైటిస్‌గా భావించే ప్రమాదం వుంది. అందుచేత సరైన వ్యాధి నిర్ధారణ పరీక్షలు చేయించుకుని మందులు వాడాలి.

★ మూత్రపిండాలలోని రాళ్ళు మూత్రనాళంలోనికి వస్తే మూత్రనాళపు గోడలకు రాపిడి కలిగి రక్తంగాని, చీముగాని వస్తుంది. ఒక్కొక్కసారి ఈ చీము కణాలు అలాపైకి పోయి చివరికి మూత్రపిండాలు పాడయిపోయేదశకు చేరవచ్చు.

### వ్యాధి నిర్ధారణ :

ఇది ఎపెండిసైటిస్ లక్షణాలను పోలి వుంటుంది కాబట్టి ముందు జబ్బును నిర్ధారణ చేసుకోవాలి. దానికి ఎక్సరే, మూత్ర పరీక్ష, మూత్రం కల్చర్, సెన్సిటివిటీ పరీక్షలు, అల్ట్రాసౌండ్ పరీక్షలు చేయించాలి.

## మూత్రపిండాల్లో ఏర్పడే రాళ్ళల్లో రకాలు :

- ★ కాల్షియం ఆక్సలేట్
- ★ కాల్షియం ఫాస్ఫేట్
- ★ యురేట్ స్టోన్స్
- ★ సిస్టిన్ స్టోన్స్
- ★ ట్రిపుల్ ఫాస్ఫేట్ స్టోన్స్

వీటిలో ఏ రకం అయినా ఏర్పడవచ్చు. అయితే చికిత్సలో ఎలాటి మార్పూ వుండదు.

## చికిత్స :

- ★ మూత్రపిండాలలో ఏర్పడిన రాళ్ళు చిన్నసైజులో అంటే కంది గింజలకంటే చిన్నగా వుంటే మూత్రంతోపాటుగా బయటకు పోతాయి. అందుకు అధికంగా నీరు త్రాగుతూవుండాలి.
- ★ రాళ్ళు ఏరకమైనవో పరీక్ష జరిపి నిర్ధారించుకున్నాక అవి దేనివల్ల ఏర్పడతాయో తెలుసుకుని ఆ పదార్థాల్ని విసర్జించాలి.
- ★ ఆగ్జలేట్ రాయి అయితే టమాటో, చింతపండు, బచ్చలికూర, ముల్లంగి, ఉల్లిపాయ, పచ్చిబఠాణీ, బెండకాయ, ఇంకా మాంసాహారులయితే 'మెదడు' కూర తినరాదు.
- ★ 'యూరిక్ ఏసిడ్' వల్ల ఏర్పడినరాయి అయితే టీ, కాఫీ పప్పుధాన్యాలు, కిడ్నీ, మాంసం, కాలేయం, వేరుశనగ, జీడిగింజలు వంటి పదార్థాల్ని తినరాదు.
- ★ చిన్న చిన్న రాళ్ళు మూత్రంతోపాటుగా బయటకు పోయినా పెద్దసైజు రాళ్ళు అలాగే వుండి ఇబ్బంది పెడతాయి. వీటిని తొలగించాలంటే ఆపరేషన్ చేయాలి. లేకపోతే మూత్రపిండాలు చెడిపోయే ప్రమాదం ఉంది.
- ★ మూత్రపిండంలోని రాయిని తొలగించేందుకు మందులు ఏవీలేవు. వీటిని పిండిచేసి మూత్రం ద్వారా బయటకు పంపే యంత్రాలున్నాయి. లిథోట్రిప్సీ (Lithotripsy) అనే ఈ పద్ధతివల్ల ఆపరేషన్‌లో కోతకూడా వుండదు. అయితే ఖరీదైన వైద్యము. ఇలాంటిదే మరో పద్ధతి కూడా వుంది. దీనిని PCNL అని అంటారు.
- ★ మూత్రపిండాలలో రాళ్ళు ఒకసారి ఆపరేషన్ చేసి తీసినా మళ్ళా ఏర్పడవని గ్యారెంటీ లేదు.
- ★ మూత్రపిండాల్లో 'కాల్షియం ఆగ్జలేట్' అనే పదార్థం పేరుకునిపోవడంవల్ల ఏర్పడే రాళ్ళు 'పాలకూరలోని గ్లైఆక్సలేట్ రిడక్టేజ్' అనే ఎంజైమ్ మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడకుండా నివారిస్తుందని ఇటీవల పరిశోధనలు తెలియజేస్తున్నాయి.





- ★ చీము కణాలు కనిపిస్తే ఈ క్రింది మందులు వాడవచ్చు.

సిఫ్రాన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా. లేక

నార్ఫ్లాక్సిన్ - 400.మి.గ్రా. లేక

నార్ఫ్లాక్స్ 400 మి.గ్రా.

వీటిని ఉదయం, సాయంత్రం రెండు పూటలా వాడవచ్చు.

- ★ నొప్పిగా వుంటే

సైక్లోపామ్ - టాబ్లెట్స్ / ఇంజక్షన్స్ /సిరప్ (పిల్లలకు)

మెఫ్టాల్‌స్పాస్ - టాబ్లెట్స్

డ్రైగాన్ - టాబ్లెట్స్/ఇంజక్షన్

వీటిలో ఏదైనా రోజుకు మూడు సార్లు వాడవచ్చు.

## మూత్రావయవాలకు చీము (Urinary Tract Infection)

సర్వసాధారణంగా ఇది స్త్రీలలో ఎక్కువగా కనబడుతుంది. స్త్రీలయోని చుట్టూ ఉన్న ప్రదేశం తడిగా వుండడంవల్ల, మూత్రనాళద్వారం బహు సున్నితంగా వుండడంచేత అక్కత ఎంత చిన్న గాయం అయినా అక్కడి చర్మం (Mucosa) దెబ్బతిని పుండుగా మారుతుంది. అది E. కొలే అనే బాక్టీరియావల్ల మరింత తీవ్రం అవుతుంది. ఆ తరువాత మూత్రావయావాల నుండి చీము వస్తుంది.

## కారణాలు :

- ★ పెళ్ళయిన కొత్త దంపతుల మొదటి కలయికలో పురుషాంగం యోనిలోనికి చొప్పించినప్పుడు అక్కడున్న సున్నితమైన భాగం దెబ్బతిని పుండయ్యే ప్రమాదం వుంది. ఆ తరువాత అది E.కొలై దాడికి గురవుతుంది. పెళ్లయిన కొత్తలో 'హనీమూన్'లో వచ్చే వ్యాధి కాబట్టి దీనిని 'హనీమూన్ సిస్టైటిస్' (Honeymoon Cystitis) అని కూడా అంటారు.
- ★ స్త్రీల మూత్రకోశం నుండి వెలుపలికి వుండే దారి అంటే యురెత్రా పొట్టిగా వుండడం వల్ల కూడా ఇన్‌ఫెక్షన్ సోకే ప్రమాదం వుంది.
- ★ కొందరు రేప్‌కు గురైన యువతులలో కూడా ఈ రకమైన ఇన్‌ఫెక్షన్ వస్తుంది.
- ★ ప్రసవానంతరం కూడా కొందరు స్త్రీలకు E.కొలై ఇన్‌ఫెక్షన్ వచ్చే ప్రమాదం వుంది.
- ★ కొందరు స్త్రీలకు వజైనైటిస్ (తెల్లబట్ట) వ్యాధి వుంటుంది. ఈ వ్యాధివల్ల కూడా వీరికి ఇన్‌ఫెక్షన్ సోకవచ్చు.

★ ఒకొక్కసారి గర్భం దాల్చిన యువతులలో వారిలోని గర్భం మూత్రాశయంపైన వత్తిడి కలిగించడంవల్ల మూత్రం వెనుకకు ప్రవహించి మూత్రనాళం, మూత్రపిండాలలోనికి ప్రవహించి ఇన్‌ఫెక్షన్ కలిగిస్తుంది.

★ స్త్రీలలో గర్భసంచి తొలగించడం - ఇంకా జననాంగాలకు చెందిన ఏ రకమైన ఆపరేషన్ జరిగినా E.కొలి ఇన్‌ఫెక్షన్ వచ్చే ప్రమాదం ఉంది.

★ మూత్రాశయంలో, మూత్రపిండాలలో రాళ్ళు వున్నా వారిలో ఇన్‌ఫెక్షన్ వచ్చే అవకాశం ఉంది.

★ చక్కెర వ్యాధి వున్న వారికి కూడా ఇన్‌ఫెక్షన్ వచ్చే ప్రమాదం వుంది.

★ పురుషులలో ప్రొస్టేట్ గ్రంధి వాచినప్పుడు వారికి E.Coli ఇన్‌ఫెక్షన్ వచ్చే ప్రమాదం వుంది.

★ కొందరు స్త్రీలకు గర్భసంచి క్రిందకు జారుగుతుంది. (prolapse) వీరిలో కూడా ఇన్‌ఫెక్షన్ సోకే అవకాశం వుంది.

★ యురెత్రాగాని, మూత్రనాళం గానీ ఏ కారణం చేతనైనా సన్నబడితే వారికి ఇన్‌ఫెక్షన్ సోకే ప్రమాదం వుంది.

★ ఏ కారణంవల్లనైనా సరే మూత్రాన్ని బలవంతాన బంధించుకొనవలసివస్తే మూత్రం బయటకు పోదుకాబట్టి అది వెనుకకు మరలే ప్రమాదం వుంది. అలా వెనుకకు వస్తే ఇన్‌ఫెక్షన్ సోకే ప్రమాదం వుంది.

★ మూత్రనాళం ఒక్క E.కోలి బ్యాక్టీరియా వల్లనే కాక, సూడోమోనాస్, క్లెబ్సియెల్లా, స్టైఫైలోకొక్కై, ఎంటరోకొక్కై ట్యూబర్క్యులోసిస్ వంటి వానివల్ల, కాండిడా, ప్రొటియస్ వంటి వానివల్ల కూడా ఇన్‌ఫెక్షన్ వస్తుంది.

**లక్షణాలు :**

★ మూత్రం వస్తున్నట్లు అనిపిస్తుంది. కానీ మూత్రం పోసే సమయంలో విపరీతమైన మంటవుండి మూత్రంచుక్కలు చుక్కలుగా పడుతుంది. లేకపోతే అసలు రాకపోవచ్చుకూడా.

★ ఒక్కొక్క సందర్భంలో మూత్రంతోపాటు రక్తం (Haematuria) కూడా రావచ్చు. చీము కూడా వస్తుంది.

★ స్త్రీలలో పొత్తికడుపు క్రిందుగా, యోని ప్రదేశానికి దగ్గరగా వుండే ఎముకలకి (public) పైభాగంలో నొప్పి వస్తుంది.

★ కడుపులో నొప్పి, వాంతులు, వికారం వుంటాయి.

★ ఆకస్మికంగా చలితో జ్వరం వస్తుంది.

★ మూత్రం దుర్వాసనతో వుంటుంది. ముఖ్యంగా ఉదయం మొదటిసారివెళ్ళే మూత్రం ఈ విధంగా దుర్వాసనతో వుంటుంది.





★ నాడి వేగం పెరుగుతుంది. మనిషి చాలా నీరసంగా వుంటాడు.

★ ఇన్‌ఫెక్షన్ మూత్రాశయానికి వస్తే తరచూ మూత్రం వస్తుంది. మంట, జ్వరం, వాంతులు, వికారం కూడా వుంటాయి.

★ మూత్రనాళాలకుగాని, మూత్రపిండాలకుగాని ఇన్‌ఫెక్షన్ వస్తే వారి కడుపులో భరించలేనంత నొప్పి వుంటుంది. దానితో పాటుగా వాంతులు కూడా వస్తాయి.

**చికిత్స :**

మూత్రం వెంట చీము పోతున్నప్పుడు తగిన పరీక్షలు జరపాలి. ముఖ్యంగా మూత్రపరీక్ష చేయించాలి. మూత్ర పరీక్షతోపాటు మూత్రం కల్చర్, 'IVPS' పరీక్ష, సిస్టోస్కోపీ వంటి పరీక్షలు వ్యాధి ఏ రకంగా వుందో తెలియజేస్తాయి. దానికి తగ్గట్లుగా చికిత్స చేస్తే మంచిది.

కొంతమందికి మందులు వేసుకున్నా వారిలోని బాక్టీరియాకు రెసిస్టెన్స్ వచ్చి మందు పనిచేయదు. అంతేగాక రోగం మరింత తిరగబెడుతుంది. కాబట్టి మూత్రంలో వుండే ఆమ్లాలను కంట్రోల్ చేయడానికి విటమిన్ 'సి' మాత్రలు లేదా 'సి' విటమిన్ కలిసిన ఆహార పదార్థాలు (నిమ్మ, నారింజ వంటివి) తీసుకోవాలి. మూత్రం మంటగా వుంటే 'ఆల్కలైన్ సిట్రేట్' వాడాలి.

మూత్రంలోని బాక్టీరియాను బయటకు పంపేందుకు లేదా బాక్టీరియా గాఢతను తగ్గించేందుకు వీలైనన్ని ఎక్కువ నీటిని త్రాగాలి. దీనివల్ల మూత్రం అధికంగా తయారై బయటకు పోతుంది. దానితోపాటుగా బాక్టీరియా కూడా బయటకుపోతుంది.

ఒక్కొక్క సందర్భంలో మూత్రావయవాలలో క్షయవ్యాధి వుంటే వారికి మూత్రం పోసేటప్పుడు బాధ కలుగుతుంది. కాబట్టి వారు 'సిస్టోస్కోపీ' అనే పరీక్ష చేయించుకొని వ్యాధి నిర్ధారణ చేసుకుంటే మంచిది. కాఫీ, టీలు మూత్రంలో మంటను కలిగిస్తాయి. అదే విధంగా మషాలాలు, పచ్చళ్ళు కూడా మూత్రంలో మంటను కలిగిస్తాయి. అందుచేత మందులు వాడేటంత కాలం వీటికి దూరంగా వుంటే మంచిది.

**మందులు :**

వ్యాధి నిర్ధారణ చేసుకున్నాక గాని లేక వ్యాధికి పరీక్షలు చేయకుండా కూడా ఈ క్రింది యాంటిబయోటిక్స్ వాడి చూడవచ్చు. అయితే వ్యాధి ఫలానా దానివల్ల వచ్చింది అనే సంగతి తెలిసినప్పుడు మందులు ఎంచుకోవడం చాలా తేలికవుతుంది.

1. 'నార్ ఫ్లాక్సాసిన్' కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు. వీటిమోతాదు రోజుకు 1600 మి.గ్రా వరకు వాడవచ్చు.

★ నార్‌ఫ్లాక్స్ - 800 మి.గ్రా/400 మి.గ్రా రోజుకు రెండు టాబ్లెట్స్

★ నార్‌బిడ్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

★ నార్‌మాక్స్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

★ నారిలెట్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

★ యూరోఫ్లాక్స్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

2. 'సిప్రోఫ్లక్సాసిన్' కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ సిఫ్రాన్ - 500 మి.గ్రా టాబ్లెట్స్

★ సిప్రోలెట్ - 500 మి.గ్రా టాబ్లెట్స్

★ సిప్రోబిడ్ - 500 మి.గ్రా టాబ్లెట్స్

★ కోఫ్లాక్స్ - 500 మి.గ్రా/750 మి.గ్రా/1గ్రా టాబ్లెట్స్

★ సిపాడ్ - 500 మి.గ్రా/250 మి.గ్రా టాబ్లెట్స్

వీటిలో ఏదైనా వాడవచ్చు. రోగం తీవ్రతను, రోగి వయసును బట్టి మోతాదు నిర్ణయించుకోవాలి.

3. 'నలిడిక్సిక్ ఏసిడ్' కలిసిన ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ గ్రామోనెగ్ - 500 గ్రా టాబ్లెట్స్/సస్పెన్షన్

★ ఎంటిరోడిక్స్ - 500 మి.గ్రా టాబ్లెట్స్/సస్పెన్షన్

★ నెగాడిక్స్ - 500 మి.గ్రా టాబ్లెట్స్ / కిడ్స్‌టాబ్లెట్స్

★ డీక్స్ - 500 మి.గ్రా టాబ్లెట్స్ / సిరప్

పై వాటిలో టాబ్లెట్స్ పూటకు ఒకటి చొప్పున మూడు పూటలూ వాడాలి. సిరప్ కూడా ప్రతిపూట ఒకటి లేదా రెండు చెంచాల చొప్పున మూడుపూటలా వాడాలి.

4. 'కో-ట్రైమాక్సజోల్' వున్న ఈ క్రింది మందుల్ని కూడా వాడవచ్చు.

★ సెప్ట్రాన్ - డి.యస్ - టాబ్లెట్స్

★ బాక్ట్రిం - డి.యస్ - టాబ్లెట్స్

★ స్టాన్ - డి.యస్ - టాబ్లెట్స్

★ కో-సల్ఫ్ - డి.యస్. - టాబ్లెట్స్

★ కో-ట్రాన్ - డి.యస్ - టాబ్లెట్స్

పై వాటిలో ఏదైనాసరే రోజూ రెండు పూటలా వాడాలి.

ఈ మందులు కాక ఇంకా - ఎరిత్రోమైసిన్, ఓఫ్లక్సాసిన్, లోమోఫ్లక్సాసిన్, నైట్రోఫ్యురన్ టాయిన్, సెఫోటాక్సైమ్ వంటి యాంటిబయాటిక్స్ వాడవచ్చు.





ఈ మందులు వాడే ముందు యూరిన్ కల్చర్ చేయించివాడితే మంచిది. దీర్ఘకాలంపాటు మూత్రావయవాలలో ఇన్‌ఫెక్షన్ వుంటే వారం లేక పదిరోజులపాటు పై మందులు వాడి చూడాలి. పై మందుల్లో ఏదైనాసరే ఒకటే వాడాల్సింది. కానీ ఒక్కోసారి రెండు రకాల మందుల్ని వాడాల్సి రావచ్చు. యూరిన్ కల్చర్‌లో నెగిటివ్ రిపోర్ట్ వస్తే మూత్రావయవాల్లో క్షయవ్యాధి వుండొచ్చు. సిస్టోస్కోపీ - ఇంకా ఇతర పరీక్షలు చేయిస్తే వ్యాధి నిర్ధారణ కానవచ్చు. క్షయవ్యాది వుంటే క్షయవ్యాదికి వాడే మందుల్ని వాడాలి. బాధ వుంటే 'పైరీడియం' వంటి మందుల్ని వాడవచ్చు. ఇది వాడుతుంటే మూత్రం ఎరుపురంగుతో వస్తుంది. కానీ భయపడాల్సిందిలేదు. కానీ ఈ మందు బాక్టీరియాను చంపదు. అవసరం అయితే మందులు ఒకటి లేదా రెండు నెలలు వాడాల్సి వుంటుంది.

## ఉబ్బు కామెర్లు (Acute Nephrites)

మూత్రపిండాలకు ఏదైనా వ్యాధి సోకిందంటే ముందుగా కనిపించే లక్షణం వంట్లో నీరు చేరడం. అదే పరిస్థితిలో ముఖం ఉబ్బినట్లుగా వుంటుంది. మూత్రపిండాల వ్యాధివల్ల ఇలా ముఖం ఉబ్బి వచ్చే కామెర్ల వ్యాధినే ఉబ్బు కామెర్లు అంటారు. దీన్నే 'నెఫ్రైటిస్' అని కూడా అంటారు.

ముఖం ఉబ్బినప్పుడల్లా 'ఉబ్బుకామెర్లు' అని అనుమానించాల్సిందే. కాని రక్తహీనతలో కూడా ముఖం ఉబ్బుతుంది. 'తెల్లకామెర్లు' అని పిలువబడే ఈ వ్యాధిలో రక్తహీనత లేక పాండురోగం ముఖ్యమైన కారణం. అయితే మూత్ర పిండాలకు వచ్చే వ్యాధి వల్ల ముఖం ఉబ్బి వచ్చేదే ఉబ్బుకామెర్లు అని ఎక్కువగా పిలుస్తారు.

ఉబ్బు కామెర్లు రావడానికి ముఖ్యంగా 'స్ట్రెప్టోకోకస్' అనే బాక్టీరియా కారణం. అయితే ఈ స్ట్రెప్టోకోకస్ నేరుగా కాకుండా పరోక్షంగా కారణం అవుతుంది. ముందు బాక్టీరియా గొంతులో ప్రవేశించి గొంతు పొక్కడం గాని, గవద్ధలలో చీము కారడంగాని జరుగుతుంది. ఈ పరిస్థితిని ఎదుర్కొనేందుకు మన శరీరం ప్రతిరక్షక పదార్థాల్ని తయారు చేస్తుంది. అయితే చివరకు ఈ ప్రతి రక్షక పదార్థాలు మన శరీరంలోని మూత్రపిండాలపైన దాడి చేయడంతో ఉబ్బు కామెర్లు వస్తాయి.

ఉబ్బు కామెర్లు కేవలం 'స్ట్రెప్టోకోకస్' బాక్టీరియావల్లనే వస్తాయని కాదు. ఇంకా ఇతర వైరస్‌ల వల్ల గాని, మలేరియావల్లగాని, ఒక్కోసారి ఫైలేరియా (బోదకాలు) క్రిమివల్లనూ, సిస్టోసోమియాసిస్ (సిస్టోసోమియా అనే పరాన్నజీవి) వల్లనూ ఉబ్బు కామెర్లు వచ్చే అవకాశం వుంది.

### లక్షణాలు :

★ ముఖం బాగా ఉబ్బి ఉంటుంది. కళ్ళ క్రింద తిత్తుల మాదిరిగా ఉబ్బు స్పష్టంగా ఉంటుంది. ఇలా ఉబ్బుదనం ఉదయంపూట బాగా ఎక్కువగా వుంటుంది.

★ మూత్రం పోసేటప్పుడు మంట వుంటుంది. ముఖ్యంగా మూత్రం చాలా తక్కువగా వుంటుంది. చిక్కని ముదురు ఎరుపు రంగుతో గాని, లేక పొగాకు రంగుతోగాని ఉంటుంది. మూత్రంలో ఎర్రరక్తకణాలు పోవడంవల్ల ఈ విధంగా రంగుతో వుంటుంది.

* మూత్రంలో ఒక్కోసారి చీము కణాలు కూడా కనబడవచ్చు. మూత్ర పరీక్ష చేస్తే ఎర్రరక్తకణాలు గాని, చీము కణాలు గాని వుంటాయి. ఇవి కాక మూత్రంలో నుండి 'అల్బుమిన్' కూడా పోతూ వుంటుంది.
* ఉబ్బు కామెర్ల వ్యాధిలో జ్వరం, వళ్ళు నొప్పులు కూడా వస్తాయి.
* నీరసంగా అనిపించడం, ఫిట్స్ రావడం, అకలి లేకపోవడం, వాంతులు, వికారం వుంటాయి. వీరిలో రక్తపోటు కూడా అధికం అవుతుంది.
* పిల్లల్లో ఉబ్బుకామెర్ల లక్షణాలు ఎక్కువగా కనబడతాయి. అయితే త్వరగా కోలుకునేది కూడా వారే .
* ఉబ్బు కామెర్లు వచ్చే ముందు వారిలో గొంతుమంట, నొప్పి వుంటాయి. ఒక్కోసారి వీరిలో ఎడతెగని దగ్గు కూడా వుంటుంది.
* టాన్సిల్స్ వ్యాధి వచ్చినప్పుడు కూడా ఉబ్బుకామెర్లు రావచ్చు.

**నిర్ధారణ :**

మూత్ర పరీక్ష చేయడంవల్ల, యూరిన్ కల్చర్, రీనల్‌బయాప్సీ రక్తపరీక్ష, స్కానింగ్ వంటి పరీక్షలు చేయడంవల్ల వ్యాధిని నిర్ధారించవచ్చు. అంతేగాక ఉబ్బుకామెర్లు వ్యాధి ఏ కారణం చేత వచ్చిందో కూడా తెలుసుకోవచ్చు.

**చికిత్స :**

* ఉబ్బుకామెర్ల వ్యాదిలో ముఖ్యంగా చికిత్స చేయించుకునే కాలంలో పూర్తి విశ్రాంతి అవసరం.
* వీరికి రక్తపోటు అధికంగా వుండే అవకాశం వుంది. కాబట్టి వీరి ఆహారంలో ఉప్పు వాడకం తగ్గించాలి లేదా పూర్తిగా మానెయ్యాలి.
* వీరు త్రాగేనీటిని కూడా మితంగా తీసుకోవాలి. అంటే వీరు రోజూ ఎంతమూత్రం, ఎన్నిసార్లు పోస్తున్నారో గమనించి ముందురోజు ఎంతమూత్రం పోయిందో ఆ కొలతకు అదనంగా అరలీటరు వీరు త్రాగాలి. ఈ విధంగా రెండు వారాలపాటు త్రాగితే మంచిది.
* మామూలుగా కామెర్లవ్యాధిలో వాడే పదార్థాలే ఆహారంలో తీసుకోవచ్చు. మాంసకృత్తులు (ప్రోటీన్స్) కలిసిన ఆహారం తీసుకోరాదు. ఒకవేళ తీసుకోవలసినా చాలా తక్కువగా తీసుకోవాలి.
* పళ్ళరసాలు గాని, కొబ్బరినీరుగాని, ద్రాక్షవంటి 'పొటాషియం' లవణం కలిసివుండే ఆహారాన్ని, పానీయాలను ఇవ్వరాదు.
* సర్వసాధారణంగా ఉబ్బుకామెర్ల వ్యాధిలో యాంటిబయోటిక్స్ కూడా వాడుతుంటే మూత్రపిండాలకు ఇన్ఫెక్షన్ రాదు.





* శరీరంలోని నీటిని తొలగించటానికి 'లాసిక్స్' టాబ్లెట్స్ రోజుకు ఒకటి లేక రెండు వాడవచ్చు. అయితే రక్తపోటు ఎంత ఉన్నదో చూసుకుని లాసిక్స్ వాడితే మంచిది.
* ఇక అంతగా అవసరం అయితే 'డయాలసిస్' చేయవలసి రావచ్చు. ఇది డాక్టరు పర్యవేక్షణలోనే చేయాల్సి వుంటుంది.
* తగిన జాగ్రత్తలు తీసుకుంటే వ్యాధి నుండి త్వరగా కోలుకుంటారు. లేకపోతే ప్రాణాపాయం కూడా జరిగే ప్రమాదం వుంది.

## ప్రోస్టేట్ గ్రంథి వాపు

ప్రోస్టేట్ గ్రంథి పురుషులలో మూత్రాశయ చివరను మూత్రనాళమును చుట్టుకొని వుంటుంది. దీనిని పౌరుష గ్రంధి అని కూడా అంటారు. ఇది బాదంకాయ ఆకారంలో వుంటుంది. ఈ గ్రంథి శుక్రముతోపాటుగా స్రవిస్తుంది. స్త్రీ, పురుషుల లైంగిక హార్మోనులయిన ఈస్ట్రోజన్, యాండ్రోజన్‌ల ప్రభావంతో పనిచేస్తుంది. ఈ ప్రోస్టేట్ గ్రంథి వాపునకు గురయితే అది మూత్రనాళాలను నొక్కిపెట్టబడడం వల్ల మూత్రం సరిగ్గా జారీ అవదు.

ప్రోస్టేట్ గ్రంధి వాపు సర్వసాధారణంగా నలభై సంవత్సరాల వయసు దాటిన వారిలో కనబడుతుంది. ఈ గ్రంధి నపుంసకులలో చిన్నదిగా వుండడంతో వారిలో ఈ వ్యాధి రాదు. ప్రోస్టేట్ గ్రంధి చెడిపోతే లైంగిక సామర్థ్యంలో మార్పు వస్తుంది. లైంగిక హార్మోన్‌లయిన ఈస్ట్రోజన్, యాండ్రోజన్‌లు రెండూ ఒక నిష్పత్తిలో వుంటాయి. ఇవి స్త్రీలలో స్త్రీత్వాన్ని, పురుషులలో పురుషత్వాన్ని కలిగిస్తాయి. చిన్న వయసులో రెండు రకాల హార్మోన్‌లు వున్నా వయసు పెరిగే కొద్దీ ఈ హార్మోన్‌లలో హెచ్చు తగ్గులు కలిగి లైంగిక లక్షణాలు బయటబడతాయి.

అయితే కొన్ని సందర్భాలలో మగవారిలో యాండ్రోజన్ తగ్గిపోయి అదే నిష్పత్తిలో తగ్గాల్సిన ఈస్ట్రోజన్ తగ్గకపోవడంతో పురుషులలో స్త్రీ హార్మోన్ స్థాయి పెరగడంతో ప్రోస్టేట్ గ్రంధి వాపునకు గురౌతుంది. కొన్ని సందర్భాలలో ఈ వాపు కాన్సర్‌కు దారి తీసే అవకాశం కూడా వుంది.

**లక్షణాలు :**

* తరచుగా మూత్రానికి వెళ్ళాలనిపించడం కానీ వెళ్ళాక మూత్రం రాకపోవడం; ముందుగా ఈ లక్షణం రాత్రులందు కనిపించి పిదప పగటిపూట కూడా వస్తుంది.
* మూత్రం అతి కష్టంపైన కొద్ది కొద్దిగా చాలాసేపు మూత్ర విసర్జన జరుగుతుంది. ఈ లక్షణాన్ని టెర్మినల్ డ్రిబ్లింగ్ (Terminal dribbling) అంటారు. మూత్రం ఆగి ఆగి వస్తుంది.
* మూత్రపిండాలు కూడా వాపునకు గురి అవుతాయి. అవి వున్న ప్రాంతంలో నొక్కితే నొప్పి పుడుతుంది.
* ప్రోస్టేట్ గ్రంధి వాచిన వారి నాలుక ఎండినట్లుగా వుండి, గోధుమరంగును చూపుతుంది.

★ మూత్ర విసర్జన సరిగ్గా వుండకపోవడంతో రక్తంలో యూరియా శాతం ఎక్కువ అవుతుంది.

★ ప్రోస్టేట్ గ్రంధి వాచినపుడు బీర్జాలకు అడుగున 'పెరీనియం' అనే విరేచనమార్గానికి పైన వుండే ప్రదేశంలో బరువుగా వున్నట్లు అనిపిస్తుంది.

★ రోగి ఆయాసం, శ్రమపడితే మరింత పెరిగే ఎగశ్వాస వంటి లక్షణాలలో తనకు లోపల లోపల ఏదో తెలియని జబ్బు వున్నదని భావిస్తూ వుంటాడు.

★ ప్రోస్టేట్ గ్రంధి వాపునకు ముందుగానే లైంగిక వాంఛ వీరికి ఎక్కువగా వుంటుంది. అయితే ఇది తాత్కాలికంగానే వుంటుంది. ఆ తరువాత వీరికి నపుంసకత్వం ఏర్పడుతుంది. ఒకవేళ వాంఛవున్నా శరీరం సహకరించని పరిస్థితిలో వుంటారు.

★ మూత్రం జారీ అయ్యే విధానాన్ని గమనించి వీరిని గుర్తించవచ్చు. మూత్రం నడవడం మరీ కష్టంగా వుంటే మూత్రాశయం నిండిపోయి, మూత్రవాహికలలోను మూత్రం నిండి అవికూడా వాపునకు గురి అవుతాయి.

★ మూత్రం సరిగ్గా రాని పక్షంలో మూత్రపిండాలు మూత్రంతో నిండిపోయి, చెడిపోతాయి. హైడ్రోనెఫ్రోసిస్ (Hydronephrosis) అనే వ్యాధి వస్తుంది.

★ ఇంకా మూత్రం బయటకు పోకుండా వున్నందువల్ల లోపల సూక్ష్మజీవులు పెరిగే ప్రమాదం వుంది. దీనివల్ల ఇతర వ్యాధులు కూడా వస్తాయి.

★ ప్రోస్టేట్ గ్రంధిలో చీమువల్ల చలితో కూడిన జ్వరం వళ్ళు నొప్పులు, నడుం నొప్పి, ఇంకా మూత్ర విసర్జనలోనూ నొప్పి, పెరీనియం వద్ద నొప్పి, మూత్రంతోపాటుగా దారాలవంటివి పోవడం, ఎక్కువసేపు కూర్చోలేకపోవడం, లైంగిక అనాసక్తత వంటి పలు సమస్యలు కూడా రావచ్చు.

## వ్యాధి నిర్ధారణ పరీక్షలు :

★ మొదట మూత్రం పోసేటప్పుడు కాస్తంత వదిలేసి అప్పుడు పట్టి పరీక్షించాలి. అంతేగాక చివరలో వచ్చే మూత్రాన్ని కూడా వదిలేయాలి. మూత్రాన్ని శుభ్రమైన సీసాలో వుంచి పరీక్షాకేంద్రానికి పంపి మూత్ర పరీక్ష జరిపించాలి. దీనివల్ల మూత్రంలోనూ, మూత్రమండలంలోనూ బాక్టీరియా వున్నదో లేదో తెలుస్తుంది.

★ స్కానింగ్ తీసి మూత్రపిండాల పరిస్థితిని తెలుసుకోవాలి.

★ రక్త పరీక్ష జరిపితే రక్తంలో యూరియా ఎంత శాతం వున్నదో తెలుస్తుంది.

★ ఇంకా ఎక్సరే ద్వారా కూడా మూత్ర పిండాల పరిస్థితి తెలుసుకోవచ్చు.

★ విరోచన మార్గం ద్వారా వేలును చొప్పించి పరీక్షిస్తే ప్రోస్టేట్ గ్రంధి ఏ పరిమాణంలో ఉందో తెలుస్తుంది.





## చికిత్స :

★ మూత్రం వచ్చినా లేక వచ్చినట్లనిపించినా వెళ్ళడమే మంచిది.

★ ప్రోస్టేట్ గ్రంధి వాపు నిర్ధారించుకున్నప్పుడు వీలైనంత తొందరలో మందుల్ని వాడితే మంచిది. లేకపోతే వ్యాధి ఎక్కువైతే చివరికి ఆపరేషన్ చేయాల్సిరావచ్చు. చాలా కేసులలో ఆపరేషన్‌తోనే వ్యాధి తగ్గుతుంది.

★ కొన్ని సందర్భాలలో ఈ వ్యాధి కేన్సర్‌కు దారితీయవచ్చు. ఆ సందర్భంలో తప్పనిసరిగా ప్రోస్టేట్ గ్రంధిని శస్త్ర చికిత్స చేసి తొలగించాలి.

★ స్టిల్‌బెస్ట్రాల్ (Stil boestrol) - 3.5 మి.గ్రా ను ఇవ్వవలసి రావచ్చు. దీనివల్ల పూర్తి నపుంసకత్వం రావచ్చు. అంతేగాక వారి స్తనాలు ఆడవాళి స్తనాలవలె పెరగవచ్చు.

★ ప్రాజోసిన్ - ఇంకా టెరజోసిన్ వంటి మందులు వాడవచ్చు.

★ వాపుతగ్గేందుకు బ్రూఫెన్ వంటి మాత్రలు, ఇన్‌ఫెక్షన్ తగ్గేందుకు యాంటీ బయోటిక్స్, క్వినోలిన్స్ వంటి ఇతర మందుల్ని కూడా వాడవచ్చు.

# చర్మ వ్యాధులు

చర్మం మనకు అత్యంత అవశ్యకమైన అంగము. శరీరాన్ని సర్వదా కప్పి కాపాడేది చర్మమే.
అంతేగాక. మన వంట్లోనివేడిని కూడా క్రమబద్ధీకరించేది కూడా చర్మమే. ఎండలకు, వేడిని,
చలిని, వానలను తట్టుకొని మన శరీరం నిలబడి వుందంటే చర్మం ముఖ్య కారణం. ఒక విధంగా
చెప్పాలంటే చర్మం ఆరోగ్యంగా వుంటే అంతా ఆరోగ్యంగా వున్నట్లే.

చర్మం మనకు స్పర్శజ్ఞానేంద్రియంగా కూడా పనిచేస్తుంది. అంతేగాక సూర్యరశ్మి నుండి
మన శరీరం విటమిన్ 'డి'ను తయారు చేసుకునేందుకు చర్మం ఉపయోగపడుతుంది. ఇటువంటి
చర్మం పరిశుభ్రంగా వుండకపోతే అనేక ఇబ్బందుల్లు వస్తాయి. చర్మంలో 'మెలనోసైట్స్' అనే
కణాలు వుంటాయి. వీటిలోని 'మెలనిన్' అనే వర్ణకం వల్ల మన శరీరానికి రంగు వస్తుంది.



—Skin

ప్రతి రోజూ చర్మాన్ని పరిశుభ్రంగా
తోముకుని ఉంచకపోతే బాక్టీరియా చేరి సోభి,
గజ్జి, చీము గుల్లలు మొటిమలు, తామర,
చుండ్రు వంటి వ్యాధులు వస్తాయి. చర్మం
ఎక్కువగా సూర్యరశ్మికి గురయినా క్యాన్సర్
వచ్చే ప్రమాదం కూడా వుంది. ఇవే కాకుండా
చర్మానికి సంబంధించి ఎలర్జీ, బొల్లి, ఎగ్జిమా,
సోరియాసిస్, నంజు, సరిపి, కుష్టువ్యాధి వంటి వ్యాధులు వచ్చే ప్రమాదం వుంది. చర్మంపైన
దాడిచేసేందుకు అనునిత్యం ఎన్నో సూక్ష్మక్రిములు కాచుకుని కూర్చుంటాయి. అయితే చర్మంపైన
ఉన్న కొన్ని రకాలైన సూక్ష్మ జీవులు హానికారక సూక్ష్మక్రిముల నుండి మన చర్మానికి రక్షణ
కల్పిస్తాయి కూడా! కానీ అన్ని వేళలా చర్మాన్ని ఇవి కాపాడలేవు.

చర్మం ముఖ్యంగా రెండు భాగాలుగా విభజింపబడివుంది. అవి 1) బాహ్య చర్మం, 2)
అంతశ్చర్మం. బాహ్యచర్మంలో మరలా రెండు భాగాలు వుంటాయి. అవి పైపొర, లోపలిపొర, పై
పొరలో చనిపోయిన చర్మకణాలు వుంటాయి. లోపలి పొరల్లో నిరంతరం కణవిభజన జరగడం
వల్ల కొత్త కణాలు పుట్టుకొస్తూ వుంటాయి. ఇవి కొద్దికాలానికి చనిపోయి చర్మంపై పొరలోనికి
వస్తాయి. పై పొరలోని మృతకణాలు బాహ్య కారకాల వల్ల రాపిడికి గురై రాలిపడిపోతూ వుంటాయి.
ఈ విషయం మనం గమనించలేము. ఇలా నిరంతరం కొత్త కణాలు వస్తాయి కాబట్టే, పుండు పడినా,
గాయం అయినా, కాలినా మరలా ఆ ప్రాంతంలో కొత్త కణాల వల్ల మామూలు స్థితిలోనికి వస్తుంది.

రెండవ పొర అయిన అంతఃచర్మంలో వెంట్రుకల కుదుళ్లు, రక్తనాళాలు, నాడులు,
చెమట గ్రంధులు, కొవ్వు గ్రంధులు చర్మం రంగును నిర్ణయించే వర్ణద్రవ్యాలు వుంటాయి.





చర్మం మన శరీర ఉష్ణోగ్రతను క్రమపరుస్తుంది. ఈ విషయంలో రక్తం తరువాత చర్మానే
చెప్పుకోవాలి. చర్మంపై పొరల్లోని సూక్ష్మ రక్తకేశనాళికల సంకోచ వ్యాకోచాలవల్లనూ, చర్మంలో
వుండే స్వేదరంధ్రాలవల్లనూ మన శరీర ఉష్ణోగ్రత క్రమపరచబడుతుంది.

సాధారణంగా చర్మవ్యాధి రావడానికి, బ్యాక్టీరియానో, వైరస్‌గాని లేక ఫంగస్ గాని
కారణమవుతాయి. ఇవికాక ఒకొక్కసారి ఇతర పరాన్నజీవులు కూడా కారణం కావచ్చు. అయితే
కొన్ని సందర్భాలలో ఇవేవీ కాకుండా కొన్ని రకాల మందులు, కొన్ని రకాల రసాయనాలు, క్రిమి,
కీటకాల వల్ల కూడా చర్మవ్యాధులు రావచ్చు.

చర్మ వ్యాదే కదా అని అశ్రద్ధ చేస్తే అది శరీరంలోపలి దాకా పాకే అవకాశం వుంది. కొన్ని
రకాల చర్మవ్యాధులను ముందుగానే గుర్తించి చికిత్స చేయకపోతే అవి మొండి వ్యాధులుగా
మారే ప్రమాదం కూడా ఉంది.

## గజ్జి (స్కేబిస్)

చర్మ వ్యాధి అనగానే ముందుగా గుర్తొచ్చే పేరు గజ్జి. చర్మ వ్యాధులలో జగమొండి
వ్యాధి - 'జిల'పెట్టే వ్యాధి ఇదే ! ఇది క్రిమిసంబంధమైన అంటు వ్యాధి. ఈ వ్యాధి ముఖ్యంగా
చిన్నపిల్లలలో ఎక్కువగా కనిపిస్తుంది. గజ్జిని కలిగించే క్రిమిని ఇచ్‌మైట్ (Itchmite) అని
అంటారు. వైద్య పరిభాషలో దీనిని సార్కోప్టిస్ స్కేబియై అని గాని లేదా అకేరస్ స్కేబియై అని
గాని పిలుస్తారు. ఇది సుమారు 0.3 మి.మీ. నుండి 0.4 మి.మీ. పరిమాణంలో వుంటుంది.
దీనికి ముందు రెండు జతలు, వెనుక రెండు జతలు మొత్తం నాలుగు కాళ్ళు వుంటాయి. ఈ
క్రిమి చర్మంపొరల్లో నివాసం ఉంటుంది.

గజ్జి క్రిమి చర్మపై నుండే పొరలను తొలుచుకొని చిన్న సొరంగంలాగా ఏర్పటు
చేసుకుంటుంది. ఈ చర్యలవల్ల చర్మం దురద పెడుతుంది. ఈ దురద ఎంత తీవ్రంగా
వుంటుందంటే రాత్రులందు నిదరకూడా పట్టదు.

గజ్జి ఆడ, మగ, చిన్నా, పెద్దా తేడా లేకుండా అందరికీ రావచ్చు. యింట్లో గజ్జి ఒకరికి
వచ్చిందంటే ఇక ఆ యింట్లో మిగిలినవారు వీరి వస్తువుల్ని వాడడం, వీరిని తాడకం వల్ల వారికీ
వ్యాధి వస్తుంది. ఇరుకైన ఇళ్ళలో నివశించేవారికీ అపరిశుభ్రవాతావరణంలో వుండే వారికీ వస్తుంది.
ముఖ్యంగా వ్యక్తిగత పరిశుభ్రత పాటించనివారికి, చిన్న పిల్లల స్కూల్లో పిల్లలలో ఎవరికైన వ్యాధి
వచ్చిందంటే మిగిలిన వారందరికీ వ్యాధి వచ్చే అవకాశం ఎక్కువ.

గజ్జి క్రిమి ముందుగా మన శరీరంలో అనువైన ప్రదేశంలో చోటు సంపాదించి అక్కడ
గుడ్లు పెడుతుంది. కొద్ది రోజుల్లో - అంటే సుమారు రెండు వారాలలోగా ఈ గుడ్ల నుండి పిల్లలు
బయటకు వస్తాయి. ఇవి చర్మాన్ని తొలచి సొరంగాల్ని ఏర్పాటు చేస్తాయి. ఈ సమయంలో ఇవి

విడుదలచేసే రసాయనాల వలన రోగికి ఎలర్జీ కలిగి దురద పెడుతుంది. ఈ దురద రాత్రుళ్ళు మరింత ఎక్కువ అవుతుంది. మొదట రోగి గోకిన చోట ఎరుపు రంగు బొబ్బమాదిరిగా కనిపించి దురద పెరడుతుంది. ఆ తర్వాత అది పొడవైన గీతలాగా తయారవుతుంది. అది పుండులాగా మారుతుంది. రక్తపు చారికలు కూడా కనిపిస్తాయి.

గజ్జి సాధారణంగా వేళ్ళ సందుల్లోను, మోచేతులు, మోకాళ్ళు, మణికట్లలోనూ, పిరుదులు, తొడలు, చంకలు, మెడక్రింద, స్త్రీలలో రొమ్ములకు క్రిందుగానూ పురుషులకు పురుషాంగం, వృషణాలపైన కూడా గజ్జి కనిపిస్తుంది. చిన్నపిల్లల్లో అయితే అరికాళ్ళు, అరిచేతులు, ముఖంపైన, తలపైన కూడా గజ్జివస్తుంది.

తెల్లనిశరీరం వున్న వ్యక్తులో గజ్జి వచ్చిందని కాస్త పరిశీలనగా చూస్తే తెలిసిపోతుంది. వారి చర్మంపైన బూడిదరంగు చారలు కనిపిస్తాయి. ఇలాంటి బూడిదరంగు మచ్చల్నిగాని, చారల్నిగాని, గీరి, దానిని మైక్రోస్కోప్ క్రింద పరిశీలిస్తే గజ్జిక్రిములు కనబడతాయి. అయితే నల్లని శరీర ఛాయగల వక్తులలో ఈ బూడిధ రంగు మచ్చల్ని గుర్తించడం కష్టం. వీరిలో పైకి కనబడే సాధారణ గజ్జి లక్షణాల్ని గమనించి వ్యాధిని నిర్ధారణ చేస్తారు.

గజ్జి వున్న ప్రాంతంలో రోగి తన చేతి గోళ్ళతో గోక్కుంటాడు. ఆ తరువాత ఆ చేత్తోనే మరో చోట గోక్కోవడంతో అక్కడ కూడా గజ్జి వస్తుంది. గజ్జికి వెంటనే చికిత్స చేయకపోతే అది 'సోరియాసిస్' వంటి దీర్ఘరోగంగా మారవచ్చు. ఇంకా ఇతర జబ్బులేమైనా రావచ్చు. రోగిక సెకండరీ ఇన్ఫెక్షన్ రాకుండా వుండాలంటే రోగికి ఒకచోట ప్రారంభమైన గజ్జి అదే ప్రాంతానికి పరిమితం అయ్యేందుకు వారి చేతి గోళ్ళు పెరగకుండా చూసుకుంటే సరిపోతుంది.

**గజ్జికి చికిత్స :**

గజ్జికి చికిత్స అంటూ మొదలుపెట్టాక దానిని పూర్తిగా కొనసాగించాలి. గజ్జి కాస్త నెమ్మదించాక చికిత్స ఆపేస్తూ వుంటారు. కానీ అలా చేయరాదు. దానివల్ల గజ్జి తిరగబెట్టే అవకాశాలున్నాయి. కానీ చాలామంది గజ్జికి చికిత్సను మధ్యలో ఆపేస్తారు. దీనివల్ల గజ్జి తగ్గదు. పైగా మహా మొండి వ్యాధిగా మారుతుంది. గజ్జి ఎంత ఎక్కువగా వున్నా - చర్మంపైన సుమారు ఐదు నుండి ఎనిమిది క్రిములు మాత్రమే వుంటాయి. గజ్జికి చికిత్స సులువైనది. అయితే కాస్తంత శ్రద్ధ తీసుకోవాలి. గజ్జిలో దురద, దద్దుర్లు శరీరం అంతటా వుండవచ్చు. శరీరంలో దద్దురు కనిపించిన ప్రతిచోటా గజ్జి క్రిమి వుండాలని లేదు.

గజ్జికి ఈ క్రింది మందులు వాడుతున్నారు.

1) 'బెంజైల్ బెంజోయేట్' - ఈ మందు.

★ ఏస్కాబియాల్ లోషన్

★ స్కాబిండాన్ లోషన్ - వంటి పేర్లతో దొరుకుతుంది.





2) గామా బెంజీన్ హెక్సాక్లోరైడ్ - ఇది.

★ స్కేబెక్స్ లోషన్

★ స్కేబోమాలోషన్ - వంటి పేర్లతో దొర్కుకుతుంది.

పై మందులలో బెంజైల్ బెంజోయేట్ 25% పెద్దలకు నేరుగా వాడవచ్చు. అదే పిల్లకు మందు సగం, నీళ్ళుసగం కలిపి వాడవచ్చు. పిల్లలకు ఆ విధంగా నీళ్ళు కలపకుండా వాడితే వారి చర్మం దెబ్బతినే ప్రమాదం వుంది. అంతేగాక ఈ మందులు విషపూర్తిమైనవి పిల్లలకు దూరంగా వుంచాలి. ఈ మందులు మెడపైనా, ముఖంపైనా పూయకూడదు. కంటికి తలగకూడదు.

గజ్జి ముఖ్యంపైన వుంటే 'క్రొమామిటాన్' అనే మందును వాడాలి. గజ్జితోపాటుగా దురద వుంటే ఎవిల్-25 మి.గ్రా రోజుకు ఒకటి లేదా రెండు చొప్పున వాడాలి. లేకపోతే 'సిట్రిజన్' మందు 5 మి.గ్రా టాబ్లెట్స్ అయినా వాడవచ్చు. గజ్జి దురదతో వుండేది కాబట్టి నొక్కితే పుండ్లు పడవచ్చు. అలాంటి పుళ్ళు చీము పట్టి వుంటే ఈ క్రింది మందులు వాడవచ్చు

1) కోట్రైమాక్సజోల్ వున్న

★ బ్యాక్ట్రిం - టాబ్లెట్స్ / సిరప్

★ సిప్లిన్ - టాబ్లెట్స్/సిరప్

★ స్టాన్ - డి.యస్ - టాబ్లెట్స్

వీటిలో ఏదైనా సరే రోజా ఉదయం, సాయంత్రం వాడాలి, లేదా

2) యాంపిసిల్లిన్ వున్న

★ యాంపిల్లిన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా/ కాప్సుల్స్ లేదా 125 మి.గ్రా/5 మి.లీ. సిరప్ /ఇంజక్షన్స్

★ రోసిల్లిన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా కాప్సుల్స్ లేదా సిరప్

వీటిలో ఏదైనా సరే రోజా ఉదయం, సాయంత్రం రెండు పూటలా వాడాలి. పై మందులు మాత్రమే కాక చీము పట్టిన గజ్జిపుళ్ళకు, డాక్సిసైక్లిన్ వంటి యాంటి బయాటిక్స్ కూడా వాడవచ్చు.

గజ్జిపొడిగా వుంటే నివారణకు పైపూతకు ఒక శాతం లిండేన్గాని గమ్మా బెంజీన్ హెక్సాక్లోరైడ్ అనే మందు శరీరంలో ఎక్కడ దద్దురు కనిపించినా శరీరం అంతా పట్టించాలి. ఈ మందు వంటికి రాసుకున్న తర్వాత సుమారు పన్నెండు గంటలపాటు పనిచేస్తుంది. ఇది 'బెక్సారిడ్' జి.ఎ.బి. స్కాబోమా వంటి పేర్లతో దొరుకుతుంది. ఎంత తీవ్రమైన కేసులో అయినా ఈ మందు వారం రోజుల వ్యవధిలో మరలా పూయకూడదు.

# తామర (రింగ్ వర్మ్)

చర్మ వ్యాధులల్లో గజ్జి తరువాత స్థానం తామర ఆక్రమిస్తుంది. ఇది 'బూజు' జాతికి చెందిన సూక్ష్మ జీవి వల్ల (ఫంగస్) వస్తుంది. శరీరంపైన ఏర్పడిన దురదగల మచ్చలన్నీ తామర మచ్చలు కావు. తామరను 'మైకోటిక్ ఇన్‌ఫెక్షన్' అంటారు. తామర మన శరీరంపైన గుండ్రని మచ్చల రూపంలో మొదలవుతుంది. బాగా దురదను కలిగించే మచ్చలయితే వాటిని తామరగా భావించవచ్చు. అయితే ఒకొక్కసారి గజ్జిలోనూ, సోరియాసిస్ అనే చర్మవ్యాధిలోనూ ఎగ్జిమాలోను గుండ్రని మచ్చలు వచ్చి దురదను కలిగించవచ్చు. జాగ్రత్తగా గమనించి వ్యాధిని గుర్తించాల్సి ఉంటుంది.

శరీరంలో అధికంగా చెమ్మలేదా చెమట చేరడం వల్ల ఆ ప్రాంతంలో తామర వచ్చేందుకు అవకాశం వుంటుంది. ముఖ్యంగా తామర వచ్చిన వారితో కలిసి తిరగడంవల్ల, బిగుతైన దుస్తులు ధరించడంవల్ల తామర వచ్చే అవకాశం వుంది.

తామరలో ఎన్నో రకాలు వున్నాయి. అది ఏర్పడే ప్రదేశాన్ని బట్టి వ్యాధికి వివిధ పేర్లు పెట్టారు. 'టీనియాక్రూరిస్'. దీనినే 'జాకీఇచ్' అని పిలుస్తారు. తొడలలోనూ, గజ్జలలోను తామర రావడాన్ని ఈ విధంగా పిలుస్తారు. 'జాకీఇచ్'లో రెండు గజ్జలలో మచ్చలు మొదలై చుట్టు ప్రక్కల ప్రదేశాలకు పాకుతాయి. ఇవి చూడడానికి ఏనుగు చెవుల మాదిరిగా వుంటాయి. ఇలాంటివే జారిన స్తనాల క్రింద, చంకలలోను చీరకట్టు ప్రదేశాలలోనూ వుండి వృషణాలకు కూడా అడుగు భాగాన వస్తుంది. దీనినే 'టి.క్రూరిస్' అని అంటారు.

పాదాలపైన తామర వస్తే దానిని 'టీనియా పీడిస్' అని, తలపైన వస్తే 'టీనియా కాపిటస్' అని, తలలో వచ్చే తామర వ్యాధిని టీనియా క్రూరిస్ అని - శరీరంలో మిగిలిన ప్రాంతాలలో వచ్చే తామర వ్యాధిని టీనియా కార్పోరిస్ అని అంటారు. కొంత మందికి తామర వ్యాధి నోట్లోనూ, ఊపిరితిత్తుల్లోనూ, ప్రేగుల్లోనూ వస్తుంది. దీనిని సిస్టమిక్ మైకోసిస్ అంటారు. చేతి గోళ్లకు కూడా తామర వస్తుంది. దీనివల్ల చేతిగోళ్ళు పిప్పిగోళ్ళుగా మారతాయి. దీనిని 'టీనియా అంగువం' అంటారు. ఇది చేతిగోళ్ళ నుండి శరీరంలోని ఇతర ప్రాంతాలకు చేరుతుంది.

తామర వ్యాధి రావడానికి ముఖ్యకారణం శరీరం అపరిశుభ్రత, శరీరంలో రోగనిరోధక శక్తి తక్కువగా వుండడం. కొందరికి తామర తరచుగా వస్తుంది. ముఖ్యంగా స్థూలకాయులకు ఈ విధంగా వస్తుంది. వీరిలో చెమట అధికంగా పట్టడమే కారణం. తామర శరీరంలోని బాహ్య చర్మం పై పొరల్లో ఏర్పడుతుంది. నిరంతరం నీళ్ళలో నానుతూ వుండే వారిలో - అంటే రజకులు, పనిమనుషుల కాలివ్రేళ్ల సందుల్లో తామర వచ్చే అవకాశం ఎక్కువ.





**లక్షణాలు :**

★ తామర వ్యాధిలో విపరీతమైన దురద వుంటుంది.

★ గోళ్ళలోనికి తామర చేరితే గోళ్ళుపుచ్చిపోతాయి లేదా వంపు తిరిగిపోతాయి.

★ శరీరంపైన గుండ్రని గులాబి రంగు మచ్చలు వస్తాయి. వీటి అంచులు కొద్దిగా ఉబ్బి వుండడం ముఖ్య లక్షణం.

★ గుండ్రని మచ్చలు రెండు గజ్జలలోనూ వచ్చి, అర్థ చంద్రాకారంలో తొడలపైకి పాకుతాయి.

★ తామర వచ్చిన ప్రాంతంలో జుట్టు రాలిపోతుంది. దీనినే 'పేను కొరుకుడు' అని కూడా అంటారు.

★ తామరను ఎక్కువకాలం నిర్లక్ష్యం చేస్తే, మచ్చలున్న ప్రాంతం ఎండి గట్టిపడి నొప్పి చేస్తుంది. మచ్చలు నొప్పితో వుండి నల్లని రంగులో వుంటాయి. ఆ తరువాత వీటి నుండి తెల్లని నూగు వంటి పదార్థం వచ్చి ఆ ప్రాంతాల్లో అసహ్యంగా కనిపిస్తాయి.

★ దురదతో గోకడంవల్ల తామర వున్నచోట బాక్టీరియా చేరవచ్చు.

**చికిత్స :**

తామరకు చికిత్స చేసేముందు అది ఏ ఏ ప్రాంతాల్లో వున్నదో తెలుసుకొని చికిత్స చేయాలి. శరీరంలో ఒకచోట లేదా రెండు చోట్ల వుంటే ఈ క్రింది మందులను వాడవచ్చు.

1. క్లోట్రైమ్ జోల్ అనే మందు కలిసిన ఈ మందులు వాడవచ్చు.

★ కాండిడ్ - క్రీం/లోషన్/పౌడర్

★ ఇమిడిల్ - పౌడర్/క్రీం/సొల్యూషన్

★ సర్‌ఫాజ్ - క్రీం/పౌడర్/సొల్యూషన్

★ స్టాటమ్ - క్రీం/లోషన్

2. ఎకొనజోల్ కలిసిన ఈ క్రింది దానిని వాడవచ్చు.

★ ఎకోడెర్మ్ - క్రీం

వీటిలో ఏదైనా సరే పైపూతకు ఆరువారాలపాటు వాడితే తామర పూర్తిగా తగ్గుతుంది.

తామర ఒక ప్రాంతంలో కాకుండా అనేక ప్రాంతాల్లో వ్యాపించి వుంటే నోటిలోనికి కూడా మందు వాడాల్సి వుంది. అది గ్రిసోఫిల్విన్ అనే మంధు కలిసిన

★ గ్రిసోవిన్ - 250 మి.గ్రా/600 మి.గ్రా టాబ్లెట్స్

★ ఇడిఫల్విన్ - 125 మి.గ్రా/250 మి.గ్రా టాబ్లెట్స్

వీటిలో ఏదైనా సరే ఆరు నుండి ఎనిమిది వారాలపాటు వాడాలి. దీనితోపాటుగా పైపూతకు కూడా మందులు వాడాలి.

ఒక్కొక్కసారి తామర వ్యాధిలో వచ్చే దురదవల్ల తామర ఉన్న ప్రాంతాన్ని బాగా గోకడంవల్ల ఆ ప్రాంతం పుండుపడి బాక్టీరియా ఇన్‌ఫెక్షన్‌కు గురి అవుతుంది. దీన్ని నివారించడానికి యాంటి బయాటిక్స్ కూడా వాడాల్సి వుంటుంది.

తామరలో వచ్చే దురదను తగ్గించడం కోసం 'ఎవిల్' టాబ్లెట్స్‌గాని, సిట్రిజన్ టాబ్లెట్స్ గాని వాడవచ్చు.

తామరకు మందులు పూర్తికాలం వాడాలి. తామర తగ్గినట్లుగా అనిపించినా మరలా తిరగబెట్టవచ్చు. చివరకు మందు పనిచేయని స్థితికి కూడా రావచ్చు. తామరమందు ఏ రూపంలో వాడినా అంటే క్రీం రూపంలో గాని, పౌడర్ రూపంలోగాని, సొల్యూషన్ గాని - ఎలా వాడినా మళ్ళీ చర్మం మామూలు స్థితికి రావడానికి కనీసం నెలరోజులు పడుతుంది. బాగా ముదిరిన కేసులో చాలాకాలం వాడాల్సి వుంటుంది. అంతేగాక తామర వచ్చిచన ప్రదేశాన్ని బట్టి కూడా మందులు వాడే సమయం ఆధారపడి వుంటుంది. ఉదాహరణకు : కాలిచర్మంపైన తామర వ్యాధి వస్తే మూడు నెలలు, కాలిగోళ్ళకు పన్నెండు నుండి రెండు సంవత్సరాలు (24 నెలలు) చేతివేలి గోళ్ళు తామరకు గురి అయితే ఆరునెలలు, తల, చర్మంపైన వస్తే ఆరు నుండి ఎనిమిది వారాలు మిగిలిన శరీరంపైన వస్తే నాలుగు వారాలు మందులు వాడాలి.

## శోభి (టీనియావెర్సికోలర్)

శోభి తామరకు దగ్గరిబంధువు. శోబి - తామర వంటి అనేక రకాలైన వ్యాధుల్ని 'డెర్మటోఫైటోసిస్' వ్యాధులని అంటారు. చాలామంది శోభిని 'ధనలక్ష్మి' అని, తామరను అదృష్టలక్ష్మిగాను భావిస్తారు. ఈ విధంగా వారు వళ్ళంతా వ్యాధి పాకిపోయే దాకా వుంచుకుంటారు. చివరకు వళ్ళంతా దురద, పుళ్ళు, చీము చేరి ఇబ్బందులకు గురవుతారు.

**లక్షణాలు :**

★ శోభి శరీరంపై ఎక్కడైనా రావచ్చు. ముఖ్యంగా మెడ, ముఖంపైన, ఛాతీపైన, వీపుపైన ఎక్కువగాను మెడవెనుక భాగంలో, మోచేతులు ప్రాంతాలలో అరుదుగా వస్తుంది.

★ శోభిమచ్చలు శరీరంపైన తెల్లగాగాని, లేత గోధుమరంగులోగాని, పసుపురంగులోగాని, లేక బచ్చలిపండు రంగులోనూ, లేత ఆకుపచ్చ రంగులోగాని చిన్న చిన్న మచ్చలుగా కనిపిస్తాయి.

★ శోభి శరీరంపై పొడవలె కొంతవరకు మాత్రమే రావచ్చు లేదా విస్తృతంగా చాలా చోట్ల రావచ్చు.

★ శోభి మచ్చలు క్రమ పద్ధతిలో వుండవు. ఒక సైజులోనూ వుండవు. ఇవి కాస్తంత ఎండ తగిలితే గోధుమరంగులోనికి మారతాయి.





★ శోభి మచ్చలవల్ల అంత ఇబ్బంది ఏమీ వుండదు. కానీ చెమట ఎక్కువగా పడుతున్నప్పుడు మాత్రం ఇవి మంటను, దురదను కలిగిస్తాయి. అంతేగాక ఈ పరిస్థితులలో ఇవి పొట్టులాగా రాల్చుతూ వుంటాయి. అందుకనే వీటినిన 'పిటీరియాసిస్ ఫర్ ఫరేషియస్' అని కూడా పిలుస్తారు.

★ కడుపులో పాములు (worms) వుండడం వల్ల కూడా శోభి మచ్చల వంటివి కనిపిస్తాయి. చూడడానికి ఇవి శోభి మచ్చలవలె వున్నా ఎండలో గోధుమరంగుకు మారవు. దీనివల్ల ఇవి శోభిమచ్చలుకావు అని తెలుసుకోవచ్చు.

**వ్యాధి నిర్ధారణ :**

శోభిమచ్చలు అవునా కాదా అని తెలుసుకోవాలంటే ఆ మచ్చల్ని ఎండలోపెడితే గోధుమరంగుకు మారితే శోభిమచ్చలని, లేకపోతే కాదని తెలుసుకోవచ్చు లేదా మచ్చలపైన ఐదు శాతం టించర్ అయోడిన్ పూస్తే అవి బాగా ప్రస్ఫుటంగా కనిపిస్తే శోభి మచ్చలని భావించవచ్చు.

**చికిత్స :**

★ శోభి మచ్చలకు ము[illegible]మైనమందు 'సోడియం థయోసల్ఫేట్' (Sodium Thiosulphate) లేక [illegible]పో (Hypo). ఇది ఫొటో డెవలప్ చేసే వారి వద్ద వుంటుంది. వారు ఉపయోగించే హైపోను తీసుకుని 20 శాతం ద్రావణాన్ని తయారు చేసుకుని ప్రతిరోజూ రాత్రిపూట పూయాలి. ఈ విధంగా చేయడంవల్ల కొద్ది రోజుల్లో శోభి మచ్చలు తగ్గిపోయి చర్మం మామూలు రంగులోనికి మారుతుంది. ఈ మందును ఒకటి, రెండు నెలలపైగా పూయాల్సి వుంటుంది.

★ మైకోనజోల్ అనే మందును గాని, ఎకొనజోల్ అనే మందును గాని, క్లోట్రిమజోల్ అనే మందుగాని, కీటోకోనజోల్ అనే మందుగాని వాడవచ్చు. వీటిలో చివరిదైన కీటోకోనజోల్ తక్క మిగిలినవి 'క్రీం' రూపంలోనూ అయింట్‌మెంట్ రూపంలోనూ వుంటాయి. క్లోట్రిమజోల్ ఒక శాతం, మిగిలినవి 2 శాతంలోనూ వుంటాయి. కీటోకోనజోల్ 200 మి.గ్రా. మోతాదులో కాప్సుల్స్ రూపంలో వుంటాయి.

★ కీటోకోన్‌జోల్ కాప్సుల్స్ రోజుకు ఒకటి చొప్పున వారం రోజులపాటు వాడాలి. ఫలితం కనబడుతున్నా పూర్తిగా తగ్గకపోతే నాలుగు వారాలు వాడాల్సి వుంటుంది.

★ 'క్రీం'ను రోజుకు రెండుసార్లు శోభి వున్న ప్రదేశంలో పూయాలి. ఈ విధంగా కనీసం నెలరోజులపాటు వ్రాయాలి.

## సోరియాసిస్

ఈ వ్యాధిలో చర్మంపొరలు పొరలుగా వుంటుంది. దురదలు పెడుతుంది. అత్యంత భయంకరమైన చర్మవ్యాధిగా దీన్ని భావిస్తున్నారు. చర్మవ్యాధులతో బాధపడేవారితో ప్రతి వంద మందిలో కనీసం పదిమందికి ఈ వ్యాధి వున్నది. అంతేగాక ఈ వ్యాధి దీర్ఘకాలంపాటు వచ్చి తగ్గుతూ మళ్ళీ వస్తూ వుంటుంది.

**లక్షణాలు :**

★ సోరియాసిస్ శీతాకాలంలో ఎక్కువగానూ, వేసవికాలంలో తక్కువగానూ కనబడుతుంది.

★ సోరియాసిస్ తలవెంట్రుకలలో వస్తే దానిని చుండ్రుగా భావించి అశ్రద్ధచేసే ప్రమాదం వుంది.

★ సోరియాసిస్ శరీరంలో రెండు వైపులా అంటే కుడి, ఎడమ వైపు ఒకేసారి వస్తుంది.

★ చర్మం కాలీఫ్లవర్ పువ్వులాగా బుడిపెలు, బుడిపెలుగా విచ్చుకొనిపోయి, నీలం, ఎరుపు కలగలసిన ఒక విధమైన పింక్ లేదా చేప పొలుసులుగా (silvery - white scales) మెరుస్తూ మచ్చలు ఏర్పడతాయి.

★ చిన్న చిన్న తెల్లని మచ్చలతో ప్రారంభమైన ఈ వ్యాధి చివరకు రూపాయి నాణెం అంత పెద్దవిగా మారతాయి.

★ కొందరిలో కేవలం తలపైన మాత్రమే సోరియాసిస్ వ్యాధి వస్తుంది. వీరిలో వంటిపైన ఎలాంటి లక్షణము కనిపించదు. ఈ రకమైన స్థితిని 'సోరియాటిక్ స్కాల్ప్' అంటారు. అయితే శరీరంలో ఏ ప్రాంతంలో వ్యాధి వచ్చినా చివరకు తలలోనికి వ్యాధి పాకవచ్చు.

★ సోరియాసిస్ వ్యాధి మోచేతికి వెనుక, మోకాలు వెనుక, ఛాతీవెనుక వీపుపైనా, అరచేతులలోనూ, మోకాలికి ముందు భాగంలోనూ, కాళ్ళపైన రావచ్చు.

★ సోరియాసిస్ వచ్చిన ప్రాంతంలో చేతితో తాకితే గరుకుగా వుంటుంది. చేప పొలుసుల మాదిరిగా ఆ ప్రాంతాలు వుంటాయి.

★ దురద వున్నా లేకపోయినా సోరియాసిస్ వచ్చిన ప్రాంతంలో గీరితే వెండి రంగు పొలుసులు జలజల రాలడం గమనించవచ్చు.

★ సోరియాసిస్ పొలుసులు రాల్చిన ప్రాంతంలో తడితడిగా వుండి మచ్చలు మెరుస్తూ కనబడతాయి. తలలో సోరియాసిస్ వస్తే దాన్ని చుండ్రుగా భావించే ప్రమాదం వుంది. అయితే చుండ్రులో పొలుసులు చిన్నవిగా వుంటే సోరియాసిస్‌లో పొలుసులు పెద్దవిగా వుంటాయి. పైగా పొలుసులు లేని ప్రదేశంలో చేతితో తలపైన తడిమితే చిన్న చిన్న పొక్కులు కూడా తగులుతాయి.





★ దువ్వెనతో తలలో దువ్వితే పొట్టుతో పాటుగా రక్తపు చారలు కూడా కనబడితే అది సోరియాసిస్ కావచ్చు.

★ సోరియాసిస్ వ్యాధి శరీరంలో కొద్ది కాలంపాటు పూర్తిగా తగ్గినట్లుగా కనబడకుండా పోతుంది. తర్వాత అకస్మాత్తుగా ప్రారంభమై ఎక్కువగా వుంటుంది. ఈ విధంగా వస్తూపోతూ వుంటే దాన్ని సోరియాసిస్‌గా భావించాలి.

★ పిల్లలో ఈ వ్యాధివస్తే వారిలో తలపైన, ముఖంపైన, ఛాతీపైన, కాళ్ళకు, చేతులకు కనబడుతుంది.

★ పిల్లలో సోరియాసిస్ పొక్కులు అమ్మవారు సోకినప్పుడు వచ్చే పొక్కులవలె వుంటాయి. కానీ ఇవి ఎంతకాలం గడిచినా తగ్గకుండా వుంటాయి.

★ చిన్నపిల్లల్లో సోరియాసిస్ వ్యాధి పెద్ద వారిలో లాగా ఎండిన పొలుసుల వలె ఉండక నీరు పట్టి వాచి బాధపెడతాయి.

★ సోరియాసిస్ వ్యాధి వచ్చిన వారిలో కొందరికి కీళ్ళవాతం కూడా రావచ్చు. మరికొందరిలో గోళ్ళపైన గుంటలు పడి, గోళ్ళు మందంగా, పసుపు రంగులోనికి వచ్చి వుంటాయి.

★ సోరియాసిస్ వ్యాధిలోని మచ్చలపై కొందరిలో పగుళ్ళు కనబడితే మరికొందరిలో గాయాలు కూడా వుండవచ్చు.

**సోరియాసిస్ వ్యాధి రావడానికి కారణం :**

సోరియాసిస్ వ్యాధిలో ప్రధానమైన కారణం మన చర్మంలోని కణాల మధ్య సమన్వయం లోపించడం అని చెప్పవచ్చు. అంటే - మన చర్మంలో బాహ్యచర్మం, అంతర చర్మం అని రెండు పొరలు వుంటాయి. బాహ్యచర్మంలో చనిపోయిన చర్మకణాలు వుంటాయి. ఇవి నిరంతరం శరీరం నుండి రాలిపడిపోతూ వుంటాయి. మరలా బాహ్యచర్మంలోనికి అంతర్ చర్మం నుండి కొత్తకణాలు పుట్టుకొని వస్తూంటాయి. ఈ ప్రక్రియ నిరంతరం జరుగుతూనే వుంటుంది. ఒక మృతకణం స్థానంలోనికి నెలరోజులలోపు క్రొత్తకణం చేరుతుంది. అయితే సోరియాసిస్ వ్యాధిలో బాహ్యచర్మకణాలు రాలిపడిపోయేదానికీ అంతర్ చర్మంలో కొత్తకతణాల ఉత్పత్తికీ మధ్య ఉండే నియంత్రణ విధానం దెబ్బతింటుంది.

లోపలి పొరల్లో అధిక సంఖ్యలో ఏర్పడిన కణాలు కేవలం మూడు లేక నాలుగు రోజుల్లోనే బాహ్య చర్మంలోనికి చేరతాయి. కానీ అదే నిష్పత్తిలో బాహ్య చర్మపు పొరలోని కణాలు రాలిపడిపోవు అవి అలాగే బాహ్య చర్మాన్ని అంటిపెట్టుకొని వుంటాయి. ఇవి ఈ విధంగా పొలుసులు పొలుసులుగా మారతాయి. ఈ లోపల బాహ్య చర్మంలోని రక్తకణాలు వ్యాకోచించి చర్మపు మచ్చలను ఎర్రబరుస్తాయి. చర్మపు కేన్సర్‌లోనూ కణాల అసాధారణ పెరుగుదల వుంటుంది

గానీ అదే చర్మంలోని ప్రాథమిక కణజాలం మాత్రం సాధారణంగానే వుంటుంది. సోరియాసిస్‌లో కణాల పెరుగుదల సాధారణ పరిమితులలోనే ఉంటుంది.

సోరియాసిస్‌లో వ్యాధి కొన్ని సందర్భాలలో పూర్తిగా కనుమరుగైపోతుంది. మరలా కనబడుతూ వుంటుంది. కేన్సర్‌లో అయితే కణాల అసాధారణ పెరుగుదల నిరంతరం వుంటుంది.

శాస్త్రీయ పరిశోధనల వలన సోరియాసిస్ వ్యాధి వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుందని, తల్లిదండ్రుల్లో ఒకరికి ఈ వ్యాధి వుంటే వారికి పుట్టిన పిల్లలో ఐదు శాతం వరకు సోరియాసిస్ వచ్చే అవకాశం వుందని, అదే తల్లిదండ్రులు ఇద్దరికీ వ్యాధి వుంటే వారికి పుట్టిన పిల్లలకు 40 శాతం వరకూ సోరియాసిస్ వచ్చేందుకు వీలుంది. అంతేగాని ఈ వ్యాధి అంటు వ్యాధి మాత్రం కాదు. చేతితో ఒకరిని తాకడం వల్ల వచ్చేది కాదు.

మానసిక ప్రశాంతతలేని రోగులకు సోరియాసిస్ వ్యాధి వచ్చే అవకాశం ఎక్కువగా వుంటుంది. అయితే సోరియాసిస్ వ్యాధి వ్యాప్తిని కొంతవరకు అరికట్టే వీలుంది. అదేమిటంటే -

★ సోరియాసిస్ ప్రారంభదశలో వున్నవారెవరైనా సరే వ్యాధి పూర్తిగా వున్నవారైనాసరే చిన్న గాయాలు కాకుండాను, ఒరిపిడికి ఆ ప్రాంతం గురికాకుండా చూసుకోవాలి.

★ మానసిక వత్తిడి తగ్గించుకుంటే సోరియాసిస్ తగ్గుముఖం పడుతుంది.

★ పొలుసులను గిరిపారేస్తుంటే వ్యాధి మరింత పెరుగుతుంది.

★ సోరియాసిస్ వచ్చిన వారు మధ్యపానం చేస్తే వ్యాధి పెరుగుతుంది.

★ ఎయిడ్స్ వ్యాధి సోరియాసిస్‌కు తోడైతే కష్టం. కాబట్టి HIV సోకకుండా చూసుకోవాలి.

★ సోరియాసిస్ వ్యాధి వున్నవారి గొంతులో పుండు వుంటే దానికి చికిత్స తీసుకోవాలి. లేకపోతే రోగనిరోధక శక్తి తగ్గి వ్యాధి పెరగడానికి దోహదపడుతుంది.

★ స్టిరాయిడ్‌లను మాత్రల రూపంలోగాని, ఇంజక్షన్‌ల రూపంలోగాని అధికంగా (దీర్ఘకాలంగా) తీసుకున్నా లేక తీసుకుంటున్న స్టెరాయిడ్‌లను హఠాత్తుగా మానేసినా సోరియాసిస్ పెరుగుతుంది.

★ లిథియం వంటి మానసిక జబ్బులకు ఉపయోగించే మందులవల్ల, అధిక రక్తపోటుకు వినియోగించే బీటా బ్లాకర్స్ వల్ల కూడా సోరియాసిస్ అధికం అవుతుంది.

★ కొన్ని సందర్భాలలో ఇరిటేషన్ కలిగించే క్రిములు, లోషన్‌లు కూడా సోరియాసిస్ వ్యాధి రావడానికి కారణం కావచ్చు.

★ సోరియాసిస్ వ్యాధి ఒకసారి వస్తే మందు వాడితే అది తగ్గింది అనుకోవడానికి వీలు లేదు. బి.పి., షుగర్ వంటి వ్యాధులలాగా ఇది కూడా జీవితాంతం ఉంటుంది. అయితే వ్యాధి ఎప్పుడూ ఎక్కువగా వుండాలని లేదు. కొన్ని సంవత్సరాలపాటు కనబడకపోవచ్చు కానీ ఎప్పుడో బయటపడవచ్చు.





★ సోరియాసిస్ వ్యాధి సాధారణంగా ముఖంపైన వుండదు. కాబట్టి - ఇది తగ్గదేమో అనే భయంతో వ్యాధిని మరింత పెంచుకునే బదులు ధైర్యంగా వ్యాధి తగ్గించుకోవడానికి ప్రయత్నించడం మంచిది. ఒక వేళ ముఖంపైన కొద్దిగా వ్యాధికనబడితే దానిని మందుల్ని వాడి అదుపు చేయవచ్చు.

★ సోరియాసిస్ చికిత్సలో వ్యాధి తగ్గిపోయి మచ్చలు కూడా తగ్గిపోతాయి. కానీ మరలా వ్యాధి ఎప్పుడు వస్తుందో, ఎంత ఉధృతంగా వస్తుందో చెప్పలేము.

★ సోరియాసిస్ వ్యాధి పిల్లల పెరుగుదలపైన, పెద్దల దైనందిన జీవితంలోనూ ఎలాంటి దుష్ప్రభావాన్ని చూపదు. ఇది స్త్రీ, పురుషుల వైవాహిక జీవితాన్ని కూడా ప్రభావితం చేసే వ్యాధి కాదు. భార్యాభర్తలు వ్యాధి గురించి అర్థం చేసుకుని జీవిస్తే ఎలాంటి ఇబ్బంది వుండదు. గర్భధారణపైన, గర్భస్థ శిశువుపైన ఇది ఎలాంటి ప్రభావం చూపే వ్యాధి కాదు.

★ సోరియాసిస్‌లో అనేక రకాలైన వ్యాధులు వున్నాయి. వ్యాధి వచ్చిన ప్రదేశాన్ని బట్టి దానికి ఆయా పేర్లు పెట్టారు.

★ కొందరి శరీరం అంతటాగాని లేక కొన్ని ప్రాంతాలలోగాని చీముతో కూడిన మచ్చలు కనబడతాయి. ఈ రకమైన వ్యాధిని 'ప్యుస్టులార్ సోరియాసిస్' అంటారు.

★ కొందరికి కాలివేళ్ళ కణుపులు, చేతివేళ్ళ కణుపులు మోకాలు కీళ్ళు, మోచేతి కీల్ళు వాచి, నొప్పి పెడుతూ వుంటాయి. ఈ రకమైన సోరియాసిస్ వ్యాధిని, ఆర్థరైటిక్ సోరియాసిస్ అంటారు.

★ సోరియాసిస్ రోగుల్లో కొందరికి మొత్తం శరీరం అంతా ఎర్రగా పొలుసులతో వుంటుంది. దీనిని ఎరిత్రోడెర్మిక్ సోరియాసిస్ అంటారు.

★ కొందరు పిల్లలకు స్ట్రెప్టోకోకై అనే బాక్టీరియావల్ల గొంతులో పుండు పడుతుంది. ఈ స్థితిలో వారిలో సోరియాసిస్ వచ్చే అవకాశం వుంది. ఏది ఏమైనా చికిత్స వెంటనే ప్రారంభించాలి. ఒకవేళ వ్యాధి ముదిరిపోయినా దానివల్ల వచ్చే దుష్ఫలితాల్ని నివారించేందుకు వెంటనే చికిత్స చే... చడం అవసరం.

## చికిత్స :

సోరియాసిస్ చికిత్స అంతసులభమైనది కాదు. చాలా తీవ్రమైన మొండి వ్యాధి ఇది. ఏ మందులు వాడినా డాక్టరు పర్యవేక్షణలో వాడాలి. ఒకవేళ డాక్టరుకు తెలియకుండా మందులు వాడినా ఎక్కువ కాలం మందులు వాడరాదు.

★ సోరియాసిస్‌కు 'సోరలిన్' దానితోపాటుగా అల్ట్రావయొలెట్ కిరణాలు (పియూవిఏ) చికిత్సగా వాడుతున్నారు. ఇంకా సైక్లోస్పోరిన్స్ కూడా వాడుతున్నారు. అయితే ఇవి వ్యాధిని పూర్తిగా నిర్మూలించలేవు.

★ సోరియాసిస్ వ్యాధి వున్నచోట 'క్లొబెటాల్' లేక 'ప్రాగ్మటార్' ఆయింట్‌మెంట్‌ను రెండుపూటలా పూయాలి. దీనితోపాటుగా బి-కాంప్లెక్స్, విటమిన్ - ఎ టాబ్లెట్స్ కూడా వాడాలి.

★ చర్మం మృదువుగా వుండేందుకు 'వేజిలైన్'గాని కొబ్బరినూనెను గాని ఉపయోగించవచ్చు.

★ 'మెథోట్రిక్సేట్' అనే మందును సోరియాసిస్ చికిత్సలో ఎక్కువగా వాడుతున్నారు. ఇది గర్భిణీ స్త్రీలపైన దుష్ప్రభావాన్ని కలిగిస్తుంది. దీనివల్ల రక్తకణాలు, కాలేయం పనితీరు దెబ్బతినవచ్చు. కాబట్టి చికిత్స సమయంలో అప్పుడప్పుడు రక్త పరీక్షలు జరిపించవలెను.

★ మెథోట్రిక్సేట్ వాడే దంపతులు పిల్లల్ని కనకుండా వుంటే మంచిది. కనీసం మూడు నెలలపాటు మందు వాడడం ఆపిన తరువాత మాత్రమే గర్భం ధరిస్తే తల్లికి, బిడ్డకూ క్షేమం.

★ పిల్లలోనూ, పెద్దలలోనూ ముఖంపైన, చంకలు, గజ్జల్లో, వెంట్రుకలు గల ప్రాంతాల్లో అధిక శక్తివంతమైన 'స్టిరాయిడ్స్' ముందుగా వాడరాదు. అదే విధంగా అధిక శక్తివంతమైన లోషన్స్ కూడా వాడరాదు.

★ 'కోల్‌తార్' లేక 'డిత్రనాల్' వంటి పైపూత మందులు వాడవచ్చు. కానీ ఇవి వాడే సమయాల్లో చర్మం ప్రకోపానికి (Irritation) గురికాకుండా తగిన చర్యలు తీసుకోవాలి.

★ సోరియాసిస్‌లో వాడే 'సైక్లోస్పోరిన్స్' వల్ల రక్తపోటు పెరగవచ్చు. మూత్రపిండాలపై ఇది ప్రభావం చూపుతుంది.

★ చర్మంపైన మచ్చలు కనబడిన వెంటనే ఏదో ఒక ఆయింట్‌మెంట్ వాడితే ఆ మచ్చలు మరింత పెరిగే ప్రమాదం ఉంది. కాబట్టి వీలైనంత త్వరగా డాక్టరు వద్దకు వెళ్ళి మందులు వాడితే మంచిది.

★ 'పియూవిట్' చికిత్సలో కొంత ఉపయోగం వుంది. 'రెటినాయిడ్స్' కూడా వాడవచ్చు కానీ ఈ రెండూ మనదేశంలో చాలా తక్కువగా ఉపయోగిస్తున్నారు.

★ సోరియాసిస్ వచ్చిన రోగులు నోటిద్వారాగాని, లేక ఇంజక్షన్స్ ద్వారాగాని వాడే స్టెరాయిడ్ మందుల్ని వాడరాదు.

సోరియాసిస్ వ్యాధి వచ్చిన వారు దాని గురించి ఆలోచించకుండా వ్యాధి అదుపులో ఉండేందుకు పాటించాల్సినవి పాటిస్తూ ఉంటే వ్యాధి అదుపులో వుండి జీవితాంతం హాయిగా వుండగలరు.

## ఎగ్జిమా (Eczema)

ఎగ్జిమా వ్యాధి కూడా సోరియాసిస్ మాదిరిగా అనిపిస్తుంది. అయితే ఇది పూర్తిగా అదుపులో వుంటుంది. చిన్న చిన్న పొక్కులతో ఇది మొదలవుతుంది. పొక్కులు గుంపులు గుంపులుగా వుండి చేతికి రసికారుతూ వుంటాయి. పైగా దురద, నొప్పి కూడా వస్తాయి. దానితోపాటు రోగికి జ్వరం కూడా రావచ్చు. చర్మం ఉబ్బి ఎర్రబడి దురద పుడుతుంది. నీరు పట్టి ఆ ప్రాంతం నుండి రసి కారుతుంది.





ఎక్జిమా వ్యాధిలో అనేక రకాలు వున్నాయి. వ్యాధిలో కనిపించే మచ్చల్ని బట్టి, వాటి ఆకారాన్ని బట్టి, వాటిలో కలిగే లక్షణాల్ని బట్టి ఎగ్జిమా వ్యాధిని అనేక రకాలుగా పిలుస్తారు. అవి

★ వెరికోస్ ఎగ్జిమా

★ సెబోరిక్ ఎగ్జిమా

★ మైక్రోబియల్ ఎగ్జిమా

★ నమ్ములర్ ఎగ్జిమా

★ వీపింగ్ ఎగ్జిమా

★ కాంటాక్ట్ ఎగ్జిమా

★ ఇన్‌ఫాంటైల్ ఎగ్జిమా

ఇలాంటివన్నీ ఒకొక్కటి ఒక్కో రకమైన ప్రత్యేక లక్షణాలతో కూడి వుంటాయి. ఎగ్జిమా ఏదైనా సరే దానిని గుర్తించిన తరువాత చికిత్సమాత్రం ఒకే విధంగా వుంటుంది.

### ఎగ్జిమా లక్షణాలు :

★ ఎగ్జిమాలో మొదటగా ఎలర్జీ వస్తుంది. అయితే ఎలర్జీ వున్నంత ఎగ్జిమా అనుకోరాదు. ఇంకా ఇతర లక్షణాల్ని కూడా గమనించి నిర్ధారించాలి.

★ పెద్దవారిలో సర్వసాధారణంగా ఎగ్జిమా - మోకాలి వెనుక భాగంలోనూ, మోచేతిలోపల కనిపిస్తుంది. ఇది సర్వసాధారణంగా పొడిగా వుండవచ్చు.

★ చిన్నపిల్లల్లో బుగ్గలపైన, చేతులపైన ఎర్రటి దద్దుర్లు వచ్చి ఆ దద్దుర్లపైన చిన్న చిన్న పొక్కులుగాని, కురుపులుగాని వచ్చి, అవి చితికి రసికారుతుంది.

★ ఎగ్జిమా ఒకసారి వచ్చిన తర్వాత అంతకు మునుపు మనం ఎప్పుడూ వాడే ఆహారపదార్థాలు, వస్తువులు అప్పుడుమనకు సరిపడకపోవచ్చు.

★ ఎగ్జిమా వెంటనే బయటబడక ముందుగా ఎలర్జీ లక్షణాలు కనబడినా ఆ తరువాత కొంత కాలానికి ఎగ్జిమా రావచ్చు.

### చికిత్స :

★ చాలా కేసులలో ఎగ్జిమా దానంతట అదే తగ్గుతుంది. దీనికి కారణం ఎగ్జిమా 'వైరస్' వల్ల వచ్చి వుండడమే.

★ ఎక్జిమా ఎక్కువగా వుండి రసికారుతూ వుండి, చీము పట్టినట్లుఆ వుంటే 'పొటాషియం పర్మాంగనేట్' ద్రావణంతో శుభ్రంగా కడగాలి. లేదా సెలైన్ వాటర్‌తో అయినా, హైడ్రోజన్ పెరాక్సైడ్‌తోనయినా శుభ్రపరిచి ఆ తరువాత యాంటి బయోటిక్స్ వాడాలి.

★ చర్మం పొడిగా వున్న వారిలో ఎలర్జీ తరచు వస్తూ వుంటుంది. అందుకని వీరు చర్మం ఎండిపోకుండా వుండేందుకు 'మాయిశ్చరైజ్' క్రీం రాస్తూ వుండాలి.

★ అంతేగాక ఎక్జిమాను పొడిగా వుంచడానికి 'కాలాడ్రిల్' లోషన్ వ్రాయాలి. లినసీడ్ ఆయిల్ కూడా వ్రాయవచ్చు.

★ ఎగ్జిమాలో దురద, దద్దుర్లు ఉంటే 'ఎవిల్ - 25 మి.గ్రా/50 మి.గ్రా టాబ్లెట్స్' రోజూ రెండు పూటలా వాడాలి.

★ ఎక్జిమా రావడానికి కొన్ని సందర్భాలలో మానసిక కారణం కూడా వుండవచ్చు. మానసిక కారణాల్ని తొలగిస్తే ఎక్జిమా తగ్గిపోయే అవకాశం వుంది.

★ అవసరాన్ని బట్టి హార్మోన్లలోపం వుంటే వాటిని ఇవ్వాలి.

★ 'ఎనబోలిక్ స్టిరాయిడ్స్' కూడా అవసరాన్ని బట్టి వాడాలి.

★ ఎక్జిమా దీర్ఘకాలం ఉంటే హైడ్రో కార్టిజోన్ ఆయింట్‌మెంట్ రోజు మూడు సార్లు వాడాలి. ఎక్జిమా మందులు అన్నీ ప్రత్యేక తరగతికి చెందినవి. వీటిని వాడాల్సి వచ్చినపుడు చర్మవ్యాధి నిపుణుల సలహా తప్పనిసరి.

★ ఎక్జిమాకు కొన్ని సందర్భాలలో సంవత్సరాల తరబడి చికిత్స చేయవలసిరావచ్చు. మరికొందరికి నాలుగు, ఐదు రోజుల్లోనే తగ్గవచ్చు.

## సరిపి (Herpes Zoster)

వక్షస్థలంపైనగాని, నడుంపైనగాని ముత్యాలు పేర్చినట్లుగా వడ్డాణంలాగా చుట్టుకుని పొక్కులు వచ్చే వ్యాధిని సరిపి అంటారు. జోస్టర్ అంటే గ్రీకు భాషలో వడ్డాణం అని అర్థం. అందుకే దీనిని వడ్డాణం సరిపి అని కూడా అంటారు.

సరిపి వైరస్‌వల్ల వచ్చే వ్యాధి 'వెరిసెల్లా జోస్టర్' అనే వైరస్ చర్మం ద్వారా ఆయా ప్రాంతాలలో వుండే నరాలకు చేరుతుంది. అక్కడకు చేరిన ఈ వ్యాధివల్ల చాలా బాధ కలుగుతుంది. చాలా రకాల చర్మవ్యాధులు చర్మంపైన మాత్రమే బాధను కలిగిస్తే ఇది చర్మంలోపలి నరాలను బాధిస్తుంది.

సరిపి రావడానికి వయసుతో నిమిత్తంలేదు. ఇది ఏ వయసువారికైనా, ఎవరికైనా రావచ్చు. అంతేగాక ఈ వ్యాధి సరిపికే పరిమితం కాకుండా ఆటలమ్మ వంటి ఇతర వైరస్ వ్యాధులు వచ్చేందుకు దోహదపడుతుంది. ఇంకా శారీరకంగా, మానసికంగా క్రుంగిపోయిన వారిలోనూ, లింఫోమా కార్సినోమా అనే వ్యాధి వున్నవారిలోనూ, షుగర్ వ్యాధి వున్నవారిలోనూ ఎక్కువగా వచ్చే అవకాశం ఉంది.





**లక్షణాలు :**

★ సరిపి వచ్చే ముందు ఆ ప్రాంతంలో తేలుకుట్టినట్లుగా నొప్పి పుడుతుంది. ఇది రాను రాను తీవ్రమవుతుంది.

★ సరిపి వచ్చే ప్రాంతంలో దురద కూడా వస్తుంది. దురద కదా అని గిరితే పుళ్ళు పడతాయి. అక్కడ నుండి అవి చీముపట్టి జ్వరం కూడా వచ్చే ప్రమాదం ఉంది.

★ సరిపి వచ్చే ప్రాంతంలో మూడు లేక నాలుగు రోజుల్లో శరీరం ఎర్రగా కందుతుంది. ఆ ప్రాంతంలోని నరాలపైనున్న చర్మమే కందుతుంది. అంతేగాక అక్కడ నీటి పొక్కులు (Vesicles) కూడా వస్తాయి. దానితో దురద పెడుతుంది.

★ సర్వసాధారణంగా సరిపి పొక్కులు ఛాతీపైన, చంకల క్రింద, వీపుపైన, నడుము చుట్టూ ఏర్పడి ముత్యాలు పేర్చినట్లుగా వుంటాయి.

★ కొన్ని సందర్భాలలో పొక్కులు ఎక్కడైతే వస్తాయో ఆ ప్రాంతంలో చర్మం అంతా స్పర్శజ్ఞానం లేనట్లుగా మొద్దుబారిపోతుంది.

★ సరిపి పొక్కులు చితికిపోయి వాటిలో వుండే నీరు అంతా ఎండిపోయినట్లుగా అయి అణగిపోతాయి. ఈ విధంగా ఎండిపోయిన పొక్కులు ఉన్న ప్రాంతం చారలు చారలుగా మచ్చలతో వుంటుంది. ఈ చారలు ఏర్పడిన ప్రాంతం అంతా నరాలు మండుతున్నట్లు అనిపిస్తుంది.

★ ఎడమవైపుకు లేక కుడివైపుకు వచ్చిన పొక్కులు అవతలవైపుకు దాటవు.

★ సరిపి కంటికి సంబంధించిన ఐదవ క్రేనియల్ నరంపైన వస్తే కంటిచూపు దెబ్బతింటుంది. చెవినరంపైన వస్తే చెముడు వస్తుంది. ఈ నరం దెబ్బతించే చెముడు శాశ్వతంగా రావచ్చు.

★ ముఖానికి చెందిన ఏడవ క్రేనియల్ నరంపైన సరిపి వస్తే ముఖం కండరాలు వ్రేలాడబడిపోయే ప్రమాదం వుంది.

★ సరిపి వ్యాధి శరీరంలో ఏ ప్రాంతంలో ఏ నరంపైన వుందో అది ఉన్నంతమేరా చాలా కాలం అంటే నెలల తరబడి, సంవత్సరాల తరబడి బాధ వుండవచ్చు. కొందరిలో కొద్దిరోజుల్లో తగ్గిపోవచ్చు.

★ సరిపి పొక్కుల్ని ఎట్టి పరిస్థితిలోనూ చితపరాదు. వాటంతట అవే చితికితే ఫరవాలేదు. వ్యాధిలో తగిన జాగ్రత్తలు తీసుకుంటే నరాలకు సంబంధించిన సమస్యలు రాకుండా వుంటాయి.

**చికిత్స :**

సరిపి వ్యాధి వైరస్ వలన వచ్చేది కాబట్టి ఇది సుమారు వారం లేక పదిరోజుల్లో తగ్గిపోతుంది. ఇది సరిపి వ్యాధి అని గుర్తించిన తరువాత చికిత్స వివిధ రకాలుగా వుంటుంది. ముందు వ్యాధి కారణమైన వైరస్‌ను చంపేందుకు మందుల్ని వాడాలి. సర్వసాధారణంగా సరిపిలో వివిధ కారణాలకు వివిధ రకాలయిన మందుల్ని ఈ క్రింది విధంగా వాడుతున్నారు.

1. వైరస్‌ను చంపేందుకు వాడాల్సిన మందులు.

★ హెర్పెరాక్స్ - 200 మి.గ్రా టాబ్లెట్స్

★ జోవిరాక్స్ - 200 మి.గ్రా టాబ్లెట్స్

వీటిలో 'ఎసైక్లోవిర్' అనే మందు వుంటుంది. వీటిని రోజుకు ఐదు సార్లు చొప్పున వారం లేక పది రోజులపాటు వాడాలి. అంటే రోజుకు సుమారు 800 మి.గ్రా నుండి ఒక గ్రాము వరకు మందు తీసుకోవాలి.

2. పై పూతకు వాడే మందులు

★ మెర్పెరాక్స్ - క్రీమ్

★ హెర్పాక్స్ - క్రీమ్

వీటిలో ఎసైక్లోవిర్ అనే మందు వుంటుంది.

★ రిడినాక్స్ ఆయింట్‌మెంట్ - దానిలో అయోడాక్సియురిడిన్ అనే మందు ఉంటుంది. వీటిలో ఏదైనా సరే రోజుకు మూడు సార్లు వ్రాయాలి. ఆయింట్‌మెంట్‌ను అణచిపెట్టి వ్రాయకూడదు.

3. నొప్పినివారణకు వాడే మందులు

★ బ్రూఫెన్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

★ మెఫ్టాల్ - 500 మి.గ్రా టాబ్లెట్స్

★ నిములిడ్ - టాబ్లెట్స్

పై వాటిల్లో ఏదైనా సరే రోజూ మూడుపూటలా ఒకటి చొప్పున వాడాలి.

4. సరిపి వున్న చోట గాయం చీము పట్టి వున్నప్పుడు

నియోస్పోరిన్ - అయింట్‌మెంట్

సోఫ్రామైసిన్ - అయింట్‌మెంట్

వీటిలో ఏదైనా సరే రోజుకు మూడుసార్లు వ్రాయాలి.

5. గాయం తగ్గిపోయాక కూడా వచ్చే నరాల నొప్పికి (Post herpetic neuralgia) కార్బమజెపైన్ కలిసిన

మెజెటాల్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

టెగ్రెటాల్ - 400 మి.గ్రా టాబ్లెట్స్

జెప్టాల్ - 400 మి.గ్రా టాబ్లెట్స్





6. సరిపి వున్న సందర్భంలో పుట్టే మంటలకు

కేలడ్రిల్ - లోషన్ గాని కేలమైన్ లోషన్ గాని లేక కేలమైన్ పౌడర్ గాని వ్రాయవచ్చు.

7. సరిపిలో వచ్చే దురద పోగొట్టడానికి ఎవిల్ - 25 మి.గ్రా లేక 50 మి.గ్రా టాబ్లెట్స్‌గాని సిట్రిన్ టాబ్లెట్స్‌గాని లేక ఇతర యాంటీ హిస్టమిన్‌లుగాని రోజుకు ఒకటి లేక రెండు టాబ్లెట్స్ గాని వాడవచ్చు.

## హెర్పిస్ సింప్లెక్స్

ఇది కూడా 'హెర్పిస్ జోస్టర్' (సరిపి) వంటి వైరస్‌వల్ల వచ్చే వ్యాధే ! ఇది రెండు రకాలుగా ఉంటుంది. అది - హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - 1, హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - 2.

**లక్షణాలు :**

★ హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ - 1 - వ్యాధి వస్తే వాళ్ళ పెదవులపైనా, ముక్కు రంధ్రాల దగ్గర, నోటి అంచుల వెంట' చిన్న చిన్న చెమట పొక్కులమాదిరిగా 'వెసికిల్స్' అనబడే నీటి పొక్కులు వస్తాయి. ఈ పొక్కువల్ల నోట్లో పుళ్లు ఏర్పడతాయి.

★ నోటిలో పుళ్ళు ఏర్పడడంతో తినడానికి ఇబ్బందిగా వుంటుంది. కనీసం మాట్లాడడం కూడా కష్టమే !

★ చాలామందిలో ఇది ఒకసారి వచ్చి తగ్గిపోవచ్చు. కానీ కొంతమందిలో ఇది తరచూ వస్తూపోతుంది. కొందరిలో పుళ్లు ఏర్పడడమే కాక - వాటికి చీము పట్టి బ్యాక్టీరియా కూడా చేరే ప్రమాదం వుంది.

★ హెర్పిస్ సింప్లెక్స్ - 2 వైరస్ పెద్దవారికి మాత్రమే వచ్చేది. దీనిలో స్త్రీలు, పురుషులలో వారి మర్మావయవాల వద్ద చిన్న నీటి పొక్కులు ఏర్పడతాయి. అవి కొద్ది గంటలలోనే పగిలిపోయి పుండుపడుతుంది.

★ పురుషులలో ఈ వ్యాధి వారి పురుషాంగం పూర్వ చర్మంపైన, లోపల పురుషాంగం పైన కూడా వెసికిల్స్ రావడం, అవి పుళ్ళుగా మారడం జరుగుతుంది.

★ స్త్రీలలో హెర్పిస్ సింప్లెక్స్ - 2 వైరస్ వారి యోని పెదవులు, యోని మార్గం, గర్భాశయం కంఠభాగం పైన నీటి పొక్కుల్ని కలిగిస్తాయి. ఆ తరువాత ఇవి పుళ్ళుగా మారతాయి. స్త్రీలలో ఇవి బాగా నొప్పి చేస్తాయి.

★ స్త్రీ, పురుషుల కలయికవలన ఈ హెర్పిస్‌సింప్లెక్స్ - 2 వైరస్ వస్తుంది. అయితే హెర్పిస్ సింప్లెక్స్ - 1 వైరస్ మాత్రం కేవలం తాకినంతనే అంటే బాహ్య స్పర్శతోనే వస్తుంది.

**చికిత్స :**

★ హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి వైరస్ వల్ల వచ్చేది కాబట్టి దీనికి సరైన మందు లేదు. కావున వేరే ఏ ఇతర మందులు వాడినా పెద్దగా ఉపయోగం లేదు. అయినా వ్యాధి నుండి ఎలాంటి ఉపద్రవాలు కలగకుండా వుండేందుకు కొన్ని మందులు వాడవలసిరావచ్చు. అయినా ఈ వ్యాధి కూడా ఎలాంటి ఉపద్రవాల్ని కలిగించదు కూడా. అదే విధంగా ఈ వ్యాధి ఎన్నిసార్లు కనిపించినా ఇబ్బంది వుండదు.

★ హెర్పిస్ వ్యాధి ఎలాంటి హానీ కలిగించనప్పటికీ వ్యాధి వల్ల నోట్లో పుండ్లుపడి బాధగా వుంటే హెక్సిజిల్ ఆయింట్‌మెంట్ గాని లేక మ్యూకోపెయిన్ ఆయింట్‌మెంట్‌గాని పూయాలి. ఈ మందును నోట్లోకూడా పూయవచ్చు.

★ సింప్లెక్స్ వ్యాధి మర్మావయవాల వద్ద, మూతిపైన, ముక్కుపైన వస్తే దానికి 'ఎసైక్లోవిరాన్' అనే ఆయింట్‌మెంట్ రోజుకు నాలుగు సార్లు పూయాలి. వ్యాధి తీవ్రతను బట్టి లేక వ్యాధి తరచుగా వస్తున్నా కూడా 'ఎసైక్లోవిరాన్' టాబ్లెట్లు రోజుకు ఐదు చొప్పున షుమారు వారం లేక పదిరోజులపాటు వాడాలి.

★ హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధివల్ల బాక్టీరియల్ ఇన్‌ఫెక్షన్ కూడా సోకితే యాంటిబయాటిక్స్ వాడాలి.

★ కొంతమందికి హెర్పిస్ సింప్లెక్స్ - 2 వైరస్ వ్యాధి తరచు వస్తూ తగ్గుతూ, మరలా వస్తూ వుంటుంది. వీరు ఎసైక్లోవిర్ మందు కలిసిన హెర్పెరాక్స్ - 200 మి.గ్రా. లేక హెర్పెక్స్ - 200 మి.గ్రా లేదా జోవిరాక్స్ - 200 మి.గ్రా. టాబ్లెట్లు జీవితాంతం రోజుకు రెండు చొప్పున వాడుతూనే వుండాలి.

## పయోడెర్మా

ఈ వ్యాధి సర్వసాధారణంగా చిన్న పిల్లల్లో అధికంగా కనిపిస్తుంది. చర్మం క్రింది పొరలో చీము పట్టే వ్యాధిని పయోడెర్మా అంటారు. చీమును ఉత్పత్తి చేయగల అంటువ్యాధి కలిగించే క్రిముల కారణంగా చర్మం క్రింద చీము పడుతుంది. ఈ చీము పైకి కనబడుతుంది కూడా . కొన్ని సందర్భాలలో చీము పైకి కనబడకపోవచ్చు. చర్మవ్యాధులకు సంబంధించిన అంటు వ్యాధులలో ముఖ్యమైనది. ఇది వచ్చినప్పుడు సరైన చికిత్స తగిన సమయంలో తీసుకోకపోతే వ్యాధి తీవ్రంగా మారి శరీరంలోని అంతర్భాగాలలోనికి వ్యాపించవచ్చు.

పయోడెర్మావల్ల ఎన్నో తీవ్ర సమస్యలు రావచ్చు. వ్యాధికి తగిన చికిత్స తీసుకోకపోతే ఇది తరచుగా వస్తూ వుంటుంది.

మన శరీరంలో వుండే చనిపోయిన కణాలు ద్రవరూపం లోనికి మారి చీముగా బయటకు వస్తాయి. ఇలా బయటకు రావడానికి కారణం మన రక్తంలో ఉండే తెల్ల రక్తకణాలే ! ఈ





చీములో అధిక శాతం తెల్ల రక్తకణాలు వుంటాయి. ఇవి మన శరీరంలోని రోగకారక క్రిములతో పోరాడి వాటిని చంపి భక్షిస్తాయి. చీమును మైక్రో స్కోపులో పరీక్షిస్తే వ్యాధి కారక క్రిములు కనబడతాయి.

బ్యాక్టీరియా క్రిములు పయోడెర్మా వ్యాధి రావడానికి ముఖ్యకారణం. బాక్టీరియాలలో కూడా స్ట్రెప్టోకోకస్ పయోజెనస్ (Streptococcus Pyogenus), స్టెఫైలో కోకస్ ఆరియస్ (Staphylococcus aureus). అనే రెండు రకాలైన క్రిముల వల్ల ఈ వ్యాధి వస్తుంది. ఇవి విడివిడిగా గాని, కలిసి గాని వ్యాధిని కలిగిస్తాయి.

స్టెఫైలోకోకస్ ఆరియస్ బాక్టీరియా క్రిములు అందరిలోనూ, ఆసనం చుట్టూ, మూత్రనాళం చుట్టూ, ముక్కులో ఎల్లప్పుడూ వుంటాయి. వీటివల్ల అరవైశాతం మందిలో వ్యాధి వచ్చే అవకాశం వుంది.

స్ట్రెప్టోకోకస్ పయోజెనస్ బాక్టీరియా పదిశాతం మంది గొంతులో వుంటుంది. అయితే వీరందరికీ పయోడెర్మా వస్తుందని చెప్పలేము. ఇది కేవలం బాహ్యంగా తాకడం వల్ల వచ్చే వ్యాధి మాత్రమే.

సాధారణంగా పయోడెర్మా వ్యాధి బీదరికంతో బాధపడేవారికి - పోషకాహార లోపంతో వున్న వారికి, పిల్లలకు, ముసలివారికి వస్తుంది. అంతేగాక పయోడెర్మా వ్యాధి షుగర్ వ్యాధి గలవారికి, ఇతర అంటువ్యాధులతో బాధపడేవారికి తేలికగా అంటుతుంది. పైగా షుగర్ వ్యాధి వున్నవారిలో కార్బంకుల్స్ (carboncles) అనే చీముగడ్డలు ఏర్పడడానికి కూడా కారణమవుతుంది. ఈ వ్యాధి వేసవిలో ఎక్కువగానూ, చలికాలంలో తక్కువగానూ కనబడుతుంది.

చర్మ సంబంధమైన గజ్జి, సెగ [illegible]ష్టలు, చిడుము, ఫాలిక్యులైటిస్, డెర్మటైటిస్ వంటి జబ్బులు పయోడెర్మా వ్యాధి రావడానికి కార[illegible]ము. అంతేగాక తలలో ఉండే పేను కూడా పయోడెర్మా రావడానికి కారణం కావచ్చు.

**చికిత్స :**

పయోడెర్మా వ్యాధి వచ్చిన పిల్లల్లో వాపు, ఎర్రదనం, చీము, రసికారడం, జ్వరం, దురద వుంటాయి. పిల్లలకు 1 శాతం జెన్షియన్ వయొలెట్ పెయింట్‌ను పూయవచ్చు. పై పూతకు ఈ మందు పూసినా చికిత్సలో ఈ క్రింది మందులు వాడవచ్చు.

★ ఓరల్ పెన్సిలిన్ టాబ్లెట్ - 125 మి.గ్రా రోజుకు మూడు చొప్పున వారం రోజులు వాడాలి.

★ ఎరిత్రోమైసిన్ మాత్రలు 30 - 50 మి.గ్రా/కి.గ్రా బరువుకు రోజుకు నాలుగు చొప్పున వారం రోజులు వాడాలి.

★ ప్రొకైన్ పెన్సిలిన్ - 50,000 IU/కి.గ్రా. శరీర బరువుకు ఇంజక్షన్‌ను రోజుకు ఒకటి చొప్పున ఏడు రోజులు వాడాలి.

★ జ్వరం వస్తే పారాసిటమాల్ ఇవ్వాలి.

గమనిక : పెన్సిలిన్ ఇంజక్షన్ గాని టాబ్లెట్‌గాని వాడేటప్పుడు సెన్సిటివిటీ పరీక్ష తప్పనిసరిగా జరపాలి.

## చిడుము (Impetigo)

ఇది గూడా పయోడెర్మా వంటి వ్యాధి. సర్వసాధారణమైనది. ఇది వయసుతో నిమిత్తం లేకుండా అందరికీ వస్తుంది. అంతేగాక చిన్నపిల్లలలో ఈ వ్యాధి ఎక్కువగా బయటపడుతుంది.

**లక్షణాలు :**

★ చిడుము వ్యాధి బాహ్యచర్మంపైన పొరపై పొక్కులవలె ఏర్పడి చితికి తెల్లని ద్రవంలాగా కారుతుంది. పొక్కుల నుండి కారిన ద్రవం ఎడిపోయి గోధుమ లేదా పసుపు రంగులో పొరలు పొరలుగా ఏర్పడుతుంది.

★ చిడుము పొరలను చేతితో తొలగించి చూస్తే పచ్చిగా ఎర్రగా తొలగించిన ప్రాంతం ఉంటుంది. అంతేగాక తొలగించిన వెంటనే కొన్ని నిముషాలలోనే మరొక పొర ఏర్పడుతుంది.

★ చిడుము పొరను గాని పొక్కులనుండి కారిన రసిని గాని మైక్రోస్కోప్ క్రింద పరీక్షిస్తే అసంఖ్యాకమైన సూక్ష్మ క్రిములు కనబడతాయి.

★ చిడుము పొక్కుల నుండి కారిన రసి లేదా ద్రవం శరీరంలో వేరొక ప్రదేశంలో తగిలితే అక్కడ కూడా చిడుము బయటపడుతుంది.

★ చిడుము శరీరంలో ఏ ప్రాంతంలోనైనా సరే తల, ముఖం, కాళ్ళు, చేతులు, మెడ ఈ విధంగా ఎక్కడైనా రావచ్చు.

★ చిడుము అత్యంత వేగంగా వ్యాపించే చర్మవ్యాధి. ముఖ్యంగా చిడుము పొక్కుల్ని చిదపడం వల్ల ఇలా జరుగుతుంది.

★ చిడుము పొక్కులు దురదను కలిగిస్తాయి. దీనిని నిర్లక్ష్యం చేస్తే చర్మం లోతుల్లోనికి చొచ్చుకుపోతుంది.

★ పోషకాహారలోపంతో బాటు ప్రతి చిన్న విషయానికీ ప్రతిస్పందించే వ్యక్తులలో ఎక్కువగా కనిపిస్తుంది. కాస్మెటిక్స్, సబ్బులు, పౌడర్లు వంటివి పడకపోవడం వల్ల చిడుము వచ్చే ప్రమాదం వుంది.

★ వ్యక్తిగత పరిశుభ్రత, వున్నవారిలో ఈ వ్యాధి కనబడదు. ఒకవేళ వారికి వచ్చినా వెంటనే తగ్గిపోతుంది.

**చికిత్స :**

★ ఇది తేలికగా నయం అయ్యే జబ్బు. అయితే చికిత్స సకాలంలో మొదలుపెట్టాలి. అప్పుడే వ్యాధి త్వరగా తగ్గుతుంది. లేకపోతే ఇది అంత త్వరగా తగ్గేది కాదు. చిడుముతోపాటు వేరే ఇతర చర్మవ్యాధులున్నా ఇది తగ్గడం ఆలస్యమవుతుంది.





★ చిడుము వ్యాధిలో చికిత్స వ్యాధి తీవ్రతపైన ఆధారపడి వుంటుంది. దీనిపైనే మందులు ఎంతకాలం వాడాలి ? పై పూత మందులతో సరిపోతుందా ? లేక నోటిలోనికి కూడా మందులు వాడాలా ? అనేది తెలుస్తుంది.

★ వ్యాధి చికిత్సకు పైపూత మందులతోబాటుగా యాంటిబయోటిక్స్ కూడా వాడాలి. అయితే పైపూతకు వాడే యాంటిబయోటిక్స్ అంత సమర్థవంతంగా పనిచేయవు. యాంటీబయోటిక్స్ నోటి ద్వారా తీసుకోవడం మంచిది.

★ బాక్ట్రోబాన్ - క్రీమ్ గాని, ముపిరాక్స్ లేక టి-బాక్ట్ 2 శాతం క్రీమ్ గాని వాడితే మంచి ఫలితం కనబడుతుంది. వీటిని వాడడంవల్ల ఎలాంటి ఇబ్బందీ వుండదు. వీనిలో ఏదైనాసరే రోజుకు మూడు లేక నాలుగుసార్లు పూయాలి.

★ చిడుము తీవ్రంగా వుంటే యాంటి బయాటిక్స్‌ను నోటి ద్వారా ఇవ్వాలి. ముఖ్యంగా చిడుము ఎక్కువగా ఉన్నప్పుడు చెవి, ముక్కు, గొంతు (ENT) ఇన్‌ఫెక్షన్ వచ్చినా యాంటిబయాటిక్స్ వాడాలి. యాంటి బయాటిక్స్ వాడుతున్నప్పుడు వ్యాధి ఒకటి రెండు రోజుల్లోనే తగ్గినట్లు అనిపిస్తుంది. అయినా మందులు పూర్తికాలం వాడాలి. మధ్యలో వాడడం మానివేస్తే వ్యాధి తిరగబెట్టవచ్చు.

★ పయోడెర్మాకు వాడే మందుల్నే దీనిలో కూడా వాడవచ్చు.

# సుఖ వ్యాధులు

స్త్రీ, పురుషుల జననేంద్రియాలకు బాక్టీరియా, వైరస్, ఫంగస్ వంటి వానివల్ల వచ్చే వ్యాధులను సుఖవ్యాధులుగా అనుమానించాలి. అయితే సుఖవ్యాధులు స్త్రీ, పురుషుల కలయికవలన ఒకరికి వ్యాధి వుంటే మరొకరికి వస్తాయి. అందుకే వీటిని ఎస్టీడి (STD) అని పిలుస్తారు. అంటే సెక్సుయల్లీ ట్రాన్స్‌మిట్టెడ్ డిసీజెస్ (Sexually Transmitted Diseases) అని అర్థం. విచ్చలవిడిగా జరిపే శృంగారము, వ్యభిచారము సుఖవ్యాధులు వ్యాపించడానికి ప్రధాన కారణం. అంతేగాక సుఖవ్యాధి సోకినవారు సిగ్గుతోగాని, అశ్రద్ధతోగాని డాక్టరుచేత చికిత్స చేయించుకోకపోవడంతో వారు ఇతరులకు ఈలోపు వ్యాధిని అంటించే అవకాశం ఏర్పడుతుంది.. అందుచేతనే సుఖవ్యాధులు చాలా వేగంగా వ్యాప్తిచెందుతాయి.

ప్రపంచంలో ప్రతి సంవత్సరం 250 కోట్లమంది గనేరియా వ్యాధితోనూ, సుమారు యాభైకోట్ల మంది సిఫిలీస్ వ్యాధితోను బాధపడుతున్నారని ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) ప్రకటించింది. పొరపాటున ఏవైనా లైంగిక వ్యాధులు వస్తే తప్పనిసరిగా చికిత్స చేయించాలి.

## గనేరియా (Gonorrhoea)

దీనిని 'సెగరోగం' అని కూడా అంటారు. ప్రపంచంలో అత్యధిక శాతం ప్రజలు ప్రతి సంవత్సరం ఈ వ్యాధి బారిన పడుతున్నారు. ఈ వ్యాధిని 'బెనోరియా' అని 'క్లాప్' అని పిలుస్తారు. ఈ వ్యాధి 'నైసీరియా గనేరియా' అనే బాక్టీరియా వల్ల వస్తుంది. ఈ వ్యాధి స్త్రీలలోను, పురుషులలోను వేరు వేరు లక్షణాల్ని కలిగి వుంటుంది.

### స్త్రీలలో కనిపించే లక్షణాలు :

★ స్త్రీలలో గనేరియా లక్షణాలు మొదట ఏమీ కనిపించవు. కొందరు స్త్రీలకయితే కొన్ని సంవత్సరాల వరకూ ఎలాంటి లక్షణాలూ కనపడవు. అయితే అంతదాకా ఈమె తనలో ఉన్న జబ్బును ఇతరులకు పంచుతుంది. అంటే ఈ మె వ్యాధి వ్యాప్తి కారకురాలు (carrier)గా వుంటుంది.

★ స్త్రీలలో గనేరియా వచ్చినప్పుడు మూత్రం ఎక్కువ సార్లు వస్తూ వుంటుంది. వీరు మూత్రం పోసుకునేటప్పుడు బాధనమభవిస్తారు. నొప్పి, చురక వుంటాయి.

★ స్త్రీలకు సహజంగా వచ్చే ఋతుక్రమంలో వీరి బాధ మరింత ఎక్కువ అవుతుంది.

★ స్త్రీలకు వచ్చే జబ్బును ఆమెలోదుస్తులలో కనిపించే పచ్చని మరకలను బట్టి గుర్తించవచ్చు. దీనికి కారణం ఆమెకు ఆ సందర్భంలో పచ్చమైల గావి, తెల్లమైలగాని కావడమే !





★ స్త్రీలకు గనేరియావస్తే పిల్లలు పుట్టే అవకాశాలు తగ్గుతాయి. వంధ్యత్వము రావడానికి అవకాశం వుంది. వీరి పొత్తికడుపు బాగా నొప్పిగా వుండి గర్భాశయం చుట్టూ ఇన్‌ఫెక్షన్ రావడమే అందుకు కారణం.

★ స్త్రీలలో గనేరియా వ్యాధి యురెత్రా (మూత్రం పోసుకునేదారి)ని వాపునకు గురిచేస్తుంది. దీనితో ద్వారం సన్నగా అవడంతో మూత్రం సరిగ్గా రాక ఇబ్బంది పడవలసి వస్తుంది. స్త్రీలలో కనబడే మొట్టమొదటి గనేరియా లక్షణం ఇదే !

★ ఆ తరువాత లోపలి మూత్రనాళం దారి (యురెథ్రైటిస్) పుండుపడినట్లుగా అయి చివరకు ఒక్క చుక్కమూత్రం తగిలినా సరే మంట, పోటు వుంటాయి. అంటేగాక యోని వాపు కూడా కనబడుతుంది.

★ ఆపైన మూడవలక్షణంగా తెల్లని లేక పచ్చని చీమును గుర్తించవచ్చు. ఈ చీమును సూక్ష్మదర్శిని క్రింద పరిశీలిస్తే 'గోనోకోకై' బాక్టీరియా క్రిములు స్పష్టంగా కనబడతాయి. ఈ దశలో వీరిజననాంగాన్ని గనుక నొక్కితే చిక్కని చీము బయటకు వస్తుంది.

★ స్త్రీలలో గనేరియా వ్యాధి సర్వసాధారణంగా జననేంద్రియాలకు మాత్రమే పరిమితమై వుంటుంది.

★ అసహజ రతి ప్రక్రియలవల్ల ఇది నోట్లోనూ, విరేచనామార్గంలోనూ రావడానికి అవకాశం వుంది

★ ఇది వున్న స్త్రీ గర్భం ధరిస్తే వారికి పుట్టే పిల్లకు పుట్టుకతోనే గనేరియా వచ్చే అవకాశం ఉంది. దీనికి కారణం తల్లియోని చుట్టూ గనేరియా చీముదశలో వుండడమే. దీని కారణంగా బిడ్డకళ్ళు ఎరుపెక్కి, పుండుపడి వాటి నుండి కూడా చీము కారడం మొదలవుతుంది.

★ గనేరియా వ్యాధి కొన్ని సందర్భాలలో కీళ్ళ జబ్బులకు కూడా దారితీస్తుంది. లేక మూత్రద్వారాన్ని కూడా ఇన్‌ఫెక్షన్‌కు గురిచేస్తుంది.

★ స్త్రీలు తమకు గనేరియా వ్యాధి వచ్చినప్పుడు దానిని గుర్తించక మామూలు తెలుపు అవుతుందని అశ్రద్ధ చేస్తారు. దీనివల్ల వ్యాధి మరింత పెరిగే ప్రమాదం వుంది.

★ స్త్రీలకు మూత్రంలో నుండి సన్నని దారాల మాదిరిగానో లేక పాలుసుల మాదిరిగానో చీము పదార్థాలు బయటకు వస్తాయి. ఈ చీముకు చికిత్స చేయకపోతే వ్యాధి గర్భసంచికి పాకి 'సెర్విసైటిస్' అనే వ్యాధి వస్తుంది. అండాలు, అండవాహికలు, మూత్రకోశం వ్యాధికి గురి అవడం వల్ల వీరి పొత్తికడుపు బిగుసుకుపోతుంది.

### పురుషులలో గనేరియా లక్షణాలు :

★ గనేరియా లక్షణాలు స్త్రీలకు పురుషులకు వేరువేరుగా వుంటాయి.

★ స్త్రీలకు గనేరియా వ్యాధి లక్షణాలు బయట బడడానికి కొన్ని సంవత్సరాల సమయం పడితే పురుషులో కేవలం రెండు నుండి ఐదు రోజుల్లోపు మొదటి లక్షణాలు బయటబడతాయి. ఒకొక్కసారి ఈ లకణాలు బయటబడేందుకు మూడు వారాలు కూడా పట్టవచ్చు.

★ మూత్రంలో చురుకు, నొప్పి వుంటాయి. వీరి అంగము నుండి చీము బయటకు వస్తుంది.

★ కొన్ని సందర్భాలలో అసలు మూత్రము రాని పరిస్థితి కలగవచ్చు. దీనితో స్వల్పంగా జ్వరం రావచ్చు. వీరిలో కూడా కీళ్ళవాపు రావచ్చు.

★ గనేరియావల్ల పురుషులలో వృషణాలు, ప్రోస్టేట్ గ్రంధి వాచడం, పొత్తికడుపు నొప్పిరావడం, నపుంసకత్వం రావడం వంటి పరిస్థితులు కలగవచ్చు.

★ మూత్రం వెళ్ళే ద్వారం సన్నబడి వుంటుంది. స్త్రీలలో కంటే పురుషులలోనే వ్యాధిని గుర్తించడం తేలిక.

★ పురుషులలో గనేరియా ముదిరితే 'ఫిమోసిస్' (Phimosis) అనే పరిస్థితి కలగవచ్చు. అంటే పురుషాంగం ముందు భాగం (గ్లాన్స్‌పెనిస్) ఉబ్బి బల్బ్‌లాగా పొగుతుంది. ఆ వాపుకు తగినంతగా దానిపైన వుండే చర్మం సాగకపోవడంవల్ల పురుషాంగం ఒక ప్రక్కకి నొక్కినట్లుగా అవుతుంది. ఇది చాలా బాధ పెడుతుంది.

**చికిత్స :**

★ గనేరియాకు చికిత్స పూర్తిగా తీసుకోవాలి.

★ యాంపిసిలిన్‌ను దానితోపాటుగా ప్రొబెన్‌సిడ్ 1 గ్రాము మందును కలిపి వాడాలి.

★ యాంపిసిల్లిన్ రోసిలిన్ - 200 మి.గ్రా /500 మి.గ్రా పేరుతో దొరుకుతుంది. ఇంకా ఇతర పేర్లతో వివిధ కంపెనీలు తయారుచేస్తున్నాయి.

★ కో-ట్రైమాక్సజోల్ - D.S. అనే మందును వాడాలి. ఇది బాక్ట్రిం - డి.యస్., సెప్ట్రాన్ - డి.యస్. - స్టాన్ - డి - యస్ వంటి పలు పేర్లతో వుంటుంది. ఈ మాత్రలు ఎనిమిది తీసుకుని ఒకేసారి మింగాలి. లేక ఐదు మాత్రలు చొప్పున పన్నెండు గంటలకు ఒకసారి మూడు సార్లు మింగాలి.

★ యాంపిసిల్లిన్ మందు పనిచేయని పరిస్థితులలో వీరికి సిప్రోఫ్లక్సాసిన్ 250 మి.గ్రా/500 మి.గ్రా మాత్రల్నిగాని సెఫటాక్సైమ్ 0.25 లేక 0.5 గ్రా లేక 1 గ్రాము ఇంజక్షన్‌గాని ఇవ్వాలి. మందులు ఏవైనా సరే డాక్టరు పర్యవేక్షణలో తీసుకోవాలి. వ్యాధి వచ్చాక బాధపడి పలు మందులు వాడేకంటే వ్యాధి రాకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటే ఉపయోగం వుంటుంది.

★ గనేరియా వ్యాధిలో ఇంకా అనేక ఉపద్రవాలు సంభవించవచ్చు. వీరిలో గర్భిణీ స్త్రీకి గనేరియా వస్తే పుట్టబోయే బిడ్డకు పుట్టుకతోనే గనేరియా రావచ్చు. బిడ్డ కళ్ళు ఎరుపెక్కి పుండులాగా మారి చీముకూడా కారవచ్చు. ఈ స్థితిని 'ఆప్తాల్మియా నియోనెటోరమ్' అంటారు. ఈ స్థితిలో అశ్రద్ధ చేస్తే బిడ్డకు శాశ్వతంగా చూపుపోయే ప్రమాదం వుంది. ఈ బిడ్డకు సిప్రోఫ్లక్సాసిన్ చుక్కలమందు వెంటనే కంట్లో వేయాలి.





★ గనేరియా వ్యాధి విచ్చలవిడిగా శృంగారం జరిపే వారిలో ఎక్కువ కనిపిస్తుంది. అందుచేత దానిని ముందుగా అదుపులో ఉంచుకుంటే వ్యాధి రాకుండా చూసుకోవచ్చు.

★ అసహజరతి ముఖ్యంగా వ్యభిచారులతో పనికిరాదు.

★ వ్యభిచారుల వద్దకు వెళ్ళేవారు తప్పనిసరిగా కండోమ్స్ ధరించాలి.

★ ముఖ్యంగా తెలియని వారితో లైంగిక కార్యకలాపాలు చేటుతెస్తాయి. అంతేగాక కేవలం గనేరియా వ్యాధి మాత్రమే కాక ఇంకా అనేక రకాల సుఖ వ్యాధులు ముఖ్యంగా ఎయిడ్స్ వంటి ప్రాణాంతక వ్యాధులు కూడా వచ్చే ప్రమాదం ఉంది.

## సిఫిలిస్ (Syphilis)

గనేరియా తరువాత ప్రపంచ వ్యాప్తంగా తీవ్రమైన ప్రమాదకరమైన వ్యాధి సిఫిలిస్. దీనినే సవాయి రోగమని కూడా అంటారు. ఇది కూడా లైంగిక సంపర్కం వల్ల వచ్చేదే. దీనిని గనుక ప్రారంభంలోనే తగిన చికిత్స చేయకపోతే వ్యాధి మూడుదశలుగా పెరిగి చివరకు ప్రాణాంతకం అవుతుంది. సిఫిలిస్‌కు 'ట్రిపోనీమాపాల్లిడం' అనే బాక్టీరియా కారణం.

**సిఫిలిస్ తొలిదశ లక్షణాలు :**

★ సిఫిలిస్ కేవలం లైంగిక సంపర్కంవల్ల మాత్రమే వస్తుంది. ఈ వ్యాధి వున్న స్త్రీతో సంపర్కం జరిపిన పురుషునిలో వ్యాధి లక్షణాలు పది రోజుల నుండి మూడు నెలలోపు ఎప్పుడైనా బయటపడవచ్చు.

★ సిఫిలిస్ లక్షణాలు స్త్రీ, పురుషులలో పెద్దగా తేడా లేకుండా వుంటాయి. వ్యాధిలో ముందుగా షాంకర్స్ అనే పుళ్ళు ఏర్పడతాయి.

★ సిఫిలిస్ పుళ్ళు పురుషులలో అంగం (Penis) చివర ఎక్కడైనా సరే ఒకటి లేక అరుదుగా రెండు ఏర్పడతాయి.

★ స్త్రీలకు సిఫిలిస్ పుళ్ళు రెండు కన్నా ఎక్కువ అంటే ఐదు లేక ఆరు ఏర్పడవచ్చు. వీరిలో ఈ పుళ్లు చింతగింజ ఆకారంలో గాని చొక్కా గుండీ ఆకారంలో గుండ్రంగా గాని ఏర్పడతాయి.

★ సిఫిలిస్ పుళ్లు స్త్రీలలో నొప్పి కలిగించవు. అందువల్ల వీరు వ్యాధిని గుర్తించరు. అంతేగాక వీరు ఈ పరిస్థితిలో వ్యాధిని ఇతరులకు అందించగలరు.

★ పురుషులలో సిఫిలిస్ పుళ్ళు గజ్జలలో లింఫ గ్రంథులు వాపునకు గురి అవుతాయి.

★ సిఫిలిస్ వ్యాధిలో వచ్చే ఈ పుళ్లు వైద్యం జరిగినా లేక జరగకపోయినా రెండు నుండి నాలుగు వారాలలో తగ్గిపోతాయి. వైద్యం జరిగితే రెండువారాలలోపునే తగ్గిపోవచ్చు.

★ మొదటి దశలో స్త్రీలో తెల్లమైల, పచ్చమైల అవుతుంది. వైద్యం జరగకపోయినా ఆరు నెలలో వ్యాధి పూర్తిగా తగ్గినట్లు అనిపిస్తుంది. కానీ వ్యాధి లోపల పెరిగి పోతుంది. ఈ దశలో వ్యాధి ఇతరులకు సోకడానికి వీరు దోహదపడగలరు. లైంగిక కలయిక తరువాత రెండేళ్ళలో ఎప్పుడు వ్యాధి బయటపడినా దానిని తొలిదశగానే గుర్తిస్తారు.

**రెండవదశ లక్షణాలు :**

★ రెండవదశ మొదటిదశలో చికిత్స సరిగ్గా జరగకపోవడంవల్ల వస్తుంది. దీనిని 'సెకండరీ సిఫిలిస్' అంటారు. మొదటి దశ తరువాత రెండేళ్ళకు ఈ దశ బయట పడుతుంది. ఈ దశలో సిఫిలిస్ పుళ్లు అంగంపైననే కాక శరీరంలో ఇంకా ఏ ప్రాంతంలో అయినా సరే రావచ్చు. ముఖ్యంగా మలద్వారం, నోటిపైన (పెదవులపై), చేతివ్రేళ్ళపై, నోటిలో నాలుకపైన ఇలా ఎక్కడైనా పుళ్ళు రావచ్చు. ఈ దశలో బయాప్సీ చేసి (పుళ్ళ నుంచి ద్రవాన్ని తీసి పరీక్షించడం) వ్యాధిని నిర్ధారిస్తారు.

★ కొంతమందిలో పుళ్ళు రాకుండా వంటి నిండా కేవలం మచ్చలు మాత్రమే రావచ్చు.

★ గొంతులోనూ నోటిలోనూ ఏర్పడిన పుళ్ళు గొంతునొప్పిని కలిగిస్తాయి. కొద్దిగా జ్వరం రావడం, దద్దుర్లు రావడం ఈ దద్దుర్లు నొక్కితే నొప్పిగా అనిపించడం జరుగుతుంది.

★ కొందరికి కీళ్ళవాపు, అరిచేతులలో దద్దుర్లు, పాదాలపై దద్దుర్లు, దురదలు కలుగుతాయి. ఈ దద్దుర్లు వలయాలవలె, గుండ్రంగా, వివిధ ఆకారాలలో వుంటాయి.

★ ఈ దశలో దద్దుర్లకు, పుళ్ళకు, సిఫిలిస్‌కు చికిత్స చేయిస్తే వ్యాధి నివారణ అవుతుంది. అయినా అంతుబట్టని చర్మవ్యాధులుగాని, ఆ తరువాత కాలంలో పుళ్ళుగాని ఏర్పడడం జరిగితే ఇంకా సిఫిలిస్ మిగిలి ఉన్నట్లుగా భావించాలి. రక్తపరీక్ష జరిపి వ్యాధి నిర్ధారణ చేసుకోవాలి.

**మూడవ దశ లక్షణాలు :**

★ మొదటి రెండు దశలలో చికిత్స సరిగా జరగకపోతే సిఫిలిస్ మూడవదశలోనికి ప్రవేశిస్తుంది. అంతేగాక మొదటి రెండు దశల్లో వచ్చిన సిఫిలిస్ పుళ్ళు వాటంటత అవే మానిపోతాయి. దానితో రోగి తాను ఆరోగ్యంగా ఉన్నట్లు భావిస్తాడు. పైగా ఈ సమయంలో తాను ఎలాంటి మందులూ తీసుకోక చికిత్స అశ్రద్ధ చేస్తారు. అయితే వీరిలో రోగం పెరుగుతూనే ఉంటుంది.

★ కనీసం ఈ దశలో అయినా చికిత్స పూర్తిగా తీసుకోకపోతే శరీరంలోని ప్రతీఅవయవం సిఫిలిస్ వ్యాధికి గురిఅవుతుంది.

★ మూడవదశ లక్షణాలు చాలా నిదానంగా వస్తాయి. మొట్టమొదటగా వ్యాధి సోకిన తరువాత మూడు నుండి పది సంవత్సరాలలోపు ఎప్పుడైనా రావచ్చు.





★ ఈ మూడవదశలో గమ్మాస్ (Gummas) అనే పుళ్ళు వేస్తాయి.

★ సిఫిలిస్ మూడవదశలో రోగి ఎముకలు, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, గుండె మాత్రమే కాక మెదడు కూడా దెబ్బతినవచ్చు. అయితే చాలా మటుకు సిఫిలిస్ వంటి లైంగిక వ్యాధి మూడవ దశ వరకూ రావడం లేదు.

★ సిఫిలిస్ వ్యాధి వలన వచ్చే నరాల జబ్బును 'న్యూరోసిఫిలిస్' అంటారు. దీనిలో సిఫిలిస్ పుండు కనిపించిన తరువాత ఇరవై సంవత్సరాలలోపు ఎప్పుడైనా ఇది రావచ్చు. దీనిలో మతిమరుపు, నిర్లక్ష్యం మొండితనం, ఉన్మాదం, విచక్షణ కోల్పోవడం, నత్తి, మాటతడబాటు చివరికి పక్షవాతం, మరణం కూడా సంభవిస్తుంది.

**చికిత్స :**

సిఫిలిస్ వ్యాధికి మూడు దశలు ఏ విధంగా ఉన్నాయో ప్రతి దశలోనూ చికిత్స కూడా అదే విధంగా ఉంటుంది. ఎటొచ్చీ వ్యాధిని వీలైనంత త్వరగా గుర్తించడమే ముఖ్యం. ఇది నిదానంగా చాపకిందనీరులాగా వ్యాపించే సైలెంట్ కిల్లర్. కాబట్టి ఈ వ్యాధికి తప్పకుండా కోర్సు ప్రకారం చికిత్స చేయించుకోవాలి. నిర్లక్ష్యం చేస్తే వ్యాధి ఇతరులకు వ్యాపించే ప్రమాదం వుంది.

**వ్యాధి నిర్ధారణ :**

చికిత్సకు ముందు వ్యాధి నిర్ధారణ అవసరం. VDRL అనే రక్త పరీక్ష జరిపి వ్యాధిని నిర్ధారించవచ్చు. ఇలా రక్తపరీక్ష జరపకుండా వ్యాధి లక్షణాలను బట్టి చికిత్స చేసే ఒక్కోసారి వ్యాధి స్వరూపం (Clinical picture) మారిపోయి అర్థంకాని లక్షణాలతో చికిత్స దారితప్పుతుంది.

**మొదటి దశలో చికిత్స :**

★ ప్రొకెయిన్ పెన్సిలిన్ - 600 - 1200 మి.గ్రా సూదిమందును కండరంలోనికి రోజుకు ఒకసారి చొప్పున పన్నెండు రోజులు వాడాలి.

★ టెర్రామైసిన్ - 500 మి.గ్రా లేక ఆక్సీ టెట్రాసైక్లిన్ - 500 మి.గ్రా గొట్టాలు ప్రతి ఆరు గంటలకు ఒకటి చొప్పన పదిహేను రోజులపాటు వాడాలి.

★ డాక్సీసైక్లిన్ - 100 మి.గ్రా - డాక్సీ - 1 - 100 మి.గ్రా లేక టెట్రాడాక్స్ - 100 మి.గ్రా రోజుకు నాలుగు గొట్టాలు చొప్పన పదిహేనురోజులు వాడాలి.

**రెండవదశలో చికిత్స :**

★ పొరపాటున మొదటి దశను నిర్లక్ష్యం చేసినా రెండవదశలో అయినా చికిత్స చేయించుకోవచ్చు. ఈ దశలో అశ్రద్ధ తీవ్ర దుష్ఫలితాలను కలిగిస్తుంది.

★ ఈ దశలో కూడా ప్రొకెయిన్ పెన్సిలిన్ - 600 - 1200 మి.గ్రా సూది మందు కండరంలోనికి రోజుకు ఒకసారి చొప్పన 15 రోజులు వాడాలి.

★ టెట్రామైసిన్ - 500 మి.గ్రా గొట్లాలు లేక ఆక్సీటెట్రాసైక్లిన్ - 500 మి.గ్రా గొట్టాలు ప్రతి అరుగంటలకు ఒకటి చొప్పున ఇరవై రోజులు వాడాలి.

★ డాక్సీ - 1 -100 మి.గ్రా. లేక టెట్రాడాక్స్ - 100 మి.గ్రా గొట్టాలు ప్రతి ఆరు గంటలకు ఒకటి చొప్పున ఇరవై రోజులు వాడాలి.

**మూడవదశలో చికిత్స :**

★ సిఫిలిస్ వ్యాధి ఈ దశలోనికి వచ్చిందంటే చాలా ప్రమాదం. ఈ దశలో అనేక ఉపద్రవాలు సంభవించవచ్చు.

★ ప్రొకెయిన్ పెన్సిలిన్ - 900 మి.గ్రా నుండి 1200 మి.గ్రా చొప్పున రోజుకు ఒకసారిగా మూడు వారాలు వాడాలి.

★ ఆక్సీ టెట్రాసైక్లిన్ - 500 గ్రా. గొట్టాలు లేదా డాక్సీ - 500 మి.గ్రా. గొట్టాలు ప్రతి అరుగంటలకు ఒకటిగా షుమారు ఒకనెలరోజులు వాడాల్సి వుంది.

★ డాక్సీ సైక్లిన్ - 100 మి.గ్రా లేదా డాక్సీ - 1 - 500 మి.గ్రా రోజుకు నాలుగు చొప్పున నెలరోజులపాటు వాడాలి.

★ చికిత్సకాలంలో తరచు రక్త పరీక్షలు జరిపించుకోవాలి. విచ్చలవిడిగా వ్యభిచారానికి దూరంగా వుంటే సిఫిలిస్ వంటి వ్యాధులు రావు.

## లింఫోగ్రాన్యులోమావెనీరియం (LGV)
## (Lympho Granuloma Venereum)

వ్యభిచారిణుల నుండి సంక్రమించే సుఖవ్యాధులలో ఇది కూడా ఒకటి. 'క్లామీడియాట్రా కోమాటిస్' అనే వైరస్ వల్ల ఈ వ్యాధి వస్తుంది.

**లక్షణాలు :**

★ L.G.V. వున్న వ్యక్తితో రతిలో పాల్గొన్న నాలుగు లేక ఐదు రోజుల్లో వ్యాధి లక్షణాలు బయటబడతాయి.

★ మొదటగా చిన్న చిన్న నీటి పొక్కులవంటివి జననాంగాలపై వస్తాయి. సాధారణంగా వీటిని గుర్తించకపోవడమో లేక పట్టించుకోకపోవడమో జరుగుతుంది.

★ నీటి పొక్కులు కనబడిన వారం నుండి ఆరు వారాలలోపు వీరి గజ్జలలో బిళ్ళలు కట్టి లోపల ఒకదానికొకటి అతుక్కుంటాయి. అంతేగాక పైన చర్మానికి కూడా ఇవి అంటుకొని వుంటాయి.

★ పొక్కులు వాటంతట అవే పగిలిపోవడమో లేక మానడమో జరుగుతుంది. పగిలిపోతే చీము కారుతుంది.





★ పొక్కులు నొప్పిని కలిగిస్తాయి. వీటితోపాటుగా జ్వరం, వికారం, వాంతులు, కీళ్ళ నొప్పులు కూడా వస్తాయి.

★ పొక్కులు పొకానికి వచ్చినవి కదా అని వాటిని చితక్కొట్టి చీమును బయటకు తీయరాదు. దీనిమూలంగా ఇతర ఉపద్రవాలు రావచ్చు. అయితే పెద్దగా వున్న గడ్డలలోని చీమును సూదివేసి సిరంజితో తీయవచ్చు

## గ్రాన్యులోమా వెనీరియం (Granuloma Venereum)

ఇది బ్యాక్టీరియా వల్ల వచ్చే వ్యాధి. డోనోవానియా గ్రాన్యులోమాటిస్ అనే బాక్టీరియా వ్యాధిని కలిగిస్తుంది. ఈ జబ్బుగల స్త్రీలతో సంపర్కం జరిపిన తరువాత కొన్ని వారాలలోపు వ్యాధి బయటపడుతుంది. ఇది ఒక పట్టాన తగ్గే వ్యాధి కాదు. దీర్ఘకాలం వుండే (Chronic Disease) వ్యాధి.

**లక్షణాలు :**

★ జననాంగాలపైన పెద్ద పెద్ద పుండ్లు ఏర్పడతాయి.

★ పుండ్లు తగ్గకపోగా బాధగా వుంటాయి.

★ దీర్ఘకాలం పుళ్ళు ఉండడంతో లింఫ్ పోగుపడుతుంది. దీనితో జననాంగాలు వాపునకు గురిఅవుతాయి.

★ పుళ్ళు బాగా బాధ కలిగించే సమయంలో స్వల్పంగా జ్వరంకూడా వస్తూ వుంటుంది.

## షాంక్రాయిడ్స్ (Chancroids)

ఇవి వ్యభిచరించే స్త్రీల వల్ల వస్తాయి. ఇవి రావడానికి 'హిమోఫిలస్ డుక్రీ' అనే బాక్టీరియా కారణం. ఇవి వ్యాపింపజేసే స్త్రీలు కేవలం వ్యాప్తికారులు మాత్రమే

**లక్షణాలు :**

★ మొదట గజ్జలలో బిళ్ళలు కడతాయి.

★ అంగానికి చివర (Penis) గాని అంగంపైన గాని చిన్న చిన్నవిగా అగ్గిపులలంత సైజులో రెండుకంటే ఎక్కువ పొక్కులు ఏర్పడతాయి.

★ పుండ్లను ఏమాత్రం కదిపినా రక్తం కారుతుంది.

★ పొక్కులు (పుండ్ల) అంచులు ఎర్రగా వుంటాయి. పుండ్లు నొప్పిగా వుండి దాని వల్ల చలిజ్వరం లాగా కూడా రావచ్చు. షాంక్రాయిడ్స్, గ్రాన్యులోమా వెనీరియం, లింఫోగ్రాన్యులోమా వెనీరియం వంటి వ్యాధులకు చికిత్స ఒకే విధంగా వుంటుంది.

**చికిత్స :**

డాక్సీసైక్లిన్ - 100 మి.గ్రా లేదా మైక్రోడాక్స్ - 100 మి.గ్రా లేదా డాక్సీక్లిన్ - 100 మి.గ్రా లేదా టెట్రాడాక్స్ - 100 మి.గ్రా గొట్టాలు రోజూ ఉదయం ఒకటి, సాయంత్రం ఒకటి చొప్పున మూడు వారాలపాటు వాడాలి. లేదా -

ఎల్టోసిన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా టాబ్లెట్స్ లేక ఆల్ట్రోసిన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా టాబ్లెట్స్ లేక ఎరిథ్రోసిన్ - 250 మి.గ్రా/ 500 గ్రా. టాబ్లెట్స్ ప్రతిరోజూ ఉదయం ఒకటి సాయంత్రం ఒక టాబ్లెట్ చొప్పున ఒకటి లేక రెండు వారాలు వాడాలి. లేక

బ్యాక్ట్రిం - డి.యస్. టాబ్లెట్స్, లేక స్పెక్ట్రాన్ - డి.యస్ టాబ్లెట్స్ లేక సిప్లిన్ - డి.యస్. టాబ్లెట్స్ ప్రతిరోజూ ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి చొప్పున వారం నుండి మూడు వారాలు వరకు వాడవచ్చు.

సిఫ్రాన్ - 250 మి.గ్రా/500 మి.గ్రా/750 మి.గ్రా. లేక ఆల్‌సిప్రో 250 మి.గ్రా/500 మి.గ్రా. టాబ్లెట్స్ గాని రోజుకు రెండు ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి చొప్పున షుమారు రెండు లేక మూడు వారాలు వాడాలి.

స్ట్రెప్టోమైసిన్ - 0.75 మి.గ్రా లేదా - 1 గ్రాము ఇంజక్షన్ లేక యాంబిస్ట్రిన్ - 0.75 మి.గ్రా లేదా 1 గ్రాము ఇంజక్షన్‌ను రోజుకు గరిష్టంగా ఒక గ్రాము చొప్పున పది లేక పదిహేను రోజులపాటు వాడాలి. గుణం కనపబడకపోతే మరొకపది రోజులపాటు వాడవచ్చు.

షాంక్రాయిడ్స్ వ్యాధికి సరైన చికిత్స చేయకపోతే బాధ ఎక్కువైపోయి రాత్రుళ్ళు నిద్రకూడా పట్టదు.

## ఇతర వ్యాధులు

వ్యాధులు అనేకం వుంటాయి. కొన్ని సాధారణ వ్యాధులు పరాన్న జీవులవల్ల వస్తాయి. వాటిలో కొన్ని - మలేరియా, టైఫాయిడ్, ఫ్లూ వంటివి.

**మలేరియా :** చలిజ్వరం వచ్చిందంటే అది మలేరియా అని అనుమానించాల్సిందే. దీనికి మాస్టర్‌ఫీవర్, కోస్టల్ ఫీవర్, ట్రాపికల్ ఫీవర్, ఇంటర్‌మిటెంట్ ఫీవర్, రోమన్ ఫీవర్ వంటి పలుపేర్లు వున్నాయి. ఇది మూడు దశలుగా వస్తుంది. అవి

1. **కోల్డ్ స్టేజ్ :** ఇది మలేరియా ప్రారంభంలో వళ్ళు వేడి (జ్వరం) లేకుండానే చలి వణికిస్తుంది. దీన్ని 'మొదటిదశ' అంటారు. ఇది అరగటంట నుండి గంటవరకు ఉంటుంది.

2. **హాట్‌స్టేజ్ :** ఇది జ్వరంతో కూడిన దశ. జ్వరం తీవ్రంగా వుంటుంది. ఈ విధంగా ఒకటి నుండి నాలుగు గంటల పాటు వుంటుంది. ఇది రెండవ దశ.

3. **స్వెట్టింగ్ స్టేజ్ :** ఇది చెమట దశ - ఈ దశలో విపరీతంగా చెమటలు పోసి జ్వరం తగ్గిపోతుంది. ఈ దశ రెండు లేక మూడు గంటలపాటు ఉంటుంది.





మలేరియా మొత్తం మూడు రకాలైన పరాన్న జీవుల వలన వస్తుంది. అవి

1) **ప్లాస్మోడియం వైవాక్స్ :**జ్వరం ప్రతి 48 గంటలకు ఒకసారి గంటకొట్టినట్లుగా వస్తుంది. ఆ తరువాత ఒకటి రెండు రోజులు వుండి తరువాత మళ్ళీ 48 గంటలవరకు ఆగి మళ్ళీ వస్తుంది.

2) ప్లా.మలేరియో : దీనివల్ల జ్వరం ప్రతి 72 గంటలకు ఒకసారి జ్వరం వస్తుంది.

3) ప్లా. ఫాల్సీఫారం :దీనివల్ల జ్వరం వచ్చినా జ్వరంలో చలిపెద్దగా ఉండదు. జ్వరం తీవ్రంగా వస్తుంది. తరచుగా ప్రతిగంటకు లేదా రెండేసి గంటలకొకసారి వస్తుంది ఎక్కువసేపు నిలబడి వుంటుంది. దీనివల్ల సెరిబ్రల్ మలేరియా అనే మెదడు మలేరియా వచ్చి చాలా ప్రమాదం కలగవచ్చు. అపస్మారక స్థితి - మరణం కూడా సంభవిస్తుంది.

**లక్షణాలు**

★ చలికుదుపులతో వుంటుంది. ప్రారంభంలో జ్వరం రోజూ వస్తుంది. చలి తరువాత తీవ్రమైన జ్వరం వస్తుంది.

★ రోగి బలహీనంగా వుంటాడు - తలనొప్పి - కడుపునొప్పి - కడుపులో వికారం - కొందరికి వాంతులు, విరేచనాలు కూడా రావచ్చు.

★ మలేరియా జ్వరం వచ్చిన వారిలో రక్తహీనత వస్తుంది. కొందరిలో పల్మొనరీ ఎడిమా (ఊపిరితిత్తుల్లో నీరు) క[illegible]వచ్చు.

★ కొంతమందిలో మెదడు[illegible]పు, ఫిట్స్ కూడా వస్తాయి. పేగులకు సంబంధించిన మలేరియాలో తరచు నీళ్ళ విరేచనాలు, వాంతులు వస్తాయి.

★ మలేరియా జ్వరంతో బొ[illegible]కు ఎడమవైపు ఉన్న ప్లీహం వాస్తుంది. దీనిని కడుపులో బల్లపెరిగిందని అంటారు.

**చికిత్స :**

రక్తపరీక్ష జరిపి వ్యాధి నిర్ధారణ జరపాలి. మలేరియా అని తేలిన పక్షంలో చికిత్స మొదలుపెట్టాలి. ఒకవేళ అది మలేరియా అవునో కాదో తేల్చుకోలేని పరిస్థితిలో వైరస్ జ్వరానికి, మలేరియా జ్వరానికి ఒకేసారి వైద్యం మొదలుపెట్టాలి.

★ జ్వరానికి పేరాసిటమాల్ - 500 మి.గ్రా టాబ్లెట్స్ వాడాలి.

వీటిని రోజుకు మూడు పూటలా ఒక్కొక్కటి చొప్పున వాడాలి.

★ క్లోరోక్విన్ కలిసిన

1) లారియాగో - టాబ్లెట్స్

2) రిసోచిన్ - టాబ్లెట్స్

3) నివాక్విన్ - టాబ్లెట్స్

వీటిని భోజనం చేసిన తరువాత మొదటి రోజు ఒకేసారి 4 మాత్రలు మింగాలి. రెండవరోజు కూడా 4 మాత్రలు ఒకేసారి మింగాలి. మూడవరోజు రెండు మాత్రలు మింగాలి. మాత్రలు వేసుకున్నాక పూర్తిగా మంచంపై పడుకుని విశ్రాంతి తీసుకోవాలి. దీనితో వికారం తగ్గుతుంది.

★ ప్రైమాక్విన్ కలిసిన

1) మాల్రిడ్ - 7.5 మి.గ్రా టాబ్లెట్స్

2) ప్రైమాలిన్ - 7.5 మి.గ్రా టాబ్లెట్స్

పై వాటిని మొదటి రోజు - 45 మి.గ్రా ఒకేసారి 15 మి.గ్రా చొప్పున రెండు నుండి ఐదవ రోజువరకు వాడాలి.

★ వాంతులు ఉంటే మెటాక్లోప్రమైడ్ కలిసిన

పెరినార్మ్ - 10 మి.గ్రా టాబ్లెట్

రెగ్లాన్ - 10 మి.గ్రా టాబ్లెట్

ఒక టాబ్లెట్ వేసుకోవాలి.

★ మెఫ్లాక్విన్ అనే కొత్తమందు వాడుతున్నారు. ఇది కూడా ప్రైమాక్విన్ వంటిదే.

★ జ్వరంవల్ల ఫిట్స్ రాకుండా ఉండేందుకు జ్వరాన్ని ముందుగా అదుపు చేయాలి. అవసరం అయితే ఐస్ వాటర్ పెట్టి తుడవాలి.

★ కొన్ని సందర్భాలలో క్లోరోక్విన్ డబుల్ డోస్ ఇచ్చి నయం చేయాల్సి వుంటుంది.

★ రోగి మందులు మ్రింగలేక అపస్మారంలో పడిపోతే క్లోరోక్విన్‌ను 5% గ్లూకోజ్ సీసాలో కలిపి నరానికి ఎక్కించాలి.

## టైఫాయిడ్

'సాల్మొనెల్లా టైఫీ' అనే బాక్టీరియా టైఫాయిడ్ వ్యాధిని కలిగిస్తుంది. ఇది ఈగలు ఇతర కీటకాలు వాలిన ఆహారాన్ని తినడంవల్ల వ్యాప్తి చెందుతుంది.

**లక్షణాలు :**

వ్యాధి క్రిములు సోకిన తరువాత పదిరోజుల్లో ఎప్పుడైనాసరే నాలుగు లేక ఐదురోజుల్లోనే వ్యాధి లక్షణాలు బయటబడవచ్చు. కొన్ని సందర్భాలలో పది పదిహేను రోజులు పడుతుంది.

★ టైఫాయిడ్ లక్షణాలు స్థిరంగా వుండవు. జలుబు లేక ఫ్లూలాగా మొదలవుతుంది. తలనొప్పి, గొంతు నొప్పి వుంటాయి. వళ్ళంతా నొప్పులు వస్తాయి. కళ్ళు మండుతాయి.

★ రోజు అంతా జ్వరం వుంటుంది. ప్రతిరోజు కొద్ది కొద్దిగా ఒకటి రెండు డిగ్రీల చొప్పున పెరుగుతుంది.

★ ఆకలి వుండదు. రోగి డల్‌గా వుంటాడు.





★ కొందరికి విరేచనాలు, మరికొందరిలో మలబద్ధకం. ఈ విధంగా లక్షణాలు అస్థిరతను ప్రదర్శిస్తుంది.

★ నాలుక అంచులు మామూలుగా ఉండి మధ్యలో పాచిలా తెల్లగా వుంటుంది.

★ నాడి వేగం తక్కువగా వుంటుంది.

★ కొందరికి ముక్కులు నుండి రక్తం పడడం మరి కొందరి వంటిపైన ఎర్రని దద్దుర్లు, సన్నని పొడవైన దద్దుర్లు రావడం వుంటుంది.

★ పైన వివరించిన అంశాలన్నీ మొదటివారంలోనే కనిపిస్తాయి. ఇక రెండవవారంలో రోగలక్షణాలు తీవ్రంగా వుంటాయి. జ్వరం 103 నుండి 105 డిగ్రీల వరకు వుంటుంది.

★ వంటిపైన గులాబి రంగు మచ్చలు వస్తాయి. కాలేయం ప్లీహం పరిమాణం పెరుగుతాయి.

★ కడుపు వాయువుతో నిండి వుంటుంది. రోగి ఆలోచన కోల్పోతాడు. ప్రేలాపన కూడా ఉంటుంది.

★ టైఫాయిడ్ వ్యాధి ఒకసారి వచ్చాక మళ్ళా తిరగబెడుతుంది. కాబట్టి వ్యాధి వచ్చిన తరువాత తగ్గేదాకా జాగ్రత్తగా వుండాలి. జ్వరం వచ్చిన మొదటి వారంలో రక్తపరీక్ష జరిపితే టైఫాయిడ్ కనబడదు. అయితే రక్తం కల్చర్ చేయిస్తే వ్యాధిని కనుక్కోవచ్చు.

★ గర్భవతులకు టైఫాయిడ్ వస్తే అబార్షన్ అయ్యే ప్రమాదం ఉంది.

★ మూడవవారంలో జ్వరం తగ్గుతుంది. అయితే కొందరిలో కడుపులో పుండుపడే ప్రమాదం ఉంది.

**చికిత్స :**

★ జ్వరం తీవ్రంగా ఉంటే తడి  ట్టతో వళ్ళంతా తుడవాలి. రోగికి ద్రవాహారం ఇవ్వాలి.

★ జ్వరం ఎక్కువగా ఉన్నప్పుడ  వళ్లు నొప్పులు తగ్గడానికి ఏస్ప్రిన్, ఎనాల్జిన్ వంటి మదులు, బెట్నసాల్, డెకడ్రాన్ వంటి కార్టికోస్టిరాయిడ్స్ వాడరాదు. కేవలం పేరాసిటమాల్ ఒక్కటే ఇవ్వవచ్చు.

★ టైఫాయిడ్ క్రిముల్ని చంపేందుకు

క్లోరోమైసిన్ - 250 మి.గ్రా/500మి.గ్రా గొట్టాలు

డాక్లోర్ - 250 మి.గ్రా/500 మి.గ్రా. గొట్టాలు

రిక్లోర్ - 250 మి.గ్రా / 500 మి.గ్రా గొట్టాలు

వీటిలో ఏదైనా సరే ప్రతి ఆరు గంటలకు ఒకటి వాడవచ్చు.

★ ప్రస్తుతం టైఫాయిడ్ వ్యాధికి సిప్రోఫ్లక్సాసిన్ అనే మందువాడుతున్నారు. ఇది కాక సిఫ్లోకసిన్, స్టార్‌ఫ్లాకసిన్, పిఫ్లోక్సాసిన్ వంటి మందుల్ని కూడా వాడుతున్నారు. అయితే ప్రస్తుతం సిప్రోఫ్లక్సాసిన్ పనిచేసినట్లుగా మరే ఇతర మందులూ పనిచేయవు. సిప్రోఫ్లక్సాసిన్ ప్రతి రోజూ రోజుకు రెండు చొప్పున వాడాలి.

★ టైఫాయిడ్‌కు TAB వాక్సిన్ కూడా ఉంది. టైఫాయిడ్ విపరీతంగా ఉన్నప్పుడు ముందు జాగ్రత్తగా వ్యాక్సిన్‌తీసుకోవచ్చు. దీన్ని ప్రతి ఆరు నెలలకు ఒక సారి తీసుకోవాలి.

# ప్రత్యేక అనుబంధం

## కొన్ని రకాల వ్యాధులకు మందులు

మందులు మార్కెట్లో కోకొల్లలుగా వున్నాయి. వాటిని అన్నింటినీ ఇక్కడ వివరించడం అసాధ్యం. ఇంతకు ముందే అన్ని వ్యాధులకు వాడే మందులనూ ఇవ్వడం జరిగింది. మరికొన్ని మందులను వివిధ వ్యాధులకు వివరిస్తున్నాము. అయితే ముఖ్యమైన విషయం - ఏ మందుకైనా రియాక్షన్ రావచ్చు. కాబట్టి రోగికి మందు వాడటప్పుడు ఆ మందు గురించిన పూర్తి వివరాలు తెలిసి వుండాలి. మందు మోతాదు ఎంతకాలం వాడాలి అనే విషయాలను మందువల్ల వచ్చే సైడ్ఎఫెక్ట్స్ వంటివి తెలియాలి. మందులు ఎవరికి వారు వేసుకోవడం ప్రమాదం కాబట్టి తప్పనిసరిగా డాక్టరు సలహా తీసుకోవాలి.

1. కడుపులో మంట, గ్యాస్, అల్సర్స్‌కు
   - ★ జెలుసిల్ MPS టాబ్లెట్స్/ లిక్విడ్
   - ★ డైజీన్ టాబ్లెట్స్/ లిక్విడ్
   - ★ జినెటాక్ 150 మి.గ్రా / 300మి.గ్రా
   - ★ హిస్టాక్ 150 మి.గ్రా / 300మి.గ్రా
   - ★ ఫామోసిడ్ 20మి.గ్రా / 40 మి.గ్రా
   - ★ ఒమెజ్ 20 మి.గ్రా
   - ★ సిజా 10మి.గ్రా టాబ్లెట్స్
   - ★ సిసాపిడ్ 10మి.గ్రా టాబ్లెట్స్
2. జీర్ణాశయం, పేగుల నొప్పి :
   - ★ బరాల్గాన్ టాబ్లెట్స్
   - ★ కోలిమిక్ టాబ్లెట్స్
   - ★ మెప్టాల్ స్పాస్ టాబ్లెట్స్
   - ★ పెప్టైజైన్ జెల్
   - ★ సైక్లోపామ్ డ్రాప్స్ (పిల్లలకు)
3. విరేచనం అరికట్టడానికి
   - ★ డిపెండాల్ - M టాబ్లెట్స్/సస్పెన్షన్



   - ★ గ్రామోనెగ్ టాబ్లెట్స్ / సస్పెన్షన్
   - ★ గ్రామొబైల్ - M టాబ్లెట్స్ / సస్పెన్షన్
   - ★ ఇమోసెక్ - f కాప్స్యూల్స్
   - ★ లోమోఫెన్ టాబ్లెట్స్
4. బంక విరేచనాలకు
   - ★ మెట్రోజైల్ - 400 మి.గ్రా టాబ్లెట్స్
   - ★ ఫ్లాజెల్ - 400 మి.గ్రా టాబ్లెట్స్
   - ★ సెకనిల్ ఫోర్ట్ - టాబ్లెట్స్
5. విరేచనాలు కావడానికి
   - ★ డుల్‌కోలక్స్ టాబ్లెట్స్
   - ★ క్రీమాఫెన్ లిక్విడ్
   - ★ ఎవాక్యుయోల్ గ్రాన్యూల్స్
   - ★ క్రీమాఫెన్ Fs గ్రాన్యూల్స్
6. వికారం - వాంతులు
   - ★ డొమెస్టాల్ టాబ్లెట్స్
   - ★ గాస్ట్రోక్టివ్ - టాబ్లెట్స్
   - ★ పెరినారమ్ టాబ్లెట్స్
   - ★ స్టెమెటిల్ టాబ్లెట్స్
7. మొలలు
   - ★ షెల్డ్ అయింట్‌మెంట్
   - ★ ఎనోవేట్ అయింట్‌మెంట్
   - ★ డాఫ్లాన్ 500మి.గ్రా టాబ్లెట్స్
8. అరుగుదలకు
   - ★ విటాపెప్సిన్ సిరప్
   - ★ ఎసిజైమ్ సిరప్
   - ★ బెస్టోజైమ్ సిరప్
   - ★ డైజీప్లెక్స్ డ్రాప్స్ (పిల్లలకు)

9. రక్తపోటుకు

★ ఎటెనోలాల్ 50మి.గ్రా / 100 మి.గ్రా టాబ్లెట్స్

★ బెటాకార్డ్ 25 మి.గ్రా / 50 మి.గ్రా/ 100మి.గ్రా టాబ్లెట్స్

★ సిప్లార్ 10 మి.గ్రా / 50 మి.గ్రా టాబ్లెట్స్

★ ఎనాప్రిల్ • 2.5 మి.గ్రా / 10మి.గ్రా / 5 మి.గ్రా టాబ్లెట్స్

★ ఇన్డెరాల్ 10 మి.గ్రా / 40 మి.గ్రా టాబ్లెట్స్

★ బెటానిఫ్ కాప్సూల్స్

★ ఏంజిగార్డ్ టాబ్లెట్స్ (5 మి.గ్రా / 10మి,గ్రా)

10. రక్తస్రావం ఆపడానికి

★ స్టిప్టోవిట్ టాబ్లెట్స్

★ స్టిప్టోమెట్ టాబ్లెట్స్

★ స్టిప్టోక్రోమ్ ఇంజక్షన్స్

11. జ్వరానికి వళ్ళు నొప్పులకు

★ క్రోసిన్ టాబ్లెట్స్ / సిరప్ / డ్రాప్స్

★ మెటాసిన్ టాబ్లెట్స్ / సిరప్ / డ్రాప్స్

★ నవాల్జిన్ టాబ్లెట్స్

★ అల్ట్రాజెన్ టాబ్లెట్స్

★ కాంబిప్లామ్ టాబ్లెట్స్

★ ఫోర్విన్ ఇంజక్షన్

★ కెటొరాల్ టాబ్లెట్స్ / ఇంజక్షన్

12. మూర్ఛవ్యాధికి

★ ఎప్టాయిన్ 100మి.గ్రా టాబ్లెట్స్

★ డైలాన్టిన్ కాప్సుల్స్

★ వాల్ప్రోరిన్ 200మి.గ్రా కాప్సుల్స్

★ మాజెటాల్ 200 మి.గ్రా టాబ్లెట్స్

★ టెగ్రెటాల్ 100 మి.గ్రా/200మి.గ్రా/ 400మి.గ్రా టాబ్లెట్స్

★ లోనాజెప్ 0.5 మి.గ్రా, 2 మి.గ్రా టాబ్లెట్స్



★ రెవోట్రిల్ 0.5 మి.గ్రా, 2 మి.గ్రా టాబ్లెట్స్

13. కండరాల నొప్పులకు

★ మొబిజాక్స్ కాప్సుల్స్

★ రిబోప్లామ్ కాప్సుల్స్

★ రోబినాక్స్ కాప్సుల్స్

★ కోఫినాక్ జెల్

★ డైక్లోమాక్స్ జెల్

14. చక్కెర వ్యాధికి

★ డయానిల్ టాబ్లెట్స్

★ గ్లైనేజ్ టాబ్లెట్స్

★ గ్లైడ్ టాబ్లెట్స్

★ గ్లైసేఫేజ్ టాబ్లెట్స్

★ సెమి డయోనిల్ టాబ్లెట్స్

15. మూత్రం జారీ అవడానికి

★ లాసిక్స్ టాబ్లెట్స్

★ లాక్టోన్ టాబ్లెట్స్

★ ఫ్రూసెలాక్ టాబ్లెట్స్

16. కడుపులో పాములకు

★ ఆల్బెన్డోల్ టాబ్లెట్స్ (400మి.గ్రా)

★ నోవార్మ్ టాబ్లెట్స్

★ కాంబాన్ట్రిక్ టాబ్లెట్స్

★ మెబెక్స్ 100మి.గ్రా టాబ్లెట్స్

17. ఆకలి పుట్టడానికి

★ బేయర్స్ టానిక్

★ పెరిటాల్ సిరప్

★ గ్లైన్సింగ్ టానిక్

18. ఐరన్ కలిసినవి

★ ఫెఫోల్ కాప్సుల్స్

★ ఫెసోవిట్ కాప్ళుల్స్

★ హెమ్ అఫ్ సిరప్ / కాప్స్యుల్స్

★ గ్లోబిరాన్ సిరప్

19. విటమిన్స్

★ బాసిటోన్‌ఫోర్ట్ టాబ్లెట్స్

★ కోబాడెక్స్ ఫోర్ట్ కాప్ళుల్స్

★ బెటోనిన్ కాప్ళుల్స్ / సిరప్

★ పాలిబియాన్ టాబ్లెట్స్ / సిరప్ / ఇంజక్షన్స్

★ సెలిన్ టాబ్లెట్స్

★ అప్టీన్యూరాన్ ఇంజక్షన్

20. ఉబ్బసానికి

★ ఏరోకార్ట్ ఇన్‌హేలర్

★ ఆస్తాలిన్ టాబ్లెట్స్

★ బేక్లాట్ ఇన్‌హేలర్

★ డెరిఫిలిన్ టాబ్లెట్స్ / సిరప్ / ఇంజక్షన్స్

21. ఎలర్జీకి

★ ఎవిల్ టాబ్లెట్స్ / సిరప్ / ఇంజక్షన్స్

★ ఇన్‌సిడాల్